# ప్రేమ సాగరుడు

## అవతార్ మెహెర్ బాబా జీవిత చరిత్ర




**6 వ భాగం**

రచయిత :

**నిట్ట భీమశంకరం**


ప్రచురణ :

అవతార్ మెహెర్ బాబా

ఆంధ్ర సెంటర్ - కాకినాడ

జై బాబా

# బాబా ప్రేమికులైన పాఠకులకు

# విన్నపము

ఆంధ్ర మెహెర్ సెంటరు ఆధ్వర్యమున ముద్రితమగుచున్న 'ప్రేమసాగరుడు అవతార్ మెహెర్ బాబా చరిత్ర' ఆరవ సంపుటమును మీ ముందుంచుచున్నాను. అపారమైన బాబా కృపవల్లను, బాబా ప్రేమికుల ప్రోత్సాహము వలనను యీ ప్రచురణ కార్యక్రమము జయప్రదముగను, చురుకుగాను సాగుచున్నదని తెలుపుటకు చాలా సంతోషించుచున్నాను ఈ ఆరవ సంపుటమును త్వరితముగ ముద్రించిన శ్రీ సీతా రామాంజనేయ ప్రెస్, ఏలూరు - 1 అధిపతులు శ్రీ మాజేటి కృష్ణారావుగారు బాబా కృపకు పాత్రులైన అభినందనీయులు.

ఇదే రీతిగా త్వరలోనే మీ ముందుంచుటకుగాను ఏడవ సంపుటము ముద్రణ త్వరితగతిని నడచుచున్నది.

ఎనిమిదవ, తొమ్మిదవ సంపుటముల ముద్రణకు కూడా ప్రయత్నములు జరుగుచున్నవి.

ఇట్లు,

చింతా సర్వారావు.

# బాబా ప్రేమలో నొక పలుకు



అవతార్ మెహెర్‌బాబా! ఆహా యీ నామమెంత అనుపమానవం వాన్ని ప్రసాదిస్తుంది! నిరుపమానమైన యీ ఆనందాన్ని కొలవడానికి, ఏ కొలమానం కలదు! ఆ నామమందించు అత్యాశ్చర్యకర అనుభవాలను ఏమి వ్రాయగలను ఆ మధురానుభూతులను వ్రాయనసాధ్యము జిహ్వాగ్రమున ఆనామం నర్తనము చేస్తుండగా, నాకు వెయ్యినాలుకలు లేవేమని చింత వేస్తుంది కర్ణములలో ఆ నామం పడగానే వెయ్యి కర్ణములు కావాలనే కోరిక జనిస్తుంది నా చైతన్యంలో ఆ నామం ప్రవేశింపగానే ఇంద్రియములన్నీ స్వాధీనం తప్పి, ఆ పరాత్పరుని సేవకై వినియోగ పడ ఆతృత చెందుతాయి

ఈ ప్రపంచంలో యీ యుగంలో అవతార్ మెహెర్‌బాబా అవతరణమే గొప్ప సంఘటన నక్షత్రమండలాలతో సహా యీ సృష్టికే ఒక నూతన చైతన్యము సనకసనందనాది ఋషులతో సహా ఆధ్యాత్మికానుభూతిపరులు యీ నవచైతన్యం కోసమై అజ్ఞలు సాచి కూర్చున్నారు ఈ వచ్చిన అవతారపురుషుడు, పెద్ద, పెద్ద వేదికలెక్కి ఆధ్యాత్మిక జీవనము పై ఉపన్యాసాలు నివ్వలేదు క్రొత్తమత స్థాపనం చేయలేదు మంత్రతంత్రాల నసలే యివ్వలేదు మౌనధారియై, తన ప్రేమతో యీ జగాన్ని ముంచి ఎత్తినాడు తనను ఆశ్రయించిన వారికి కొంగుబంగారమైనాడు తనపేరు, తెలియని, తెలిసినా, తన్నుచేరని, తన్ను నమ్మని వారికి కూడ, అజ్ఞాతంగానే ఆధ్యాత్మికసాయం చెసినాడు అతడు ప్రేమసాగరుడు అతని నామస్మరణ మాత్రముననే జన్మాంతర సంస్కార జనితమైన అవిద్యను, అజ్ఞానాన్ని రూపుమాపగలడు అన్ని ఆధ్యాత్మిక సోపానాలను విహంగమార్గంలో దాటించి ఎన్నో భ్రమ ప్రమాదాలను తప్పించి తన ఆశ్రితులను రక్షించినాడు అపారమైన ప్రేమామృతాన్ని మనపై వర్షించి మన అత్యల్పమై స్వల్పమైన మానవప్రేమను తనపై కేంద్రీకరింపమని కోరినాడు మన తను మన ధనముల సర్వము నాతనికే

అర్పించి ఆతడే మన రక్షకుడని హృదయపూర్వకముగ విశ్వసించ మన్నాడు. ఎట్టి పరిస్థితులలోకూడా తనపై విశ్వాసాన్ని వీడక, తన కొంగును వదలకూడదన్నాడు. జీవులను, పరమాత్మను శరణుజొచ్చుటమే పరమధర్మమన్నాడు. అహంకారవర్జితులై, నిరంతరం తననే స్మరించిన నాడు, ఎట్టి కర్మలు, ఎట్టి యోగములు ఎట్టి ఉపాసనలూ చేయనక్కర లేకనే, తన్ను చేరగలరని నొక్కి వక్కాణించినాడు మనోనాశం పరమ ధర్మమన్నాడు. "అహంకార నివృత్తానాం కేశవోనహిదూరగః॥ అహంకార యుతానాం హి మధ్యే పర్వతరాశయః॥

అహంకార నివృత్తులైనవారికి, భగవంతుడు దూరుడుకాడు అహంకారయుతులకు, భగవంతునికి మధ్యదూరమే కాదు దాటశక్యంగాని పర్వతపంక్తులు కలవు. బాబా, ఒకసారి ఇంగ్లండులో ఒక పత్రికా విలేఖరి, మీ రహస్యమేమిటి అని ప్రశ్నింపగా, తన పని "అహంకార నాశనమే" అని ఒక్కమాటలో చెప్పారు.

తన నవ్యజీవనవిధానంలో "అహంకార" నాశనమెలా చేయాలో ఆయన చేసి చూపించారు. ఆంధ్రదేశంలో ఆయన రెండుసార్లు పర్యటించారు. ఆంధ్రులంటే నాకు అమిత యిష్టం – వారు నా హృదయం అన్నారు.

భారతయుద్ధంలో ఆంధ్రరాజులు, కౌరవుల పక్షంలో నుండే వారని ఇతిహాసక చరిత్రకారులు చెపుతారు. రామునికాలంలో యిది దండకారణ్యప్రాంతం. బహుశా ఖరదూషణాదుల పక్షం వహించియుండ నోవును. బుద్ధుని అవతారయుగంలో ఆంధ్రరాజులు కొందరు బుద్ధుని బోధలను, బౌద్ధమతాన్ని ప్రోత్సహించారు నేటి మెహెరవతారయుగంలో అవతారుడు స్వయంగా. ఆంధ్రరాష్ట్రాన్ని పర్యటించి, యీ భూమిని, తన పాదస్పర్శచే పునీతం చేసారు.

ఆంధ్రులెంతో ధన్యులు. యీ భాగ్యాన్ని మనకు కలిగించిన డా॥ తోట ధనపతిరావు గారికి ఆంధ్రులెంతో ఋణపడియున్నారు. బాబాపైని, అచంచల విశ్వాసంతో, అన్ని ప్రాతికూల్యాలను వర్జించి, నీవుతప్ప అన్యథాశరణం నాస్తి, అని సర్వసమర్పణభావంతో, మెహెర్ ప్రభువుకు అర్పణమైన యెడల, ఆ ప్రభువు, ఆ ప్రేమమూర్తి,

జై బాబా

# అవతార్ మెహెర్‌బాబా జీవితచరిత్ర

## ఆరవ భాగము

## నవజీవనము
(తరువాయి భాగము)

ఈ ప్రకారంగా బాబా వారి క్రొత్త జీవిత సహచరులకు వారు చేసిన నిర్ణయాన్ని దిద్దుకోవానికి అవకాశం యిచ్చారు వారు మరల ఆయనను క్రొత్త జీవితంలో కలవాలని వారు నిశ్చయించుకుంటే బాబాకు మాటికి పూరుపాళ్ళ విధేయులుగా ఉండడానికి ప్రయత్నించాలని హెచ్చరిక చేసారు బాబా ఆజ్ఞలను సేవకునివలె పాటించుటకు వారంతట వారుగా చెయ్యాలి గాని బలవంతంగా కాదు, బానిసలవలె కాదు అని బాగా తెలుసుకోవాలి.

ఆ సమయంలో బాబా నూతన జీవితంలో నుంచి ఆ కొద్దిసేపూ పాత జీవితంలో ప్రవేశించినపుడు బాబా చేసేపని నిమిత్తం అంటే సాధువులకోసం, బీదవారి కోసం, మస్తులకోసం, ధర్మకార్య నిమిత్తం కొంత ధనం పోగుచెస్తారని బాబా ఆ ప్రేమికులకు అప్పుడు తెలియజేసారు మహాబలేశ్వర్ రాలేని ప్రేమికులు వారు యివ్వదలుచుకున్నది ఆదీ కె ఇరానీకి అహమద్‌నగర్‌కి పంపించారు ఆ సొమ్ము ఆది మహాబలేశ్వర్ వచ్చేటప్పుడు కూడా తీసుకువచ్చాడు మహాబలేశ్వర్‌కి వచ్చినవారు మూడువందలమంది ఉంటారు వారిలో చాలామంది బాబా పనిలో యీ విధంగా పాల్గొనే అవకాశం వారికి కలిగిందని ఆనందించారు ఆహ్వానంలోనే వారిచ్చే కానుకల సొమ్ము బీదవారికోసం, సాధువులకోసం, మస్తులకోసం వెచ్చింపబడుతుందని స్పష్టం చేయబడింది సమావేశంలో బాబా యీ సంగతి ధృవపరిచారు.

ఈ సమయంలో హమీర్‌పూర్ నివాసి అయిన పరమేశ్వరీ దయాళ్ నిగమ్ (పుకార్) బాబాను ప్రథమంగా దర్శించడం కోసం హరిద్వార్ వగైరా స్థలాలు ఆయనకోసం తిరిగితిరిగి చివరికి యిక్కడికి వచ్చాడు అతడు బాబాను దర్శించాక బాబాకు అంకితమై మండలిలో చేరిపోయాడు

(10) ఒక అరగంట అయిన తరువాత అందరు లోపలికి వచ్చాక మరల సమావేశం ప్రారంభం అయింది. తలుపులు మళ్ళీ మూసేశారు

ఎన్నో కష్టాలు వచ్చినా సహించి వారి బాధ్యతలను తృప్తికరంగా, జయప్రదంగా నెరవేర్చినందుకు బాబా ఏర్పాటువార్లను అభినందించారు

(11) సమయం కాగానే సమావేశం నుండి క్రొత్త జీవితంయొక్క ప్రమాణాలు తీసుకుందుకు లోపలకు వెళ్ళారు బాబా. కొద్ది నిమిషాల తరువాత బాబా ఒక తెల్లటి కఫ్నీ ధరించి చేతిలో ఒక కాషాయపురంగు జోలి తీసుకుని వచ్చి వారి కుర్చీలో కూర్చున్నారు అప్పుడు బాబా మరల నవ్య జీవితంలోకి ప్రవేశించినట్లు ప్రకటించారు.

(12) ఒకరి తరువాత ఒకరిని బాబా 'అపును గాళ్ళను' అందరిని బాబా నవ్యజీవితంలో బాబాకు నూటికి నూరుపాళ్ళు విధేయులై ఆయనను సేవించడానికి, బాబా నూతన జీవిత నిబంధనలను నూటికి నూరుపాళ్ళు పాటించడానికి ప్రయత్నించుటకు, లేక పాత జీవితం అవలంభించడానికి, లేక యివేవీ గాక స్వతంత్ర జీవనం చేయడానికి నిర్ణయం తీసుకోమన్నారు బాబా.

ఈ క్రింది విధంగా వారు నిర్ణయాలు తీసుకున్నారు —

ఆదీ (సీనియర్) — పాత జీవితం

డా॥ దౌలత్ సింగ్ — పాత జీవితం (అదే ఎన్నుకోమని బాబా అతనిని ఆజ్ఞాపించారు)

అన్నా జక్కల్ — పాత జీవితం (కానీ బాబా తమవద్ద మామూలు సేవకునిలా ఉంచుకోడానికి, తమ యిష్టమయినపుడు బాబా అతనిని పంపించేయవచ్చు)

ఆలి ఆక్బర్ — పాత జీవితం (ఇదివరకే బాబా అతనికి బొంబాయిలో సలహా యిచ్చిన ప్రకారం పాతజీవితానికి వెళ్తానన్నాడు. ఇతనికి మహాబలేశ్వర్ 16 అక్టోబరు కార్యక్రమానికి హాజరవకుండా అనుమతి తీసుకున్నాడు)

మీనూ ఖరాస్ — పాత జీవితం (ఇతడు సేవకుడుగా నుండుటకు నిశ్చయించుకున్నాడు. కాని బాబా అతనిని పాత జీవితంలోకి వెళ్ళమన్నారు)

బాబాదాప్ — పాత జీవితం. (బాబా అది తీసుకోమని సలహాయిచ్చారు)
పండోబా — పాత జీవితం
కిషన్‌సింగ్ — పాత జీవితం
బాల్‌నాటు — పాత జీవితం
డా॥ ఘనీ — పాత జీవితం
పెందు — సేవకుడు (క్రొత్త జీవితం)
విష్ణు — సేవకుడు — క్రొత్త జీవితము
ఎరచ్ — సేవకుడు — ,,
డా॥ నీలు — సేవకుడు — ,,
డా॥ డాన్‌కిన్ — సేవకుడు — ,,
కాకా బారియా — సేవకుడు — ,,
ఆగా బైదుల్ — సేవకుడు — ,,
గుస్తాద్‌జీ — సేవకుడు — ,,
మురళీకాలే — సేవకుడు — ,,
కైకోబాద్ దస్తూర్ — సేవకుడు — ,,

(13) నవ్యజీవితం పూర్ణంగా జీవించవానికి బలం యిమ్మని దేవుని కోరారు బాబా

(14) విష్ణు నీలూలు హిందూ ప్రార్థన, కైకోబాద్ దస్తూర్ జొరోస్ట్రియన్ ప్రార్థన, ఆగా బైదుల్ ముస్లిమ్ ప్రార్థన, డా॥ డాన్‌కిన్ క్రిష్టియన్ ప్రార్థన చదివారు.

(15) ఒక ఖవ్వాల్‌ను ఆ సమయానికి పిలిపించగా అతడు హార్మోనియం తోను, డోలు, బుల్‌బుల్ తరంగ్‌తోను నూతన జీవితపు పాటను, ప్రార్థనా గీతమును పాడాడు

(16) బాబా తరువాత ఆయన కుర్చీలోంచి లేచి ఒక గదిలోకి వెళ్ళి ఆలీషా మస్తును (బాప్‌జీ) స్నానం చేయించారు ఈ దృశ్యం వచ్చినవారిలో చాలా మంది చూసారు.

కార్యక్రమం దీనితో ముగిసింది గనుక అందరినీ వెళ్ళిపొమ్మన్నారు మహాబలేశ్వర్‌లో 16–10-50 వ తేదీనాడు పాత జీవితపు ఓప్పులు, భక్తులనుంచి వసూలయిన మొత్తం రు 23,566–14–0. ఇది అక్కడ సమావేశమయిన 218 మంది యిచ్చినది.

వారి పర్యటన అక్టోబరు 21 వ తేదీని ప్రారంభం అవుతుందని బాబా చెప్పారు. రెండు నెలలయినా యీ పర్యటన సాగుతుందన్నారు బాబా బాదా కూడా మండలి ఉండవచ్చునుగాని వారు నూతన జీవిత నియమాలు పాటించరు.

రెండు వారాలు ముందుగానే బాబా ఈ పర్యటన గురించి చెప్పారు. పెండు, ఎరచ్, బైదుల్ అను యీ పర్యటన కార్యక్రమం వివరంగా తయారు చేయమని బాబా చెప్పారు క్యాలెండర్లు, మ్యాపులు, రైల్వే టైమ్‌టేబిల్‌లు దగ్గరపెట్టుకుని ఒకటి రెండు వారాలు వారు తంటాలు పడ్డారు.

అక్టోబరు 21వ తేదీన బాబా మహాబలేశ్వర్‌నుంచి నలుగురు సేవకులతో– పెండు, గుస్తాద్‌జీ, ఎరచ్, బైదుల్- 21-10-50 తేదీన బయలుదేరారు. భగన్‌ని ప్రత్యేకంగా బాబా కలకత్తాలో వచ్చి చేరమన్నారు ఆ ప్రకారం అతడు నవంబరు 4వ తేదీన కలకత్తాలో బాబా బృందాన్ని చేరాడు.

ఈ పర్యటనలో బాబా మస్తు కార్యక్రమము పేదవారితో పనికూడా సాగించారు పేదవారితోవలె గాక మస్తుల పనికి డబ్బు ఖర్చు ఎక్కువ అవుతుంది వారిని కలుసుకునేందుకే ఎన్నో ఊళ్ళు తిరగాలి. వారికి ఉన్న అవసరాలు చాలా తక్కువ. అయినా వారితో సాంగత్యం కోసం వారికి వీలయినపుడు వెళ్ళడానికి డబ్బు బాగా ఖర్చుపెట్టాలి. పేదవారికి ముఖ్యంగా తక్కువగా ఉండే మధ్యతరగతి కుటుంబాలకి సహాయం చేయాలంటే వారి గురించి ముందు సరియయిన దర్యాప్తు చేయాలి ఈ పర్యటనలో యీ పని చాలా చురుకుగాను సరిగ్గాను జరిగింది. వారికి ధనసహాయం చేసినపుడు కొందరు ధర్మాత్ములు బాబా చెప్పగా యీ సహాయం చేసారని వారికి చెప్పబడింది వారికి సహాయం చేసేముందు బాబా ప్రతి మనిషికి కాళ్ళు కడిగి శిరసుతో వారికి ప్రణమిల్లారు వారికి బాబా తమతో వచ్చే సేవకునిచేత యీ మాటలు చెప్పించేవారు.

"ఈ సొమ్ము మీకు కొందరు ప్రేమహృదయులు యిస్తున్నారు. సహాయం కావలసిన వారికి అవసరం కలవారికి యిమ్మని వారు చెప్పియిచ్చారు. పుచ్చుకున్నవారు యిది ధర్మంగా యిచ్చింవని భావించరాదు. ఇచ్చినవారికి పుచ్చుకున్నవారు ఋణపడి ఉన్నట్లు అనుకోకూడదు ఇది ప్రేమతో యిచ్చిన కానుక అని అనుకోవాలి" ఈ మాటలు చెప్పేటప్పుడు బాబాను వారు "మా అన్నగారు" యిలా చెప్పమన్నారనే వారు నూతన జీవిత నియమాల ననుసరించి బాబా పేరు చెప్పడం లేదు. ఆయన పేరు చెప్తే వారు గౌరవం చూపెస్తారు. అందుకని అది తప్పించుకుందామని కావాలనే అలా చేసేవారు అర్హులయినవారికి బీదవారికి డబ్బు పంచిపెట్టడం, వారితో సాంగత్యం కాకుండా మస్తులతో సాంగత్యం కూడా చేసేవారు

ఈ విధమయిన కార్యక్రమాలు జరుపుతూ బాబా తమ సేవకులతో బీహార్, బెంగాల్, ఒరిస్సా, నేపాల్, మద్రాసు, హైదరాబాద్, బొంబాయి రాష్ట్రాలు తిరిగారు.

బాబా మొదట పాట్నా వెళ్ళి, అక్కడనుంచి బీహార్ రాష్ట్రంలో యింకా యితర జిల్లాయిన్నూ పర్యటన చేసారు ఈ ప్రాంతంలో కోసీనది ప్రవహిస్తోంది. ఇది అమెరికాలోని యెల్లో, మిస్సిస్సిపి నదులవలెనే హఠాత్తుగా వరదలువచ్చి చాలా వినాశనం కలుగజేస్తుంది గత కొద్ది వారాలలోను కోసీనది పొంగి బీహార్‌లో కొన్ని జిల్లాలలో చాలా నష్టం కలిగించి అనేక గ్రామాలు పాడుచేసింది. వేలకొలది రైతులు దిక్కులేక నానా బాధలు పడ్డారు వారికి అవసరసహాయం అందవలసి యుండెను.

వరద బాధితులకు ప్రభుత్వం వారు, కొన్ని యితర సంస్థలు కొంత సహాయం చేసారు కాని అది చాలా నెమ్మదిగా సాగుతోంది. అనేక సంఘ సేవక సంస్థలుకూడా స్వచ్ఛందంగా ప్రజలకి సహాయం చేసాయి బీదవారికి సహాయం చేయ డానికి పూనుకుని బాబా బీహారులో వరదచేత పాడయిన మూడు గ్రామాలు తిరిగి 200 మందికి ఒక్కొక్కరికి కొద్దిగా ధనసహాయం చేసారు.

ఒక రైలుస్టేషన్‌లో (జంజర్‌పూరు) ఒక కాంగ్రెసు కార్యకర్త యిద్దరు ముగ్గురుతో మాట్లాడుతున్నాడు బాబా అది వారితో అవసరమయిన వ్యవహారాలు ఏమి మాట్లాడుతున్నాడో అడగమన్నారు వరదలవల్ల యీ మధ్య జరిగిన వినాశనం అతడు వర్ణించి చెప్పాడు ప్రభుత్వం అతనిని సహాయం చేసేపనిని ఏర్పాటు చేయమని

నియమించింది. బాబా అప్పుడు కొన్ని ఊళ్ళు చూసి కొంత సహాయం చేయడానికి వీలవుతుందా అని అడిగారు అప్పుడు అతడు బాబాని ఆయన సహచరులను ఎద్దు బండి మీద తీసుకుని వెళ్ళాడు అన్నిటి కంటె ఎక్కువగా పాడయిన అనేక గ్రామాలు చూడడానికి ఆ కాంగ్రెసు కార్యకర్తతో కూడా బాబా వెళ్ళారు ఇతడు ఎంత నిస్వార్థపరుడో చూడండి అతని యిల్లే వరదల్లో కొట్టుకుపోయింది. మోటులు పాడయిపోయాయి. అయినా అతడు ప్రజాసేవకోసం పాటు పడుతున్నారు. తనసంగతి అతడు చెప్పుకోలేదు అడుగగా అడుగగా బాబావద్దనుంచి కొంత సొమ్ము తీసుకోవడానికి అంగీకరించాడు.

వరద తీసింది. గ్రామాలు ఎంతవరకు నాశనమయాయో యిప్పుడు బాగా కనిపిస్తోంది తరువాత ఒక రోజంటా ఒక ఊరినుంచి యింకో ఊరికి తిరిగి బాబా జంజర్‌పూరు అనే గ్రామంలో 20J మందికి పాదాలు స్పృశించి ప్రణామంచేసి ఒక్కొక్కరికి అయిదేసి రూపాయిలు, 11 కుటుంబాలకి యింకా పెద్ద మొత్తాలు- 50 రూపాయిలు మొదలు 500 రూపాయిల వరకు అవసరాన్నిబట్టి యిచ్చారు. బాబా యిలాంటి సమయాలలో యిదివరకు బాగా జీవించిన కుటుంబాలు యిప్పుడు ఏమీలేని స్థితిలో ఉంటే అలాంటివారికే ఎక్కువ మొత్తాలు (రు 500) ఒక్కొక్క కుటుంబానికి యిచ్చి సహాయం చేసారు ఈ విధంగా పెదమొతాలు సహాయం పొందిన వారందరి పాదాలు కడిగి బాబా వారికి ధనం యిచ్చి వారి పాదాలకు శిరసు అంటేలాగ ప్రణామం చేసారు

డబ్బు యిచ్చినప్పుడు బాబా తమ సహచరుడొకని చేత 'నా సోదరుడు యిస్తున్నాడు. తీసుకోండి. ప్రేమయుత హృదయాలు గలవారు డబ్బుయిచ్చి అవసరం ఉన్నవారికి అర్హులకి సహాయం చేయమని చెప్పారు- నా అన్న'' అని చెప్పించారు ''ఇది ఏదో ధర్మం చేసారని అనుకోకండి ఈ డబ్బు తీసుకున్నందువల్ల మీరు ఋణపడి ఉంటామని అనుకోకండి ఇది కేవలం ప్రేమతో యిస్తున్నది ' అని చెప్పించారు. బీహార్‌లో బాబా సమస్తిపూర్. ఛాప్రా, మోకమేహాట్, భాగల్‌పూర్‌లు వెళ్ళివచ్చారు

తరువాత దర్భాంగ జిల్లా బోర్డు అధ్యక్షుడయిన జానకినందన్‌సింగ్ బైజనాధ మిశ్ర అను మంచి కార్యకర్తను బాబాకు అప్పజెప్పాడు. బైజనాథ్‌తో కలిసి బాబా బృందము తమూరియా రైలుస్టేషన్ నుండి నాలుగుమైళ్ళ దూరమున్న

మధుపూరుకి టాంగాలో వెళ్ళారు అక్కడ మూడు పంచి అర్హత కలిగిన కుటుంబాలకి రు 500/- చొప్పున బాబా సహాయం చేసారు మధుపూరులో పేదవారయిన కొంతరు వ్యక్తుల క్కూడా బాబా సహాయం చేసారు

అక్కడ నుంచి కచ్చువా గ్రామానికి వెళ్ళి అక్కడ రెండు కుటుంబాలకి అలాగే అయిదేసి వందల రూపాయలు (500/-) సాయం చేసారు. అక్కడనుంచి చేహత్ గ్రామానికి వెళ్ళి అక్కడ ఒక్కొక్క కుటుంబానికి రు 100/- చొ॥ రెండు కుటుంబాలకి సహాయం చేసారు. మైబి అనే గ్రామంలో ఒక కుటుంబానికి రు 100/- యిచ్చారు. బైజ్‌నాథ్‌మిశ్రా బాబాతో తిరిగి నిస్వార్థంగా సేవ చేసాడు ఇతడు పేదవాడు కోసీనది వరదలం వల్ల ఇతడు బాగా నష్టపోయాడు. ఇది తెలుసుకుని అతనికి బాబా రు 140/- యిచ్చి సహాయం చేసారు మైబిలో పేదవారికి రు 5/- చొ॥ బాబా పంచిపెట్టారు.

## నేపాళదేశ గమనం :—

బీహారులో కొంతరు వరద బాధితులకు సహాయం చేసాక బాబా జనకపురి వెళ్ళారు జనకపురి అంటే మిథిలానగరం ఇది నేపాల్ దేశంలో ఇండియా దేశ సరిహద్దుకి 20 మైళ్ళ దూరంలో ఉంది ఈ 20 మైళ్ళు ఒక చిన్న రైలు మార్గం మీద ప్రయాణం చెయ్యాలి. ఆ కాస్తదూరం వెళ్ళడానికి నాలుగు గంటల కాలం పట్టింది. ఇది పూర్వం జనకమహారాజు రాజ్యం చేసిన నగరమే. ఇది జానకి (సీతాదేవి) పుట్టినిల్లు.

ఇప్పటికీ హిందూ యాత్రీకులు యీ మహాక్షేత్రానికి వెళ్తుంటారు. ఈ చిన్న పట్టణంలో అనేక సుందరమైన ఆశ్రమాలు దేవాలయాలు ఉన్నాయి. బాబా అక్కడ అనేకమంది సాధువులను సాంగత్యం చేసారు అందులో కొందరు ఆధ్యాత్మికంగా అభివృద్ధి చెందినవారు. బాబా జయనగర్ కూడా వెళ్ళివచ్చారు

నేపాల్ నుంచి బాబా కలకత్తా వచ్చారు దారిలో కాల్గాన్ అనే రైలు స్టేషన్ వద్ద బాబా ఒక మస్తును కలిసారు ఈ చిన్న రైలుస్టేషన్ లో యితడు ప్రక్కనున్న వీధులు తిరుగుతూ చాలాకాలం గడిపాడు ఆ స్టేషన్‌లో ఆ మస్తుకి

స్వేచ్ఛ ఉంది. వాని యిష్టం వచ్చిన పని చేస్తూండేవాడు అతనిని అందరూ పిచ్చి వాడనుకునేవారు

ఆ మస్తు బాబాను మండలిని ఆరాత్రి తన అతిథులుగా ఉండాలని పట్టు బట్టాడు. మరొకరెవరయినా ఆ ఆహ్వానానికి ఒక నవ్వుతో నిరాకరించేవారు. బాబాకు అక్కడ ఉండాలనీ లేదు. అతడు వెళ్ళమని చెప్పకుండా వెళ్ళాలనీ లేదు. తరువాత వచ్చే రైలులో కలకత్తాకు వెళ్ళిపోవాలని పని తొందరవలన ఆగడానికి వీలులేదని ఎన్నో విధాలుగా మస్తుకి చెప్పించారు బాబా. అప్పటికి మస్తు స్టేషన్ ప్లాట్‌ఫామ్ మీదకి వచ్చాడు కొంతమంది అప్పటికే అక్కడ పోగయారు. వాళ్ళు స్టేషన్ సిబ్బంది యీ పిచ్చివానితో మాట్లాడి అతన్ని ఏదో చేస్తున్నారని మండలిమీద కోపం వచ్చింది ఈ పిచ్చివాడు వాళ్ళ స్వంత మనిషయినట్లు యింకెవరూ వానితో మాట్లాడకూడదన్నట్లు ఉంది వాళ్ళ తరహా. ఎరచ్‌ని, బైదుల్‌ని యివతలకి లాగి వాళ్ళమీద చెయ్యి చేసు కున్నారుకూడాను. ఏ పాపం ఎరుగని ఆ "పిచ్చి" వాడిని కొంతమంది బయటకు తీసుకుపోయారు ఇంతలోనే రైలు రావడంతో యీ గొడవ అంతమయింది. రైల్లో చోటు చూసుకోడానికి పరుగెత్తారు వాళ్ళని కొట్టినవాళ్ళు మిగతా జనం అందరూ బాబా మండలితో అ రైలులోకి ఎక్కారు ఈ విషయమే బాటసారులంతా ఆ పెట్టెలో ఆధ్యాత్మికంగా చర్చిస్తున్నారు. బాబాని మండలిని వారు గుర్తు పట్టనేలేదు, అక్కడ జరిగినదానికి వీరే కారకులని.

## దక్షిణేశ్వరంలో బాబా :-

కొల్గాన్ నుంచి బాబా కలకత్తా చేరుకున్నారు. మహాబలేశ్వర్ నుంచి బయలుదేరి 11 రోజులయింది ఈ ప్రయాణం చాలా కష్టమయింది శ్రమతో కూడు కున్నదయింది సగటున వారికి రోజుకీ ఒక గంటకన్న ఎక్కువ నిద్ర లేకపోయింది. అందుచేత కలకత్తాలో బాబా మూడు నాలుగు రోజులుండి విశ్రాంతి తీసుకున్నారు. కలకత్తాలో కొందరు మస్తులను బాబా సాంగత్యం చేసారు. ఆ నగరంలో బారానగర్ అనే పేటలో ఒక బీదకుటుంబానికి బాబా రు 500/- సహాయం చేసారు రైలులో ప్రయాణం చేస్తూ ఒక బీద కుటుంబానికి ఆస్పత్రి ఖర్చులకోసం పాతిక రూపాయి లిచ్చారు.

కలకత్తాకు అనతిదూరంలోనే దక్షిణేశ్వర్ అని ఒక ఊరులో ఉన్న కాళీ దేవాలయంలోనే సుప్రసిద్ధుడయిన రామకృష్ణ పరమహంస ఉండేవాడు. ఈ ఊరికి వెళ్ళి బాబా దేవతాలయాల సమీపంలో ఒక గదిలో బాబా లంగోటీ మాత్రం ధరించి అరగంటసేపు కూర్చున్నారు ఏకాంతంగా. తరువాత ఒక తెల్ల కఫ్నీ ధరించి చేతిలో కాషాయరంగుగల జోలి పుచ్చుకుని వీధిలో ఆహారం కోసం యింటింటికి వెళ్ళి బాబా భిక్ష యెత్తారు. చిన్న చిన్న దుకాణాలు అనేకం ఉన్నాయి. అక్కడ బాబాకి ఏమీ దొరకలేదు అది కాళికాలయానికి వెళ్ళే రోడ్డు మీదే ఎడాపెడా ఉన్నాయి. బాబాతో శిష్యులు వెంబడిస్తున్నారు. వారు మంచి దుస్తులు వేసుకుని ఉన్నారు. పెండు బాబా ఆజ్ఞప్రకారం డబ్బు ఉన్న సంచీని పట్టుకుని బాబాకి వెనుకనే దగ్గరగా ఉండి నడుస్తూన్నాడు ఆ సంచిలోనుంచి తీసి బాబా ఆజ్ఞప్రకారం బిచ్చగాండ్రకు సాధువులకు అణా బేడా ధర్మం చేస్తున్నాడు కూడాను. బిచ్చగాళ్ళు అనేకమందికి అణా అణా చొప్పున డబ్బులిచ్చాడు వాళ్ళు ఆలయాలలోకి వెళ్ళేవారిని వచ్చేవారిని డబ్బులు ధర్మం చెయ్యమని అడుక్కొంటూ ఉంటారు. ఇళ్ళవాళ్ళకు తెలియకుండా బాబా భిక్షకు బయలు దేరడం యిదే మొదటిమాటు.

చివరకు ఆలయానికి సమీపంలోనే ఒక బెంగాలీల యింటిలో బాబాకు అప్పుడే వండి ఒక తల్లి వేడి వేడి అన్నం పెట్టింది. వద్దంటున్నా యింకా వారి జోలిలో అన్నం వేసింది. బాబాను కూర్చోమని కడుపునిండా భోజనం కూడా పెట్టింది. బలవంతంగా తినమని పెట్టింది తరువాత బాబా గుడికి దగ్గరగా ఒక గదిలో లంగోటీతోనే కొంతసేపు కూర్చున్నారు తరువాత ఒక చెట్టుక్రింద ఆగి మామూలు పైజమా సాద్రా తొడుగుకున్నారు బాబా. తెచ్చిన భిక్షాన్నం శిష్యులకు పెట్టగా వారు కడుపు నిండా భోజనం చేసారు ప్రేమతో అన్నం పెట్టిన ఆమెను బాబా తలుచుకున్నారు. ఆహారం అందరికీ సరిపోయింది.

అహమద్‌నగర్ నుంచి బాబా ఆజ్ఞప్రకారం బాబా శిష్యుడయిన ఛగన్ కలకత్తాకి వచ్చాడు. ఇప్పుడు బాబాతో కలిపి ఆరుగురయారు.

కలకత్తానుంచి బాబా ఒరిస్సా రాష్ట్రానికి ఆ కాలంలో ముఖ్యపట్టణమయిన కటక్ నగరానికి వెళ్ళి అక్కడొక బీద కుటుంబానికి రు 500/- ల ధనసహాయం

చేసారు. అక్కడనుంచి విజయవాడ గూడూరు పట్నాలకి వెళ్ళి మద్రాసు చేరుకున్నారు. గూడూరులో ఒక నిరుపేద కుటుంబానికి రు 500/- లు మద్రాసు పాత మాంబ కంలో మూడు కుటుంబాలకి రు 500/- చొప్పున, యిచ్చి సహాయం చేసారు తరువాత బాబా హైదరాబాద్ వెళ్ళారు అక్కడ 3 మహమ్మదీయ కుటుంబాలకి అయిదేసి వందల చొప్పున, అయిదు హిందూ కుటుంబాలకి రు 500/- చొప్పున ఒక కుటుంబానికి రు 300/- మరియొక కుటుంబానికి రు 200/- యింకొక కుటుంబానికి రు 51/- లు యిచ్చారు.

ఒకప్పుడు బాగా బ్రతికి యిప్పుడు చితికిపోయి ఆర్థిక యిబ్బందులతో నానా అగచాట్లు పడుతూన్న కుటుంబాలను అన్వేషించి బాబా సహాయం చేసారు.

హైదరాబాద్‌లో ఒక కోటీశ్వరుడుండేవాడు అంత ఆస్తినీ తండ్రి తనయునికిచ్చి చనిపోతూ "నాయనా! నీకు 9 తరాల వరకు తరుగని ఆస్తిని యిస్తున్నాను ఎంత గొప్పగా నయినా జీవించవచ్చును." అని చెప్పాడు భోగవిలాస జీవితంలో ఆ తండ్రిని మించిపోయాడు కొడుకు అతనికి ఎన్నో ఏనుగులుండేవి రైల్వే కంపెనీతో అతడు ఏర్పాటు చేసుకున్న స్వంత రైలుపెట్టెలు రెండు ఉండేవి అతనికి. ఎంత ధనమయినా ఖర్చు చేసాడు – బాబా చూద్దామని వెళ్ళేసరికి ఆ కొడుకు అనేక వ్యసనాలవలన ఆస్తినంతటిని పోగొట్టుకుని ఒక దరిద్రమైన కొంపలో భార్యతో ఉన్నాడు. వీధుల్లో తిరిగి అగ్గిపెట్టెలమ్ముకుంటూ జీవిస్తున్నాడు. ఆస్తంతా హారతి కర్పూరంలా హరించిపోయింది ఈ కష్టాలు చాలక ఆరోగ్యం చెడిపోయి జబ్బుతో మూలుగుతూ మంచాన్ని పట్టాడు ఆ పరిస్థితిలో అతని వద్దకు బాబా వెళ్ళి అతనిని లేవదీసి నిలబెట్టి అతని కాళ్ళుకడిగి అతని చేతిలో రు 200/- సొమ్ము పెట్టగానే అతడు తననుతానే నమ్మలేక క్రిందకి పడిపోయాడు. డబ్బు యిచ్చారన్న సంగతి తెలియక అతని భార్య పడిపోయిన భర్తవద్దకు గుండెలు బాదుకుంటూ వచ్చి చచ్చిపోయాడేమో వాళ్ళు అతనిని ఏం చేసారో అని కంగారు పడిపోయింది ఆమె ఏడవడం ప్రారంభించింది మండలి పడిపోయిన అతనిని లేవనెత్తి మంచం మీద పరుండబెట్టి ముఖంమీద కొంచెం నీళ్ళు చల్లారు కొంచెంసేపట్లో అతనికి స్పృహ వచ్చింది. ఆమె అప్పుడు నిజస్థితి గ్రహించి ఆమె బాబాకి కృతజ్ఞతా వందనా లర్పించింది బాబా యింకో వందరూపాయలు మందులకోసం ఖర్చుపెట్టమని అతనికి యిచ్చి వెళ్ళారు. వెళ్ళిపోయేముందు యింత ఆస్తి ఎలాగ పాడయిపోయిందని

మండలి అడిగారు. ఏమని చెబుతాను పాపం ? ఆ మాటకతడు తన నుదుటిని చేత్తో కొట్టుకున్నాడు

బాబా హైదరాబాద్‌లో ఒక ఇద్‌గా లో లంగోటీతో ఒక అరగంట కూర్చున్నారు హైదరాబాద్‌నుంచి బాబా కొల్హాపూర్, మీరజ్ వెళ్ళారు. మీరజ్ లో ఒకచోట బాబా లంగోటీతో ఒక అరగంట ఏకాంతంగా కూర్చున్నారు. ఇది నూతన జీవితంలో ఒక ఘట్టం.

మీరజ్ నుంచి బాబా తమ సహచర బృందంతో తిన్నగా నవంబరు 25 వ తేదీకి బొంబాయి వెళ్ళారు. అక్కడ బాబా 33 గ్గురు మస్తులతో పని నెరవేర్చారు. చాలా మంది బీదవారిని సాధువులను సాంగత్యం చేసారు అందరూ కలిసి మహాబలేశ్వర్‌కి డిశెంబరు 6 వ తేదీకి చేరుకున్నారు.

మస్తు పనికి ప్రత్యేకంగా ఒక వెయ్యి రూపాయిలు ఖర్చయింది. ప్రయాణపు ఖర్చులకి యీ ప్రయాణాలలో మస్తులను బీదవారిని సాంగత్యం చేయడానికి చాలా సొమ్ము ఖర్చయింది ఇంకా బాబా వద్ద రు 1896 లు మిగిలింది ఇది భవిష్యత్తులో మస్తు కార్యక్రమం కోసం ఖర్చుపెట్టవచ్చునని బాబా మెహెర్‌జీ వద్ద ఉంచారు

బాబా మండలితో క్రిస్టమస్ దినోత్సవం చేసుకున్నారు. వారి మండలిలోని మెహెరా, మణి, మెహెరూ, అంతా కలిసి బంగళా చుట్టూ తిరిగి ఆ అడవిలోని ఒక పచ్చని చెట్టును వ్రేళ్ళతో ఊడబెరికి గదిలో బల్లమీద పెట్టి గది అంతా అలంకరించారు ఒక దేవత బొమ్మను తయారుచేయమని మణి కిట్టీతో చెప్పింది ఆమె అలాగే చక్కగా ఒక దేవతా విగ్రహాన్ని చేసి ఆ పచ్చని చెట్టుమీద పెట్టింది అప్పుడా చెట్టు ఎంతో అందంగా కనబడింది బాబా ముఖారవిందం మీద చిరునవ్వు తొణికిసలాడుతోంది. క్రీస్తు పుట్టినరోజయిన క్రిస్టమస్ రోజున (డిశెంబరు, 25వ తేదీన) అవతార పురుషుడయిన మెహెర్ ప్రభువు ఆ పవిత్రవృక్షం ప్రక్కన నిలబడ్డారు. రానో, నజా యిరువురు కలిసి ఆ చెట్టు నిలబెట్టిన బల్లను అందంగా అలంకరించారు అప్పుడు మంచి మంచి తినుబండారాలు తయారుచేసి ఉంచారు వీటిని ఒక కుటీరం ఆకారంలో ఏర్పాటు చేసారు దీనిని క్రిస్టమస్ కాటేజ్ అని పిలిచారు ఇందులో ఒక దీపంకూడా పెట్టారు ఆ యింటి కిటికీలోంచి ఎవరో తొంగి చూస్తున్నట్టు ఒక బొమ్మను అమర్చారు ఆ సమయంలో ఆ వనంలోనుంచి ఒక లేడిపిల్ల గంతులువేస్తూ బాబా వద్దకు

వచ్చింది. ఈ విధంగా అందరికీ ఆనందం గొల్పుతూ బాబా క్రిస్టమస్ పండుగ చేసు కున్నారు.

బాబా చేసిన ప్రయాణాలలో 119 మస్తులను, 23గురు సంతులను, 21 మంది సాధువులను సాంగత్యం చేసారు 33 కుటుంబాలకి, 250 మంది పేదవారికి సహాయం చేసారు.

1951 వ సంవత్సరంలో డెలియా ఆరోగ్యం ఏమీ బాగాలేదు అయినా ప్రేమికుల సమావేశాలు జరుపుతూనే ఉంది బాబా అమెరికా వస్తారని తెలిసినపుడు డెలియాను ఆయనను కలుసుకోమని బాబా వ్రాయించారు. ఈ సంగతి స్థిరపడగా (డా॥ డాన్‌కిన్ బాబా నిజంగానే 1952 వ సంవత్సరంలో అమెరికా వస్తున్నారని వ్రాసాడు.) క్వీన్ ఎలిజబెత్ అనే ఓడలో డెలియా న్యూయార్క్‌కి వెళ్ళింది జీన్ ఏడ్రియల్ అప్పుడు ఫ్రాన్స్‌లో దక్షిణభాగంలో ఉంటున్నది ఆమెను కూడా బాబా తమను అమెరికాలో కలుసుకోమన్నారు అందుచేత ఆమె డెలియా ప్రయాణం చేస్తున్న క్వీన్ ఎలిజబెత్‌లోనే హోవర్‌నుంచి బయలాదేరుతానని చెప్పింది.

యూరప్ నుంచి డెలియాని జీన్‌ని యిద్దరినే బాబా పిలిచారు కానీ జీన్ అస్వస్థగా ఉన్నందువల్ల ప్రయాణం అనుకున్న ప్రకారం చేయలేకపోయింది పాత జీవితంలో బాబా చేసిన మస్త్ పని సంగతి సుస్తుకి, దేవుడయిన బాబాకి మాత్రమే తెలుసును. అప్పుడు మండలివారిని ఎవరిని కూడా బాబా తమ దగ్గరకు రానిచ్చేవారు కాదు. నూతన జీవితంలో మస్తులతో పనిచేసినప్పుడు బాబా ఎవరినయినా చూడనిచ్చే వారు. అప్పుడు ఆ మస్తుతో పని ఆపుచేసి బాబా ఒక అన్వేషకునివలె ఆ మస్తుకి ప్రణమిల్లి తన ఆధ్యాత్మిక ఉద్దేశాలు నెరవేరాలని దీవించమని ఆ మస్తుని అడిగే వారు. ఈ క్రొత్త జీవితంలో మస్తుని సాంగత్యం చేయడానికి ముందు అతనికి వీలుగా ఉందో లేదో అని చూస్తారు. ఆ మస్తుకి రూపాయికి తక్కువ గాకుండా డబ్బు యిస్తారు. అతని పాదాల మీద శిరసు నుంచి ప్రణమిల్లుతారు. కూడా ఉన్న బైదుల్‌నో యింకో సేవకునో బాబా యొక్క ఆధ్యాత్మికోద్దేశం నెరవేరుగాక అని ప్రార్థించమని మస్తును కోరుతారు. మస్తు చెప్పినమాట వినేవాడు కాకపోతే అలా చెప్పడం మానేస్తారు. ప్రత్యేకి వ్యక్తులకు బీదవారికి ధర్మం చేసేటప్పుడు సాధ్యమయి నంత వరకు యిచ్చేదాత (ఫలానా బాబా అని) ఎవరో తెలియజేయకుండా ఉంటారు. దానం తీసుకున్నవాడు అందువల్ల యిచ్చేవానికి ఋణపడి ఉన్నట్లు అనుకోవద్దని అది

ధర్మం కాదనీ ప్రేమతో యిచ్చిన కానుక అని విశదపరుస్తారు బీదవాని కాళ్ళు కడిగి పాదాలకి ప్రణమిల్లి అప్పుడు ఆ దబ్బు అతనికి యిస్తారు.

సాధారణంగా బీదవారికి చిన్న నాణాలు ప్రయాణాల్లో మామూలుగా వారికి ప్రణామం వగైరాలు లేకుండానే యిస్తూంటారు లేక సేవకులచే యిప్పిస్తూ ఉంటారు మహాబలేశ్వర్ నుంచి మోటారులో హైదరాబాద్‌కి మళ్ళీ మహాబలేశ్వర్‌కి చేసిన ప్రయాణం చాలా తృప్తికరంగా ఉంది నూతన జీవితం ప్రారంభించిన తరువాత యింత సుఖంగా సంతోషంగా బాబా ఎప్పుడూలేరు ఈ మారు సాంగత్యం చేసిన మస్తులు చాలా నుంచి బాబా యిదివరకు కలిసినవారే కొద్దిమంది తప్ప. మస్తు లందరు బాబా చెప్పినట్లు సంతోషంగా చేసారు; బాబాకు ఎక్కువ సంతోషం కలిగించారు.

అనుకున్న ప్రకారం బాబా మహాబలేశ్వర్ నుంచి 1951 జనవరి 15 వ తేదీ ఉదయం పెండు, ఎరచ్, బైదుల్, ఆదీ (సీ)లతో కారు మీద బయలుదేరారు. ఈ ప్రయాణం కోసం సగం ఖర్చుకి కాకా వద్ద ఉన్న సొమ్ము మస్తు కాతాలోంచి, మిగిలిన సగం మెహెర్‌జీ వద్దనుంచబడిన దానిలోంచి ఖర్చుపెడదా మనుకున్నారు. అందరు మధ్యాహ్నానికి షోలాపూరు చేరుకున్నారు. అక్కడ వెంటనే మస్తులకోసం అన్వేషణ ప్రారంభించారు సిద్ధేశ్వర్ ఉత్సవం మూలాన వీధులు క్రిక్కిరిసిఉన్నాయి. పురం అంతా కోలాహలంగా ఉంది. ముగ్గురు మస్తులను వెదకి వారి సాంగత్యం చేయడానికి కొద్ది గంటలసేపు పట్టింది అందరు నదే అంచే ఆరాత్రికక్కడ ఆగక బాబా కారులో ప్రయాణం సాగించారు బాబా బృందము తిన్నగా హైదరాబాదు వెళ్తూ ఆ రాత్రికి జహీరాబాదులో డాక్ బంగాళాలో ఆగారు. మరునాడు ఉదయమే బయలు దేరి కొన్ని గంటలలో హైదరాబాదు చేరుకున్నారు. బాబా హైదరాబాదులో ఉండటా నికి అనువుగా రెండు బంగళాలు ఎన్నుకోవడంలో ఆ రోజు (16-1-51) గడిచింది. మహాబలేశ్వర్‌లో తీసుకున్న బంగళా అద్దెకాలము అయిపోయిన తరువాత బాబా అమెరికా వెళ్ళడానికి పరిస్థితులు అనుకూలంగా లేకపోతే బాబా శిష్యులతో వచ్చి హైదరాబాదులో ఉంటారు నగరానికి 11 మైళ్ళ దూరంలో ఉన్న ఉస్మాన్‌సాగర్ అతిథి గృహాన్ని యీ మూడు రోజులు ఉండడానికి తీసుకున్నారు జనవరి 17 వ తేదీన మస్తు అన్వేషణ ప్రారంభించారు. కొద్ది గంటలలోనే కొందరి మస్తులను బాబా సాంగత్యము చేసారు. వారు బాబాతో సహకరించి ఆయన పని సులువు చేసి

ఆయనకు సంతోషము కలిగించారు. శాస్త్రి అనే మస్తుకోసం రెండు రోజులుగావెదకగా బాబా మండలికి అతడు కనిపించలేదు జనవరి 18 వ తేదీన ఆ మస్తు అకస్మాత్తుగా ఒక హోటలులో కనిపించేసరికి మండలికి ఎంతో సంతోషం కలిగింది. హైదరాబాదు లోని ప్రధానమయిన మస్తు సయ్యద్ మోయినుద్దీన్ (లక్డావాలాబావా)ను బాబా రెండవ మారు సాంగత్యం చేసారు 17, 18 తేదీలలో బాబా 31 మంది మస్తులను సాంగత్యం చేసి హైదరాబాద్‌లో వారి పని ముగించారు.

19 వ తేదీ ఉదయాన్నే బాబా హైదరాబాదు వదలి హోమినాబాదుకు ఆరోజు మధ్యాహ్నం చేరుకున్నారు అక్కడనుంచి బాబా గుల్బర్గా వెళ్లానన్నారు. ఆ ఊరిలో ఖ్వాజా బందా గరీబ్ నవాజ్ అను మహాత్ముని దర్గాను బాబా దర్శనంచేసారు. చేసి గుల్బర్గా ఊళ్ళోకి వస్తూంటే ఒక మస్తును కలిసారు అక్కడ నుంచి ఇట్కా అనే గ్రామం 12½ మైళ్ళ దూరంలో ఉంటే అక్కడకు వెళ్ళారు బాబా. పది మైళ్ళు ఆ గ్రామానికి మంచి రోడ్డు ఉంది. అక్కడ నుంచి 2½ మైళ్ళు మంచిరోడ్డు లేదు. కాని కారు ఎలాగో జాగ్రత్తగా మెల్లగా నడిపించి అందులో వెళ్ళారు ఇంక గ్రామం ఒక మైలు ఉందనగా ఆ దారి కూడా అంతమయింది ఇంక కారు దిగి బాబా వారి బృందంతో నడిచి వెళ్ళారు వెళ్ళి అక్కడ స్వామి మస్తు అనునాతని సాంగత్యం చేసారు స్వామి చాలా ప్రధానమయిన మస్తు. బాబా అతనికిచ్చిన మిఠాయిలు బట్టలు పుచ్చుకున్నాడని బాబా చాలా సంతోషించారు ఆ మస్తువద్ద సెలవు తీసుకుని బాబా సేవకులతో గుల్బర్గా తిరిగి వచ్చేసరికి రాత్రి 8 గంటలయింది. రాగానే గుల్బర్గానుంచి అల్లందు వెళ్ళారు అప్పుడు రాత్రి 9-30 గంటలయింది. అక్కడ ఉన్న ఒక మజ్జూబ్‌ను ఒక హోటలులో కలుసుకున్నారు. వచ్చినందుకు మస్తు సాంగత్యం జరిగిందని బాబా చాలా సంతోషించారు.

పోలీసువారి సలహాప్రకారం అల్లందునుంచి అక్కల్‌కోట మీదుగా రోడ్డు బాగాలేదని షోలాపూర్ వెళ్ళలేదు బాబా. అందుచేత మరల గుల్బర్గా వచ్చి హోమినా బాద్ మీదుగా హైదరాబాద్ నుంచి (వచ్చిన దారినే) షోలాపూరు వెళ్ళే ట్రంకు రోడ్డుకు వచ్చి ప్రయాణం సాగించారు. అక్కల్‌కోట దారి బాగా లేనందువల్ల 160 మైళ్ళు ఎక్కువ వెళ్ళవలసి వచ్చింది బాబా. ఆ రాత్రి తెల్లవారుజామున 2 గంటలకు నైజాం రాష్ట్ర సరిహద్దు నల్‌దుర్గం వద్ద దాటారు. అక్కడ బాబా కారు ఆపి అంద రికీ 2½ గంటలు విశ్రాంతి యిచ్చారు. కారు నడపిన ఆదీని నిద్రపొమ్మని చెప్పారు

వాహా బావా నిద్రపోలేముగాని విశ్రాంతి తీసుకున్నారు. ఈ 2½ గంటలసేపు ఎరచ్, పెండు, వైడుక్‌లను వావా నిద్రపోయేటక మెలకువగా ఉండి కావలా కాయమన్నారు. అదీ లేవాక తెల్లవారుజామున 4½ గంటలకు బయల్దేరి ఉదయం 6 గంటలకల్లా షోలాపూరు చేరుకున్నారు. షోలాపూర్ నుంచి పూనాకి వెళ్ళేసరికి మధ్యాహ్నం 12 గంటలయింది. అక్కడ కొంతసేపాగి మహాబలేశ్వర్ వెళ్ళారు మొత్తం కారుమీద 1400 మైళ్ళ తిరిగి వచ్చినట్లయింది 19, 20 తేదీలలో తిన్నగా కారులోనే ప్రయాణం చేసారు. దారిలో మస్తు పని కోసం కొన్ని గ్రామాలలోను పట్నాలలోను ఆగుతూ వెళ్ళారు ఒక్క నల్‌దుర్గ్‌లోనే 2½ గంటలు విశ్రాంతి తీసుకున్నారు అందరు. ఈ పర్యటనలో హైదరాబాద్‌లో 31 మంది, షోలాపూర్‌లో ముగ్గురు, గుల్బర్గాలో ఒకడు, అల్లంపులో ఒకడు, షోలాపూరు నుంచి పూనా వెళ్ళే రోడ్డుమీద ఒకడు: మొత్తం 38 మంది మస్తులను బాబా సాంగత్యం చేసారు

మహాబలేశ్వర్ చేరిన తరువాత ఊరినుంచి యిద్దరు పేద స్త్రీలను రాపించి వారికి రు 60/- పంచి యిచ్చారు. హైదరాబాద్ వెళ్తూను మరల మహాబలేశ్వర్ వస్తూను రోడ్డుమీద కనిపించిన పేదవారికి ప్రతివానికి ఒక చిన్న నాణెం బాబా ధర్మం చేసారు. మహాబలేశ్వర్ నుంచి బాబా 29-1-51 తేదీన బొంబాయి వెళ్ళారు. వెళ్ళే దారిలో ఒక కొండవద్ద పూనాలోని స్వర్‌గేటు మోటారుస్టాండు వద్ద అహమద్‌నగర్ నుంచి ప్రత్యేకంగా పిలిపించిన అయిదుగురు పేదవారికి బాబా రు. 2000/- పంచి పెట్టారు.

నూతన జీవితంలో ప్రవేశించక ముందు (16-10-49) బావా పిలమాయికి ఆమె పోషణ నిమిత్తం రు. 2000 యివ్వబోగా ఆమె నిజాయితీగలది గనుక తన పోషణకు లోపం లేదని బాబావద్ద ఆ సొమ్ము తీసుకోలేదు అప్పటినుంచి బాబా వద్ద ఆ మొత్తం ఉండిపోయింది. అది యిప్పుడు పాత జీవితపు కుటుంబాల వారికి ఏడు గురు అప్తులకు బాబా పంచిపెట్టారు ఆ మొత్తం తీసుకునేందుకే అహమద్‌నగర్ నుంచి పూనాకి రమ్మనగా అయిదుగురు వచ్చారు. అందులో ఒకడు సిద్ధుజీ, ముగ్గురి తరఫున బాబా వద్ద వారు యిచ్చిన సొమ్ము అందుకుని తీసికొని వెళ్ళాడు.

పైన చెప్పిన కొండ దిగువను అరుణేశ్వరాలయం ఉంది. ఆ ఆలయంలో ఆ అయిదుగురిని వరుసగా నిలబడమని చెప్పి బాబా వారి పాదాలు కడిగి వారికి ఒకరి తరువాత ఒకరుగా పాదాలకు శిరసుతో ప్రణమిల్లి బాబా వారికి డబ్బు యిప్పించారు.

బొంబాయిలో నారిమన్ యింటిలో అర్హులయిన రెండు పార్సీ కుటుంబాలకి రు 722 బాబా పంచి యిచ్చారు. అందులో ఒకరు పాతజీవితంతో సంబంధం కలిగిన వాడు. డబ్బు యిచ్చేటందు బాబా పైన వర్ణించినట్లే చేసారు బొంబాయి వెళ్ళేటప్పుడు బాబా పెండు, ఎరచ్, గుస్తాద్‌జీలను తీసుకువెళ్ళారు బైదుల్‌ను ముందే బొంబాయికి 24 వ తేదీని పంపించారు బాబా బయలుదేరిన తరువాత పూనా వచ్చి ఆదీని వారితో చేరమన్నారు రంజూ బొంబాయిలో వచ్చి కలిసాడు బాబా ఆజ్ఞప్రకారం ఇంకా పరోష్, ఆదీ (జూ) జాల్, పాద్రి, సావక్ దాదా బృందాన్ని బొంబాయిలో చేరారు. బైదుల్ బొంబాయిలో 3 వ తేదీవరకు ఉంటాడు.

బొంబాయిలో మస్తు పనికోసం తిరిగేటప్పుడు వీరంతరేకాక బొంబాయిలో ఉన్న నారిమన్, మెహెర్‌జీలను బాబా తమతో రమ్మన్నారు. బొంబాయిలో పాతవాళ్ళు కొత్తవాళ్ళు కలిసి మొత్తం 55 మంది మస్తులను బాబా సాంగత్యం చేసారు మహాబలేశ్వర్ నుంచి పూనా వెళ్ళేటప్పుడు దారిలోని శివపురిలో ఒక మస్తును గాదా సాంగత్యం చేసారు. 55 మందిలోను యితడు కూడా ఉన్నాడు. బొంబాయిలో కొందరు మస్తులను వారి వైఖరి చక్కనవడం కోసం మళ్ళీ మళ్ళీ కలుసుకోవలసి వచ్చింది. కొందరిని బయప్రదంగా కలుసుకున్నపుడు వారి వద్దకు తిరిగి వెళ్ళి కలిసేవారు. సాంగత్య సమయంలో ఒకసారో ఎక్కువసార్లో బాబా ఆ మస్తులకి వంగి ప్రణామం చేసేవారు. కొన్ని సమయాలలో వారికి డబ్బు కూడా యిచ్చేవారు. బొంబాయిలోని ప్రధానమస్తుకి ప్రణామాలు చేసినపుడల్లా యిచ్చినది యిప్పటికి మొత్తం రు 40 లు అయింది.

బాబా హైదరాబాదులోను బొంబాయిలోను సాంగత్యం చేసిన మస్తులలో అయిదవ వంతు మస్తులు చాలా అభివృద్ధి చెందినవారు, రెండు వంతులు కొంత దేవుడంటే పిచ్చి కలిగినవారు, మిగిలిన రెండు వంతులు కొంత అభివృద్ధి చెందిన మస్తులు.

ఈ మస్తు పర్యటనతో మెహెర్‌జీకి బాబా యిచ్చి ఉంచిన సొమ్ము అంతా ఖర్చయింది. అదేకాక పేలమాయి పుచ్చుకోనందున మిగిలిన రు 2,000/- కూడా ఖర్చయిపోయింది. అందుచేత బాబా బొంబాయినుంచి బరోడా వెళ్ళకుండా వచ్చేసారు. అంతేగాక బరోడాలో బహు కొద్దిమంది మస్తులున్నారని తెలిసింది.

బాబా మహాబలేశ్వర్ తిరిగి వచ్చాక అమెరికా నుంచి ఎలిజబెత్ పాటర్సన్ యీ సంవత్సరం బాబా అమెరికా ప్రయాణం సాధ్యమయేటట్టు లేదని కేబిల్ యిచ్చింది. ఆ కేబిల్ 12-2-51 తేదీన అందినది. అందుచేత బాబా పాశ్చాత్యదేశాలకి వెళ్ళే కార్యక్రమం రద్దయింది ఈ సంగతి ఆదీ ద్వారా బాబా భక్తులందరికి తెలియ పరచ బడింది.

ఎలిజబెత్ వి బాబా ఆయన యీ సంవత్సరం అమెరికా వెళ్ళేదీ లేనిదీ 12 ఫిబ్రవరి లోపుగా తెలియపరచమని ఆమెను కోరారు ఆ ప్రకారం ఆమె ఆ తేదీ నాటికి ఆమె లేదని తెలియపరచింది అందుచేత బాబా వారి సేవక పరివారం తోటి జూన్ మాసంలో హైదరాబాదు వెళ్ళాలని అనుకుంటున్నారు.

బాబా 13-2-51 తేదీనుంచి నూరు రోజుల ఏకాంతవాసం ప్రారంభించ వలసి ఉంది అందుచేత ఆ క్రితంరోజున, 12-2-51 తేదీన, బాబా ఒక సమావేశం ఏర్పరచారు ఆ రోజున సేవకులందరూ హాజరయారు ఆ సమావేశంలో బాబా యీ క్రింది నిర్ణయాలు తీసుకున్నారు—ఇవి సేవకులందరు పాటించాలని బాబా చెప్పారు.

(1) ఎంవరూ జూన్ 10 (1951) వ తేదీ వరకు ఆయన సేవకులవలె బాబాతో ఉండాలి

(2) 12-2-51 తేదీనుంచి నూతన జీవితపు నియమాల నుంచి బాబా వారందరిని విముక్తలను చేసారు. కాని యీక్రింద పేర్కొనబడిన బాబా ఆజ్ఞలకు వారు విధేయులై ఉండాలి.

(a) కామవికారమయిన పనులు చేయకూడదు.
(b) బాబాని ఒకరు సన్మానంచేసే పరిస్థితి కనిపించకుండా ఉండాలి.
(c) పాత జీవితపు శిష్యులతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరపడము మొద లయిన ఎట్టి సంబంధము కలిగి ఉండరాదు.
(d) సేవకులు పరస్పరం బట్టలు మార్చుకోరాదు.
(e) ఎవరి వద్దనుంచీ ఆహారం అంగీకరించకూడదు. కానీ ఎవరైనా టీగాని, సిగరెట్లు కాని, 'పాన్' కాని యిస్తే పుచ్చుకోవచ్చును.

(f) ఈ క్రింది పనులు చేసినపుడు బాబాకి జ్ఞాపకం చేయవలెను—

i) ఎవరికయినా ఏదయినా వాగ్దానం చేసినపుడు,

ii) ఎవరి గురించయినా బాబా చెడ్డగా మాట్లాడినపుడు,

iii) ఏదయినా వేయరాని అడుగు వేసినపుడు,

iv) ఎందుకయినా మానస వికారం తెచ్చుకున్నపుడు,

v) ఆయన సేవకులను బాబా సందేహించినపుడు,

(g) దినదినము యిచ్చిన ఆజ్ఞలు నూటికి నూరుపాళ్ళు పరిపాలించుట.

(h) బాబా తృప్తిపడాలని శాయశక్తులా ప్రయత్నించడం

ఈ సమావేశమయిన మరునాడు 13 వ తేదీ నుంచి బాబా మహాబలేశ్వర్ ఆగాఖాన్ భవనంలో 100 రోజుల ఏకాంతవాసం ఆరంభించారు. ఇది పాక్షికమయిన ఏకాంతం అద్వితీయమయినది కూడాను. ఈ ఏకాంతవాసం మే (1951) 23 వ తేదీ వరకు సాగుతుంది ఇది బాబా నూతన జీవిత ప్రమాణానికి సంబంధించినది. పాత జీవితపు ఏకాంతవాసాలలాగ బాబా రోజంతా ఒకే గదిలో ఉండిపోరు ఈ క్రొత్త జీవితంలో బాబా అనుకున్నది జయప్రదంగా సాధించి తీరుతానన్నారు. ఫిబ్రవరి (1951) 12 వ తేదీని పార్సీ పంచాంగం ప్రకారం బాబా జన్మదినం అయింది కాని నూతన జీవితంలో పండుగ చేసుకోరు బాబా ఏకాంతవాసం ప్రారంభించే ముందు బావలా ఖవ్వాల్ బాబా యెదుట గానం చేసాడు.

ఏకాంతవాసం యొక్క స్థలపరిమితులు బాబా నిర్ణయించుకున్నారు – మహాబలేశ్వర్‌లో ఉన్న బంగళా ఆవరణ, బాబా యొక్క కేబిన్, ఆయన కుటీరము. ఈ పరిమితులు బాబా యీ క్రింది కారణాలవల్ల విస్తృత పరచవలసి వచ్చింది

(1) బాబా 7 రోజులు ఉపవాసంతోను, 33 రోజులు ఏకభుక్తం చేసి ఉంటారు.

(2) మహాబలేశ్వర్ బంగళా ఆవరణలో మస్తు కార్యక్రమం చేయవలసి వచ్చింది

(3) బాబా పూనా వెళ్ళవలసి వచ్చింది.

(4) పూనాలో వివిధ స్థలాల్లో, కొండల్లో కూడ, కూర్చోవలసి వచ్చింది.

(5) పూనాలో మస్తు సాంగత్యం చేసారు.

(6) ప్రతిరోజూ సాయంకాలం ప్రార్థనలు చేయించాలి.
(7) ఇంకా ఏవయినా అవసరం వస్తే దానికి తగినట్లు నడుచుకోవాలి.

"ఈ నూరు రోజుల ఏకాంతవాసంలోను మొదటి 40 రోజులు చాలా క్లిష్టంగా ఉంటాయి భగవంతుని సహాయం లేనిదే నేను యీ కఠిన పరీక్షకు తట్టుకొని యుండగలిగేవాడను కాను. భగవంతుడు నాకు సహాయం చేసినట్టు రుజువుకోసమే అన్నట్టు, నాకు జ్వరంతో బాటు దాన్ని సహించడానికి తగిన బలం కూడా ప్రసాదించాడు. నా 'సేవకుల' తరఫున నేను చేసిన విన్నపాలు భగవంతుడు ఆలకించాడు." అని బాబా చెప్పారు.

మొదటి 19 రోజులు ఫిబ్రవరి 15 వ తేదీనుండి మార్చి 5 వ తేదీ వరకు బాబా (ఆరీషా, అహమదనగర్) మస్తుతో రోజుకొక అరగంట చొప్పున పనిచేసారు.

ఈ శతదిన ఏకాంతవాసం తోను బాబా యొక్క శరీరం చాలా నీరసించిపోయింది వారి యొక్క నిస్సహాయత అనునది బాగా ప్రస్ఫుటంగా అమలులో పెట్టారని కనిపించింది. బాబా యొక్క నిస్సహాయత చూడలేక డా॥ గోహర్ ఒక రోజున ఏడ్చేసింది అది చూసి బాబా "నీ వావిధంగా దుఃఖిస్తుంటే మాత్రం నాకు బాధ తగ్గుతుందా ? అంతా దైవ నిర్ణయం ప్రకారం జరుగుతోంది ఎటువంటి పరిస్థితులలోనయినా మీరంతా ఉల్లాసంగా ఉండాలి" అన్నారు. అయినప్పటికి బాబా ప్రతీ సాయంకాలం మండలిని పిలిచి మరాటీలోను, ఉర్దూలోను, ఇంగ్లీషులోను ప్రార్థనలు చేయించెడివారు.

అపుడు బాబా చెప్పినటువంటి సంపూర్ణ నిస్సహాయస్థితిలో ఉంటానని తరువాత తమ స్వంతమునకు ఏదో ఒక గొప్పఆపద రానున్నదని 1949 వ సం॥లో బాబా చెప్పిన సమయము యిదే కాబోలునని అందరూ అనుకునేలా బాబా ఉన్నారు. అయినా వారు సూచించిన సమయమిది కానేకాదు. మండలి ఎంత శుశ్రూష చేస్తే మాత్రం ఆయన బాధ తగ్గించగలరు ? మానవులమీద అపారకృపచేత ఆయన యీ బాధ తెచ్చిపెట్టుకున్నారు

ఈ నవ్యజీవితమునందు బాబా కేవలం తాము మానవుడుగానే ప్రవర్తించారు బాబా అనంతానందం కలిగిన అవతారపురుషుడు అని జ్ఞాపకం వచ్చే సంఘట

నగా అటువంటి స్థితి జ్ఞాపకం చేసే ఏ అంశము కనబడలేదు మానవాళియొక్క బాధలు పరిమితములు అవి పైన వేసుకొని బాబాకూడా నూటికి నూరుపాళ్ళ మానవుడే అని ఏతన్మాత్రుడే అని నిరూపించే లాగుంది యీ కాలమంతా. అపరి మిత్రుడయిన భగవంతుడు అవతారమూర్తియై తనను పరిమిత పరచుకొనడమే ఒక సంపూర్ణ అవతార లక్షణమేమో అన్నట్లుగా ఉంది ఆయన అందరకు ప్రేమనుయిచ్చి వారి బాధలను స్వీకరిస్తున్నారు శ్రీకృష్ణమూర్తిగా అవతారమెత్తినపుడు భగవానుడు ఆ దివ్యమానవ దేహంలో దేవునికి ప్రార్దనలు చేయలేదా ? ఆరాధించలేదా ? సాధు సత్పురుషుల సేవ, సాంగత్యము చేయలేదా ? ఆయన తన భక్తులకు సదా సేవ చేయు డానికి సంసిద్ధత కనపరచలేదా ? భక్తపరాధీనుడు అనే బిరుదు పొందలేదా ? అలాగే బాబాకూడా యిప్పుడు తమ చర్యలవల్ల 'తనను ప్రేమించెడి వారి సేవకుడను' అని నిరూపించుకుంటూ వారి కొరకే గాక సమస్తమానవ ప్రపంచమునకు తన ప్రేమను విరజిమ్ముతూ వారిబాధల నందుకుని తాము మిక్కుటమైన బాధ ననుభవిస్తున్నారు. ఇంకా ముందు ముందు చూడండి, బాబా ఏ విధముగా బాధలకులోనై మానవోద్ధరణ కార్యం నెరువేరుస్తారో.

క్రీస్తు తానే భగవంతుడయినప్పటికీ తన జీవితంలో భగవంతుని నుంచి తను వేరు ఆయన వేరు అనే అభిప్రాయం కగిగేటట్టుగా క్షమించమని భగవంతుని ప్రార్థన చేసేవాడు. అలాగే బాబా కూడా తన తరఫున మండలి తరఫున తప్పులను క్షమించమని భగవంతుని ప్రార్థించేవారు.

ఈ నవ్య జీవితంలో వివిధములయిన ఘట్టాలలో బాబా సాధారణ మానవుని వలెనే పశ్చాత్తాపం, ఆరాధన, ధ్యానం, సేవ, అన్నీ తమ సేవక సహచరులతో ఆచ రించారు.

క్రీస్తు కాలంలో "ఆయన ఎన్ని బాధలు పడ్డాడో, ఎటువంటి బాధలు ఆయన సహించాడోగాని అవన్నీ మన కోసమే అనే మన నమ్మకం మన కోసమే ఆయన శిలువ మీద వ్రేలాడి పడరాని బాధల ననుభవించాడు" అని ఆయన భక్తులు యిప్పటికీ అనుకుంటారు అలాగే బాబా పడే బాధల గురించి మనం అనుకోవాలి మరి. నూతన జీవితంలో సర్వసమర్పణా భావం అభ్యాసం చేయాలి దైనందిన జీవితంలో 24 గంటలూ ఆ భావంలో ఉండాలి. అంతేకాని ఏమీ పనిలేనప్పుడు ఏకాంతంగా

ఉన్నప్పుడు విశ్రాంతి తీసుకుంటూన్నప్పుడు మాత్రమే కాదు బాబా యొక్క మండలి వారు నవ్యజీవితంలో ఆయనను చేరారంటే ఆయనను వదలకుండా ఆయన ఇచ్ఛకే అంతా సమర్పణ చేసుకుని ఆయనతోపాటే అష్టకష్టాలు పడుతూ ఉన్నారంటే ఆయన మీద వారికి ఎంత నమ్మకం ఉందో, ఆయన యెడల వారికి ఎంత ప్రేమ ఉన్నదో తెలుస్తోంది బాబా యొక్క ముఖ్య అనుచరులు (సేవక సహచరులు) బాధాయుత మయిన యీ నవ్య జీవితంలో వారికి యితర మార్గాలు బాబా సూచించినా, యిదే కావాలని కోరుకుని, బాధలను తప్పించుకోకుండా, బాబాతో ఉండి ప్రతినిత్యము అను భవించి నిజమైన విశ్వాసపాత్రులయిన శిష్యులని అనిపించుకున్నారు కాయకష్టంతో బాబాకి విధేయులుగా ఉన్నారు.

1951, ఫిబ్రవరి 19 వ తేదీ నుండి ఫిబ్రవరి 28 వరకు బాబా కేబిన్‌లోను, కుటీరంలోను, మహాబలేశ్వర్‌లోను ఏకాంతవాసపు కార్యకలాపాలు జరిపారు.

మార్చి 1 వ తేదీనుండి మార్చి 5 వరకు ఏకాంతవాసంలో కఠినమయిన రోజులు చాలా రాత్రి వరకు బాబా కుటీరంలో ఒక్కరూ కటిక చీకటిలో గంటలు కాలదీ గడిపేవారు. ఆ తరువాత అకస్మాత్తుగా పెద్ద దీపం పెట్టుకుని యింకా ఎన్నో గంటలు ఉండేవారు. మార్చి 6 నుంచి మార్చి 9 వరకు – ఈ నాలుగు రోజులు బాబా కటిక ఉపవాసాలు చేసారు ఆ కాలం కుటీరంలోను, వారిగది (కేబిన్)లోను గడిపారు.

మార్చి 10, 11, 12 తేదీలు మూడు రోజులు బాబా ద్రవపదార్థాలు మాత్రం తీసుకుంటూ గదిలోను కుటీరంలోను ఉన్నారు. మార్చి 13 మొదలు 24 వరకు రోజుకొక్కపూటే భోజనం చేస్తూ రాత్రిళ్ళు ఒక్క గంట మాత్రమే కుటీరంలో గడిపేవారు ఈ గంటసేపు సగం చీకటిలోనూ, సగం దీపం వెలిగించుకునీ ఉన్నారు.

25 మార్చినుంచి 23 మే వరకు 60 రోజులు ఏకాంతవాసంలో 2 వ భాగం. ఆయన వీలుని బట్టి ఏకాంతవాసంలోని పనులు సర్దుబాటు చేసుకున్నారు.

1951 ఏప్రెల్ మాసంలో మేరీ బాకెట్ బాబా వద్దకు ఇండియాకు వచ్చింది. ఆమె లండన్‌లో కిట్టీకి ఉత్తరం వ్రాస్తూ బొంబాయి నుంచి బాబా ఆజ్ఞప్రకారం

వారిమన్, అర్నవాజ్ దాదాచాన్జీ దంపతులు లండన్‌లో ఆక్టన్‌లోని బాబా సెంటరుకి వచ్చారనీ ప్రియతమ బాబా గురించి వారితో చాలాసేపు మాట్లాడారని వ్రాసింది బాబా అనుగ్రహం వల్ల ఆయన మాతో ఎల్లకాలము ఉంటున్నారని వారికి కలిగిన మనో విశ్వాసం గురించి వ్రాసాడు విల్. వారి కదలికల గురించి బాబా ఎప్పటికప్పుడు విల్ మేరీలకు తెలియపరుస్తూనే ఉన్నారు బాబా వారి కార్యదర్శిగా ఉన్న చాన్జీచేతను తరువాత ఎవరుంటే వారిచేత ఎవరికి డాన్‌కెన్ చేతను మణి చేతను విల్ మేరీలకు ఉత్తరాలు వ్రాయించేవారు. ఈ విధంగా వారి జీవితాంతము వరకు బాబా ప్రేమలో వారు పనిచేస్తూనే ఉన్నారు. ఏప్రెల్ నెలలోనే బాబా వారి ఏకాంతవాసం గురించి యిలా చెప్పారు –

"నేను అవలంభించిన నవ్యజీవితంలో నిజాయితీ తోను సత్యం తోను ఆచరించడానికి పూనుకున్నాను నా నూతన జీవితానికి నేను నిజాయితీతో ఉండాలి గనుక దీనిని గురించి నా పాతజీవితపు శిష్యులు, భక్తులు నాతో సంబంధం లేనివారు సేవకులు, ఏర్పాటుదారులు, నాతో సంబంధం నేరుగా ఉన్నవారు, పరోక్షంగా ఉన్న వారు, వీరంతా ఏమనుకుంటారో నాకు ఏమీ అవసరం లేదు వారు గాని యితరులు గాని ఎలా అర్థం చేసుకున్నారనే నాకేమీ కాదు, నాకు దానితో ఏమీ సంబంధం లేదు.

"ఈ నూరు రోజుల ఏకాంతవాసం లోను మొదటి 40 రోజులు చాలా ముఖ్యమయినవి దేవుని సహాయం లేనిదే నేను యీ క్లిష్టమయిన కాలం జయప్రదంగా గడిపి ఉండేవాడిని కాదు. ఈ కాలంలో నేను శారీరకంగాను మానసికం గాను చాలా శ్రమకు లోనయ్యాను. దేవుడు ఈ 40 రోజులు నాకు ఎంతో బాధను కలుగజేసి ఆ బాధను భరించడానికి కావలసిన బలాన్ని కూడా యిచ్చాడు. నేను చెప్పి వ్రాయించిన ప్రార్థనలు నా తరఫున నాసేవకులు చేసిన ప్రార్థనలు దేవుడు అంగీకరించాడు.

"మిగిలిన 60 రోజులు గడవడం నాకు అంత ఎక్కువ కష్టం కాదు. ఈ రోజుల్లో ఏం పని చేయాలో, ఎక్కడ చేయాలో దేవుని సహాయంతో నేను చూసుకోగలను నా సేవకులు, ఏర్పాటుదారులు, పాతజీవితపు శిష్యులు, భక్తులు, నాతో పరోక్షంగాను అపరోక్షంగాను సంబంధం ఉన్నవారు అందరు నా నూతన జీవితంలో వారి క్లిష్టమయినా కాకపోయినా నాకు అండగా నిలిచారు. అది నా అదృష్టంగా భావిస్తున్నాను నాకు వారు బాసటగా నిలిచారు గనుక, యీ నూరురోజుల

ఏకాంతవాసం జయప్రదంగా నాకు సంపూర్ణమయిన తృప్తితో గడుపుతాను, గనుక, దేవుడుకూడా దానితో పరిపూర్ణ సంతృప్తి పొందుతాడని నేను భావిస్తున్నాను. ఈ జూన్ 10 వ తేదీ మొదలు 30 వ తేదీ వరకు దేవుడు ఆయన అనంత జ్ఞానముచేత నేను నా జీవితంలోను సేవకులు, భక్తులు, పాతజీవితపు శిష్యులు ఏర్పాటుదారులు వగైరాల జీవితంలోను అసాధారణమైన విప్లవాత్మకమైన మార్పుకలిగేలా నేను ఒక అడుగు వేసేలా (ఒక పని చేసేలా) దేవుడు అనుగ్రహిస్తాడని నాకు నమ్మకం ఉందని దేవునికి తెలుసును. దేవుని యిచ్ఛప్రకారం యీ మార్పు కలుగుతుంది దేవుడు నిర్ణయించిన విధంగా జరగడం నేను తప్పించలేనని భావిస్తున్నాను ఆయన నిర్ణయించిన జీవితమే నేను జీవిస్తాను అది నామీద ఎలాటి ఫలితం యిస్తుందో యితరులమీద దాని ప్రభావం ఎలా ఉంటుందో నాకు తెలియదు అని అనుకుంటాను''- అని బాబా ఏప్రెల్ మాసంలో చెప్పారు

''నేను యిదివరకు చెప్పినది నాకు తృప్తికరంగా ఉంది. ఎందుచేతంటే మళ్ళీ వెనక్కు తీసుకోలేని ఆ అడుగు నాచేత దేవుడు తప్పక వేయించాలనుకుంటున్నాడని నాకు గట్టి నమ్మకం ఉంది దానిమీద ఉన్న నా నమ్మకంతో నేను అడుగు వెయ్యడం అంటే ఏమిటో నేను ఏ పని చెయ్యబోతున్నానో దాని స్వభావం ఏమిటో యింతవరకు నాకే తెలియదని మీరు తెలుసుకోవాలని కోరుతున్నాను. ఇంకా అర్థమయేలా చెప్పాలంటే దేవుడు నాచేత ఏమి చేయించదలచుకున్నాడో నేను ఊహించనైనా లేను. ఈ అడుగు పాత జీవితం కంటె యింకా పాత జీవితంలోకి నన్ను తీసుకుపోవచ్చు లేక క్రొత్త జీవితం కంటె యింకా క్రొత్త జీవితంలోకి నన్ను తోసేయవచ్చు లేక యీ రెండింటికి క్రిందుగా గానీ మీదుగా గాని ఉన్న జీవితంలోకి నన్ను నెట్టెయ్యవచ్చు.

జూన్ (1951) ఆఖరివారం ప్రారంభానికి నేను ఏమి చేయవలయునో దాని స్వభావమేమిటో నాలో నిర్దుష్టంగా తెలియజేస్తాడని నేను నిశ్చయంగా భావిస్తున్నాను నేను వేయవలసిన అడుగు ఏమిటో జూన్ ఆఖరువారంలో నాకు తెలియగానే మీకందరకు తెలియడం కోసం నేను ప్రకటిస్తాను వెనక్కు తీయజాలని ఆ అడుగు ఏమిటో నేను ఆఖరిసారిగా 16-10-51 తేదీన ఆచరణలో పెట్టేమురిను -అది ఒక అసాధారణమైన విప్లవాత్మకమైన మార్పును నా జీవితంలోను నాతో అపరోక్షంగా

గాని పరోక్షంగా గాని తీసుకువస్తుందని యిదివరకే చెప్పాను- జూలై (1951) నుంచి అక్టోబరు (1951) 16 వ తేదీ వరకు కొంత ముందు పనిచేయవలసి ఉంది

నేను అక్టోబరు 16, 1950 న వెనక్కు తీయజాలని ఆ అడుగు వేయ డంలో కొన్ని అవాంతరాలు కొన్ని అభ్యంతరాలు రాకుండా నేను, నా తృప్తికోసం, నా కోసం, నాతో సంబంధం ఉన్నవారి కోసం, కొన్ని పనులు చేసుకోవలసి ఉంది.

నా పనికి అంతరాయం కల్పించే వాటితో నేను విచక్షణతోను, నిశ్చయం తోను తీర్మానం చేసుకోవలసి ఉంది-

నేను నూతన జీవితం ప్రారంభించినప్పటి నుండి నేను, నాతో సంబంధం ఉన్నవారు, యీ అంతరాయం కలిగించే కారణాలను అధిగమించడానికి అనేక సందర్భాలు వచ్చాయని నాకు తోస్తోంది. 16 అక్టోబరు 1951 తేదీనాడు చేయవలసిన పనికోసం నేను తీర్మానించుకు చేసేందుకు నాకు సంపూర్తి సంతృప్తి యివ్వనిదేదీ నేను చేయడంలేదు.

దేవుని సహాయంతో, ఆయన ఇచ్ఛవలన, నేను తిరుగులేకుండా చేసేపని యొక్క ఫలితం జూన్ 1951 లో నాకు తెలుస్తుంది; అది నేను తెలియజేస్తాను. ఆ పని నేను అక్టోబరు (1951) 16 వ తేదీన చేయడం అది 16 ఫిబ్రవరి 1952 నాటికి ఫలవంతం కావడం జరుగుతుంది. ఇలా అని నాకు బాగా నమ్మకంగా ఉంది.

ఇదంతా మీకు ముందు తెలిసేలాగ నా మాటలు మీకర్థం అవుతాయని కలవరం లేకుండా చేస్తాయని మీకు నమ్మకం లేకపోతే నమ్మకం కలిగిస్తాయని మీకు విడమర్చి చెప్తున్నాను. అయినా తిరుగులేని నాపని యొక్క ఫలితం దేవుడు ఆయన యిష్టం వచ్చినవిధంగా ప్రసాదిస్తాడు. ఇది ఒకడు కలవరపడినా, ఎవరికయినా నమ్మకం ఉన్నా లేకపోయినా దానిమీద ఆధారపడి ఉండదు. భగవంతుని ఇచ్ఛతో జరగవలసిన అసాధారణమయినదేదో జరిగి తీరుతుంది."

హైదరాబాదులో ఉన్నంతకాలము నన్ను ఎవరూ కలుసుకుందామని కాని నాతో సంబంధం పెట్టుకోడానికి గాని ప్రయత్నించ కూడదని బాబా కోరుతున్నారు.

బాబా చెప్పిన మాటలు తరువాత ఆయన చేసిన విశదీకరణ అందరికీ సర్క్యులర్ మూలంగా మే 1 వ తేదీన పంపబడింది పాత జీవితపు శిష్యులకు, బాబా భక్తులకు, ఏర్పాటుదార్లకు అందరకు పంపించారు

1951, మే నెల 26 వ తేదీన మౌంట్ అబూ నుంచి డా॥ డాన్‌కిన్‌ని అహమద్‌నగర్‌కి యీ విధంగా తంతి పంపమని బాబా ఆజ్ఞాపించారు —

"ఈ వేసవికాలంలో చేసిన పస్తు ప్రయాణాలవల్ల బాబా ఆరోగ్యం పాడయి పోయింది. అయితే ఆయనకి కలుగబోయే అపరిమిత కష్టాలతో పోలిస్తే యిదేమీ కాదు నగర్‌లోను ఎగువ దిగువ మెహెరాబాద్‌లో ఉన్న మండలితో చెప్పవలెను."

1951 జూన్ మాసంలో బాబా వారి శిష్యులతో హైదరాబాద్‌లో జూబిలీ హిల్స్‌మీద ఒక బంగళాలో ఉన్నారు. వారి శిష్యులతో ఉండగా బాబా జూన్ 28 వ తేదీన యీ మనోనాశ్ కాలంలో తాము శరీరం చాలించవచ్చునని చెప్పారు. ఆ మాట విని శిష్యులందరు దిగులుపడి కూర్చున్నారు మండలి బాధను చూడలేక అబ్దుల్ ఘనీ మున్సిఫ్ నవ్వు పుట్టించే కథలెన్నో వారికి చెప్తూండేవాడు. ఆ రోజులలో హైదరాబాద్ నగరంలో ప్రసిద్ధి చెందిన సాలార్‌జంగ్ మ్యూజియం అను అద్భుత కళాఖండ ప్రదర్శనం 78 గదుల ఒక పెద్ద పాత భవనంలో ఉండెను. అవన్నీ సరిగా చూడాలంటే 5 రోజులయినా పడుతుంది, కళాతృష్ణ కలిగిన మానవుడికి సర్వజ్ఞుడు గనుక బాబా ఆ మ్యూజియం చూడాలని వెళ్ళి అన్ని గదులూ 45 నిమిషాలలో తిరిగి చూసి వచ్చేసారు తమ మండలితో. ప్రతిరోజూ అనేక మంది చూడడానికి వెళ్ళే యీ ప్రదర్శనశాలకి బాబా ఏదో ఆధ్యాత్మికమయిన పనిమీదే వెళ్ళి వచ్చేసారు.

21 జూన్ లగాయతు అక్కడ ఉన్న కార్యక్రమానికి హాజరు కాదలచి కొందరు అనుమతి కోరారు. ఆహ్వానించబడిన వారందరిలోను నూటికి 75 మంది హాజరయారు. బాబా కోరినట్లు సేవకులందరు వచ్చారు. బాబా అనేకమారులు చెప్పి నట్లు బాబా చాలా ఆనందించారు ఆ సంవత్సరం అందరికీ సంతోషం కలిగించింది.

కార్యక్రమంలోని ముఖ్య విషయం బాబా వేయదలచుకున్న అడుగును గురించి వివరంగా 28-6-51 తేదీన వచ్చిన వారందరికి ప్రకటించబడింది. ఈ ప్రకటన పకళ్ళు అందరికీ యివ్వబడ్డాయి.

సేవకులు ఏర్పాటుదారులు కలిసి ఎవరికి బాబా కొన్ని పనులు చేయమని చెప్పారో వారు తప్ప ఇతరులకు బాబాతో వెళ్ళడానికి అవకాశం యిచ్చారు 21 మంది బాబాను చేరుతామన్నారు వారెవరంటే—(1) క్రైకోబాద్ (2) కాకాబారియా (3) గుస్తాద్‌జీ (4) ఎరచ్ (5) పెండు (6) బైదుల్ (7) మినూఖరాస్ (8) ఎన్ జి. ఖేర్ (9) పంఖరాజ్ (10) గోమాగణేశ్ (11) పెయిలర్ (12) తోడీసింగ్ (13) కిషన్ సింగ్ (14) దౌలత్‌సింగ్ (15) ప్రీతమ్‌సింగ్ (16) గడేకార్ (17) బాబాదాస్ (18) శ్రీపత్‌సహాయి (19) వాసుదేవ్‌క్రైన్ (20) పి డి నిగమ్ (21) ఎ సి. యస్ చారి.

ఈ 21 మందిలోను 13 గ్గురిని బాబా రావద్దని తేల్చేసారు మిగతా ఎనమండుగురి గురించి బాబా యింకా ఒక నిశ్చయానికి రాలేదు ఈ ఎనమండుగురు ఎవరనగా - (1) క్రైకోబాద్, (2) కాకా (3) గుస్తాద్‌జీ, (4) ఎరచ్ (5) పెండు, (6) బైదుల్ (7) మినూఖరాస్ (8) దౌలత్‌సింగ్.

బాబా యింకెవరినీ బాబాతో వస్తామని చెప్పడం గాని రావడానికి ప్రయత్నం గాని చేయవద్దన్నారు. ఈ మాట హైదరాబాద్ సమావేశానికి రానివారి గురించి బాబా చెప్పారు. హైదరాబాద్‌లో సమావేశమయిన ఆహ్వానితులయిన బాబా భక్తుల యెదుట 28 జూన్ 1951 తేదీన బాబా యీ క్రింది ప్రకటన చేసారు - ఇది అబ్దుల్‌ఘనీ మున్సిఫ్‌చేత చదివించారు బాబా

"దేవుని సమక్షంలో, సంపూర్ణ సద్గురువు లందరిని సాక్షులుగా నా హృదయంలో ఉంచుకుని, దేవుని యిచ్ఛతోను, దేవుని సహాయం తోను వచ్చే అక్టోబరు 16 వ తేదీన (1951) నేను తప్పకుండా వినాశనకరమయిన యీ పని చేస్తాను. నూరు రోజుల ఏకాంతవాసం నాకు పూర్తిగా తృప్తికరంగా పూర్తిచేయడానికి నాకు దేవుడు సహాయం చేసాడు. 16 ఫిబ్రవరి 1952 తేదీనాటికి పాత జీవితపు మెహెర్ బాబా స్థితి అందుకోడానికి విశ్వవ్యాప్తంగా ప్రకటీకరణ చేయడానికి దేవుడు సహాయం చేస్తాడని నాకు పూర్తి నమ్మకం ఉంది.

ఈ ప్రకటనకు యిక్కడ సాక్షులుగా ఉన్న మీరు ప్రతి ఒక్కరు 16 అక్టోబరు తేదీన టీ తోను నీటితోను ఉదయం 8 గంటలనుంచి 24 గంటలకాలం ఉపవాసం ఉండమని నేను కోరుతున్నాను"

ఈ ప్రకటనకు అనుబంధంగా ఆరోజునే బాబా యీ విధంగా చెప్పారు - ఇది కూడా అబ్దుల్ ఘనీ మున్సిఫ్ చేతనే చదివించారు బాబా.

"అక్టోబరు 16 వ తేదీన నేను తిరుగులేకుండా చేయవలసిన పనిని నా మనసులో దేవుడు నిశ్చయం చేసాడు. ఈ పని చేయడానికి కావలసిన కాలం అక్టోబరు 18 నుంచి ఫిబ్రవరి (1952) 16 వరకు.

జూన్ 21 తేదీ లగాయతు యీ 7 రోజులు వ్యక్తిగతంగాను సామూహికంగాను నేను అవసరమయినప్పుడల్లా యీ పని పూర్తి చేయవలసిన ఏర్పాట్ల గురించి మీతో మాట్లాడుతున్నాను. జూలై 1 వ తేదీనుంచి అక్టోబరు 1 వరకు యీ ఏర్పాట్లన్నీ జరిగేటట్లుగా వివరంగా నేను చూస్తాను

దేవుడు నేను చేయవలసిన పని, పూర్తి అయిన నాశనము అని కోరాడు. ఈ క్షణంలో నేను పూర్తిగా నూతన జీవితంలో ఉన్నాను సాధారణ మానవుని యీ నూతన జీవిత స్థితినుంచి మీకు యీ నాశనం గురించి చెప్తున్నాను నేను చేయవలసిన అడుగు సంపూర్తి అయిన మానసిక నాశనం అని అది అక్టోబరు 16 (1951) మొదలు ఫిబ్రవరి 12 (1952) వరకు ఉన్న కాలంలో జరగాలని నాకు ప్రోద్బలం కలుగుతుంది అంటే యీ మనోనాశనకాలంలో మామూలుగా నేను శారీరక నాశనంకూడా ఎదుర్కోవలసి వస్తుంది దాన్ని నేను వేరే కోరుకోనక్కర లేదు. ఫిబ్రవరి 12 వ తేదీకి దాని ఫలితం ఎలా ఉంటుందంటే—

(a) నేను పూర్తిగా మనోనాశనం పొందుతాను కాని శారీరకంగా బ్రతికే ఉంటాను అంటే నేను పాత జీవితపు మెహెర్‌బాబా స్థితి పొందడమే కాకుండా దానిని నేను విశ్వవ్యాప్తంగా ప్రకటీకరణ చేస్తాను నాతో సంబంధించిన వారి జీవితాలన్నీ విప్లవాత్మకంగా మారిపోతాయి. అప్పుడు నేను మానవులందరితోను సంబంధం కలిగి ఉంటాను గనుక అందరి జీవితాలు మారతాయి. నాతో వారికున్న సంబంధం ఎంత బలంగా ఉందో దాని ఫలితం అంత ఎక్కువగా ఉంటుంది.

(b) నా మనోనాశనం తో నాదేహం పడిపోవచ్చు. అది సర్వమునకు అంతం అవుతుంది అన్నిటికి అది ఆరంభం కూడా అవుతుంది నాతో సంబంధం ఉన్నవారికి అదే అతీతమయిన మార్పు అవుతుంది. కాని అది నా స్వంత వ్యక్తీకరణ లేకుండా జరుగుతుంది.

(c) మనోనాశనానికి బదులు నా భౌతిక శరీరం పడిపోవచ్చు అంటే మనం అందరం ఎక్కడ ఉండేవాళ్ళమో అక్కడ ఉంటామన్నమాట. అలాగయితే మీలో ప్రతియొక్కరు నాతో మీకు ఉన్న సంబంధము నా యెడల మీకు ఉన్న ప్రేమ. నమ్మకమును బట్టి మీకు లాభం కలుగుతుంది.

(d) ఫిబ్రవరి ఆఖరునాటికి మనోనాశనం కలుగకపోవచ్చు దైహికంగా నేను జీవించియే ఉండవచ్చు అంటే అది అందరి అంతము అన్నమాట. అప్పుడు నాతో అపరోక్ష సంబంధం కలిగి ఉండకుండా అందరినీ విముక్తులను చేస్తాను. వారి యిష్టం వచ్చిన జీవితం వారు గడుపవచ్చును.

(3) ఎలాగయినప్పటికీ నాతో పరోక్ష అపరోక్ష సంబంధాలు కలిగిన వారందరు నన్ను వ్యర్థంగా ప్రేమించినట్లు నాకు వ్యర్థంగా సేవ చేసినట్లు కాదు. నేను ఎవరినై ఉండినా, ఎవరినై ఉన్నా, ఎవరినై యికముందు ఉండబోయినా దేవుడు ఆయన అనంత న్యాయంతో అన్నీ జరిగేటట్టు చూస్తాడు. మీ ప్రతి యొక్కరికి నా బలమైన ఒక్క సలహా ఏమిటంటే—"నాలో మీకు ఉన్న నమ్మకానికి నాయెడల మీకు ఉన్న ప్రేమకి కట్టుబడి ఉండండి ఇప్పుడున్నంత దానికంటె ఎక్కువగా కాకపోయినా అలాగే అయినా మీరు నన్ను అంటిపెట్టుకుని ఉండండి " అని.

(4) దేవుడు నన్ను యీ అడుగు వేయమంటున్నాడు ఫిబ్రవరి 12 వ తేదీ నాటికి నాకు మనోనాశనం కావడానికి ఆయన నాకు సహాయం చేస్తాడని నేను నిశ్చయంగా చెప్పగలను. ఈ అంతరంగ విశ్వాసంతో నేను యీ మనోనాశన కార్యంలో అక్టోబరు 16 వ తేదీనుంచి ప్రవేశిస్తాను.

(5) ఫిబ్రవరి 12 నాటికి యీ కోరిక నెరవేర్చడానికి నాకు దేవుడు సహాయం చేయాలని వినమ్రుడనై కోరుతున్నాను.

(6) నేను గనుక భౌతికంగా మరణిస్తే నేను వారికి చెప్పు చేయించి యిచ్చిన ప్రకారంగా ఏర్పాటుదార్లు జరిగించాలి. విష్ణు అందరిగురించి నేను చెప్పినట్లు చేస్తాడు.

(7) అక్టోబరు (1951) 16 నుంచి ఫిబ్రవరి (1952) 12 వరకు నేను హైదరాబాదులో ఉండను. ఇప్పుడు నాతో ఉన్న స్త్రీలు నేను యక్కడ లేనప్పుడు

హైదరాబాదులోనే ఉంటారు- జూలై 1 వ తేదీనుంచి ఫిబ్రవరి 12 వరకు విష్ణు నేను చెప్పిన పనులు చేస్తాడు.

(8) ఈ 1951 అక్టోబరు 16 నుంచి 1952 ఫిబ్రవరి 12 వరకు ఏ విధ మయిన అవరోధాలు లేకుండా స్వేచ్ఛగా, చనిపోవడానికి స్వేచ్ఛకలిగి, జీవించడానికి స్వేచ్ఛ కలిగి ఏ విధమయిన భారము లేకుండా ఉండాలని కోరుతున్నాను ఎవరయితే మరణించే కార్యక్రమంలో నాతో చేరాలని అనుకున్నారో వారు నాతో చేరవచ్చు. కానీ మీలో ప్రతియొక్కరు మీ మనస్సుపూర్తిగా అర్థం చేసుకుని అటువంటి నిశ్చయానికి వచ్చి నిలవడం ఎంత కష్టమో అది మనస్సుకి ఎంత పెద్దపనో మీరు తెలుసుకో వాలని కోరుతున్నాను. 1949 లో నూతన జీవితం ప్రారంభించినపుడు ఎదుర్కొనిన కష్టాలను మీ మనస్సులో ఉంచుకోవాలని నేను కోరుతున్నాను మీ దారిలోని అడ్డం కులు నా దారిలోని అవరోధాలు తలుచుకోండి అది మళ్ళా సంభవించకూడదు. మీరు తాత్కాలిక మయిన చిత్తవికారంతో నాతో రావాలని అనుకుంటే అది వినాశన హేతువు అవుతుంది. నాతో వస్తే అన్ని విధాల కష్టాలు చెప్పరాని ఇడుమలు పడాలన్నమాట కష్టాలంటే తిండిలేక మాడడం, నిద్రలేకుండా బాధపడడం, జబ్బు చేయడం, అశక్తులయిపోవడం. పూర్తిఅయిన నిరాశ, నిస్సహాయత వాటి యొక్క పరమ ఆధిక్యస్థితి చూడడం అన్నమాట. 4 మాసాలలో 400 మరణాలు అనుభ వించడం కూడా కావచ్చు నాతో ఎవరయినా వస్తే వారి గురించి నాకు ఎటువంటి బాధ్యత ఉండదు

(9) నా సేవకులను ఆజ్ఞాపిస్తున్నాను, రెండింటిలో ఒకటి ఎన్నుకోమని — (1) ఈ నిరాశతో కూడిన కార్యంలో నాతో చేరడం, (2) నేను ఏ పని చెప్తానో అపని చేస్తూ హైదరాబాదులో ఉండిపోవడం. ఈ రెండవ పక్షంలో వారికి ఆహారము' బట్టలు, చిల్లర ఖర్చుకి డబ్బు నాలుగు నెలల లోను అన్నీ యివ్వబడతాయి. ఏర్పాటు దార్లెవరూ నాతో వస్తానని అనకూడదు అఖరి వరకు వారు చేయవలసిన బాధ్యతా యుతమైన పనులున్నాయి గనుక. నా పాత జీవితంలోని శిష్యులెవరయినా నాతో చేరవచ్చును. నేను దేవుని అనుగ్రహం వల్ల 12 వ ఫిబ్రవరి నాటికి నా ఉద్దేశం నెరవేర్చుకున్నట్లయితే, ఆధ్యాత్మికంగాను, భౌతికం గాను లేక ఆధ్యాత్మికంగా మాత్రం, నా సేవకులకు, నా పాతజీవిత శిష్యులకు భక్తులకు లాభం కలుగుతుంది.

(10) అయినా నేను అక్టోబరు 16 వ తేదీన యీ అడుగు వేసేటందు నా పాత జీవితపు శిష్యులకు కొంతవరికి ప్రయత్నించి భౌతికంగా సహాయం చేద్దామని ఉంది వారిలో కొంతవరి వ్యవహారాలు కొన్ని చక్కబరిచి వారికి ఏ భారము లేకుండా చేయాలి.

జూలై 1 నుంచి ఫిబ్రవరి 12 వరకు నేను అందరికి అందుబాటులో ఉంటాను. లేక కొద్దిమందికే అందుబాటులో ఉండవచ్చును లేక ఎవరికీ అందుబాటులో ఉండకపోవచ్చును ప్రజా బాహుళ్యానికి నేను దర్శనం యివ్వవచ్చును. ఈ విషయాలన్నీ నా యిష్టం వచ్చినట్లు నిశ్చయించడానికి నాకు స్వేచ్ఛ ఉంది

(11) నాతో కూడా వచ్చేవారు ఒక్కరయినా నేను తృప్తిపడి సంతోషిస్తాను లేక చాలామంది వచ్చినాసరే కానీ నాతో వచ్చేవారు ఎలాంటి పరిస్థితులలోనయినా అన్నిటికి ఆగి నిలబడగలిగేలా ఉండాలి నా ఆజ్ఞలను వెంటనే పాటించాలి. ఏ విధమయిన బహుమానము, ఆధ్యాత్మికంగాని భౌతికంగాని, ఆశించకూడదు. నా వద్దనుంచి ఏ సహాయము వారు ఆశించకూడదు అంతేగాక వారే నాకు సహాయము చేయవలసి ఉంటుంది.

(12) నాతో వస్తానని అనేవారిలో ఎవరు నాతో రావాలో ఎవరు ఉండిపోవాలో నేను ఆఖరు మాటుగా నిశ్చయం చేస్తాను

(13) 1951 అక్టోబరు 16 లగాయతు 1952 ఫిబ్రవరి 12 వరకు వున్న యీ మనోనాశన కాలంలో నా యొక్క జీవిత విధానం ఎటువంటి బంధించే షరతులు లేకుండా స్వేచ్ఛగా ఉంటుంది. నేను ఒకచోటనుండి వేరొక చోటికి తిరుగాడవచ్చును. లేక ఒకేచోట స్థిరంగా ఉండవచ్చును. ఏ సంగతీ అంటే నేను ఎక్కడకు వెళ్ళదలచినది 1951 జూలై నుంచి, 1951 అక్టోబరు వరకు ఉన్న వ్యవధిలో నిశ్చయిస్తాను. నేను దేనికోసమయినా భిక్ష మెత్తవచ్చును. ఏదయినా కావాలని అడుగవచ్చును. ఏదయినా అంగీకరించ వచ్చును. ఏదయినా నిరాకరించవచ్చును బహుశా యివేమీ వేషు చేయలేకపోవచ్చును కూడ నేను ఏదయినా మంచిగాని చెడుగాని సందర్భాన్ని బట్టి అసాధారణమయినది గాని సాధారణమయినది గాని యీ గొప్ప మనోనాశన కార్యక్రమానికి దేవుని యిచ్ఛమీద ఆధారపడి చేస్తాను.

ఈ ప్రకటన చేసిన తరువాత బాబా 'నాశన'మని ఉదహరించినది 'మనోనాశన'మని వివరించారు.

అనంతరము శిష్యులందరినీ ఆ రోజంతా మర్నాడు (జూన్ 29) ఉదయం 8 గంటల వరకు టీ, మంచినీరు మాత్రం తీసుకుంటూ ఉపవాసం చేయవలసినదిగాను బాబా యొక్క మనోనాశ్ కార్యక్రమము జయప్రదంగా జరుగునట్లు ప్రార్థించవలెనని బాబా ఆదేశించారు స్త్రీలు కూడా ఉపవాసం ఉన్నారు

ఈ మనోనాశన కార్యక్రమము అమలు జరుపుటకు బాబాతో ఉండదలచిన వారందరికి అనేక కష్టాలు కలుగవచ్చునని, పడరాని పాట్లు పడవలసి వచ్చునని వీటికి బాబా ఎంత మాత్రము బాధ్యులుగా నుండజాలరని, ఆ రోజులలో సహచరు లందరు నిద్రాహారాలు లేక రోగాలతో బాధపడుతూ. నిస్సహాయులై నిరాశా నిస్పృహ లతో రోజులు గడపవలసి రావచ్చుననీ ముందుగానే బాబా హెచ్చరిక చేసారు.

చివరకు బాబా ఎరచ్, పెండు, గుస్తాద్‌జీ, బైదుల్‌లను మాత్రమే తమతో తీసుకొని వెళ్తామన్నారు అక్టోబరు (1951) 16 నుండి నాలుగు నెలలు వారుండ వలెననియూ, యింకా ఆ తేదీ లగాయితు మూడు నెలలు మాత్రమే మినూఖరాస్ డా॥ దౌలత్ సింగ్ బాబాతో ఉండాలని బాబా చెప్పారు.

1951 జూన్ నెల 27, 28 తేదీలలో బాబా హైదరాబాదులో ఒక ముఖ్య మయిన సమావేశం ఆయత్త పరిచారు చాలామంది బాబా శిష్యులు భక్తులు యీ సమావేశానికి హాజరయారు. బాబా యిది భగవన్నిర్ణీతమయిన సమావేశం అని చెప్పారు. రాబోవు అక్టోబరు 16 (1951) వ తేదీని తాము తీసుకునే చర్య గురించి 28 జూన్ ఉదయాన్నే యీ విధంగా ప్రస్తావించారు. ఈ ప్రస్తావన డా॥ డాన్‌కిన్‌చేత బాబా చదివించారు. అందులో యిలా చెప్పించారు.—

“భగవంతుని సన్నిధిలో యిదివరకు ప్రపంచమునందు ఉద్భవించిన పూర్ణ పురుషు లందరను (సద్గురువులు) హృదయమున నుంచుకుని వారు సాక్షులుగా నేను భగవంతుని సహకారముతోను ఆయన ఇచ్ఛతోను రాబోవు అక్టోబరు 16 వ తేదీన తప్పకుండా ఒక మనోనాశన కార్యంలో అడుగుపెడుతున్నానని ప్రకటన చేస్తున్నాను. అది ఫిబ్రవరి 1952 నాటికి పాత జీవితపు మెహెర్‌బాబా స్థితికి నన్ను గొనిపోతుంది.

అంతేకాదు. నా అవతార ప్రకటీకరణ విశ్వవ్యాప్తంగా జరుగుటకు దోహదకారి కాగలదు." పవిత్ర గంభీర సమయంలో యిది చదువుతూన్న ఆ శిష్యుడు యిలా అన్నాడు — "ఈ ప్రకటన బిగ్గరగా చదివేటప్పుడు మేమంతా మౌనము గాను గంభీరము గాను నిలబడి యుంటిమి." బాబా నిలబడియున్న మీరంతా యీ ప్రకటనకు సాక్షులు" అని చెప్పారు సేవకులతోటి అక్టోబరు 16 నుంచి ఫిబ్రవరి (1952) 16 వరకు చేయబోయే మనోనాశన కార్యక్రమానికి కావలసిన ఏర్పాట్ల గురించి బాబా చర్చ చేసారు.

బాబా 28 జూన్‌న ప్రకటనలో చెప్పినట్లు యీ కాలంలో బాబా శరీరంకూడా విడిచి వేయవచ్చునని మరల జ్ఞాపకం చేసారు. ఆయన కోరిన ఫలితాలు పొందడానికి ఆయనకి ఏది మంచిదని తోస్తే అది చేయడానికి పూర్తి స్వేచ్ఛ ఆయనకి ఉంటుందన్నారు. కావలిస్తే ఆయన కార్యక్రమం ఆయనకు వీలయినట్లు ఏ క్షణంలోనయినా మార్చుకోడానికి ఆయనకి సంపూర్ణ స్వేచ్ఛ ఉంటుంది అది ఆయన మానసిక వైఖరి మీద ఆధారపడి ఉంయింది

అందరినీ బాబా ఆయనకి ఎటువంటి సంబంధాలు ఉండవని మనసులో జ్ఞాపకం ఉంచుకోమని కోరుతూ మనోనాశన కాల పరిమితిని నాలుగు స్థితులుగా విభజించారు.

(1) మొదటి స్థితి 30 నుంచి 40 రోజులు వరకు ఉంటుంది. ఈ కాలం హైదరాబాదు వద్ద ఏదయిన కొండమీద గడుపుతానన్నారు. ఆ పరిసరాలలోని కొండ ప్రదేశాలన్నీ వెదకి ఒక స్థలంలో ఒక గుహను ఎన్నుకున్నారు. ఈ ప్రదేశం బాబా చెప్పిన 4 షరతులకు అనుగుణంగా ఉంది.

(a) స్థలము పట్నానికి దూరంగా ఉండాలి.

(b) అది ఒక కొండమీద గాని సముద్రం దగ్గర గాని ఉండాలి.

(c) దానికి దగ్గరగా ఒక చిన్నగ్రామం ఉండాలి.

(d) దానికి ఆధ్యాత్మికమయిన చరిత్ర ఉండాలి.

(e) దానికి ఒక వైపునయినా విశాలమయిన ప్రదేశం ఉండాలి.

తలచుకుంటే బాబా ఆ ఖాళీప్రదేశంలో ఎవరివల్ల అంతరాయం లేకుండా నడుస్తూండ వచ్చు.

మురళీ అనే సేవకుడు హోమియోపతి శిక్షణ పూర్తిగా అవాలని ఉందని అభిలాష వ్యక్తపరిచాడు అందుచేత బాబా అతనిని జూలై 1, 1951 నుంచి విముక్తుణ్ణి చేసి, పాత జీవితానికి హోమియోపతి వైద్యవిధానంలో ఉత్తీర్ణుడవడానికి పంపించారు. నూతన జీవితంలో ఉన్నన్నాళ్ళు అతడు మంచి గుణాలే వ్యక్తపరిచాడు. అతనితో సహచరుడుగాను తమకు సేవకుడుగాను బాబా చాలా సంతృప్తిచెంది సంతోషించారు.

బాబా జూలై 8 (1951) తేదీన అక్టోబరు 16 నుంచి యీ దిగువ కనపరిచిన పేర్ల ప్రకారం నలుగురిని వారితో కూడా తీసుకువెళ్ళడానికి నిశ్చయించారు-
(1) ఎరచ్ (2) పెండు (3) బైదుల్ (4) గుస్తాద్‌జీ.

మినూఖరాస్, దౌలత్‌సింగ్‌లు తమతో రావాలో అక్కర్లేదో సెప్టెంబరు 7 వ తేదీన నిర్ణయిస్తానని బాబా చెప్పారు -

"అక్టోబరు 16 వ తేదీన భగవంతుడు నిర్ణయించిన అడుగు వేయడం దృష్టిలో ఉంచుకుని నేను సేవకులందరిని జూలై 10 వ తేదీన ఉదయం 6 గంటల నుంచి 24 గంటలు మౌనం వహించమని ఆజ్ఞాపించాను. నాతో ఉన్న స్త్రీలు కూడా ఆ ప్రకారం మౌనం పాటిస్తారు'' అని బాబా అన్నారు.

జూలై (1951) 10 వ తేదీ బాబా యొక్క 26 వ మౌనవార్షిక దినమగుట చేత అరోజు ఉదయం 6 గంటలనుండి 24 గంటల కాలము సంపూర్ణ మౌనము పాటింపవలెనని బాబా శిష్యులందరినే గాక ప్రపంచము నందలి ప్రేమికులందరినీ కూడా కోరారు.

ఆగష్టు (1951) 9 వ తేదీన ఉదయం మెహెర్‌జీ, ఆదీ (సీనియరు), ఆదీ (జూనియర్ - బాబా ఆఖరి తమ్ముడు) కొండమీది యీ ప్రదేశాన్ని చూసి నచ్చిందన్నారు అందులో బాబా ఉండడానికి తగినట్లు కావలసిన మార్పులు చేయిస్తున్నారు.

(2) హైదరాబాద్ వద్ద కొండమీద 30-40 రోజులు గడిపి బాబా బౌరంగాబాదు వెళ్దామనుకుంటున్నారు. హైదరాబాదుకి 350 మైళ్ళ దూరం ఉన్న ఆ పట్నానికి

బాబా కాలినడకను వెళ్ళాలనుకుంటున్నారు. అక్కడికి వెళ్ళేసరికి 36, 40 రోజులు పడుతుంది.

ఈ రోజుల్లో ఆయన ఎలా జీవిస్తారో ఎలా ఉంటారో యిప్పుడు చెప్పలేరు. ఆయన లంగోటీ కట్టుకోవచ్చు లేక మామూలు దుస్తులు ధరించవచ్చు. రోజుకి 4 మార్లు భుజించవచ్చు లేక రోజులు కొలదీ ఉపవాసాలు చెయ్యవచ్చు. ఇవి బాబా ఇష్టం వచ్చినట్లు గాక దేవుడు చెయ్యమన్నట్లు చేస్తారు.

ఔరంగాబాదు వెళ్ళాక 3,4 రోజులు ఆ చుట్టు ప్రక్కల ఉండి మనోనాశన కాలం మూడవ స్థితిలో ప్రవేశిస్తారు ఇక్కడనుంచి మూడవస్థితిలో ఉండవలసిన చోటకి నడిచే వెళ్తారు. ఈ మూడవస్థితి ఆఖరయేసరికి ఆయిన శారీరకస్థితి ఆయన శరీరం పడిపోవడానికి సిద్ధంగా ఉన్నట్లుంటుంది. అలాగయితే ఆ స్థలానికి ఆధ్యాత్మిక చరిత్ర ఉండనక్కర్లేదని ఆయనకి తోస్తే ఆఖరిస్థితిలో ఆయన పాత జీవితానికి సంబంధించిన ఒక స్థలంలో ఉంటారు ఈ పరిస్థితులలో బాబా పింపలగామ్ కొండ బాగుంటుందని యీ కొండమీద యిదివరలో ఏకాంతవాసం చేసారు – అక్కడ ఉండడానికి షరతులన్నీ సరిపోతే, అక్కడ ఉంటారు.

సేవకులతోను యితరులతోను పింపలగామ్ కొండ గురించి బాబా చర్చించారు పరోష్‌తోతు, పాడ్రి, ఆదీ (జూనియర్)లతోను, ఆదీ (సీ)ని వెళ్ళి ఆ కొండని చూడమన్నారు బాబా – వారి సహాయంతో అక్కడ కావలసిన ఏర్పాట్లు చేయమన్నారు. మూడవ స్థితిలో ఉండే స్థలానికి ఆధ్యాత్మిక చరిత్ర ఉండి ఉండాలని తోస్తే, బాబా శరీరం నిలిచేలా ఉంచే అహమద్‌నగర్ వద్దగాని పూనావద్దగాని తగిన స్థలం ఏర్పాటుచేయమని ఆదీతో చెప్పారు.

మనోనాశన కార్యక్రమపు కాలం నాలుగు నెలల్లోను కార్యక్రమం అంతా మార్చుకోడానికి బాబాకి పూర్తిస్వేచ్ఛ ఉందని ఆయన అన్నారు.

పింపలగామ్ కొండమీద ఉండడమే వస్తే అది 30; 40 రోజులపాటు ఆఖరు స్థితిలో ఉంటానన్నారు. అక్కడ ఉంటే యిదివరకులాగ పింపలగామ్‌లో స్థిరపడిపోతానని అనుకోకూడదని బాబా హెచ్చరించారు.

బాబా దేవుడు నిర్ణయించిన ప్రకారం 16-10-51 తేదీని మనోనాశన కార్యక్రమం ప్రారంభించాలి గనుక యీ దిగువ వ్రాసిన ప్రకారం అర్థం చేసుకుని ఆచరించమని ఆగస్టు 16 వ తేదీన వారి భక్తులను కోరారు.

(1) బాబా ఎప్పుడూ రాజకీయాలతో సంబంధం పెట్టుకోలేదు. ఇంక పెట్టుకోరు. అందుచేత మీలో ఎవరయినా రాజకీయంగా పని చేస్తూంటే ఆ పనిలో బాబా పేరు ఎన్నడూ మీరు ఉపయోగించకూడదు. ఆ రాజకీయాలలోకి ఆయన్ని మీరు లాగకూడదు.

(2) బాబా వారి పాతజీవితపు అనుయాయులందరను స్వార్థపూరితమయిన పనులు చేయడానికి పూనుకోవద్దని కోరుతున్నారు.

(3) బాబా వారి పాత జీవితపు అనుయాయులను, నూతన -జీవితపు మిత్రులను, సోదర సోదరీలను, సేవకులను వారి హృదయాల్లో దేవుని యెడల ప్రేమ అనే జ్యోతిని వెలిగించమని కోరుతున్నారు.

ఆ ప్రదేశమందు బాబా నలుబది దినములు గడపనుద్దేశించుచున్నట్లు కూడా తెలిపారు. తమ కార్యక్రమము పూర్తి అయిన అనంతరము హైదరాబాదు నుంచి ఔరంగాబాదునకు పాదయాత్ర చేస్తానని కూడా బాబా తెలియపరచారు.

ఆగస్టు 18 వ తేదీన హైదరాబాద్‌లో బాబా యీ విధంగా చెప్పారు. "ఈ నవ్యజీవన కాలమునందు మూడవది ఆఖరుది అయిన యీ స్థితి చాలా సందిగ్ధావస్థ యనియు ఆపదతో కూడినదియుగా నుండును." ఈఅవస్థ అంతమునందు బాబా తమ భౌతిక శరీర విసర్జనము చేసినను చేయవచ్చునని తెలిపారు. ఆధ్యాత్మిక వాతావరణ మంతగా లేకపోయినను పాత జీవితపు శిష్యులతో సన్నిహితముగా నుండగలుగు చోట యీ అంతిమస్థితిలో బాబా గడపవలెనని అనుకుంటున్నారు. దీనికి తగినది- పింపలగామ్‌లో ఉన్నకొండ. ఆ కొండమీద పాత జీవితంలో యిదివరకు బాబా కొన్నాళ్ళు ఏకాంతవాసం చేశారు.

## అబ్దుల్‌ఘనీ మరణము :—

చిన్నప్పటి నుండి బాబా సహపాఠుడు, మిత్రుడు, శిష్యుడుగా నుండిన డాక్టర్ అబ్దుల్‌ఘనీ మున్సిఫ్ అనునాతడు ఆగస్టు 20వ తేదీన పూనాలో ఆనాడు సాయంకాలము

7 గంటలకు బాబాలో శాశ్వతంగా లీనమయ్యాడు. అతని యెడల బాబాకు ఉన్న ప్రేమ బాబా యిట్లు జారీచేసిన యీ ప్రత్యేకమయిన సర్క్యులర్ లేఖవల్ల తెలియగలదు –

"నా నూతన జీవితంలో నేను త్యాగముచేసినవి బాధపడిన వాటి అన్నిటి లోను ఘనీయొక్క మరణము అన్నిటికంటె గొప్పది."

అబ్దుల్ ఘనీ అంటే బాబాకు ఎంత ప్రేమ ఉన్నదో ఘనీ జీవితంలోని ప్రధానమయిన యీ సంఘటన తెలుపుతోంది. ఒకానొక సమయంలో గృహచ్ఛిద్రాల వల్ల ఘనీకి మనస్సు పాడై పోయింది. నిరాశ కలిగింది. జీవితం మీద ఇచ్ఛపోయింది. ఎలాగోలా జీవితాన్ని అంతం చేయుకోవాలని – ఆత్మహత్య చేసుకోవాలని సంకల్పించాడు. అదే పరిష్కారమార్గం అనుకున్నాడు తన అసౌఖ్యానికి. ఇలా నిశ్చయించుకుని ఒక రాత్రి స్నేహితులతో హోటలులో చాలాసేపు గడిపి రాత్రి 2 గంటలకు ఒక్కడూ బయలుదేరి అక్కడ "తా" చెరువు వద్ద ఉన్నడామ్ మీదకు వెళ్ళాడు. వెళ్ళి తనకు సాంగత్యం భాగ్యం కలిగిన ఆధ్యాత్మిక గురువులందరినీ ఒక్కమారు తలచుకున్నాడు. ముఖ్యంగా మెహెర్‌బాబాను యీ విధంగా తలిచాడు.

"బాబా! నన్ను నీవు చిన్నప్పటినుంచీ ఎరుగుదువు. నాకు యిటువంటి సంకటస్థితి కలిగినా నీకేమీ తెలియనట్లు ఊరుకుంటున్నావు. నా కష్టాలన్నీ గట్టెక్కే మార్గం యిది ఒక్కటే. నేను నీ దగ్గరికి శాశ్వతంగా రావడానికి సంకల్పించాను. కాని గుర్తుంచుకో ఘనీకి నీవు యింత నైరాశ్యం జీవితంలో కలిగేలా చేసావు. అయినా సహాయం చేయడానికి యిసుమంతయినా నీవు ప్రయత్నించటం లేదు. నిన్ను తలవనిరోజు లేదు నాకు; కాని నా కర్మానికి నన్ను వదిలివేసావు" అని నిందాత్మకంగా బాబాను సంబోధించి ఆయనను తలచుకున్నాడు ఇంక ఆ డామ్ మీద నుంచి ఆ పెద్ద చెరువులోకి దూకి అసువులు బాయవలెనని ఉద్దేశించి డామ్‌మీద, నీటి అంచు దగ్గరకు వెళ్ళి అక్కడ చపటా ఉంటే దానిమీద నీటి కభిముఖంగా కూర్చున్నాడు. తన చివరి క్షణాలు అవే అని భావించాడు ఆ చపటామీద కూర్చుంటే నీటిమీద నుంచి హాయిగా చల్లనిగాలి వీస్తోంది. ఆ నిశాసమయంలో ఆ చల్లగాలికి (అంతవరకు హోటలులో మిత్రులతో కాలక్షేపం చేసిన మీదట) అతనికి నిద్రవచ్చేసింది. అప్రయత్నంగానే ఆ చపటామీద పరున్నాడు. ఘనీకి తెల్లవారిన తరువాతే మెలకువ వచ్చింది ఇప్పుడు యిలా జరిగింది కదా. రేపురాత్రి తన ప్రయత్నం జరిగితీరాలి అనుకున్నాడు అలా వాయిదావేసి యింటికి వెళ్ళాడు.

ఇంటిలో ప్రవేశించగానే - ఆశ్చర్యము! – ప్రియతములైన మెహెర్ బాబా తన మిత్రుడయిన ఘనీకోసం కనిపెట్టుకుని ఉన్నారు. నిజంగా బాబా శరీరంతో భౌతికంగా అక్కడికి వచ్చారు. ఆయనకు ఎన్ని పనులున్నా భక్త సంరక్షణార్థం స్వయంగా వచ్చారు ఆయన చలవ వల్లనే ఘనీకి నిద్రపట్టింది. లేకపోతే అంతటి తీవ్రమైన మనోభావం కలిగి అటువంటి చర్యకు ఒడగట్టినవానికి నిద్ర ఎలా వస్తుంది? బాబా ఘనీ రాగానే కౌగిలించుకుని "నిన్నరాత్రి నన్ను తలిచావు కదా. అందుకని పరుగెత్తుకుని నీ కోసమే వచ్చాను" అన్నారు. బాబా దర్శన స్పర్శలు కలుగగానే ఘనీకి మనసు మారిపోయి ఎంతో సంతోషం కలిగింది. జీవితం మీద ఆశ కలిగి అది ఒక క్రొత్త మలుపు తిరిగింది. అతని చిక్కులన్నీ సూర్యుని ముందు మంచులా విడిపోయాయి. ఆజన్మాంతము బాబాను ప్రేమిస్తూ ఆయన సేవలోనే ఘనీ ఉండిపోయాడు. "బాబా తో 20 సంవత్సరముల నా సాంగత్యము" అను గ్రంథము కూడా అతడు రచించాడు అటువంటి ఆప్త శిష్యుడు యీనాడు శాశ్వతంగా యీ లోకానికి దూరమయాడు.

అబ్దుల్ ఘనీ గురించి బాబా యింకా యీ విధంగా అన్నారు.

ఇండియాలోను పాశ్చాత్య దేశాల్లోను పాత జీవితంలో నా శిష్యులు నా ప్రేమికులుగా ఉండి వారిలో మరణించిన వారందరి మొదల నేను పొందిన నష్టానికి చాలా బాధ పడ్డాను. కాని హఠాత్తుగా ఘనీ నానుంచి లాక్కుపో బడ్డాడంటే నాకు అది ఒక వినాశకరమయిన దెబ్బ నూతన జీవితపు అంతం దగ్గరలో ఉన్నప్పుడు యీ సమయంలో అతని వియోగం చాలా క్రూరంగా ఉంది మీ అందరికంటె నాకు ఎక్కువగా. ఘనీ అద్వితీయమైనవాడు. నాకు యితరులు చేసి పెట్టవలసిన పనిలో ఘనీ చేసియుండదగినది ఎక్కువగా ఉంది అది యింకెవ్వరూ చేయలేనిది అతని పెద్ద తలకాయ నాకు నిజంగా ఒక పెన్నిధివంటిది అది జ్ఞానంతోను హాస్యరసంతోను నిండియుండెను. మా చిన్నతనం నుండి మేము సన్నిహిత స్నేహితులం. అతడు ఎంతటి ధైర్యశాలియో, ఎంత ప్రేమ హృదయుడో, ఎంత మిత్రప్రేమ కలవాడో నాకంటె ఎవరికీ బాగా తెలియదు నాకు ఘనీ స్థానం మళ్ళీ పూరింపబడదు నా పనిలో అతడొక పనిముట్టుగాను నా కొక మిత్రుడుగాను ఘనీ అద్వితీయమైన స్థానం వహించాడు.

హైదరాబాదులో ఆ రోజున (28-6-51) సమావేశంలో మీరు ఉండగా నా ప్రకటన దానికి వివరణ అనుబంధము రెండూ కూడా ఘనీయే చదివాడని మీకు జ్ఞాపకం ఉంటుంది. దానికి సాక్షిగా ఉన్నవారిలో అతడు కూడా అక్టోబరు 16 వ తేదీన ఉపవాసం చేయవలసి ఉండెను.

ఫిబ్రవరి 16, 1952 వరకు ఘనీ యింకా శరీరంతో ఉంటాడని నేను భావించాను. అందుచేత ఘనీ అల్లుడయిన బగ్గూని నేను అక్టోబరు 16 వ తేదీన ఘనీ తరఫున నాకోసం ఉపవాసం చేయాలని, నా కోసం అతడు ప్రార్థన చేయాలని నేను బగ్గూని అడిగాను. బగ్గూ 28 జూన్ సమావేశంలో లేడు. బగ్గూకి పూసగుచ్చినట్లు అన్ని విషయాలు కళ్ళకు కట్టినట్లుగా వర్ణించి చెప్పమని రంజూని నేను కోరాను. ఆ వర్ణన విని అతడే స్వయంగా ఆ సమావేశంలో ఉండి అంతా స్వయంగా చూసినట్లు అతడు భావించాలని చెప్పాను. ఈ విధంగా నా ప్రకటనకి ఘనీ సాక్షిగా ఉండి చేయవలసిన కార్యం జరుపబడుతుంది.

భగవంతుని ఇచ్ఛ అయితే 1952 ఫిబ్రవరి 16 నాటికి నేను విశ్వవ్యాప్తంగా ప్రకటీకరణ చేస్తాను ఘనీ, యింకా మరణించిన ప్రతీ పాత జీవితపు శిష్యుడు ఆ ప్రకటీకరణ అనుభవిస్తాడు వారు భౌతిక శరీరంతో ఉన్నట్లే దానిని అనుభవించగలరు అని బాబా చెప్పారు

హైదరాబాద్ లో జూన్ 28 వ తేదీన చేసిన ప్రకటనలో బాబా వారి ప్రకటనకు సాక్షులుగా ఉన్నవారు 16-10-51 తేదీ ఉదయం 8 గంటల నుంచి 24 గంటలు టీ గాని నీరు గాని తీసుకుంటూ ఉపవాసం ఉండాలని బాబా చెప్పారు. ఉపవాసం ఉండి వారి మనో నాశన కార్యక్రమమును జయప్రదంగా ముగించమని దేవుని ప్రార్థిస్తున్నారు.

ఈ రోజున బాబా ఆ విధంగా ఆరోజున ప్రకటనకు సాక్షులుగా ఉన్నవారే గాక ఎవరయినా ఉపవాసం చేయవచ్చునని బాబా యొక్క మనోనాశనపు పని జయప్రదంగా పూర్తి కావాలని, దేవుని ప్రార్థించ వచ్చును. ఆవిధంగా బాబాకి తోడ్పడవచ్చునని చెప్పారు.

తరువాత 1951, అక్టోబరు 16 వ తేదీన మనోనాశ్ కార్యక్రమం ప్రారంభించిన రోజున బాబా యీ విధంగా చెప్పారు-

" ఈ రోజున బాబా యొక్క మనోనాశన కార్యక్రమం ప్రారంభమయిన రోజు ఈ పని 1952, ఫిబ్రవరి 6 వ తేదీన అంత మొందుతుంది ఈ నాలుగు నెలలలోను బాబా వారి పాత జీవితపు శిష్యులను, సేవకులను, వారితో ఉండే 6 గురిని తప్ప యింకెవరినీ కలుసుకోరు. హైదరాబాదులో ఏకాంతంగా ఒక కొండమీద 28 రోజులు ఉంటారు. తరువాత 40 రోజులు బాబా హైదరాబాదులో బయలుదేరి పింపలగామ్ కొండ దగ్గరకు నడిచి వెళ్ళడంలో గడుపుతారు. తరువాత ఆఖరి 50 రోజులు పెంబి కొండమీద ఉంటారు.

బాబాతో ఉంటూ ఉన్న స్త్రీలు యిప్పుడు హైదరాబాద్ లోనే ఉన్నారు. డిసెంబరు మధ్యలో హైదరాబాద్ వదలి పింపలగామ్ లో నారిమన్ యింటిలో అతనికి నెలకి రు 50 లు అద్దె యిస్తూ నివాసం ఉంటారు. బాబా పింపలగామ్ కొండమీద ఉన్న కాలంలో యీ స్త్రీలను కలుసుకో యి. ఆ కొండకి క్రింద ఉన్న తోటకి ఏ యింటికి సంబంధం లేకుండా చేస్తారు బాబా ఏకాంతంగానే ఉంటారు.

పింపలగామ్‌లో స్త్రీలు ఉన్నకాలంలో వారి వద్దకు బాబా యొక్క పాత జీవితపు శిష్యులు, భక్తులు - స్త్రీలుగాని పురుషులు గాని - ఎవరూ పోకూడదు. స్త్రీలు కూడా నూతన జీవితంలోనే ఉన్నారు.

పింపలగామ్ కొండమీదకు వెళ్ళి అసలు బాబాను ఎవరూ చూసే ప్రశ్నే లేదు. ఆ విధంగా బాబాను వారి పాతజీవితపు శిష్యులు భక్తులు ఎవరూ కలుసుకో కూడదని ఆజ్ఞాపించారు వారు పింపలగామ్‌కి నడిచి వచ్చేటప్పుడూ కలుసుకోకూడదు. కొండమీద ఉన్న కాలంలోనూ ఎవరూ వచ్చి కలువరాదు. ఈ ఆజ్ఞ ఉల్లంఘించిన వారు బాబా పనికి అంతరాయం కల్పిస్తారు. దేవుని యెదుట వారు ఆ అకార్యానికి బాధ్యులవుతారు.

బాబా అందరినీ తెలుసుకోమంటున్నారు. ఈ ఏర్పాట్లన్నిటికీ బాబా బద్ధులు కారు ఆయనకి పూర్తి స్వేచ్ఛ ఉంది ఈ నాలుగు నెలలలోను మనోనాశనం సాధించడానికి బాబా వారి యిష్టం వచ్చినపని చేస్తారు

నూతన జీవితంలో ఆఖరి నెలలు బాబా పింపలగామ్‌లో గడిపారు. అక్టోబరు (1951) లో ఉద్యోగాలను విరమించుకుని తమ్మని కొందరిని పిలువనంపారు బాబా.

ఆ ప్రకారంగా రానో కిట్టీలు వారి ఉద్యోగాలు మానేసి బొంబాయినుంచి మహాబలేశ్వర్ వచ్చి బాబాను చేరారు.

మహాబలేశ్వర్ నుంచి బాబా హైదరాబాద్‌కి వెళ్ళారు అక్కడ బాబా దిగిన బంగళా చాలా అందంగా ఉంది. దానికి మేడ కూడా ఉంది మొదట బాబా మేడమీద దిగారు. కాని అక్కడ ఏదో చప్పుడు అవుతుంటే వారి గదిని క్రిందికి మార్చారు. కొన్నాళ్ళయాక రానో కిట్టీలను బాబా తిరిగి బొంబాయి పంపించేసారు. వెళ్ళి అక్కడ ఊరికినే ఉన్నారు వారు.

నూతన జీవితంలో అప్పుడప్పుడు కిట్టీదేవిని మరి ఒకరిద్దరిని పిలిపించే వారు. అప్పుడు బాబా మహాబలేశ్వర్ లోను సతారాలోను ఉండేవారు. ఆ రోజులలో బాబా గొప్ప మానసిక వ్యధను పొందేవారు.

మహాబలేశ్వర్ లో ఉన్నపుడు బాబా గదిలో ప్రతి సాయంత్రం 6-30, నుంచి 7 గంటల వరకు జీరోస్ట్రియన్, ముస్లిమ్, హిందూ, క్రిస్టియన్ ప్రార్థనలు గట్టిగా చదవించే వారు. ప్రార్థనలు చదివినంత సేపు బాబా నిటారుగా నిలబడి యుండేవారు.

సతారాలో ఉన్నపుడు ప్రతి ఉదయం 10 గంటలకు బాబా జెందవెస్తా, ఖురాన్, గీత, బైబిల్ పవిత్ర గ్రంథాల నుంచి గట్టిగా చదివించేవారు. స్త్రీలు అప్పుడు తెరవెనుక కూర్చుని యుండేవారు. అలా చదువుతూంటే మధ్య మధ్యను ఆపి బాబా కొన్ని విషయాలు వ్యాఖ్యానించి చెప్పేవారు అక్షర ఫలకం మీద. ఈ అరగంట సమావేశాలలోను ఒకరికొకరు చాలా సన్నిహితంగా చనువుగా ఉండేవారు. అనుకున్న ప్రకారం హైదరాబాద్ సమీపంలో కొండమీద గుహలో 16-10-51 తేదీ నుంచి 28 రోజులు ఏకాంతవాసం చేసారు. మనోనాశన కార్యక్రమానికి అదే ప్రారంభం. ఆ 28 రోజులూ అయాక పింపలగామ్ కొండకి నడచి వెళ్ళారు. అక్కడ కార్యక్రమం అయాక 1951 డిసెంబరులో కొండమీద రేకులతోను పెంకులతోను నిర్మించిన గదులు తీసివేసారు. వాటితో మెహెరాజాదులో ఒకేగది నిర్మించారు అందులో బాబా కొన్నాళ్ళున్నారు బాబా యొక్క నవ్య జీవితం అయిపోగానే. తరువాత బాబా ఎరచ్‌ను అంఘిలో ఉండమన్నారు

1951, డిసెంబరు 24 వ తేదీన యాత్రాత్త జీవితంలో నన్ను గోహర్ తయారు చేసిన జాబితా ప్రకారం వారిని తలచుకుని "గతించిన భక్తుల యొక్క ప్రేమకు, సేవకు, నేను ఎంత అనర్హుడనని తెలిసినా, ఎంతో వినమ్రుడనై నేను అత్యంత కరుణాన్వితుడు కృపా ప్రపూర్ణుడు అయిన భగవంతుని నేను అభ్యర్థిస్తు న్నాను– ఆయన అనుగ్రహంప్రతివారి మీద వారి వారి గుణ గణాలని బట్టి ప్రసరించ వలసిందని నేను కోరుతున్నాను.

ఈ విజ్ఞప్తి భగవంతునికి కంటె నాకే ఎక్కువగా చేసుకుంటున్నాను. ఈ ప్రియమైన వారు శారీరకంగా లేకపోవడం జ్ఞాపకం చేసుకుంటున్నాను ఎందు చేతంటే నాకు తెలుసును అనంతుడు, సర్వజ్ఞుడు అయిన భగవంతుడు అడుగ కుండానే అన్నిపనులు చేస్తాడు. మనం కల్పించుకోకుండానే ఆయన అనుగ్రహాన్ని మనకు కలిగిస్తాడు.

ఆత్మ అమరం గనుక, యీ భూమిలో శరీరాలు పతనమైపోయినా, వీరి ఆత్మలు జీవించియే ఉన్నాయి. అయినా యీ రోజున పవిత్రమయిన ప్రేమ జ్యోతికి నేను జోహారు చేయకతప్పదు. అది భగవంతునకు ప్రియమైనది ప్రతీ ప్రేమ హృదయంలోను ఆ జ్యోతి వెలుగుతూంటుంది ఈ గతించిన వారి హృదయాలలో తరతమ భేదాలతో ఆ జ్యోతి వెలిగింది.

ఈ ప్రియుల యొక్క జ్ఞాపకార్థం, వారికి జోహారు చేసేందుకు, నా జీవితాన్ని వారి ప్రేమతో నింపివేసారు గనుక ఈ రోజున యోగ్యమైన నడవడి కలిగిన ఒక బీదవానికి ప్రణమిల్లి వానికి రు 124 లు సమర్పిస్తాను. అప్పుడు బాబా యీ క్రింది జాబితా ప్రకారం 87 గురు పురుషుల 37 గురు స్త్రీల పేర్లను చదివించారు.

పురుషులు :—(1) షెరియార్జీ ముందేగర్ ఇరానీ [బాబా తండ్రి], (2) బెహెరామ్ ఇరానీ [బువాసాహెబ్] (3) డా॥ అబ్దుల్ ఘనీ మున్సిఫ్, (4) ఫ్రం రోజ్ హెచ్. దాదాచాన్జీ, (5) రుస్తుం ఇరానీ [మాసాజీ - బాబా మమ] (6) మున్షిసాహెబ్, (7) నావల్ సి. తలాతీ, (8) ఖాక్ సాహెబ్, (9) జామ్‌షెడ్ ఎస్. ఇరానీ [బాబా అన్నగారు] (10) వాల్టర్ మెర్టెన్స్, (11) నెర్వాస్ ఇరానీ, (12) సంపత్ అయ్యంగార్, (13) రామానుజం, (14) అర్జున్ సుపేకర్, (15) కొండిబా, (16) సయ్యద్

జమేదార్, (17) కేకిలట్టూస్, (18) ఫరెదూచ్‌మాసా, (బావా యొక్క మేనమామ) (19) ఖాన్ బహదూర్ కె. ఎస్. ఇరానీ, (20) బిహారీలాల్, (21) కైఖుస్రూ (మాసా) ఇరానీ, (22) కుంజి బిహారీచౌబే, (23) మానెక్‌రంజి, (24) సాథుపైక్, (25) నాదిర్‌షా (26) చౌదరి, (27) బార్‌సోప్ అబ్దుల్‌రహమాన్, (28) దౌలత్ పాదిర్ (29) నీల్ మెస్, (30) గారెట్ ఫోర్ట్, (31) జంబుమామ, (32) క్వెన్‌టిన్‌టాడ్ (33) సోరాబ్జీ ఎమ్. దేశాయి, (34) అజోబా, (35) అహమద్‌ఖాన్ గవాయ్, (36) తెహెమ్‌తన్ ఎన్. దాదా చాస్జీ, (37 కాకా [బాబా పినతండ్రి] (38) షా [బాదా పినతండ్రి కొడుకు], (39) పులాద్ [బాబా బంధువు] (40) బాబానందస్వామి, (41) నస్సెర్ వాంజి కేరావాలా (42) డా॥ కర్కాల్, (43) గనుచంహార్, (44) ఆశ్రమ సేవకుడు జాన్ (45) రామ్‌నాథ్ (46) బాల సుపేకర్, (47) ఆలీ అక్బర్ [జూనియర్] (48) సొరాబ్జీవకీల్, (49) ఫరెదూన్ బైదుల్, (50) బేహెరమ్ బైదుల్ (51) హోర్మజ్దియార్ బైదుల్, (52) బాపుఘంటె, 53) కాశియా (సేవకుడు. (54 లాలాపథాన్, (55) చింతామణ్‌రావు, (56) సోపె కొత్వాల్, (57) బెహెరంజీ ఎమ్ దేశాయి, (58) అర్దేషిర్ ఎమ్. దేశాయి. (59) మానెక్‌జీ కన్‌ఫెషనర్, (60) ఎన్. నామ్‌దార్ దస్తూర్, (61) రుస్తుం దిన్యార్, (62) భావుసాహెబ్ మహేందర్‌గె, (63) రషిద్ ఖుస్రూ, (64) జామ్‌షెద్ బ్రెహామ్ పీర్‌మర్ద్, 65) పీర్‌మర్ద్ ఖోర్‌బంధ్ (66) సొహ్రామ్ జహంగీర్ ఇరాని. (67) ఖాన్ బహదూర్ పదమ్‌జీ, (68) పలంజీ మోతీవాలా, (69) మోటాదావా (ఖజోటియా తండ్రి) (70) నవరోజీ సతా, (71) మెర్వాన్ కైఖుస్రూ ఇరానీ, (72) గోల్వేద్‌వాలా (ఓల్డ్‌మాన్ సొహ్రాజీ ఇరానీ. (73) గోల్వార్‌వాలా (ఓల్డ్‌మన్ సొహ్రాబ్జీ కొడుకు) (74) ధన్‌జిభాయి కేరావాలా, (75) సక్కూర్, (76) బ్రెహెమ్ కస్టమ్‌సావెంగ్, (77 అర్దేషిర్ ఇరానీ, (78) మెహెర్వాన్ కైఖుస్రూ ఇరానీ, (79) రుస్తుం ఇరానీ (దామంజి సోదరుడు) (80) కైఖుస్రూ ఐస్క్రీమ్‌వాలా, (81) హూర్మస్ బోమన్ (82) కసమ్ రంజూ అబ్దుల్లా, (83 రార్ దున్ (84) బిల్లా (ఇరానీ తండ్రి) (85) రుస్తుం (బెయిలీ సోదరుడు), (86) సొహ్రాబ్ (సెయిలర్ సోదరుడు) (87) మన్సారీ బంధువు బెజన్ జి (నవసారీ)

స్త్రీలు :—(1) షిరీన్‌మాయి షెరియార్ ఇరానీ [బాబా తల్లి] (2) నానీ గేలీ (3) నడీనె టాల్‌స్టాయి, (4) మేబెల్, (5) దౌలత్ మాసి ఎఫ్ ఇరానీ, (6) పిలం సి. ఆర్. ఇరానీ [బాబా అత్త] (7) కాకు బాయి దేషరుక్కర్, [విష్ణు తల్లి] (8) నజా

మాయి నెయిలర్ (9) బనమాయి ఎన్. దాదాచాన్‌జీ, (10) జిబ్బా ఇర్షద్, (11) ఫ్రెని మాసి ఎన్ డ్రైవర్, (12) యశోదా గడేకార్, (13) కమలాబాయి లక్‌డావాలా (20) గూలా ఎ ఇరానీ, (21) ఖోర్షెద్ పస్తాకియా, (22) బానూ బైదుల్ ఇరానీ (23) జోహరా సయ్యెద్ సాబ్ (24) మిసెస్ దహివాలా [దావర్] (25) సయ్యెద్ సాబ్‌కుమార్తె, (26) ఛాకుబాయి, (27) ఖోదావాడ్‌సర్కిల్‌వాలాకుమార్తె [పెర్షియన్ డెయిరీవాలా భార్య] (28) మెహెరా ఖొదారామ్ ఇరానీ, (29) డా॥ సి. డి దేశముఖ్ తల్లి (30) షిరిన్ బాయి సొహ్రాబ్ ఇరానీ [పాద్రీ నాయనమ్మ] (31) భికాజీ ఎన్. హాంసోటియా, (32) ధోండి [బాబా సేవకుడు] (33) సీత [ఆరంగామ్] (34) హెలెనా డెవీ [కిట్టి తల్లి], (35) దినమాయి సతా [గాయి మాయి బంధువు] (36) శాంత [సేవకుడు కాశియా భార్య] (37) సుందర్ బాగాజీ [సేవకురాలు]

ఒక బీదవానిని నిలబెట్టి బాబా "భగవంతుడా ! యీ పేదవానికి ప్రణమిల్లుట వలన గతించిన వారికి నేను ప్రణమిల్లుతున్నాను" అని ప్రార్థించారు.

ఈ 24 డిశెంబరు (1951) తేదీన బాబా బొత్తిగా నైరాశ్యము, మనస్సు నందు శరీరము నందు కూడా అనుభవిస్తున్నారు. ఆయన పూర్తిగా బలహీనంగా ఉన్నారు. ప్రాచ్య పాశ్చాత్య దేశాలలో బాబాలో ప్రేమయుతమయిన నమ్మకమును కలిగిన వారియొక్క, ప్రేమకు, సేవకు, భక్తికి పూర్తిగా అర్హత లేనట్లుగా బాబా భావిస్తున్నారు. ఎవరి యోగ్యతకు తగినట్లుగా వారికి సర్వజ్ఞుడు, సర్వన్యాయమూర్తి, సర్వమును అర్థము చేసుకొనగల దేవుడు ఆయన దివ్యమయిన ఆత్మ జ్ఞానమును అందరికీ ప్రసాదించెదరని బాబాకు తెలుసును అయినా వారి ప్రేమకు, సేవకు, భక్తికి ఈ పేదవానికి రు 51 దక్షిణనిచ్చి ప్రణమిల్లుట ద్వారా వారికి జోహారుచేసారు. "ఇది జీవించియున్న నా ప్రేమికులందరకు చెందుగాక" అని అప్పుడు బాబా అన్నారు

బాబా ఆయన మనోనాశ్ కార్యమునకు దేవుని సహాయమును కోరు తున్నారు. ఈ ప్రార్థనలో బాబాను చేరదలచిన వారు చేరవచ్చును హృదయపూర్వక ముగాను, ప్రేమతోను యీ దిగువ వ్రాసిన నామములను డిశెంబరు 29, 1951 తేదీ మంచి ఫెబ్రవరి 16, 1952 వరకు రోజుకు అరగంట చొప్పున ఉచ్చరించుట ద్వారా వారు యీ ప్రార్థనలో బాబాను చేరుతున్నారు

| | | | |
|---|---|---|---|
| పార్సీలు | — | ఆహురమజ్దా | అని |
| ఇరానీలు | — | యజ్దాన్ | అని |
| ముస్లిములు | — | అల్లాహూ | అని |
| హిందువులు | — | పరబ్రహ్మ | అని |
| క్రిస్టియనులు | — | గాడ్ ది ఫాదర్ | |
| | | గాడ్ ది సన్ అండ్ | |
| | | గాడ్ ది హోలీ ఘోస్ట్ | అని |

ఉచ్ఛరించవలెను.

ఇతరులందరు వారి మతం ప్రకారం మామూలుగా దేవుని ఏ పేరుతో పిలుస్తారో ఆ పేరు జపించవలెను. ఆ సమయమునందు తమ భక్తు లెల్లరును వారెక్కడ ఉన్నను యీ ప్రార్థన చేసి బాబా కార్యమునందు పాల్గొనవచ్చును :—

"అవిభాజ్యుడు, అనంతుడు, శాశ్వతుడు అయిన దేవుడు ప్రతివారిలోను ప్రతిదానిలోను ఉన్నాడు, ఆయన పరమాత్మ గనుక. అయినా ఆయన ప్రతి దానికీ ప్రతివారికి అతీతుడుగా ఉన్నాడు. ఆయన సర్వము తెలిసినవాడు ఎందుచేతననగా ఆయన అందరి మనసులకు మనసు. ఆ దేవుని వివిధ నామములద్వారా ఆయన అనంతశక్తి ద్వారా, ప్రేమద్వారా కరుణద్వారా ఆయనకు సహాయము చేయు"మని బాబా ప్రార్థిస్తున్నారు.

పైన వర్ణించిన తతంగం డిసెంబరు 24, 1951 వ తేదీ ఉదయం 9 గంటలకు పింపలగామ్‌లో ఆయన ఏకాంత నివాసము నందు జరిపించారు. ఇద్దరు పేదవారికి ప్రణమిల్లడం దక్షిణ యివ్వడం ఏకాంతంగా జరిగింది గనుక యింతకంటె యీ కర్మకాండలో ఏమి జరిగిందో ఎవరికీ తెలియదు.

డిసెంబరు 31 వ తేదీని మెహెరాబాద్‌లో బాబా ధునిలో అగ్ని రగిల్చి సాయంకాలం 7 గంటలకు జ్యోతిని వెలిగించి యీ విధముగా చదివించారు.

"అనంత జ్ఞానమునకు మూలాధారుడవయిన ఓ పరమేశ్వరా ! సర్వశక్తి మంతుడవయిన దైవమా ! యీ మామూలు స్థితిలో మానవమాత్రునకు సాధ్యమయిన దంతా చేసానని నీకు తెలుసు– ఫలితము నీ ఇచ్ఛకూ నీ అనుగ్రహమునకు వదిలేసాను.

దాని సఫలత కొరకు సరియయిన ఏ కాలమున ఏ సంవత్సరమున ఏ మాసమున ఏ దినమున ఏ గంటలో నీ ఇచ్ఛ నెరవేరపడెనో నీ నిర్ణయము ప్రకారము జరుగుగాక!"

"1952 ఫిబ్రవరి 15 వ తేదీన నీ నిశ్చయమేదో నేను సత్యముగా ప్రకటింపగలుగుదును గాక."

"సత్య జీవనము నందును, మనో నాశనకాలమునందును నేను గావించిన మతాచారములు కర్మకాండల నుండి యింతటితో విముక్తుడనవుతున్నాను. వాటినుండి యిప్పుడు నేను స్వేచ్ఛ పొందుతున్నాను."

ఇట్లు చదివించిన యనంతరము బాబా యీ క్రింది వాక్యములను చెప్పి వ్రాయించారు.

"సర్వవ్యాపకుడు, సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు పరమాత్మయగు భగవంతుడు నా మనోనాశనకాలమందు నా కార్యములకు మార్గదర్శివై యుండి యిప్పుడు యీ వాక్యములను నాచేత చెప్పిస్తున్నాడు.

ఒక రోజున హైదరాబాద్ నగరం దాటి ఒక సాధువు దర్గాను చూడడానికి ఖోజాగుడాకి అందరిని బాబా తీసుకు వెళ్ళారు అది కొండమీద ఏకాంత ప్రదేశం – ఒక గుహ. అక్కడ ఆ గుహ సమీపంలో యాత్రీకులు దిగడానికి కొన్ని గదులు ఉన్నాయి. వాటికి ఒక మనిషి కాపలాదారు కూడా ఉన్నాడు. ఇక్కడ గుహలో బాబా కొన్నాళ్ళున్నారు ఏకాంతంగా. అక్కడనుంచి మండలితో కాలినడకను ఔరంగాబాద్ మీదుగా అహమద్‌నగర్‌కి బయలుదేరారు. పదిరోజుల తరువాత ఆదీ, వామన్‌లు ఒక కారు తీసికొనివచ్చి బాబాను కలుసుకున్నారు.

బాబా వారి స్త్రీ బృందంతో, మళ్ళీ యింక రామనుకున్న మెహెరాజాద్‌కి వచ్చారు. తరువాత ఏకాంతవాసం చేసిన కొండమీద మనోనాశ్ పనికోసం బాబా ఏకాంతవాసం చేసారు. అందులో ఉండగా ఒక రోజున వచ్చి బాబాను చూడడానికి మెహెరా, మణిలను అనుమతించారు. బాబా వారి తెల్లటి కొత్త కఫ్నీలో చాలా అందంగా ఉన్నారు ఆయన పెట్టుకున్న ఆకుపచ్చని తలపాగా బాబాకు మరీ అందము కలుగజేసింది అక్కడ కొన్నాళ్ళు ఏకాంతంగా ఉన్నారు బాబా. కాని

గాలి చాలా బలంగా వీచేది కొండపైన బాబా మనోనాశ్ పనికి అది అంతరాయం కలుగజేసింది. అందుచేత బాబా కొండదిగి వచ్చి అక్కడి కేబిన్ కూడా తీయించేసి క్రింద వేయించారు. అందులో బాబా వారి మనోనాశ్ పని ముగించారు 1952, జనవరి 31 వ తేదీన ధుని వెలిగించారు బాబా. అందులోని బూడిదను రెండు రేకు పెట్టెలలోకి గట్టిగా నొక్కిపెట్టారు బాబా. ఆ పెట్టెలు ఎవరూ ముట్టుకోవద్దని చెప్పారు

నోరీనా ఎలిజబెత్‌లు అమెరికా వచ్చిన తరువాత వారికి బాబాకి మధ్య అనేక కేబిల్సు ఉత్తర ప్రత్యుత్తరాలు నడిచాయి బాబా మిర్టిల్‌బీచ్‌కి వస్తానని వాగ్దానం చేసారు.

1947 వ సంవత్సరం నుంచి యూపన్‌డ్యూన్స్ అనే భవనం ఎలిజబెత్ నివాసంగా ఉపయోగింప బడుతోంది. బాబా అందులో ఒక నెలరోజులున్నారు ఎలిజబెత్‌తో ఉండడానికి అక్కడికి బాబా అనేకమంది శిష్యురాండ్రను పంపించారు — మిల్‌డ్రెడ్‌కైల్, నోరీనా మాచెబెల్లీ నడీన టాల్‌స్టాయ్, కిట్టీదేవీ, రుత్‌వైట్. రుత్‌వైట్‌కి అప్పటికి(1952) 89 సంవత్సరాల వయసు। ఆమె బాబా ఉపయోగించిన గదిలో నివసించింది బాబా నోరీనాకు చెప్పినప్రకారం ఆమె ముందువసారాలో కూర్చుని సముద్రంవైపు చూస్తూ ఆ సముద్రంవలె బాబా ప్రేమ అనంతమని తలుచుకుంటూ ఉండేది ”

బాబా చెప్పినట్లుగా ప్రతి ప్రేమికుని హృదయము ఆయన కేంద్రము. అదే ఆయన నివాసస్థానము వారి జీవితమే ఆయన ప్రేమ సందేశాన్ని ప్రపంచానికి అందజేస్తూ ఉండాలి. ఆయన ప్రేమికులు యీ మాటలెప్పుడూ జ్ఞాపకం ఉంచుకుంటారు.

ఫిబ్రవరి 6 వ తేదీన యీ క్రింది సందేశాన్ని బాబా పంపించారు

“సాధారణమయిన మానవ అంతస్థుప్రకారం నాకు తెలిసిన విధమున, గత నాలుగు మాసాలలోను నా చేతనయినంత వరకు ప్రయత్నించి మనోనాశనమును పొందడానికి పని చేసాను. నా మట్టుకు నేను చేసిన పనితో తృప్తి నొందానని సత్యముగా చెప్పగలుగుతున్నాను. నేను మరల మెహెర్‌బాబా పాత జీవితపు స్థితిని పొందాను అయినను నూతన జీవితపు సాధారణ మానవస్థితిని కూడ నిలుపుకొంటు న్నాను ఈ నా భావము వల్లనే నాకు తృప్తి కలిగింది నా పాతజీవితములో ఉండిన

నా జ్ఞానము, శక్తి, ఘనత నేను తిరిగి పొందాను. నూతన జీవితపు అజ్ఞానము, బలహీనత నమ్రత కూడ నిలుపుకొని యున్నాను. ఈ పాత క్రొత్త జీవితాల కలయిక వలన ఒక జీవితము కలుగుతోంది. అది నిత్యముగా పాతదియు కొత్తదియు కూడా.'

మెహెరాబాద్ (పింపలగామ్)లో ఉన్నప్పుడు 1952, ఫిబ్రవరి 6 వ తేదీన యింకా బాబా యీ విధంగా చెప్పారు.

"దేవుడు అన్నిచోట్లా ఉన్నాడు. అన్నీ చేస్తాడు
దేవుడు మనలో ఉన్నాడు, అన్నీ తెలుసుకుంటాడు.
దేవుడు మనకి బయట ఉన్నాడు, అన్నీ చూస్తాడు
దేవుడు మనకి అతీతుడై ఉన్నాడు, అన్నీ ఆయనే."

సర్వవ్యాపకుడు, సర్వము అవగాహనము చేసుకోగలిగినవాడు, సర్వశక్తి మంతుడు అయిన దేవుడు మన ఆత్మలకు పరమాత్మ, ఆయనతప్ప ఏదీ సత్యము కాదు. ఆయన నాకు సహాయము చేసి నా మనోనాశ్ కార్యము నాకు మార్గదర్శిగా ఉన్నాడు. ఇప్పుడు నన్ను ఈ క్రింది విధముగా మీకు చెప్పేలా చేస్తున్నాడు—

"మనసు ఎప్పుడూ అర్థంచేసుకోలేని దాన్ని మనసుతో అర్థం చేసుకుందామని ప్రయత్నించడం వ్యర్థం భాషల శబ్దాలలో సర్వోత్కృష్టమయిన ఆత్మస్థితిని వ్యక్తపరచాలని చూడడం అంతకంటె వ్యర్థం. ఆ స్థితిని అనుభవించి జీవించినవారు చెప్పగలిగినది, చెప్పినది, చెప్పేది ఏమిటంటే అబద్ధపు ఆత్మ పోగానే అసలయిన ఆత్మజ్ఞానం కలుగుతుంది. అసత్యపుది మరణిస్తేనే సత్యమయినది కనుగొనబడుతుంది. మనకి మనం చనిపోవడం, మరణాలన్నిటిని అంతమొందించే నిజమయిన మరణం—శాశ్వత జీవనానికి ఒకటే మార్గం అంటే మనసు దాని కోరికలతోను, వాంఛలతోను, అభిలాషతోను, ఎప్పుడయితే దివ్య ప్రేమాగ్నిలో ఆహుతి అయిపోతుందో, అప్పుడు అనంతము, అవినాశము, అవిభాజ్యము, శాశ్వతము అయిన ఆత్మ వ్యక్తమవుతుంది ఇదే మనోనాశ్ అసత్యమయినది, పరిమితమయినది, దుఃఖభాజనమైనది, అజ్ఞానయుతమయినది, నాశము పొందేది అయిన "నేను" స్థానే నిజమైన 'నేను' రావాలి. ఈ నిజమైన 'నేను' అనంతజ్ఞానానికి, ప్రేమకి, శక్తికి, శాంతికి, ఆనందానికి, వైభవానికి దానియొక్క మార్పులేని అస్తిత్వంలో శాశ్వతంగా నిలయమై ఉంటుంది.

"మనోనాశ్ వల్ల అనేకత్వం పోయి, ఏకత్వం వస్తుంది అజ్ఞానం పోయి జ్ఞానం కలుగుతుంది. బంధనం పోయి స్వేచ్ఛ వస్తుంది. మన మందరము అపారమయిన అనంత జ్ఞాన సముద్రంలో ఉన్నాము. కానీ అజ్ఞానానికి మూలమయిన మనస్సు శాశ్వతంగా మాయమయేవరకు అనంతమయిన అజ్ఞానంలో పడిపోయి ఉంటాము. మనస్సు పోయినపుడు అజ్ఞానం పటాపంచలవుతుంది.

"అజ్ఞానం పోయేంతవరకు, అజ్ఞానం పోయి జ్ఞానం వచ్చేంతవరకు దివ్యజీవనం అనుభవించి జీవించేది జ్ఞానం వల్లనే—అంతవరకు ఆధ్యాత్మిక సంబంధమయినదంతా ఆకాశకుసుమమే అవుతుంది మనకు కంటికి కనిపించని దేవుని సత్యమంటున్నాము. మనం కంటితో చూస్తున్నా యీ ప్రపంచాన్ని లేనిదనీ మాయ అనీ అంటున్నాము. అనుభవంలో మనకి ఉంది అని తోచేది నిజంగా లేనిది మనం లేనిదని అనుకునేది నిజంగా ఉన్నది.

మనం మనలను కనుగొనాలంటే మనం మనలను పోగొట్టుకోవాలి. అందుచేత నష్టమే మనకు లాభమన్నమాట. దేవునిలో జీవించడానికి మనము మనజీవాత్మకు చనిపోవాలి. ఆ విధంగా మరణం అంటే జీవితమన్నమాట.

మనలోపల మనం పూర్తిగా ఖాళీ అయిపోతే మన హృదయాన్ని దేవుడు నిండుగా ఆక్రమిస్తాడు. పూర్తి ఖాళీ అంటే నిజంగా నిండుతనం అన్నమాట.

జీవాత్మకు మనం నగ్నమైపోవాలి. 'మనది' అన్నదేదీ మిగలకూడదు. అంతా దేవుని అనంతత్వంలో లీనమవాలి. అందుచేత శూన్యమే సర్వము అన్నమాట.

ఈ ఆఖరు నాలుగు మాసాలు మామూలు మానవ పద్ధతి ననుసరించి, నాకు తెలిసిన విధానాలను బట్టి మనోనాశ్ కోసం నేను శాయశక్తులా ప్రయత్నించాను. నేను చేసినపని నాకు తృప్తికరంగా ఉందని నిజంగా నేను చెప్పగలను. నేను పాత జీవితపు మెహెర్‌బాబా స్థితిని పొందాను గనుక నాకు తృప్తి అయిందని చెప్పగలుగుతున్నాను. ఆ జ్ఞానము, బలము, ఆ గొప్పతనము నా పాత జీవితంలో ఉన్నదంతా నేను మరల పొందాను. నూతన జీవితంలోని అజ్ఞానము, బలహీనత, అణకువ నేను అట్టే పెట్టుకున్నాను. ఈ పాత క్రొత్త జీవితాల కలయిక వలన శాశ్వతంగా పాతది కొత్తది అయిన జీవితం జన్మించింది.

ఇప్పుడు నాకు జీవితం అంటే

(1) స్వేచ్ఛతో కూడిన, భారం (ఋణం) లేని జీవితం.

(2) ఆజ్ఞలు యివ్వడంలో గురువు యొక్క జీవితం, అణకువతో ఉన్న సేవకుని యొక్క జీవితం.

(3) మనమంతా ఒక్కటే, శాశ్వతము. అవిభాజ్యము, సారము. అన్న శాశ్వతమయిన నమ్మకం ; దానితో కూడా సర్వశక్తిమంతమయిన పరమాత్మతో నేను వేరు అనే అజ్ఞానంతో కూడిన భావం

(4) సారభూతమయిన దేవుని జీవనం , ఆవరించే మాచపుడు.

(5) ఏకత్వంలోనుంచి వచ్చిన అంతర్నిహితమయిన జ్ఞానంలో ప్రభవించిన శక్తియుత జీవితం ; బంధనయుతమయిన కోరికలచే కలిగిన బలహీనత.

మనోనాశ్ కోసం నేను చేసిన యత్నములు వాస్తవమైనవి దాని ఫలితం కూడా నిజమైనదిగానే ఉంటుంది. దీనికి ఫలితాలు నేను భగవంతుని ఆజ్ఞకే వదిలేస్తున్నాను. ఎక్కడ, ఏ విధంగా, ఎప్పుడు ఫలితం కలుగుతుందో అది అంతా భగవదిచ్ఛయే. అది ఏక్షణంలోనయినా, ఏరోజునయినా, ఏ నెలలో అయినా, ఏ సంవత్సరములో నయినా ఏ యుగంలో నయినా ఎప్పుడయినా జరుగవచ్చు. అది ప్రపంచంలో ఏ భాగంలోనయినా కనబడవచ్చు. తూర్పునో, పడమరనో, ఉత్తరాన్నో, దక్షిణాన్నో ఎక్కడో కనిపించవచ్చు. కాని మొత్తానికి అది అన్ని దిక్కులా పనిచేయవచ్చు. ఏ పరిస్థితిలోనయినా కలుగవచ్చును.

అది హఠాత్తుగా సంభవించవచ్చును. ప్రేమ యొక్క సారము, ఏకత్వము, సాక్షాత్కారము, వెలుగు రావడము, నాకు, నాతో సంబంధించిన వారికి కనపడవచ్చును. నా మనోనాశ్ పనిలో నా నలుగురు సేవకులు నాతో ఉన్నవారు, నాదగ్గరగాని దూరముగా గాని ఉన్న యితరులు నాకు వారి చేతనయినంత సహాయం చేసారు. నా మనోనాశ్ కాలమునందు నేను బొత్తిగా నిస్సహాయుడనై, బలహీనతలతో నిండి నా సామాన్య మానవస్థితిలో ఉన్నాను. దేవుడు ఆయన వ్యక్తీకరణలోను, మహాత్ములు, నన్ను ప్రేమించువారి ప్రార్థనలు నా మనోనాశ్ అంతరంగ కార్యమును చేసిపెట్టారు. నా నలుగురు సేవకులు దాని బాహ్యాకరణాలు చూసారు.

ఏప్రెల్‌నెల మొదట్లో కొన్ని నెలలపాటు పర్యటించడంకోసం పాశ్చాత్య దేశాలకి వెళ్తానని బాబా అన్నారు. అక్కడ మార్చి 21 వ తేదీ నుంచి క్లిష్టమయిన స్వేచ్ఛా జీవితమును జీవిస్తాను. జూలై 10 వ తేదీనుంచి విందు స్వేచ్ఛా జీవితమును జీవిస్తాను. నవంబరు 15 వ తేదీనుంచి జ్యోతిర్మయస్వేచ్ఛా జీవితమును జీవిస్తాను. నా దగ్గరకు రావాలనుకున్నవారు 21 మార్చినుంచి రావచ్చును. కాని ఆ వచ్చే స్త్రీ అయినా పురుషుడయినా వసతి భోజనం విషయమై వారి ఏర్పాటు వారే చేసుకోవాలి. అవసరమని నాకు తోచినప్పుడు లేక నాకు యిష్టం కలిగినపుడు నేను బహిరంగ ప్రజాదర్శనం యిస్తాను. నా పాత జీవితంగురించి చెప్పాలంటే ఎవరయినా నా యెదుటనే అది వారి నోటితో చెప్పవచ్చును. నా నూతన జీవితవిధానాన్ననుసరించి వారి వద్దనుంచి గౌరవంగాని వందనంగాని అంగీకరించను. అందుచేత ఎవరూ నా పాదాలంట రాదు. నాకు వంగి ప్రణామం చేయరాదు.

ఫిబ్రవరి (1952) 12 వ తేదీన పార్సీ పంచాంగం ప్రకారం ప్రియతమ బాబా పుట్టినరోజు అయింది. ఆ రోజున మెహెరాజాద్‌నుంచి బాబా రెండు సందేశాలు పంపించారు.

(1) "మీ అందరికి నాయీ నిజమయిన మొదటి జన్మదినమున భగవంతుని ఆశీర్వాదములను, నా ప్రేమను అందజేస్తున్నాను.

(2) "ఓ భగవాన్ ! ఈ రోజున నా నిజమయిన మొదటి జన్మదినం గనుక నేను గావించే జీవిత ప్రకటనము పూర్తిగా నీదే అని నీ ఇచ్ఛ ప్రకారమే అది జరుగుతోందని నా హృదయం చెబుతోంది. నీ ఇచ్ఛలేనిదే ఏదీ జరుగదు.

"నా జ్ఞానమంతయు, నా అజ్ఞానము, నా శక్తి అంతయు, నా బలహీనతయు, నా స్వేచ్ఛ అంతయు, నా బంధనము, అన్నీ నీ నిర్ణయం ప్రకారము, నీకోరిక ప్రకారమే ఉన్నాయి.

"ఈ శాశ్వత జీవితం నీ అనుగ్రహంవల్ల జరుగబోయే జీవిత ప్రకటనంలోని ప్రతిమాట నీ ఇచ్ఛ ప్రకారమే జీవింపబడుతుంది"

మనోనాశ పని పూర్తిగా జరిగినప్పటికి దాని ఫలితాలు నూటికి నూరుపాళ్ళు నాకు తృప్తిగా రావలసియున్నప్పటికీ యిప్పుడు నాతో సంబంధించిన వారందరికి నేను

స్వేచ్ఛను యిస్తున్నాను. వారు వారి కిష్టమయిన జీవితాన్ని వారి యిష్టం వచ్చిన విధంగా గడపవచ్చును. వారు నాతో ఉండి నా ఆజ్ఞలను పరిపాలిస్తూ ఉండవచ్చును. లేదా వారు దూరంగా నివసిస్తూ నా ఆజ్ఞలను పాటిస్తూ ఉండవచ్చును. నేను చెప్పినట్లుగా వారు జీవించుటకు, వారి యిచ్ఛవచ్చిన రీతిని వారు జీవించుటకు, వారికి స్వేచ్ఛ ఉన్నది నా ఆజ్ఞలు లేకుండా పూర్తిస్వేచ్ఛను కలిగి వారు జీవించవచ్చును. 'వారు' అనగా యిందులో ఏర్పాటుదార్లు కూడా ఉన్నారు. వారికి మాత్రం వారికి ఉన్న బాధ్యతలనుండి స్వేచ్ఛను నేను యివ్వలేను. అది చివరి వరకు వారు నిర్వర్తించ వలసినదే.

"వారు ఏది ఎన్నుకున్నా ఏక్షణంలోనయినా దైవానుగ్రహం వలన నిజమైన స్వేచ్ఛ వచ్చినపుడు ప్రతివారు అది పంచుకుంటారు." అని బాబా చెప్పి వ్రాయించారు.

ఫిబ్రవరి 12 వ తేదీతో నవ్యజీవితం ముగిసింది. ఆ రోజున బాబా వారి మనోనాశ్ ఏకాంతంనుండి బయటకు వచ్చేసారు ఆ రోజున తెల్లవారకుండా బాబా వారి శిష్యుల బసవద్దకు వచ్చారు మండలి అప్పుడు గంటలు, డోళ్ళు వాయించారు తుపాకులు పేల్చారు. మండలి ఉచ్చైస్స్వరంతో భగవంతుని నామం పలికారు. వారి కంఠాలు బాగా ధ్వనించాయి క్రితం సాయంత్రం ప్రార్థనలుచేసి వెలిగించిన ధుని యింకా రగులుతూనే ఉంది.

ఫిబ్రవరి (1952) 16 వ తేదీతో మనోనాశ్ ఏకాంతవాసం అంతమయింది. ఆరోజున బాబా యీ క్రింది విధంగా చెప్పి వ్రాయించి దాన్ని చదివించారు

"ఓ దైవమా ! ఈ రోజున నా యొక్క నిజమయిన జన్మదినం. 'జీవితం' గురించి నేను చేసిన ప్రకటన నా హృదయం వ్యక్తపరిచింది. అది పూర్తిగా మీ యిచ్ఛప్రకారం జరిగింది.

"నా జ్ఞానమంతాను, నా అజ్ఞానము, నాశక్తి, నా బలహీనత, నా స్వేచ్ఛ అంతాను నా బంధనము, మీరు కోరినట్లు, తీర్మానించినట్లు ఉన్నాయి

"ఆదిదేవా, మీ యిచ్ఛ ప్రకారం నేను ఆనందమైన శాశ్వత జీవనాన్ని జీవిస్తాను మీ దయవల్ల నేను ప్రకటించిన ప్రతిమాటా జరిగి తీరుతుంది."

ఇది మనోనాశ కాలంలోని మాస్ట్ జీవితంలో పాత జీవితం మిళితం చేసుకున్న ఆఖరుఘట్టం. మొదటి రెండు సంవత్సరాలకాలంలో, ఎదురుస్థితి మాట అలాఉంచి, బాబా సాధారణ మానవుడిలాగా, మానసిక, దేహిక శ్రమకు గురిఅయి, అకాల భోజన, భాజన పద్ధతులకు లోనయినారు. తర్వాతి నాల్గు మాసాలలో, మరింత బాధకు లోనైనారు. నూతన జీవితంలో ఆయన వివిధ సమయాల్లో వివిధ కార్య క్రమాలు చేపట్టారు. అవన్నీ విజయవంత మైనాయి, కానీ ఆయన కెంతో దేహశ్రమ కలిగింది. ఈనాలుగు నెలల కాలంలోని ఏకాంతవాసం లో అయన సహజ మనస్సు, సాధారణతను కోల్పోయి అసాధారణమై అనంత మైన దివ్యత్వాన్ని పొందింది. ఈ స్థితి మన కెంతమాత్రం అర్థంకాదు. మాస్ట్ జీవితం నుండి బాబా బయటకు వచ్చు సరికి శారీరకంగా చాలా అలసిపోయి యున్నారు. ఈ నూతన జీవితం మధ్యలో బాబాకు మూలశంఖ వ్యాధి సంక్రమించింది. నూతనజీవితం అయిపోగానే 26-2-1952 నాడు శస్త్రచికిత్స చేశారు. ఆయన బాగా కోలుకోవడానికి మార్చి 21 వ తేదీవరకు పట్టవచ్చు. అయితే బాబా 9-4-1952 నాడు అమెరికాకు బయలుదేరవలసి ఉన్నది. బాబా సర్క్యులర్ I లో చెప్పినదానికి వ్యతిరేకంగా పై కారణాలవల్ల ఎవరినీ చూడటా నికి వీలులేని పరిస్థితి ఏర్పడింది. మహాఉంటే బాబావారు అమెరికాలో 8 నెలలుంటారు. తర్వాత యిండియాకు వస్తారు. కనుక ఆయన వచ్చాక దర్శనం చేసుకోవచ్చు.

బాబా యిలా చెప్పారు—

"మనోనాశ్ పనిని గురించి సూక్ష్మంగా చెప్పాలంటే—

(1) నాలుగు నెలల మనోనాశ్ పని నా సంపూర్ణతృప్తితో దేవుని సహాయంతో జరిగిందని నేను భావిస్తున్నాను.

(2) ఈ పని యొక్క ఫలితాలు త్వరలోనో ఆలస్యంగానో, వెంటనేనో, తరువాత కొంత కాలానికో లేక దూరపు భావిలోనో కనిపించాలి.

(3) దాని ఫలితం మన అంవరకు స్వేచ్ఛను తీసుకువస్తుంది. అది మనకున్న ప్రేమ, విశ్వాసం, సేవ యొక్క తీవ్రతను బట్టి కలుగుతుంది

(4) ఈ స్వేచ్ఛ అజ్ఞానం నుండి స్వేచ్ఛగా ఉంటుంది అది మనం దేవునితో ఒకటిగా ఉన్నామని, ఉంటామని, ఉండేవారిమని తెలియజేస్తూ ఉంటుంది.

(5) ఈ అజ్ఞానం మనకు దేవుని తెలుసుకోవడానికి సహాయపడుతుంది. మనకు ఎల్లప్పుడూ ఉండేది యింతవరకు తెలియనిది అయిన అనంత ప్రేమ, శక్తి, ఆనందము, శాంతి కలుగజేస్తుంది.”

“జీవిత సర్క్యులర్‌లు” అనే పేరుతో బాబా పంపించడం ప్రారంభించారు. మెహెర్‌బాబా దివ్యపురుషుడు, మామూలు మానవుడు కూడాను. యజమాని, సేవకుడు కూడా ఆయనే జీవిత సర్క్యులర్‌లలో మొదటిది 1952 ఫిబ్రవరి 6 వ తేదీన వ్రాయించినదే. అది అందినట్లు ప్రేమికులను ఒక్కొక్కరిని రు 25/-లకి తక్కువ కాకుండాను రు 5,000/-లకి ఎక్కువ కాకుండాను పంపించమని రెండవ నెంబరు సర్క్యులర్ ద్వారా ఆ రోజునే అడిగారు.

(1) కానుక యిచ్చే ప్రతివాడు యివ్వగలిగినంత కంటె ఎక్కువగా ఉండరాదు.

(2) ప్రతీ కానుక ప్రేమతో యిచ్చేదిగా ఉండాలి.

(3) దానికి మరల ఏదీ ప్రతిఫలం కోరకూడదు. ఈ సర్క్యులరు అందనివాళ్ళు కూడా పైకం పంపవచ్చు. పంపుదామనుకున్నవారు పైన చూపిన షరతులకి లోబడి పంపవలసి ఉంటుంది. పంపవలసిన చిరునామా-

“ఆదీ. కె. ఇరానీ, కింగ్స్‌రోడ్, అహమద్‌నగర్, బొంబాయి రాష్ట్రం, ఇండియా.”

మార్చి 21 వ తేదీలోగా అందునట్లు పంపాలి. పంపించేవారు వారు నివసిస్తున్న దేశాల చట్టాలకు వ్యతిరేకంగా నడచుకోరాదు.

నూతన జీవితంలో రెండో సంవత్సరంకూడా బాబా ఎక్కువయిన శ్రమతోను మానసిక కార్యభారంతోను, జీవితంలోని ఎగుడు దిగుడులతోను అనేక ఒడుదుడుకులతోను గడుపుతున్నారు. మనోనాశ్ కాలంలోని తరువాతి నాలుగు నెలలలోను బాబా యింకా ఎక్కువగా బాధపడ్డారు. వివిధ సమయాలలో నూతన జీవితంలో ఆయన చేసిన రకరకాల పనులన్నీ జయప్రదమయినవి. కాని యీ పని ఒత్తిడివలన ఆయన ఆరోగ్యం పాడయింది ఆయన ఎక్కడ ఉన్నా చూడాలని ప్రయత్నించవద్దని బాబా కోరారు.

అమెరికానుంచి తిరిగి వచ్చాక దేవుడు దయతలిస్తే బాబా దర్శనార్థులను వ్యక్తిగతంగా గాని సామూహికంగా గాని చూస్తానని అన్నారు.

మార్చి 21 (1952) వ తేదీన బాబా ఒక సర్క్యులర్ యీ విధంగా పంపించారు. ఈ రోజున చిక్కులతో కూడిన స్వేచ్ఛా జీవితానికి మొదటిరోజు గనుక యీ లేఖద్వారా నేను యీ ప్రకటన చేయడానికి సంతోషిస్తున్నాను.

(a) జీవితం యొక్క విశదీకరణ—దాని మూడు భాగాలు.

(b) నా జీవిత సర్క్యులర్ I లో నమ్మకం ఉన్నవారికి ఒక సందేశం.

(c) ఏప్రెల్ 1 నుంచి అక్టోబరు 1952 ఆఖరివరకూ 7 నెలలకి ఎరచ్ కి పెండుకి చెప్పేమాటలు.

(d) (1) ఈరోజున జీవితంలో నేను బలంగా ఉన్నాను బలహీనంగానూ ఉన్నాను నా జ్ఞానంలోను నా పాత జీవితపు మెహెర్‌బాబా స్థితిలోను ఉన్న నమ్మకమే నా బలం; మామూలు మానవస్థితిలో ఉండే బలహీనత బంధించే కోరికలు యివి నన్ను బొత్తిగా నీరస స్థితిలోకి త్రోసినట్లు అనిపిస్తోంది.

(2) ఇదివరకే నేను ప్రకటించినట్లు నా మనోనాశ్ పనికి ఫలితం ఈశ్వరేచ్ఛకే వదిలేసాను ఎక్కడ, ఎలాగ, ఎప్పుడు యీపనియొక్క ఫలితాలు కనబడతాయో అది ఆ దేవునికే వదిలేస్తాను.

(3) చిక్కులతో కూడిన-నా యీ స్వేచ్ఛా-జీవితంలో, పూర్ణ స్వేచ్ఛాజీవితంలోను, జ్యోతిర్మయ స్వేచ్ఛా జీవితంలోను, నేను, నాకు సహాయంచేసే వారి సహాయంతో, దేవుని మార్గదర్శకత్వంతో నాకు తోపించిన రీతిని పనిచేస్తాను.

నా క్లిష్టమయిన స్వేచ్ఛా జీవితంలో స్వేచ్ఛకంటె బంధనమే ప్రాబల్యం కలిగి ఉంటుంది.

నా పూర్ణ స్వేచ్ఛా జీవితంలో స్వేచ్ఛయే బంధనం కంటె లధికమై ప్రబలంగా ఉంటుంది.

నా జ్యోతిర్మయస్వేచ్ఛా జీవితంలో స్వేచ్ఛ, బంధనము దేవుని కృపవలన దివ్యజీవితంలో కలిసిపోతాయి.

( B ) నన్ను ప్రేమిస్తూ, నా జీవితంలో నమ్మకం ఉన్నవారికి యీనాడు నా సందేశం ఏమిటంటే, యీ విశ్వమాయ నుండి తప్పించుకోడానికి పరమ సత్యాన్ని పొందడానికి మనం యీ క్రింద వివరించినట్లు ఆచరించాలి -

మొట్టమొదట ఎవరిలో భగవంతుడు తన పూర్ణవైభవంతో, తన అనంత శక్తితో, తన అగాధ జ్ఞానంతో, తన అనిర్వచనీయ ఆనందంతో, శాశ్వత అస్తిత్వంతో ప్రకాశిస్తున్నాడో ఆ పైగంబరునికి మనం పూర్తి సమర్పణ కావాలి. ఈ పూర్తి సమర్పణ సాధ్యముకానిచో యీ క్రింద చెప్పిన వాటిలో ఒకటిగాని కొన్నిగాని ఆచరిస్తే భగవదనుగ్రహం కలుగుతుంది.

(1) దేవుని యెడల హృదయపూర్ణమయిన ప్రేమ కలిగి ఉండడం ; ఆయనను దర్శించాలని తృష్ణ. ఆయనతో ఐక్యత పొందాలని దహించే కోరిక, వీటివలన ప్రేమికుడు తన సర్వస్వము తుదకు తనను కూడా పరిత్యాగం చేసే యీ సర్వాన్ని దహించివేసే ప్రేమ కలుగుతుంది.

(2) నిరంతరము సాధువులతోను దైవ ప్రేమికులతోను సాహచర్యము చేస్తూ వారిసేవ చేయడం.

(3) కామము, ఆశ, కోపము, ద్వేషము, పదవి, అధికారము, తప్పులెన్నడము- వీటి ఆకర్షణకు లోనుగాకుండుట ;

(4) సంపూర్ణమయిన బాహ్య సన్యాసము - దాని వలన అన్నిటిని అందరిని వదిలివేయడం, ఏకాంతంలో ప్రార్థన, ఉపవాసము, ధ్యానము చేస్తూ ఉండడం ;

(5) ప్రపంచంలో జీవిస్తూనే పూర్తి అయిన అంతరంగ త్యాగము చేయడం.

ప్రపంచంలో అన్ని పనులు చేసుకుంటూ దేనియందు ఆసక్తి కలుగకుండా ఉంటూ, అంతా మాయ అని, భగవంతుడే సత్యమని తెలుసుకొని, ప్రపంచ విధుల

పరిశుద్ధమయిన హృదయంతోను నిర్మలమయిన మనసుతోను నిర్వర్తిస్తూ ఎంత తీవ్రమయిన పనిలో ఉన్నా సన్యాసివలె జీవితం గడుపుతూ ఉండడం.

(b) నిస్వార్థసేవ :—ఇది ఎవరు అభ్యాసం చేస్తారో, తన గురించికాక యితరుల సుఖం కోసమే ఆలోచిస్తారో, ప్రతిఫలాపేక్షలేకుండా యితరులను సేవిస్తారో, తన మనసుకు కలవరపాటు రానీయకుండా ఆశాభంగం కలుగనీయకుండా ఉంటారో, ఏ కష్టాలు వచ్చినా ఏ ఒడుదుడుకులు కలిగినా స్థైర్యంతో సంతోషంతో ఎదుర్కొంటారో, యితరుల మంచికోసం వారి సౌఖ్యం త్యాగం చేస్తారో అది నిస్వార్థపరుల జీవితం. వారు నిస్వార్థ కార్యకర్తలవుతారు.

(c) (1) ఏడు నెలలపాటు ఇండియా పాకిస్తాన్ అంతా పర్యటించమని ఎరచ్‌కి ప్రత్యేకంగా పని చెప్పాను : నవంబరు 15 వ తేదీన ప్రారంభం కానున్న జ్యోతిర్మయ స్వేచ్ఛా జీవితంలో నా పని జరిగేందుకు తగిన వాతావరణం సృష్టించడానికి అతడు పర్యటన చేసి నా పనికోసం కొందరు ప్రేమికులను సిద్ధం చేస్తాడు.

(2) ఈ జ్యోతిర్మయ స్వేచ్ఛా జీవితం నేను నాపని జరిగేందుకు సిద్ధం అయిన నా ప్రేమికులు దివ్యప్రేమలో ఆహూతి అయిపోయి పైన 'B' లో చెప్పినవన్నీ ఆచరించేలా చేస్తుంది.

(3) మార్చి 21 వ తేదీన (1952) ప్రత్యేకంగా చెప్పినవన్నీ చేయడమే గాక ఎరచ్ యీ క్రింపివికూడా గమనించి ఆ ప్రకారం చేయాలి.

(a) ఈ ఏడుమాసాల పర్యటన ఖర్చుల నిమిత్తం అతనికి రు 2,000/- ఇవ్వడం అయింది.

(b) ఎవరివద్ద అతడు డబ్బు (నగదు) ఏ పరిస్థితులలోను తీసుకోకూడదు.

(c) అతడు ఎవరయినా సంతోషంగా మనఃపూర్వకంగా భోజనంపెడితే తీసుకోవచ్చును. అలాగే ఎవరేనా ప్రయాణానికి టిక్కెట్టుయిస్తే తీసుకోవచ్చును.

(d) రాజకీయాలలో అతడు పాల్గొనరాదు మనం జీవితంలో మొదటినుంచి మనం చేస్తున్నట్లుగానే ఉండాలి.

(e) అతడు మొదటినుంచీ చేస్తున్నాడని నేను ఆశిస్తూ ఉన్నట్లు పాపపూరిత మయిన పనులు ఏవీ చేయకుండా ఉండాలి.

(f) ప్రశంసలకి అతడు పొంగిపోకూడదు ఆ విధంగానే ఎవరయినా తిట్టినా లేక అపహాస్యం చేసినా కృంగిపోనూ కూడదు.

(g) ధైర్యంతోను ప్రేమతోను అన్ని కష్టాలు ఎదుర్కొంటూ తనకి యిచ్చిన పని, దేవుని పేరుతో నెరవేర్చాలి.

(h) అతడు ఇండియా పాకిస్తాన్ ప్రభుత్వ చట్టాలకి కఠినంగా బద్ధుడై ప్రవర్తించాలి

(i) ఈ ఏడు నెలల పనిలో పెండు ఎరచ్‌కి హృదయపూర్వకంగా సహాయం చేయాలి.

(j) (ఎరచ్‌తో కలిసి పర్యటించేందుకు) పెండుకి కూడా రు 2 000/-యివ్వడం అయింది.

(k) పైన చెప్పినవన్నీ పెండుకి కూడా వర్తిస్తాయి. తరువాత రెండు నెలల్లోను అమెరికా వెళ్ళడానికి బాబా ఏర్పాట్లు చేయించారు.

1952 వ సంవత్సరం మార్చి నెల 21 వ తేదీన బాబా తమ ప్రేమికులకు యీ క్రింది విధంగా సందేశం యిచ్చారు -

"నన్ను ప్రేమించిన వారికి నా జీవితంలో నమ్మకమున్న వారికి యీ రోజున నేను యిచ్చే సందేశం యేమనగా – విశ్వమాయ నుంచి తప్పించుకోవాలంటే, పరమ సత్యమును పొందాలంటే, మనము యీ దిగువప్రకారం చేయాలి :—

(1) మొట్టమొదట దైవ - మానవునికి సంపూర్ణంగా సమర్పణ కావాలి. ఎవరిలో భగవంతుడు తన సంపూర్ణ వైభవమును ప్రదర్శిస్తాడో, తన అనంతశక్తిని, తన అగాధమైన జ్ఞానమును, వ్యక్తీకరించలేని తన ఆనందమును, తన శాశ్వత అస్తిత్వమును ఎవరితో ప్రతిఫలింప జేస్తాడో, ఆ అవతారునికి సర్వసమర్పణ కావాలి

(2) సాధువుల, భగవత్ప్రేమికుల నిరంతర సాంగత్యము చేసేవారికి హృదయపూర్వకసేవ చేయడం .

[8]

(3) ఆ విధంగా సంపూర్ణ సమర్పణ సాధ్యము కాకపోతే మనసును కామ, క్రోధములనుంచి, ద్వేషము, శక్తి కీర్తి వీటినుంచి తప్పించున్నట్టు సుంచి యను మనస్సును సంరక్షించుకోవాలి.

(4) సంపూర్ణము కేవలము అయిన బాహ్యసన్యాసము – దాని వలన ప్రతి యొకదానిని ప్రతి యొక్కరి సంగతిని పరిత్యజించుట, ఏకాంతముగా ఉండి ప్రార్థన, ఉపవాసము, ధ్యానము చేయుచుండుట.

(5) ప్రపంచములో నివసిస్తున్నప్పటికి సంపూర్ణమయిన అంతరసన్యాసము అభ్యాసము చేయుట, అంటే విరాగముతో ప్రపంచ సంబంధమయిన పనులన్నీ చేసుకొనుచుండుట, అన్నీ మాయయని, దేవుడు మాత్రమే సత్యమని తెలుసుకొని ప్రాపంచిక వ్యవహారములను నిర్మల హృదయము తోను పరిశుభ్రమయిన మనసుతోను చేసుకొనుచూ తీవ్రమయిన పనిలో ఉండియు ఏకాంతము నందున్న సన్యాసివలె జీవించుట.

(6) నిస్వార్థసేవ —— ఇది ఎవరు అభ్యాసము చేస్తారో తనను గూర్చిగాక యితరుల సుఖము గూర్చి ఆలోచించెదరో, ఫలాపేక్ష లేకుండా ఎవరు సేవ చేయుదురో, ఎవరు తన మనసును కలవరపాటు చెందకుండా ఆశాభంగము పొందకుండా శాంతముగా ఉంచగలరో, ఎవడు అన్ని కష్టములను యిబ్బందులను సంతోషముతో ఎదుర్కొనునో, అతడు యితరుల క్షేమం కోసము తన సుఖాన్ని త్యాగం చేస్తాడు. ఇది నిస్వార్థ సేవ చేయువాని జీవితము ॥

## బాబా అమెరికా ప్రయాణము :—[18-4-52]

1945 వ సంవత్సరము నుంచి 1952 వరకు అనేకమంది మిర్టిల్ బీచ్ సెంటరుకు కేర్‌టేకర్లుగా దానిని జాగ్రత్తగా చూసేవారుగా, సంరక్షకులుగా ఉంటూ వచ్చారు. అనేకమారులు నోరీనా ఎలిజబెత్‌లు మిర్టిల్ బీచ్‌కి వచ్చి అక్కడ అభివృద్ధి కార్యక్రమాలు చేస్తూ వచ్చారు. బాబా యిల్లు టి. మూర్ అనునతనిచేత కట్టించారు. అప్పుడు యీ ప్రేమికురాండ్రు న్యూయార్క్‌లోనే ఉండేవారు 1947 వ సం॥లో వారిద్దరూ బాబా సతారాలో ఉండగా అక్కడికి రావడం రెండేళ్ళు బాబాతో ఉండడం మనకు తెలిసిన సంగతే

తరువాత నవ్య జీవనం జరిగింది. బాబా జూలై 1951 వ సం॥లో అమెరికా వస్తామన్నారు కానీ అది జరుగలేదు బాబా ఇండియాలో మహబలేశ్వర్‌లో ఉన్నప్పుడు జూలై (1951) మాసంలో బాబా రాలేదు. వారి ప్రయాణం ఫిబ్రవరి 1952 కి వాయిదా పడిందని మిర్టిల్‌బీచ్‌కి వ్రాయించారు తప్పకుండా బాబా అప్పుడు వచ్చి ఒక సంవత్సరంపాటు మిర్టిల్ బీచ్ సెంటరులో ఉంటారని తెలియజేసారు.

మరల 1951 వ సం॥ అక్టోబరు 2 వ తేదీన - "చాలా ఆనందంగా ఉన్నాను" 'ఎలినోరా' బాబా మార్చి నెలాఖరుకి అమెరికా తప్పకుండా వచ్చేలా చేయడంలో కృతకృత్యులయారు. గాఢమైన ప్రేమతో - బాబా".

ఇలా కేబిల్ యిచ్చి మరల ఒక సందేశంకూడా పంపించారు బాబా నిజంగా వస్తున్నారని ఎలిజబెత్ నొరీనాలకు యిలా వ్రాసారు బాబా.

"అక్టోబరు 16, 1951 నుంచి 1952 ఫిబ్రవరి 15 వరకు నేను ముఖ్యమయిన పనిలో ఉంటాను. 15 ఫిబ్రవరి తరువాత నేను 15 రోజులు విశ్రాంతి తీసుకుంటాను. బయలుదేరే ముందు టీకాలు వేయించుకోవడం, ఇంజక్షన్లు తీసుకోవడం యివన్నీ జరగాలి. అందుచేత మార్చి ఆఖరివారం లోగా అమెరికాకు బయలుదేరడానికి వీలుండదు – భగవంతుడు యిష్టపడితే, నేను జీవించి ఉంటే, మేము తప్పకుండా 1952 మార్చి ఆఖరివారంలో అమెరికా వస్తాము.

"అక్టోబరు నుంచి ఫిబ్రవరి 15 వరకు నేను ఎవరితోను ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపను. కాని మీకు డా॥ డాన్‌కిన్ వ్రాస్తూ ఉంటాడు మేము అమెరికా రావడం గురించి మీరు అతనికి వ్రాయవచ్చు అతడు యిప్పుడు పాస్‌పోర్ట్ల కోసం బొంబాయిలో ఉన్నాడు. నేను అన్నీ అతనికి వివరంగా చెప్పాను డాన్‌కిన్ అహమద్ నగర్‌లో అక్టోబరు 16 నుంచి ఉంటాడు.

అందుచేత ప్రియతములైన బాబా ప్రేమికులారా! మీరంతా ఆనందంగా ఉండండి చివరికి పాశ్చాత్యదేశాలకి నేను వచ్చేందుకు వీలు కలిగించారు మీరు. మీ యిద్దరికీ నా ప్రేమ - బాబా". తరువాత 1952, జనవరి 23 వ తేదీన డాన్‌చేత ఎలినోరాకి (ఎలిజబెత్, నొరీనాలకు) బాబా యిలా వ్రాయించారు -

"ఫిబ్రవరి 16 వ తేదీన ఏకాంతవాసం నుంచి బయటకు వచ్చాక ఎన్నో సంభాషణలు (ఇంటర్‌వ్యూలు) ఏర్పాటు చేసుకున్నారు. ఆయనకు ఎంతో పని ఉంది.

అంతేగాక ఆయన ఆరోగ్యం సరిగాలేదు. అందుచేత అమెరికాకు బయలు దేరే ముందు యింకో పదిరోజులు సమయం ఆయనకు ఉంటే బాగుండునని నేనే అన్నాను. ఇప్పుడు మార్చి 31 వ తేదీకి బాబా ప్రయాణానికి చేసిన ఏర్పాటుకు బదులుగా ఏప్రెల్ 10 ఆ ప్రాంతాలకి మళ్ళీ బుకింగ్ చేయాలి బాబా యీ మార్పు వల్ల మీకు ఆందోళన కలుగుతుందేమో అన్నారు. అసలు ఆయన వస్తారా అని మీరు సందేహిస్తారేమో అన్నారు. అందుచేత ఏప్రెల్ 10 వ తేదీని ఆయన బయలుదేర డానికి మీ అంగీకారం కేబిల్ద్వారా తెలియజేయమన్నారు. మీకు అంగీకారం లేకపోతే ఎలాగోలాగు పని ముగించుకుని మార్చి నెలాఖరుకే బయలుదేరుతారు. అందుచేత ఏ సంగతీ మీరు కేబిల్ యివ్వండి. మీరు సరే అంటే ఏప్రెల్ 10 కి దగ్గరగా ఏరోజున విమానం దొరికితే దానిమీద ఆ రోజున బయలుదేరుతారు మీరు కాదంటే మార్చి 31 నే బయలుదేరుతారు. ఏది ఎలా ఉన్నా యీ మాటు బాబా అక్కడికి రావడం మాత్రం ఖాయం బాబా యొక్కయు, స్త్రీ మండలి యొక్కయు బట్టలు ఉన్న ట్రంకుపెట్టెలు స్టీమరులో న్యూయార్క్ రేవుకి 24 వ తేదీని పంపుతున్నాము. వాటిలో యింకా యిక్కడ ఉపయోగించే పప్పులు మసాలా దినుసులు కూడా ఉంటాయి...."

దానికి నోరీనా జవాబుగా డా॥ డాన్కిన్ కి కేబిల్ యిచ్చింది — "బాబా ఏప్రెల్ 10 వ తేదీన బయలుదేరడానికి మాకు వీలుగా ఉంటుందా అని అడుగు తున్నారు. ఎలాగయినా సరే, ఏ రోజయినా మాకు వీలుగానే ఉంటుంది బాబా వస్తే చాలు"

అంతకు ముందే బాబా యీ క్రింది సర్క్యులర్ అందరి ప్రేమికులకు పంపించారు—

"ఎలిజబెత్ నోరీనాలు అవసరమయిన ఏర్పాటులన్నీ పూర్తి చేసారు. భగవంతుని ఇచ్ఛ ఉంటే, నేను జీవించి ఉంటే, నేను వచ్చే సంవత్సరం (1952) లో అమెరికా వెళ్తాను మొదట తిన్నగా అమెరికాకు వెళ్తాను. తరువాత కొన్ని వారాల పాటు ఇగ్లండులోను, ఫ్రాన్స్లోను, స్విట్జర్లాండు లోను ఉంటాను. అక్టోబరు 16, 1951 నుంచి, ఫిబ్రవరి 15, 1952 వరకు నేను చేసిన పనియొక్క ఫలితాలు కనబడా లంటే—పూర్తి విజయంతో గాని లేక పూర్తి అపజయంతో గాని — నేను అమెరికాలో

రెండు వారాలు ఏకాంతంగా ఉండాలి అందుచేత నేను వస్తున్నట్లు బహిరంగ ప్రకటనలు వగైరా ఏమీ ఉండకూడదు. నేను అమెరికా వచ్చినపుడు గాని అక్కడ నుంచి వెళ్ళినపుడు గాని బహిరంగపరచకూడదు. మొదటి రెండు వారాలు అయిన తరువాత అన్నిచోట్లా అందరినీ నేను చూస్తాను ఎందుచేతంటే, నానాలుగు నెలలపని యొక్క ఫలితం ప్రపంచానికి యివ్వాలి.

కొన్నాళ్ళయిన తరువాత బయలుదేరడంలో అనేక మార్పులు చేసిన తరువాత బాబా ఏప్రెల్ నెలాఖరులోగా తప్పకుండా బయలుదేరుతున్నారని బాబా కేబిల్ యిచ్చారు. మార్చి నెలాఖరున బాబా ఆయన ఆరోగ్యం బాగాలేక బయలుదేరలేదు. బాబా మనోనాశ ఏకాంతవాసం తరువాత నీరసంగా ఉన్నందున బయలుదేరలేక పోయారు. ఈ నెలలో అనేక కేబిల్స్ యివ్వడం వాటికి జవాబులు రావడం జరిగింది. బాబా నీరసంగా ఉన్నందుననే అసలు అమెరికా ప్రయాణమే రద్దు చేస్తే బాగుంటుం దని మండలి బాబాను కోరారు—వారికి నీరసం తగ్గేంతవరకు బాబా మొదట అను కున్న ప్రకారం జూలై నెలాఖరువరకు మాత్రమే అమెరికాలో ఉంటానన్నారు.

డాన్‌కిన్ యిలా కేబిల్ యిచ్చాడు —"బాబా రావడమేమో నిశ్చయం. పాశ్చాత్య ప్రజలు అభీష్టమే గాకుండా, భగవంతుడు ఇచ్ఛయించాడు బాబా అక్కడికి వెళ్ళాలని "

బాబా అసలు బయలుదేరి విమానం ఎక్కితేగాని ఏదీ నిశ్చయం కాలేదు. ఏప్రెల్ 10 అనుకున్నది ఏప్రెల్ 18 అయింది, ఆయన ఇండియానుంచి బయలు దేరడానికి ఎందుచేత నిశ్చయం కాలేదంటే బాబా ఆరోగ్యమే అలా ఉండింది. మార్చి 17 వ తేదీన యిచ్చిన ఒక కేబిల్‌లోకూడా "బాబా పరిస్థితి దిగజారుతోంది. అయినా ఆయన వస్తానంటున్నారు — ఎందుచేతంటే ఆయన యిప్పుడు రావలసి ఉంది. ఇప్పుడు రాకపోతే యింక ఎప్పటికీ ఆయనరారు." అని వ్రాయించారు బాబా.

తరువాత నోర్‌నాకు ఏదో ప్రమాదం జరిగిందని తెలియవచ్చింది. రానో యీ సంగతి తెలిసి యిలా వ్రాసింది — "బాబా చాలా నీరసంగా ఉన్నారు. మాయ అన్నిటికీ అడ్డాలు తెచ్చిపెడుతూనే ఉంది. డాన్, ఎలిజబెత్ అన్నీ సరిగా చూసుకో గలరు " అని వ్రాసింది.

మిర్టిల్ బీచ్‌కి ఎలినోరా పేరున మార్చి 20 వ తేదీన ఒక కేబిల్ వచ్చింది— 'బాబా చాలా స్థిరసంగా ఉన్నారు. అయినా ఏప్రెల్ 18 వ తేదీన బయలుదేరు తున్నారు. మిర్టిల్ బీచ్‌లో ఒక నెల ఏకాంతవాసం చేస్తారుట, ఆయన ఆరోగ్యం కోలుకోడానికి. తరువాత అమెరికాలో మూడు మాసాలు పనిచేస్తారుట. మిర్టిల్ బీచ్‌లో మే 10 వ తేదీన మే 17 వ తేదీన వచ్చేవారిని బాబా చూస్తారు. ఈ కేబిల్ అందిన సంగతి తెలియపరచండి — బాబా ''

ఇంటర్‌వ్యూలు, ప్రత్యేక సంభాషణలు ఏర్పాటు చెయ్యాలి. కాని యింక మార్పు మాత్రం వద్దు. అని బాబా అనుకున్నారు. తరువాత బాబా యీ విధంగా కేబిల్ యిప్పించారు —

"బాబా 18 వ ఏప్రెల్‌ని బయలుదేరుతున్నారు. విమానం టిక్కెట్లుకూడా కొనేసారు 20 రోజులు మిర్టిల్ బీచ్‌లో ఏకాంతంలో ఉంటారు. మే 10, 11 తేదీ లలో సన్నిహితులను కొందరిని చూస్తారు మీ కేబిల్‌లో పేర్కొనినవారిని చూస్తారు. కొన్ని రోజులు ముందుగా పాస్కల్ వేచియుండలేకపోతే అతన్ని చూస్తారు. ఆహ్వానితులను మే 17-24 తేదీల మధ్య చూస్తారు ఏకాంతవాసంలో మరీ దగ్గరవారిని కొద్దిమందినే చూస్తారు. వారు రైలులో బాబాతో మిర్టిల్ బీచ్‌కి రావచ్చును ఈ సంగతి డాన్ (డాన్ స్టివెన్స్)కి అతడు వచ్చినపుడు చెప్పండి. అహమద్‌నగర్‌కి జవాబు యివ్వండి బాబా ప్రేమ. మెహెర్‌జీ ''

మార్చి 31 వ తేదీన రానోగేస్ యీ విధంగా కేబిల్ యిచ్చింది—"మేము ఏప్రెల్ 20 వ తేదీన విమానందిగుతాము. మండలి విమానంలో 20 వ తేదీన బయలు దేరి 22 వ తేదీన వస్తారు. డాన్‌కి అన్ని కేబుల్స్, ఉత్తరాలు చూపించండి బాబా ఏకాంతవాసం ఆయన కోలుకునేందుకు విశ్రాంతికి అనుగుణంగా ఉండాలి ఏప్రెల్ 7 నుంచి c/o మెహెర్జీ, బొంబాయి అని కేబిల్ చేయండి.''

ఇది అందినప్పటి నుంచి మిర్టిల్‌బీచ్ సెంటరులో పని చురుకుగా సాగింది. ఎలిజబెత్ బాబా దర్శనార్థం వచ్చినవారి వీసాలు వగైరాలతో చాలా పనిలో ఉంది. బాబా ఒక సంవత్సరం ఉంటామని తెలియపరచారు వారికి నోరీనా సెంటరులో ఏర్పాట్లు చేయిస్తోంది బాబాతో కూడా 15 మంది స్త్రీ పురుషమండలి వస్తున్నారని బాబా తెలియపరచారు. ఆయన స్త్రీ మండలిలో మెహెరా, మణి, మెహెరూ, గోహర్,

రానో, గేవ్, కిట్టీడేవీ బాబాతో వెళ్ళారు. వారి పాశ్చాత్య శిష్యురాండ్రలో మార్గరెట్, క్రాస్కే, జీన్ ఏడ్రియల్, డెలియా డిలియాన్, రువానో బోగిస్లావ్ – వీరు అమెరికాలో బాబాతో కూడా రైలులో ప్రయాణాలు చేస్తారు. బాబా ఏకాంతంలో ఉన్నప్పటికీ వీరు ఆయనతోనే ఉంటారు. మాల్కమ్ స్లాస్ మే (1952) నెల 10 వ తేదీ నుంచి 17 వ తేదీవరకు మిర్టిల్‌బీచ్ బాబా సెంటర్‌లోనే ఉండాలని ఆహ్వానం పంపించారు. ఆగ్నెస బోర్న్, జానీకుక్ – వీరు కూడా మే 3, 10, 17 తారీఖుల మధ్య ఎప్పుడయినా ఒకటి రెండు మూడు రోజులు బాబాతో ఉండటానికి ఆహ్వానింపబడ్డారు.

1952 ఏప్రెల్‌లో అమెరికాకి విమానంలో ఎక్కేముందు బాబా బొంబాయిలో హేంగింగు గార్డెన్స్‌లో బస చేశారు. ఏప్రెల్ 18 వ తేదీన బాబా విమానంలో వెళ్ళేరోజున ఆ తోటలలో ఆయన తిరుగుతూండగా డా॥ దేశ్‌ముఖ్ ఫిల్మ్‌కెమేరాతో సినిమాఫిల్మ్ తీసాడు. ఆ సమయంలో అక్కడ పూలబాటలో బాబా నడుస్తూండగా ఆయనకు ఒక శిష్యుడు గొడుగుపట్టి, కూడా నడుస్తున్నాడు. ఈ దృశ్యం ఫిల్మ్‌లో చక్కగా పడింది.

ఏప్రెల్ (1952) 18 వ తేదీ శుక్రవారం రాత్రి 10-30 గంటలకు బొంబాయి శాంతాక్రూజ్ విమానాశ్రయాన్నుంచి బాబా అమెరికాకు విమానంలో బయలు దేరారు. అక్కడ ప్రియతమునికి అనేకమంది ప్రేమికులు వీడ్కోలు యిచ్చారు. దేశ్‌ముఖ్ కుటుంబంవారు అనగా భార్య ఇందుమతిదేవి, పిల్లలు - ప్రబోధచంద్ర, సంజీవిని, జయశ్రీ, ప్రాజ్ఞ, ప్రణవ - బాబాకు వీడ్కోలు యిచ్చినవారిలో ఉన్నారు.

బాబా అమెరికాలో దిగిన సంగతి తరువాత చెప్పబడుతుంది. ముందుగా ఏప్రెల్ నెలలోనే బాబా డా॥ డాన్‌కిన్‌ని అమెరికాకి పంపించారు.

మార్గరెట్, రువానో యింకా యితరులు మిర్టిల్‌బీచ్ సెంటరుకి ఏప్రెల్ (1952) 20 వ తేదీన వెళ్ళారు. మార్గరెట్‌కి డాన్స్ క్లాసులు ఉండడం వల్ల ఆమె మిర్టిల్‌బీచ్ సెంటరులో వారం రోజుల కన్న ఎక్కువ ఉండలేకపోయింది. రువానో కూడా ఎక్కువ రోజులు ఉండలేదు. రానో, కిట్టీ, ఎలిజబెత్, నోరీనా, డెలియాలు మాత్రం సెంటరులోనే ఉంటూ వచ్చారు. మాల్కమ్ స్లాస్ కూడా వచ్చి వారం రోజులున్నాడు. మూర్షిదా డ్యూక్, చార్మియాన్, ఫిల్లిస్ ఫ్రెడెరిక్, అడీల్ వాల్కిన్,

డార్విన్‌షా దంపతులు కూడా బాబా దర్శనం కోసం ఆయన సహవాసం కోసమూ వచ్చారు. ఫ్రాన్సిస్, బ్రాబజాన్ వచ్చి బాబా ఎలాచెప్తే అలా చేస్తూండేవాడు. బాబా గేబ్రియల్ పాస్కల్‌ని హాలివుడ్‌నుంచి రమ్మని ట్రంక్ టెలిఫోనులో పిలిపించారు. కాని అతడు హాలివుడ్‌లోని పని ఒత్తిడివల్ల రాలేక బాబాని హాలివుడ్‌లోనే చూస్తానన్నాడు. ఎనిద్ కార్ప్‌కి జబ్బుచేసి న్యూయార్కులో ఆసుపత్రిలో చేరవలసి వచ్చింది.

న్యూయార్కులో బాబా విమానం తెల్లవారితే ఏప్రెల్ 20 వ తేదీ అనగా దిగింది. బాబా ఆ రాత్రి శేషం అక్కడే గడిపారు. లండన్‌లో గాని పారిస్‌లో గాని బాబా ఆగలేదు. వారి తిరుగు ప్రయాణంలో బాబా యీ నగరాలలో దిగుతారు. విమాన ప్రయాణం పారిస్‌వరకు బాగానే జరిగింది. ఆ తరువాత పెద్ద పెద్ద గాలులు వీచాయి. అక్కడనుండి ఐడిల్‌వైల్డ్ విమానాశ్రయంలో దిగేవరకు ప్రయాణం యిబ్బందిగానే ఉంది. సాఫీగాను సుఖంగానూ లేదు బాబాతో ఉన్న పాశ్చాత్యులను విమానంలో వారు యిచ్చిన భోజనంలో ఏది యిష్టమైతే అది తినమని బాబా అనుజ్ఞ యిచ్చారు. భోజనంతో యిచ్చిన షాంపేన్ కూడా త్రాగారు కొందరు కానీ వారికి సుఖం కలుగలేదు.

న్యూయార్కులో విమానం దిగేసరికి బాబా, మెహెరా తదితరులు మంచి చురుకుగా సంతోషంగా ఉన్నారు ఐడిల్ వైల్డ్ విమానాశ్రయంలో ఎలిజబెత్, మార్గరెట్‌తోను డెలియాతోను వచ్చి బాబాకు స్వాగతం యివ్వడానికి నిలబడి ఉంది వారి ముగ్గురిని విమానంలో నుంచే బాబా గుర్తుపట్టారు బాబాతో అక్కడ దిగినవారు ఆరుగురు పురుషమండలి ఆరుగురు స్త్రీ మండలి వచ్చారు బాబా న్యూయార్కులో ఎక్కువ మందిని ఆయనను చూడనివ్వలేదు ఆయన తిన్నగా మిర్టిల్‌బీచ్‌కే వెళ్తానన్నారు. రాత్రి ఫ్లారెన్సుకి రైలులో వెళ్ళేముందు విమానాశ్రయం నుంచి బాబా పెన్ స్టేషన్ హోటలులో ఆరోజు గడిపారు. అక్కడ కూడా ఎవరినీ బాబా తమ దర్శనం చేసుకోనివ్వలేదు.

జాన్‌బాస్ 21 సంవత్సరాల తరువాత న్యూయార్కులో 5 నిమిషాలు మాత్రం బాబాను చూసాడు ఇతడు మొదట 1931 లో అమెరికాలో బాబాను దర్శించాడు. అతడు తన ప్రధమానుభవాన్ని గురించి అంటాడు — "బాబా సన్నిధిలో నేను గొప్ప దివ్యత్వాన్ని అనుభవించాను అది నేను ఎలా వర్ణించాలో నాకు తెలియదు. అది యిదివరకుగాని తరువాతగాని నేను అనుభవించి ఎరుగను బాబా యొక్క

బ్రహ్మాండమయిన శక్తినీ బలాన్నీ నేను భావించగలిగాను అదే సమయంలో ఒక విధమైన దివ్యకాంతిని ఆయన మొమట నేను అనుభవించాను ''

అతడు మొదట బాబా దర్శనం చేసుకుని గది బయటకు వెళ్ళగానే ఎలిజ బెత్‌తో _ ''బాబా మహా గొప్పవాడు, దివ్యమైనవాడు'' అని అంటే ఆమె ''అవును, బాబా అంటే అదే. ఏమనుకున్నావు?'' అని అంది.

## మిర్టిల్ బీచ్ సెంటరులో

సౌత్ కెరోలినా రాష్ట్రంలో చేరిన ఫ్లారెన్స్ రైలుస్టేషన్‌లో దిగి బాబా కారులో మిర్టిల్‌బీచ్‌కి వెళ్తున్నారు మెహెర్ సెంటరుకి వెళ్ళేముందు ఆయన్ని ఎవరూ దర్శించకూడదు. అందుచేత ఫిల్లిస్ ఫ్రెడెరిక్, అడీల్ వాల్కిన్‌లు కారులో వెళ్తున్న బాబాను చూసారు. ''అదుగో బాబా! అదుగో ఆమె మెహెరా, అని గుర్తుపట్టారు వారు దూరంగా ఉన్నా బాబా వారిని చిరునవ్వుతో చూసారు. ఫిల్లిస్ బాబా చూడవద్దన్నా రని చూడడం మానేసింది. బాబాను మిర్టిల్ బీచ్‌కి వెళ్ళాకే చూడాలని జ్ఞాపకం వచ్చింది ఆమెకు.

మెహెర్ సెంటరుకి చేరేసరికి 21 వ తేదీన (ఏప్రెల్, 1952) పగలు 12 గంటలయింది. సూర్యుడు బాగా ప్రకాశిస్తున్నాడు. బాబా వారి బృందంతో ముందు వారి యింటికి వెళ్ళారు. అది చెరువు గట్టుకి చివర ఉంది. అక్కడ నోరీనా బాబా కోసం వేచి ఉంది నాలుగేళ్ళ తరువాత ఆమె యిప్పుడే బాబాను మరల దర్శించింది. గది లోపల వెలుతురు బాగా వుంది. గదిలోపల పుష్పగుచ్ఛాలతో అలంకారాలు చాలా చక్కగా చేయబడి ఉన్నాయి. బాబా యొక్క ప్రేమయుత సాన్నిధ్యంతో ఆ గది యొక్క అందం ఎన్నోరెట్లు ఇనుమడించింది బాబా సోఫాలో కూర్చుని నోరీనాను ప్రక్కన కూర్చోమన్నారు మిగిలిన వారంతా నిలబడి యున్నారు. కొద్ది నిముషాలు అందరూ మౌనంగా ఉన్నారు ఎలిజబెత్ నోరీనాలు తమతో కూడా రాగా బాబా అందరినీ లోపలకు ప్రతిగదిలోకి తీసుకు వెళ్ళారు. ఆయన పడక గదిలో ఆయనకే ఆశ్చర్యం కలిగించేటట్లు ఇండియాలో వలె ఒక పెద్ద పట్టిమంచం వేయబడి ఉంది.

మరల అందరూ ముందు కూర్చున్న గదిలో ప్రవేశించారు. బాబా ఆయన అక్షరాల పలక మీద ''ఇక్కడికి వచ్చినందుకు నేను ఎంతో సంతోషిస్తున్నానని''

బాబా అన్నారు. మణి ఆమాటలు అందరికీ చెప్పింది ఎలిజబెత్, నోరీనాలు కనపరచిన ప్రేమ, భక్తి, శ్రద్ధ, అక్కడవారు గావించిన ఏర్పాట్లు, యిన్ని సంవత్సరాలు వారు చేసిన పని చూసి, బాబా ముగ్ధులయారు. బాబా సుఖం కోసం, ఆయన ఆనందం కోసం, వారు ఏర్పాటు చేసిన సదుపాయాలు బాబా మెచ్చుకున్నారు: వ్యయప్రయాసలకి లెక్క చేయక ఎన్నో చిన్న వివరాలు కూడా ఆలోచించి వారు అన్నీ చేసి పెట్టారు. వారి హృదయం బాబా యెడల ప్రేమతో నిండి పోయింది. బాబా యీ క్రొత్త యిల్లు సంతోష పూర్వకంగా అంగీకరించారు ఇంటిచుట్టూ ఉన్న స్థలంలో బాబా తిరిగారు. అక్కడి నుంచి చూస్తే లాంగ్‌లేక్ అనే మంచినీటి సరస్సుయొక్క దృశ్యాలు ఎంతో మనో హరంగా ఉన్నాయి. మండలివారంతా అవన్నీ చూస్తూ అబ్బురపడి అక్కడక్కడ నిలబడి మెచ్చుకుంటున్నారు.

తరువాత గేట్లు తెరుచుకుని అరమైలు దూరంలో ఉన్న ఇతర గృహాలు చూడడానికి బాబా బయలుదేరారు. వారితో అందరూ బయలుదేరారు. మొదట గెస్ట్‌హౌస్ వద్ద ఆగారు ఇందులోనే మెహెరా, మణి మొదలయిన భారతీయ స్త్రీ మండలి బసచేసారు. ఈ గెస్ట్‌హౌస్‌లో కూడా అన్ని సదుపాయాలు ఏర్పాటుచేసారు. వంటయిల్లు భోజనాలయిల్లు అన్నీ వేరేవేరే ఉన్నాయి ఎలిజబెత్ తనయొక్క స్వంత వంటలక్కను, బెస్సీ అను ఆమెను వారికోసం యీయింట్లో పెట్టింది బాబా కొద్దిరోజు లయిన తరువాత తమకోసం పెట్టిన వంటవానిని ఒకనిని అక్కర్లేదు వెళ్ళమని చెప్పారు. అతని బదులు బెస్సీనే బాబాకి కూడా వంటచేసి పెట్టమన్నారు. బాబాకి వారి మండలికి వండిపెట్టడం అంటే ఆమెకు ఎంతో సంతోషంగా ఉంది. ఎందుకంటె ఎవరూ గట్టిగా కోపంగా మాట్లాడరు. మృదువుగా నవ్వుతూ మాట్లాడుతారు. అందు చేత అక్కడ పనిచేయడం ఆమెకి చాలా యిష్టం. మొత్తం ప్రతిరోజూ పాతికమందికి వండిపెట్టాలి. అందుకని ఆమెకాక ముగ్గురు మగవారు వంటపనికోసం నియమింప బడ్డారు – స్టీవ్ అనే వాడొకడు జె బి. అనే వాడొకడు (ఇతడు తరువాత కొన్నాళ్ళకి మరణించాడు) మూడవవాని పేరు చార్లెస్‌స్మాల్ జానిటర్. ప్రతిరోజూ బాబా వంట యింటికి వెళ్ళి వారందరిని చిరునవ్వుతో పలకరించి వారి భుజాలమీద తట్టి వెళ్తుం టారు రాత్రి బాగా నిద్రపోయారా అని అడుగుతారు వంట అంతా శాకాహారమే తయారుచేయడానికి ఎప్పుడయినా ఎవరికయినా కోడిగుడ్డు మాత్రం కావలసివస్తుంది.

బాబా ఫిల్లిస్ ఫ్రెడెరిక్‌కి ఒక ఉత్తరం వ్రాయించారు ఫిల్లిస్‌ని, అడీల్ వాల్కిన్‌ని మిర్టిల్ బీచ్‌కి వచ్చి మూడు వారాలుండమని వ్రాయించారు తరువాత

ఆమెకే యింకొక ఉత్తరంలో వారిద్దరిని రెండువారాలయినా ఉండమన్నారు. తరువాత మూడవ ఉత్తరంలో వారిని ఒక్క వారమయినా ఉండాలన్నారు. బాబా వ్రాసిన ప్రకారం వారిరువురు వచ్చారు వారితో కారులో వింటర్‌ఫెల్టు దంపతులను ఆగ్నిస్ బోక్సను కూడా మిర్టిల్‌బీచ్‌కి తీసుకువచ్చారు. వారు వచ్చి లఫాయట్ హోటలులో దిగారు. మరునాడు ఉదయం ఫిల్లిస్ బాబాకు యిష్టమయిన నీలిరంగు గౌను వేసుకొని 9-30 గంటలకు జాన్‌బాసతోను ఎడీల్‌తోను బాబా వద్దకు వచ్చింది. బాబాను చూడగానే ఆయన ఒక ఇజిప్షన్‌లా ఉన్నారనుకుంది ఆమె బాబా ఆమెను చూడగానే "నేనెల్లా ఉన్నాను?" అని అడిగారు ఆదీ బాబా మాటలు అక్షరఫలకం చదివి చెప్తున్నాడు "ఆయన సుస్తీగా ఉన్నట్టున్నారు. అని ఫిల్లిస్ ఆదీతో చెప్పింది. కాని చెప్పిన తరువాత "లేదు, లేదు. ఆయన అందంగా ఉన్నారు" అని ఆమెకుతోచి అట్లు చెప్పింది. ఆయన కళ్ళు నల్లని రత్నాల్లా మెరిసిపోతున్నాయి.

తరువాత బాబా అడీల్‌ను పిలిచారు. పిలిచి ఆమెతో — "నిన్ను గురించి నొరీనా, ఎలిజబెత్, మార్గరెట్‌ల వద్దనుండి విన్నాను అంతేకాకుండా నా లోపలనుంచి కూడా విన్నాను నీవు నన్ను ఎరిగి ఉంటే నన్ను ఒక చిన్నపిల్లవానిలా ప్రేమించ గలవు నేను ఒక బిడ్డను - పెరిగియున్నాను. నీవు నాకు నా చెల్లెలు మణిలా ఉన్నావు నాకు హాస్యం అంటే యిష్టం నీతో యిక్కడ మాట్లాడుతుండగానే నేను అనేకచోట్ల అనేక పనులు చేస్తున్నాను. ఈ రోజున నీవూ ఫిల్లిస్ నన్ను కలుసుకున్నారు కదా. నిర్మలమైన ప్రేమతో మీరు నన్ను ప్రేమిస్తే మీకు ఏ అడ్డమూ ఉండదు. ప్రేమ స్వచ్ఛంగా ఉంటే అన్ని సందేహాలు పోతాయి. అంతవరకు మనసుకి సందేహాలు కలుగుతూనే ఉంటాయి. మీరు నిజంగా నన్ను ప్రేమిస్తున్నారా? అంతకంటె ప్రియతమునికి మీరు చేయగలిగినదేముంది? నాకు ప్రేమ కావాలి. ఇంకేమీ వద్దు నన్ను ప్రేమించండి. భగవంతుని మనలను ప్రేమించనీయండి అదీ నాకు కావలసినది. మీరు బాబాను ప్రేమిస్తే భగవంతుడు మిమ్ములను ప్రేమిస్తాడు. భగవంతుని ప్రేమ అంటే సమస్తమూ అన్నమాట అందుచేత ఓ ఫిల్లిస్! అడీల్! నాకు చాలా చాలా సంతోషంగా ఉంది అణకువ కలిగిన వారందరికంటె ఎక్కువ అణకువ కలిగినవాడే గొప్పవారందరి కంటె ఎక్కువ గొప్పవాడు. కాని అది నిజాయితీతో నిండి ఉండాలి మీరు కపటం కలిగి ఉండడం కంటె మీకు భగవంతునిలో అసలు నమ్మకం ఉండకపోవడమే మంచిది అందుచేత మనం ప్రేమిద్దాము — ప్రేమ. ప్రేమ — మిగిలిందంతా మాయ. అందుచేత అడీల్! నన్ను నిజంగా

ప్రేమించడం కంటె నీవు అంతకన్న ఎక్కువ ఏదీ చేయనక్కరలేదు. నన్ను ప్రేమిస్తున్నావా?" అని అడుగగానే అడీల్ "అవును బాబా!" అని ఆమె సమాధానం యిచ్చింది

"ఆ ప్రేమ యెక్కడి నుంచి వస్తోందో మీకు తెలుసునా? మీరు బాబాను ప్రేమించినపుడు ఆయన మీకు సహాయం చేస్తున్నారు. భగవంతుని ప్రేమ అంటే సర్వమూ అన్నమాట బాబా యీమాట అనగానే బాబా హృదయంలో నుంచి ప్రేమ కిరణాలు ఫిల్లిస్ అడీల్ ల లోకి ప్రసారమయినట్లుగా వారిరువురు అనుభూతి పొందారు ఆ ప్రేమ కిరణాలు తిరిగి వారి హృదయం లో నుంచి బాబాకి వెళ్ళినట్లుగా కూడా వారు అనుభవించారు ఆ ప్రేమ బాబా యొక్క కానుక. వారిని బాబా స్త్రీ మండలి వద్దకు వెళ్ళ మాడమని పంపించారు వెళ్ళేముందు ఫిల్లిస్ "బాబా! మీ పాదాలను నేను ప్రేమిస్తున్నాను " అన్నది ఆమెకు బాబా పాదాలను తాకాలని ఉన్నదని బాబా కని పెట్టారు కానీ యిది యింకా బాబా నవ్యజీవితం. అందుచేత పాద స్పర్శ అన్న ప్రశ్నే లేదు వారు స్త్రీ మండలి — మెహెరా, మణి, కిట్టీ, డా॥ గోహర్, రానో, మెహర్జి బస చేసి యున్న గెస్టుహౌస్‌కి వెళ్ళారు బాబాను కలిసినపుడు సూర్య దర్శనం అయినట్లంటే, మెహెరాను చూసే సరికి వారికి చంద్రదర్శనమే అయింది అన్నమాట. మణి ఎల్లపుడు ఉల్లాసంగా ఉంటుంది. బాబా బంధువయిన మెహర్జి అందమయిన యువతి ఆమెకు 20 సంవత్సరాల లోపు వయసు ఉంటుంది. రానో, కిట్టీ, 20 ఏళ్ళ నుంచి బాబా ఆశ్రమంలో ఉంటూ ఉన్న పాశ్చాత్య వనితలు.

ఆ మధ్యాహ్నం బాబా అడీల్‌ను, ఫిల్లిస్‌ను, గెస్టుహౌస్‌కి రమ్మని కబురు చేసారు బాబా వారి సోఫాలో కూర్చున్నారు. దానికి ఎదురుగా ఉన్న చిన్న బల్లమీద ఒక మెత్త వేయబడి ఉంది ఆ మెత్తమీద బాబా వారి పాదాలను పెట్టుకుని ఉన్నారు. ఆయన చుట్టూ స్త్రీ లంతా కూర్చుని ఉన్నారు. ఎలిజబెత్, డెలియా, మార్గరెట్ కూడా అక్కడే బాబా యెదుట కూర్చుని ఉన్నారు. బాబా చాలా సుందరంగా కనిపిస్తున్నారు. వారి లోంచి తేజస్సు బాగా ప్రకాశిస్తోంది. బాబా శిరోజాలు ఆయన భుజాలమీద స్వేచ్ఛగా పడుతున్నాయి బాబాకు తెచ్చినకానుకలు యివ్వడానికి ఫిల్లిస్‌కి అడీల్‌కి అవ కాశం కలిగింది. ఫిల్లిస్ బాబాకోసం ఒకబొచ్చు చొక్కా కుట్టించి తెచ్చింది బాబా లేచి నిలబడి అది తొడిగారు అప్పుడు ఫిల్లిస్ లేచి "బాబా! ఆ చొక్కా రెండు వైపులా కూడా తొడుగు కోవచ్చు" అంది. అప్పుడు బాబా చొక్కా విప్పేసి తిరగదీసి మనోహ రమయిన చిరునగవుతో ఆచొక్కా రెండవ వైపు నుంచి తొడిగారు ఆమె బాబాకు

ఒక చెప్పుల జోడు కూడా తెచ్చి యిచ్చింది ఒక కాలికి ఆమె స్వయంగా తొడిగింది- ఎలాగయినా పాదాలు తాకే అవకాశం వచ్చింది కదా అని పొంగిపోతూ. బాబా స్త్రీ మండలికి కూడా ఫిల్లిస్ ఏవో బట్టలు తెచ్చి యిచ్చింది. అవి అందుకుని బాబా వారికి తలొకటి యిచ్చారు. ఎవరు ఎవరికి ఏకానుకలు తీసుకు వచ్చినా ముందుగా బాబాకు యిస్తారు తరువాత బాబా అవి ఎవరికివ్వాలో వారికి అందజేస్తారు. అకీల్ ఒకమంచి స్కార్ఫ్ తీసుకువచ్చి బాబాకు యిచ్చింది అది బాబా స్వీకరించి ఆయన సద్రాజేబులో పెట్టుకున్నారు. ఫిల్లిస్, అడీల్‌ల కోసం బాబా స్త్రీ మండలి ఏవో నగలు తీసి బల్లమీద పెట్టారు బాబా వారిని అవి తీసుకోమన్నారు ఒక చిన్న పిన్నును ఫిల్లిస్ చూపింది. బాబా అది కొంచెం సేపు వారి చేతిలో ఉంచుకుని దానిని తిరిగి ఆమెకి యిచ్చేసారు. ఫిల్లిస్ అకీల్‌లు యిరువురు బాబా కుటుంబంలో ఒకరుగా చేరి పోయారు. వారిద్దరు గెస్టుహౌసెకి ప్రక్కన ఉన్న లాంబెర్న్ కేబిన్‌లో బస చేసారు ప్రతి ఉదయమూ ఆదీ బాబాను కారులో తీసుకు వచ్చి ఆ యింటి వద్ద దింపేవాడు బాబా వచ్చేసరికి వారు సిద్ధంగా ఉండి బాబాను ఆలింగనం చేసుకునేవారు. అప్పుడు రాత్రిబాగా నిద్రపో యారా అని బాబా వారిని కుశల ప్రశ్న వేసేవారు.

రాత్రి ఏమి కల వచ్చింది అని అడిగి బాబా చెప్పించుకుని విని వినోదించే వారు మొదటి రాత్రి ఫిల్లిస్‌కు బాబా అక్షర ఫలకం ఆమె హృదయం మీద ఉన్నట్లు దాని మీద **M** అక్షరం మీద బాబా వేలుపెట్టి ఉన్నట్లు ఆమె కలగన్నది. ఆయన ప్రేమ ఆమె హృదయంలోకి ప్రవేశించినట్లు బాబా "నేను ఫిల్లిస్‌ను" అన్నట్లు "మెహెరా, మెహెరా," అని రెండు మారులు ఆయన పలికినట్లు ఆమెకు కలలో అనుభూతి అయింది.

మరునాడు కొందరిని లాగూన్ కేబిన్‌లో సంభాషణకి పిలిచారు బాబా. అప్పుడు పాశ్చాత్యస్త్రీలు రాగానే మండలిని కూడా బయటకు పంపించివేసారు. ఆదీని కూడా బయట ఉండమనేవారు ఫిల్లిస్ వంతు వచ్చింది. ఏవయినా ప్రశ్న లడుగుతావా ? అన్నారు బాబా. ఏమీ లేవన్నట్టుగా తల త్రిప్పింది ఫిల్లిస్. బాబా ఆమె మణికట్టు పుచ్చుకున్నారు ఆ క్షణంలో ఆమె రక్తం బాబా శరీరంలోకి ప్రవహిస్తున్నట్లు ఆయన రక్తం ఆమెలోకి ప్రవహిస్తున్నట్లు ఆమెకు అనుభూతి కలిగింది. ఆయన బాధ తాను పంచుకుంటున్నట్లుగా భావించింది. అలాగే తన బాధలలో ఆయన భాగం పంచుకుంటున్నారని ఆమె భావించింది బాబా ఆమెతో అన్నారు _ "ఏదీ అడగని

వారికి సర్వమూ కలుగుతుంది " అని బాబా తరువాత భగవత్ప్రేమయే సత్యమయిన దని అన్నారు ఫిల్లిప్ బాబా చేతిని తన చేతితో పట్టుకుంది అది ఒక చిన్న పిల్లవాని చేయిలా ఉంది. అది ఒక గులాబీ పుష్పంలా సున్నితంగా ఉంది ఆయన చేయి స్వచ్ఛముగా ఉంది. ఆమె బాబాతో మౌనంగా యీ విధంగా చెప్పింది — "బాబా ఎల్లప్పుడు మిమ్ము నా గురువుగా ఉంచాలని కోరుతున్నాను చివరి వరకు." బాబా ఆమె మనసులోని కోరిక తెలుసుకుని అలాగే అన్నట్లు తల ఊపారు.

బాబా ఒక మారన్నారు - "నేను ఎవరినీ యిది తినాలి అది తినాలి అని నిర్బంధ పెట్టను శాకాహారులను అదే తినమంటాను మాంసాహారులను అదే తిన మంటాను. భగవంతుని ప్రేమ విషయంలో యీ బాహ్యవిషయాలు ఆట్టే యిబ్బంది కలిగించవు " అన్నారు.

ఇండియాలో లాగే యిక్కడ కూడా ఏ గదిలో ఎవరుండాలో బాబాయే నిశ్చయించి చెప్పారు. సరోష్ మెహెర్‌జీలను కొండమీద గదిలో ఉండమన్నారు. కొద్దిరోజులు ముందు వచ్చిన విలియం డాన్‌కిన్‌ను సెంటర్ కేర్‌టేకర్ గదిలో ఉండ మన్నారు. గుస్తావ్‌జీని దూరంగా యింకో గదిలో బస చేయమన్నారు ఆదీ (సీని యర్)ని నీలూని దగ్గరలోనే యింకోగదిలో సర్దుకోమన్నారు. గెస్ట్‌హౌస్‌లోను లాంటరన్ కేబిన్‌లోను చోటులేక ఉండని స్త్రీలను ట్విన్ కేబిన్స్ లో బసచేయమని చెప్పారు ఇవి పంతెనకి ఉత్తరంగా ఉన్నాయి. బాబా స్వయంగా చెప్పిన తరువాత యింక తిరుగుండదు ఆ ప్రకారం వారు బస చేసినపుడు ఇబ్బందులు అసలు వారికి తోచవు అందరూ చిరునవ్వుతో సంతోషంతో ఉన్నారు.

జీన్ ఏడ్రియల్ ఒంట్లో జబ్బుగా ఉండుటచే ఆమె సెంటర్‌కి వచ్చి ఉండ లేదు ఐవీ డ్యూక్, చార్‌మియాన్, ఫ్రెడ్, ఎల్లా, వింటర్‌ఫెల్ట్, డార్విన్‌షా, అతని కుటుంబము, బెరిల్ విలియమ్స్ బార్బరా మహన్ యింకా ఎందరో వచ్చి సెంటరులో ఉన్నారు- ఆస్ట్రేలియా నుంచి ఫ్రాన్సిస్ బ్రాబజాన్ వచ్చాడు. అతడు మిర్టిల్ బీచ్ నుంచి బాబాతో కాలిఫోర్నియా వెళ్ళాలని వచ్చాడు కాని కొద్దిరోజులు మిర్టిల్ బీచ్‌లో ఉన్నాక బాబా అతనిని ఆస్ట్రేలియా పంపించేసారు గ్రీన్ కాటేజ్‌లో మాల్కమ్ స్లాక్స్ బసచేసాడు. అతడు లాస్ ఏంజెల్స్‌కి రెండు మార్లు వెళ్ళి వచ్చాడు బాబా యిచ్చిన విషయాలు అతడు పద్యాలలో రచించే పనిలో నిమగ్నమైఉన్నాడు. ఈ రచన తరువాత ప్రచురణ అయింది.

ఫిల్లిస్ ఫ్రెడెరెక్, అడీల్ వాల్కిన్ లను సెంటరులో యింకా సహవాస ఆఖరు వరకు ఉండమన్నారు వారు బాబా కాలిఫోర్నియాకు ప్రయాణమై వెళ్ళేవరకు ఉన్నారు.

బాబా సెంటరులో రోజులు ఎలా గడిపారు ? మిర్టిల్ ఏచ్‌కి యిది ప్రథమ ఆగమనం. ప్రతిరోజు ఉదయం 5 గంటలకులేచి బాబా నడిచేవారు 7 గంటలకు మొందు బ్రిడ్జి దగ్గరకు వస్తే బాబాను చూడవచ్చును, లాగూన్ వద్ద ప్రధాన భోజనశాలవద్ద చూసి బాబా అందరూ వచ్చారా అని ముందుగా చూసి, రానివారికోసం కబురు పంపించే వారు. మిగిలిన వారు భోజనాలు చేస్తుంటే బాబా కూర్చునే వారు.

ఒక నాటి ఉదయాన్ని భారతీయ స్త్రీలు పాశ్చాత్య స్త్రీలకి చీరలు యిచ్చారు ధరించమని వారుతలొకచీర కట్టుకున్నారు. అప్పుడే చార్మీ (చార్మియాన్ డ్యూ్యస్-ఐవీ మమార్తె) ఆమె స్నేహితురాలు స్పార్కీ ఒక సీసాతో చిన్న కప్పలు, ఒక గోధుమ వర్ణపు కుందేలు తీసుకువచ్చి బాబా చేతిలో పెట్టారు. కప్పల సీసాను పైకి ఎత్తి పట్టుకున్నారు బాబా ఆ కుందేటిని తరువాత ఎంతో మృదువుగా చేతిలోకితీసుకు న్నారు బాబా సీసా ఎత్తగానే అడుగున ఉన్న కప్పలు ఆయన వైపున సీసాలో ఎగబ్రాకాయి. బాబా చేతిలో ఆకప్పలు వాటిపరిణామంలో గంతు వేసాయి సందేహం లేదు ఈ కుందేటి పిల్ల కూడా ఎక్కడో మానవ జన్మ మెత్తుతుందేమో అవతారపురు షుని స్పర్శ ఫలితంగా చీరలు కట్టుకున్న పాశ్చాత్య వనితలు ఫోటోలు తీయించుకు న్నారు. ఒకామె కుందేటిపిల్లనుఎత్తుకుని మరీతీయించుకుంది. వారు బాబాను కూడాఫొటో తీసారు. బాబాకి పాశ్చాత్యస్త్రీలు ఆ కెమేరాను బహూకరించారు బాబా అప్పుడు "మణి దీనితో ఫొటోలు తీస్తుంది. అయితే మీకు యిది లేకపోతే యిబ్బంది కాదా, ఇది చాలా ఖరీదయినది కాదా ? " అని అడిగారు. బాబాకు కొద్దిరోజుల తరువాత ఓక్లహామా వద్ద జరిగిన ప్రమాదంలో యీ కెమేరా నలిగిపోయి నాశనం అయిపోయింది.

ఒక రోజున (13-5-52) స్త్రీ మండలి అందరూ, పాశ్చాత్యస్త్రీలతో సహా. ఆయనచుట్టూ కూర్చున్నారు. బాబా అన్నారు - "నా మనసులో ఒక అంకె తలచు కున్నాను 1 మొదలు 22 వరకు చెప్పుకోండి ఎవరయినా ; చూద్దాం" అందరూ తలొక సంఖ్య చెప్పారు. ఏదీకాక పోయింది ఆఖరున అడీల్ '11' అని చెప్పింది. ఆమెదే సరి అన్నారు బాబా సరిగ్గా అప్పటికి 11 వ రోజునే మోటారు ప్రమాదం జరిగింది బాబాకి.

ఆ రోజునే ఫిల్లిప్స్, అడీల్ బాబా వద్ద కూర్చుని ఉండగా బాబా "మీరు రేపు వచ్చినప్పుడు బైబిల్‌నుంచి ఒక మంచి సెయింట్ (సాధువు) కథ చెప్పాలి" అన్నారు. ఆ మర్నాడు ఫిల్లిప్ ఏమికథ చెప్పిందో కాని అడీల్ మాత్రం సెయింట్ పీటర్ కథ టూకీగా చెప్పింది. బాబా వారి అందమయిన శిరసు వంచి శ్రద్ధగా వింటు న్నారు. వింటూ ఆయన అన్నారు — "పీటర్ నన్ను ఎంతగానో ప్రేమించేవాడు అలాంటివాడు అయినా అతడు నన్ను తిరస్కరించాడు." అక్కడ వింటూ ఉన్న ఇతర స్త్రీ మండలిలోని డెలియా అడిగింది — "అయితే పీటర్ అలా తెలిసే చేసాడా? తెలియకుండా చేసాడా ? బాబా !" బాబా జవాబు చెప్పారు — "ఎవరూ జీసస్‌ని పీటరంత గొప్పగా ప్రేమించలేదు అతడికి తెలిసే చేసాడు. అలా జరగాలని విధి ఉంది. జరిగింది" డెలియా — "నేను ఎప్పుడూ అనుకునేదాన్ని జూడాస్ జీసస్‌కి ద్రోహం చేసినపుడు తెలియకుండానే చేసి ఉండాలి. తెలిసి ఉండి అలా జీసస్ అంతటి వాడిని ద్రోహం చేస్తాడా? అనుకునే దాన్ని" అన్నది బాబా — "జూడాస్ ద్రోహం చేయడమే గొప్పసేవ అయింది. అతడు క్రీస్తుని బుగ్గమీద ముద్దుపెట్టుకున్నపుడు అతడేమీ చేయలేదు. భగవంతుడే అంతా చేసాడు. ఒక తెరలో ఉండి చేసినట్టుగా చేసాడు. అందరికంటె గురువు పనే ఎక్కువ కష్టమయినది" అని చెప్పిన తరువాత బాబా జూడాస్ కూడా భగవంతుని తెలుసుకున్నవాడే అనిచెప్పారు అది మే 14 వ తేదీ.

ఆ రోజు సాయంకాలం బాబా అడీల్‌వైపు తిరిగి అక్షరాల పలకమీద "భగవంతుని యెడల ప్రేమ ఒక్కటి తప్ప యీ ప్రపంచంలో ఏదీ ప్రధానం కాదు మస్తులకి యీ ప్రేమ అపారంగా ఉంది. అందుకే వారంటే నా కంత ప్రేమ. అంత ఆనందం. భగవంతుని దరిజేరడానికి అగ్ని సాగరంలో మునిగిపోయి ఏమీ కాకుండా బయటపడి రావాలి." అన్నారు బాబా.

బాబా — ఫిల్లిప్స్ ! అడీల్ ! మీరు నన్ను ప్రేమిస్తున్నారా ? అది నా ప్రేమ. అర్థమౌతోందా ?

వారు అవును బాబా అన్నారు.

బాబా — కొన్ని వందల సంవత్సరాల తరువాత మనం యిప్పుడు యిక్కడ ఏమి చేసామో దాన్ని గురించి అప్పటి ప్రజలు మాట్లాడుకుంటారు బాబా యిక్క డున్నపుడు ఏమి జరిగిందో చెప్పుకుంటారు తరువాత నేను మరల మరల వస్తూం టాను. అలాగే మీరంతా కూడాను

"ఫిల్లిస్, అడీల్ : మీరు నన్ను ప్రేమిస్తున్నారు కొన్ని యుగాల నుంచి మిమ్మల్ని నేనెరుగుదును ఎప్పటినుంచో మీకు తెలియదు. నాకు తెలుసును. మీరు దేనికీ విచారించకండి. నన్ను ఎక్కువగా యింకా ఎక్కువగా ప్రేమించండి. ఈ మాటలు మీ హృదయాల మీద వ్రాయబడి ఉండాలి — "భగవంతుడు తప్ప ఏదీ సత్యంకాదు" అని ఈ మాటలు చెప్తూ బాబా తన హృదయం వైపు చూపించారు. బాబా చెప్పిన మాటలు వినేవారి హృదయాలకు హత్తుకుపోయినంత శక్తివంతములుగా ఉన్నాయి.

బాబా అన్నారు— "త్వరలోనే ఖడ్గము ధరిస్తాను"— ఈ మాటలన్నప్పుడు ఫిల్లిస్ ఆయన చేతిలో జ్వలిస్తున్న కృపాణమును గనెను ముందు ముందు గొప్ప వినాశనం కలుగబోతుందని వారికి తెలిపెను.

మే 14 వ తేదీ బుధవారం ఉదయం బాబా వారి యింటినుంచి గెస్ట్‌హౌస్‌కి ఫోన్‌చేసి యిలా చెప్పారు — "ఫిల్లిస్, అడీల్, సెంటర్‌లో అతిథులుగా ఉండగా వారు ఏ పనీ చెయ్యకూడదు." అని.

స్త్రీలతో బాబా నడిచి వెళ్ళేవారు, బీచ్‌కి షికారుకి. క్రింది రోడ్డుమీద నుంచి వెళ్ళి పైరోడ్డుమీద నుంచి వచ్చేవారు. ఒక కర్ర చేతితో పుచ్చుకుని కిట్టీదేవీని ముందుకు నడవమనేవారు. ఈ దారిలో ఎప్పుడూ పాములు కానరాలేదు. బీచ్‌లో (సముద్రతీరాన) కొంతదూరం బాబా ముందు నడిచేవారు ఏవయిన అందమయిన గుల్లలు కనిపిస్తే వెనక్కి వచ్చేవారు ; అక్కడ ఆగేవారు అప్పుడప్పుడు వెనకపడ్డవారి కోసం కూడా ఎప్పుడయినా ఆగేవారు బాబా. వారు పోగుచేసిన గవ్వలు మొదలయినవి చూసి యింకా మంచివి ఏరండి అని చెప్పేవారు మెహెరా అందరు ఏరిన వాటికంటె అందమయినవి చేర్చేది. ఇందులో బాబాకి నచ్చినవి ఆయన జేబులో వేసుకునేవారు - లేకపోతే జాగ్రత్తగా ఉంచుతుందన్నవారి చేతికిచ్చి దాచమని చెప్పేవారు. ఉదయం సూర్యుడు బాగా పైకి రాకముందే 9-30 గంటలకి ముందే తిరిగి వచ్చేవారు బాబా మెహెరాను మిగిలిన వారిని గెస్ట్‌హవుస్ వద్ద విడిచి పురుషమండలితో లాగూన్ కేబిన్‌కి వెళ్ళేవారు అక్కడ కొందరితో సంభాషణలు చేసేవారు రహస్యంగా. భోజనాల వేళవరకు వీటితో కూర్చునేవారు బాబా కొందరు స్త్రీలు మొదటిసారిగా

బాబాను చూసినవారిని మెహెరాను కలుసుకోమని ప్రాచ్యమండలి వారిని కలుసుకోమని బాబా పంపించారు.

ఒక రోజు ఉదయం స్త్రీ మండలి ఆరుగురు, ఫిల్లిప్, అకీల్ మిగిలిన వారు అందరూ బాబాతో కలిసి సముద్రతీరానికి షికారుకి వెళ్ళడానికి ఉద్యుక్తులైనారు. బాబా కొంచెం కఠినంగా కనిపించారు. ఆయన చేతికర్రను తీసుకున్నారు.

బీచ్‌లో బాబా చాలా త్వరగా అందరికంటె ముందు నడుస్తున్నారు. ఆయన నడిచిన ఆయన పాదాలలో అడుగులు వేసుకుంటూ వెనుక ఫిల్లిప్ నడుస్తోంది. బాబా వంగి ఏదో తీసి "ఇది మెహెరాకియ్యి" అని ఫిల్లిప్‌కి ఒక గుల్ల యిచ్చారు అది యివ్వగానే మెహెరా ఎంతో సంతోషించింది. మెహెరా కూడా అందమయిన గుల్లలు గవ్వలు కనిపిస్తే ఏరుతోంది ఇండియాకి తీసుకు వెళ్ళడానికి.

అడవిలో నుంచి వెనుకకు వస్తూంటే బాబా "ఫిల్లిప్ ' ఎందుకు ఆందోళన చెందుతావు విచారించడం మానెయ్యి" అన్నారు. అలా రెండు మూడు మాట్లు ఆమెకి చెప్పించారు బాబా ఇంక యిది పనికాదని ఆమెను దగ్గరకు పిలిచి ఆయన కుడిచేతితో ఆమె ఎడమచేతిని మణికట్టు దగ్గర పట్టుకున్నారు. వెంటనే ఆమెలో ఏదో కరెంటు ప్రవహించింది. ఆమెకు హృదయానికీ మనసుకి శాంతి కలిగింది.

బాబా మిర్టిల్‌బీచ్ సెంటరు ప్రారంభోత్సవం చేసినపుడు నోరీనాకు గుండె జబ్బు చేసింది ఆరోజున ఆమె హాజరుకాలేదు. ఆమె ఆసుపత్రిలో చేరవలసివచ్చింది.

ఇంకా కొద్దిరోజులకి కాలిఫోర్నియాకు బయలుదేరుతారనగా ప్రారంభోత్సవం పెద్ద బార్న్ యింట్లో జరిగింది. బాబా మండలితోనూ, ఎలిజబెత్ తోనూ కూడా లోపల ఉండగా రానో డెలియాలు మెట్లమీద బయట నిలబడి ఎవరయినావస్తే లోపలికి పంపేవారు ఆడవాళ్ళు వచ్చినపుడు మెహెరా, మణి, డా॥ గోహర్, మెహ్రూలను కలుసుకోవడానికి రానోగాని డెలియాగాని వాళ్ళని తీసుకువెళ్ళేవారు. వింటర్‌ఫెల్ట్ దంపతులు, డాన్ స్టీవెన్స్ మొదలయినవారు కూడా వచ్చారు. పనామా నుంచి డెలియా స్నేహితురాలయిన మిసెస్ ఓటివియా తేజీరా కూడా వచ్చింది 1948 లో ఆమె మొదటిమాటుగా బాబా దర్శనం చేసుకుంది. అప్పుడు బాబా ఆమెకు సహాయం చేస్తానన్నారు ఇప్పుడు ఆమె బాబా దర్శనం కోసం మళ్ళా వచ్చింది.

మే 17 వ తేదీన బాబా దర్శనార్థం మిర్టిల్‌బీచ్‌కి వెళ్ళినవారు అనేక యిబ్బందులకు లోనై వెళ్ళారు. బస్సులు ఆలస్యంగా వెళ్ళాయి రైళ్ళు అందలేదు. ఫ్లోరెన్స్‌లో రైలు దిగి రెండు గంటలు కారుమీద ప్రయాణం చేయవలసి వచ్చేది. కొంతమంది అసలు రాలేకపోయారు పాపం కొందరు యిళ్ళదగ్గ ఏవో పనులవల్ల అసలు బయలుదేరనేలేదు. వారంతా భగవంతుని కలుసుకోలేకపోయారు కదా పాపం.

మే 17 వ తేదీ శనివారం నాడు 'ఓపెన్‌డే' అని ప్రకటించారు. అంటే బయటనుంచి ఎవరయినా బాబా దర్శనార్థం రావచ్చును ఉదయం 7 గంటలనుంచి సాయంత్రం 7 గంటలవరకూ వస్తూనే ఉన్నారు. ఆ రోజున మొత్తం 1500 మంది మెహెర్ సెంటరుకి వచ్చారు. మార్గరెట్, డెలియా, ఫిల్లిస్, అడీల్, షా సోదరీలు లాగూన్ కేబిన్‌కి రమ్మని వీరికి వచ్చిన వారితో ఉండేపని అంతా తలొకరికి చెప్పి అప్పగించారు బాబా. బాబా ఆయన ప్రక్కన ఉన్న చిన్న బల్లమీద ఫిల్లిస్‌ని కూర్చో మన్నారు. ఆమెకి సిగ్గువేసి క్రిందనే కూర్చుంది. బాబా పాదాలవద్ద కూర్చుని ఆ పాదాలవైపు తేరిపార జూసింది. ఆమె బాబా గదిలోకి అనేకమంది అదృశ్యులు వెళ్తున్నట్లు చూడగలిగింది.

'ఫీలాడిల్' (ఫిల్లిస్‌ను అడీల్‌ను కలిపి యిలా పిలిచేవారు బాబా)ను బార్న్ వెనుక ఉండమన్నారు. బాబా దర్శనం చేసుకుని వెళ్ళేజనం మెట్లు దిగేటప్పుడు వారికి సహాయపడాలి వీరిద్దరు చాలా మంది ఆయన సన్నిధినుంచి యీవలకి వచ్చే టప్పుడు – కొందరు పరవశులై వెళ్తారు, కొందరు కళ్ళనీళ్ళతో వెళ్తారు, కొందరు నడవడానికి తడబడుతూంటారు ; కొందరు పైకే ఏడుస్తూంటారు వారికి ఎవరికైనా సహాయం అవసరం ఉంటుంది. వారిని తిరిగి రోడ్డుమీదకు చేరేలా వీరు చూడాలి. లేకపోతే తిన్నగా వెళ్తే అడవిలోకి వెళ్తుంది దారి. వారిలో చాలామంది మొదటి మాటుగా బాబాను దర్శిస్తున్నారు. ఆ రోజున వారి మీద బాబా తమ ప్రేమను అక్షరాలా వర్షించారు. చాలామందిని పట్టుకుని బయటకు నడిపించి తీసికెళ్ళారు. దర్శనార్థులు అనేక ప్రశ్నలు వేస్తారని ముందుగానే అచ్చువేయించబడిన రెండుపుటల వివరణ ప్రతివారికి యిచ్చారు. అందులో బాబా అనేక విషయాల గురించి చెప్పారు – అద్భుతాలు, జబ్బులు కుదర్చడం, బాబా మౌనం - ఇంకా యితర సంగతులు అందులో చెప్పబడ్డాయి. బాబా అందులో భగవంతుని గూర్చి యిలా అన్నారు –

" భగవంతుని గురించి నేర్చుకోడానికి వీలు లేదు భగవంతుని గురించి చర్చించడానికి వీలులేదు. భగవంతుని గురించి చదువుకోవానికి గాని వాదించ డానికి గాని వీలు లేదు భగవంతునిగూర్చి ధ్యానించాలి, ధావించాలి, ప్రేమించాలి, ఆయనను జీవించాలి. "

ఇంకో విషయం—

అన్ని విధములైన యోగముల (సత్యాన్వేషణము) యొక్క ఉద్దేశము— కర్మయోగము, జ్ఞానయోగము, రాజయోగము, భక్తియోగముల ద్వారాను, యితరులకు నిస్వార్థసేవ చేయడం ద్వారాను, ధ్యానం చేయడం ద్వారాను, భగవంతుని యెడల ప్రేమద్వారాను పరిమితమైన అహమును మరిచిపోయి, అపరిమితమయిన ఆత్మను పొందడమే."

దర్శనార్థం వచ్చిన ప్రతివానితోను బాబాను చూసి ఆయన చేతిని స్పృశించి ముందుకి వెళ్ళిపోవాలి అని చెప్పేవారు చేతులున్న ఒక పెద్ద కుర్చీలో కూర్చున్నారు బాబా. హాల్లో ఒక చివర ఆ కుర్చీ వేయబడి ఉంది. బాబా మొదట 1931 సంIIలో వచ్చినపుడు న్యూయార్క్‌లో యీ కుర్చీలోనే కూర్చున్నారు. ఎలిజబెత్ బాబాకి కుడి వైపున కూర్చుంది ఆమె బాబాను అడిగింది— "ఇంత త్వరగా వారు మిమ్మ స్పృశించి ఊరికే చూసి వెళ్ళిపోతున్నారే మీరు వారికి ఎలా సహాయం చేయగలరు ?" అని బాబా జవాబు చెప్పారు—

"వారు యింకా కొంచెంసేపు ఆగితే వారి మనసు పనిచేయడం ప్రారంభిస్తుంది నేను వారి హృదయాన్ని స్పృశించాలని కోరుతున్నాను."

ఇంకొకమారు బాబా మనసు హృదయంకంటె ఎంతోత్వరగా పనిచేస్తుందని చెప్పారు. అందుచేత మనసును నెమ్మదిపరచి హృదయాన్ని త్వరితపరచాలని అన్నారు.

దర్శనార్థులు చాలామంది నల్లవారు (నీగ్రోలు) కూడా వచ్చారు. కుటుంబాలతో వచ్చారు తెల్లవారుగాక నల్లవారు గాని సవర్ణులు గాని వచ్చినపుడెల్ల బాబా లేచి నిలబడి వారికి స్వాగతం యిచ్చేవారు తెల్లవారు వచ్చినపుడు బాబా కూర్చునే ఉండే వారు ఈ చర్య నల్లజాతి వారి అభివృద్ధికి దోహదం చేసింది ఒకతడు బాబా

దర్శనంవల్ల అంతరంగానుభవం కలిగి నిశ్చేష్టుడై నిలిచిపోయాడు ఏమి చేయాలి? అని బాబా ప్రేమికులయిన అకీల్ ఫిల్లిస్‌లు బాబావైపు చూసారు బాబా అతనిని ఉండ నియ్యండి అని సైగచేసారు వారికి బాబాను దర్శనం చేసుకున్నవారిలో ఒక తాబేలు కూడా ఉంది. అది లోపలకు వచ్చేవారితో లోపలికి రావాలని మరీ మరీ ప్రయత్నం చేసింది బాబా కొంచెంసేపు విశ్రాంతికై అక్కడనుంచి లేచిరాగా వారు యీ తాబేటి సంగతి ఆయనతో చెప్పారు. బాబా చిరునవ్వు చూపించారు.

17 వ తేదీనాడు పెద్దవర్షం వస్తుందేమో అన్నట్టుగా ఉంది వాతావరణం. మేఘావృతమై ఉంది ఆకాశం. ఆ సాయంకాలము మరల అకీల్‌ని, ఫిల్లిస్‌ని బాబా కారులోకి వచ్చి కూర్చోమన్నారు. కారు ఎక్కుతూంటే ఫిల్లిస్ కాలిమీద రెండు ఎర్రటి ఆనవాళ్ళు చూసి ఏదయినా కరిచిందా అని అడిగారు. "లేదు" బాబా అని ఆమె జవాబిచ్చింది గెస్టుహౌస్‌కి వెళ్ళిన తరువాత బాబా డా॥ గోహర్‌ని పిలిచి ఫిల్లిస్‌ను పరీక్ష చేయించారు ఆయన ముఖంమీద ఆందోళన కనిపించింది, ప్రక్కన నిలబడి చూస్తూండగా డెలియా రాత్రి చీకట్లో ఏదయినా తగిలిందేమో అంది పాము కాదు కదా అన్నారు బాబా- ఆమెకి అలా అనగానే చాలా భయం వేసింది. ఆమెకి పాము అసలు కనిపించనే లేదు ఆమె ఆసెంటరులో అసలు పామునే చూడలేదు యింత వరకు. బాబా ఆ సాయంకాలం ఆయన మెడలో నుంచి కార్నేషన్‌ల (ఒకవిధమయిన పుష్పాలు) దండతీసి ఫిల్లిస్‌కి యిచ్చారు ఆమె యింతవరకు యింకా ఆ దండ ఆమె వద్ద భద్రంగా దాచుకుంది.

ఆ రోజున బాబాతో జాన్‌బాస్ కూడా కూర్చున్నాడు అతడు యీ రోజు గురించి "నా జీవితంలో యిది అన్నిటికంటె గొప్ప అనుభవం అని అనుకుంటు న్నాను – వారు బాబాను ఆలింగనం చేసుకుంటూంటే చూడడం. ఒక లైబ్రరీ పుస్తకా లన్నీ చదివితే వచ్చే జ్ఞానం కంటె ఆ రోజున బాబా వద్ద కూర్చుని నేను ఎక్కువ నేర్చుకున్నాను"

ఏదో అభిప్రాయభేదం వల్ల ఐవీడ్యూక్ వారితో లోపల కూర్చోలేదు, మొదట్లో ఆమె లోపల కూర్చుందామనుకున్నా గాని. కానీ ఆమె సూఫీ బృందంతో బాబా దర్శనార్థం వచ్చింది సమావేశంలో బాబా వారందరికీ అనేక విషయాలు చెప్పారు. కిట్టీ దేవీవైపు ఎలిజబెత్ వైపు తిరిగి – "మీకు నేను చెప్పినది అర్థమయి నదా? మళ్ళీ చెప్పండి చూద్దాం" అని వారిచేత బాబా తిరిగి చెప్పించేవారు.

స్త్రీలు, పురుషులు, పిల్లలు వరుసగా ఎడతెరపి లేకుండా వస్తూనే ఉన్నారు. వారిలో కొందరు తెల్లవాళ్ళే కాకుండా, రంగు కలవారు కూడా ఉన్నారు. కొందరు బాబాను కలుసుకున్నాక గాఢంగా హృదయం కదిలి పారవశ్యత పొందడం వల్ల ఏడుస్తూ వెళ్ళారు. వారు బాబా యొక్క దివ్యప్రేమను రుచి చూసారు. ఆయన తీక్షణమైన దృక్కులలోనుంచి వచ్చే ప్రేమ, కరుణాకిరణాలకి తట్టుకోలేకపోయారు. ఆయన కళ్ళవైపు చూడలేక పోయారు.

## బెరిల్ విలియమ్స్ :—

ఆరోజున బెరిల్ విలియమ్స్ అనే ప్రేమికురాలు మొదటిసారిగా బాబా దర్శనం కోసం వచ్చింది. బస్సుస్టేషన్ వద్దకు బాబా సరోష్‌ను పంపి ఆమెను తీసుకుని రమ్మన్నారు. సరోష్ ఆమెను దిగినవెంటనే సెంటర్‌కి తీసుకువెళ్ళాడు కారులో ఆమె బార్న్ లోపలికి వెళ్ళడానికి పోర్చ్‌లోకి రాగానే బాబా కొందరు శిష్యులతో కూర్చుని ఉండడం ఆమె పసిగట్టింది. డెలియా తలుపు తెరిచింది. ఆమె "బాబా! ఈమె బెరిల్!" అని బాబాతో చెప్పింది. బెరిల్‌ను డెలియా బాబాకు యీ విధంగా పరిచయం చేసినా లోపలకు ఆమె అడుగుపెట్టడానికి సంకోచిస్తోంది. ఇంతలో బాబా ఆమెను చూడగానే లేచి ముందుకు వచ్చి చేతులు రెండూ జాపి నిలబడ్డారు తరువాత ఆమె ఆయన చేతులలోకి వెళ్ళింది ఆయన కౌగిలిలో ఆమె పరవశురాలయిపోయింది. ఆమెకు స్పృహ వచ్చేసరికి బెరిల్ ఏడుస్తోంది ఆమె తలను ప్రియతముని భుజంమీద పెట్టుకుంది. ఆమె తుదకు తనకి కావలసిన నిజధామానికి వచ్చినందుకు ఆనందం పట్టలేకపోయింది. ఆమె కళ్ళు బాష్పధారలు కురుస్తున్నాయి. తరువాత ఆమె బాబా ప్రక్కన కూర్చుంది. బాబా ఆమెను ప్రయాణం గురించి, భోజనం చేసావా అని యిలాంటి ప్రశ్నలు ఎన్నోవేసి కుశలమడిగారు బాబా ఆమెను గొప్పగా ఆకర్షించారు. ఆయన ఆకర్షణవల్లనే ఆయనవద్దకు వచ్చింది బెరిల్. ఆమెతో మాట్లాడుతూ అకస్మాత్‌గా ప్రక్కనున్న ఆదీ వైపు తిరిగి అక్షరాల ఫలకమీద "మంచిపనే జరిగింది. యోగ్యురాలే" అన్నారు. ఈ విధంగా బాబా తృప్తిని వెల్లడించారు బెరిల్ ఏమి చేయాలో ఆమెకి కొన్ని సంగతులు బాబా చెప్పారు. ఆమె హృదయంలోకి లోతుగా చూసి బాబా—"అంతా నాకు వదిలెయ్యి! నీకెందుకు నేనున్నానుగా. నాకు వదిలెయ్యి" అన్నారు చెప్పడం సులభంగా చెప్పేసారు బాబా. కానీ ఆమె అది ఆచరణలో

పెట్టడం ఎంత కష్టం అనుకుంది. ఆమె హృదయంలో నుంచి గొప్ప బరువును దింపేసినట్లు అనుభవించింది ఆమె హృదయం చాలా తేలిక అయింది అంతవరకు యింత బరువు మోస్తున్నట్టు కూడా ఆమెకు తెలియదు ఆ క్షణంలోనే హృదయం తేలిక వచ్చతరువాత ఆమెకు తెలిసింది బాబా డెరిల్‌ను ఎలిజబెత్ పాటర్సన్‌కి పరిచయం చేసారు డెరిల్‌ను మిర్టిల్ బీచ్ సెంటరులోనే ఆయన అతిధిగా ఉండమన్నారు. ఎలిజబెత్ ఆమెకు అన్ని ఏర్పాట్లు చేస్తుందన్నారు తరువాత బాబా సెంటరు నుంచి వెళ్ళిన తరువాత న్యూయార్క్‌కి వెళ్ళిపోవచ్చునన్నారు.

## బార్బరా మహన్ :—

డెరిల్ లాగే బార్బరామహన్ కూడా మొదటిసారిగా బాబా దర్శనం చేసుకుంది ఈమె రెండు సంవత్సరాల నుంచి బాబాను చూడాలని అనుకుంటోంది. కొన్నాళ్ళు ఆగితే బాబా న్యూయార్క్ వస్తారు. ఇక్కడే చూడవచ్చు అని మార్గరెట్ ఆమెకు చెప్పింది అంతవరకు వేచియుండలేక బార్బరా యిప్పుడే వెళ్ళి చూడాలని మిర్టిల్‌బీచ్‌కి వచ్చింది అయితే డబ్బు కావలిస్తే యిస్తానని కూడా అంది మార్గరెట్. అక్కర్లేదు అని తనకు డబ్బు సమకూడిందని, అది వచ్చిన అద్భుతమయిన విషం కూడా బార్బరా మార్గరెట్‌కు చెప్పింది పాల్ కేయస్ అనే యువకుడు బాబాను ఎంతో ప్రేమిస్తున్నాడు అతనిద్వారా బాబా గురించి మొదట విన్నదట యీమె. బాబా ఆయన కార్యక్రమం మార్చుకుంటే ఆయన దర్శనం చేసుకోవడం పడదని మిర్టిల్‌బీచ్‌కి వెళ్ళి దర్శనం చేసుకుందామని బార్బరా యిక్కడికి వచ్చేసింది. మధ్యలో ఎక్కడా విశ్రాంతి లేకుండా ఫ్లోరిడా ఎక్స్‌ప్రెస్‌బస్‌లో 20 గంటలు ప్రయాణం చేసి వచ్చింది ఆమె ఆమె మిర్టిల్ బీచ్‌కి వచ్చేసరికి ఆమెకు ఆకలి చంపేస్తోంది నీరసంగా ఉంది ఆమెకు. తిన్నగా ఒక హోటలుకి వెళ్ళింది. అక్కడ ఒక పెద్ద డబుల్‌రూమ్ తీసుకుని ఒకత్తె అందులో దిగింది- రాత్రి భోజనం బాగా చేసింది రాత్రి నిద్దర పట్టలేదు తెల్లవారితే బాబా దర్శనం చేసుకోవాలి. చాలా సేపు మెలకువగా మంచానికి అడ్డంగా పడుంది. తలలో అనేక ఆలోచనలు. హోటలుకి ఎదురుగా ఒక వినోదాలతోట ఉంది అందులో నుంచి ఏదో సంగీతం వినవస్తోంది. అందులో దీపాలు చూస్తూ ఆ సంగీతం వింటూ కొంతసేపు గడిపింది మరునాడు ఉదయాన్నే ఒక కారులో సెంటరుకి వచ్చింది. బార్బరా మొదట కిట్టీడేవీని చూసింది కిట్టీ సెంటరు లోపల

వచ్చేపోయే కార్లు రావడానికి వెళ్ళడానికి మార్గదర్శిగా ఉండి పనిచేస్తోంది. గులాబీ రంగు సిల్కుగౌను వేసుకుంది కిట్టీ మార్గరెట్ చూపించిన ఫోటోగ్రాఫ్‌లను బట్టి యీమె కిట్టీదేవీ అని గుర్తు పట్టింది.

బార్బ్రవద్దకు వెళ్ళేసరికి అక్కడ ఎల్లామాసీ, మాట్లిన్ గాఁవర్స్ ఉన్నారు. వారితోనే ఆమె బాబాను చూడాలి వారు కూడా ఆ హోటలులోనే రాత్రి గడిపారు. కానీ వాళ్ళకి రిజర్వేషన్ లేనందున గది దొరకలేదు. ఒక చిన్నగది - చెప్పుళ్ళు పెట్టుకునే గదిలో సామాను పెట్టుకున్నారు అప్పుడు బార్బరా ఒకత్తె అంత పెద్ద గదిలో రాత్రి ఎలా గడిపింది జ్ఞాపకం చేసుకుంది. మార్గరెట్ చెప్పిన ప్రకారం బాబాకి ఏదయినా కానుక తీసుకువెళ్తే మంచిదని అక్షరాల పలక మార్గరెట్ చెప్పిన ప్రకారం చేయించింది ఒక ఫొటోగ్రాఫ్‌ను బట్టి ఆ బల్ల సైజు యింత ఉండాలని, అక్షరాలు యింత పెద్దవిగా యింత దూరంగా యిలా ఉండాలని ఊహించి అన్నీ చెప్పి చేయించింది. బాబా వద్దనుంచి పిలుపు రాగానే ఎల్లా, మాట్, బార్బరా లోపలికి వెళ్ళారు.

బాబా తెల్లని దుస్తులు ధరించి ఉన్నారు. శిరోజాలు క్రిందికి వ్రేలాడుతున్నాయి. ఆయన చిరునవ్వు నవ్వుతున్నారు. ఉల్లాసంగా ఉన్నారు ఆయనను చూసేసరికి బార్బరాకి నోటమాట రాలేదు శరీరం మొద్దుబారినట్లయింది బాబా భగవంతుడు. ఆయన అందరిలోనూ ఉన్నాడు తనలోనూ ఉన్నాడు అందుచేత ఆయనకి తెలియనిది ఏముంది ? ఇంక ఏదయినా అడగడం అనవసరం అనిపించింది బార్బరాకి కానీ ఆమె అంతరాంతరాలలోని భావాలు, అన్నీ బాబాకు తెలియాలి అని ఎప్పటినుంచో అనుకుంటోంది ఆమెకు సిగ్గువేసింది మనసు తత్తరపాటు చేసింది. బాబా వారితో "మీరు చాలా దూరాలనుంచి ఎంతో వ్యయప్రయాసలకు లోనై రావడం త్యాగంతో కూడుకున్నపని. నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను. మీ కోసమే నేను బాధపడుతున్నాను" ఇలా గంభీరమయిన మాటలు చెప్తున్నా ఆయనకళ్ళలో నవ్వు స్ఫురిస్తోంది ముఖంలో మృదువయిన ప్రేమభావం బాగా కనిపిస్తోంది. వారు కానుకలు యిచ్చారు వార్బరా యిచ్చిన అక్షరాల బోర్డు చూసి బాబా సంతోషించారు. బాబా "రెండు వైపులా అక్షరాలున్నాయి దీనిలో. నావద్ద యిలాటిది లేదు పట్టుకున్నపుడు అక్షరాలుమూసుకుపోకుండా మార్జిన్ ఉంది దీనికి" అని చెప్పినపుడు బాబా ఆ పలకే ఉపయోగించారు ఆయన అప్పుడే రెండు వ్రేళ్ళమధ్య దాన్ని పట్టుకుని గిరగిరా త్రిప్పారు.

మే 18 వ తేదీ ఆదివారం అందరు ప్రేమికులూ మిర్టిల్ బీచ్ వెంటరు నుండి వెళ్ళడానికి బాబావద్ద సెలవు తీసుకున్నారు. ఎవరిమట్టుకు వారికే బాబాను కలిసి నపుడు ఎంత సంతోషంగా ఉందో వారినుండి వెళ్ళిపోయేటప్పుడు అంత విచారంగా ఉంది. 18 వ తేదీ ఉదయం 9 గంటలకు సరిగ్గా బాబా లాగూన్‌కేబిన్‌కి వచ్చారు. ఆయన మామూలుకంటె తేజోమయంతంగా, అందంగా ఉన్నారు. ఆయన జడ వేసుకో లేదు జుట్టు చక్కగా దువ్వుకున్నారు తెల్ల లాంగ్రీమీద రంగుకోటు తొడుక్కున్నారు. బాబా వేచియున్నారు ఆ కళాకారుల కోసం నిరీక్షించారు ఎవ్వరూ రాలేదు ఆయన మార్గరెట్ కోసం కబురుచేసారు ఆమె 17 వ తేదీ తరువాత ఎవరినో చూడడానికి ఎందుకు ఏర్పాటు చేసింది? అసలు ఆయనిప్పుడు ఒకరితో సంభాషించేటట్టుగా లేరు. అయినా వారెక్కడున్నారు. దర్శనాలయిన మరునాడే వర్షం బాగా కురిసింది. తుఫానులా గాలులు కూడా వీచాయి. మిగిలినవారిని కూడా బాబా పిలిచి యీ మాటలే చెప్పారు. లాగూన్‌కేబిన్‌లో అటూ యిటూ నడుస్తూ అసలు వారికి (ఆ వచ్చేవారికి) ఏమయిందని అనుకుంటున్నారు మీరు ? అని అడిగారు. వారికేమయినా ప్రమాదం జరిగిందని అనుకుంటున్నారా మీరు ? వారు ఎలా వద్దామని అనుకుంటున్నారు ? విమానాశ్రయా నికి టెలిఫోన్ చేసి కనుక్కోండని పంపించారు బాబా. వారి విమానం గురించి జాడ తెలియలేదు. రోజంతా యిలాగే జరిగింది. బాబా భోజనానికి వెళ్ళారు భోజనం చేసి వచ్చి మళ్ళీ ఆ నలుగురు కళాకారుల గురించే మాట్లాడుతూ పచారు చేస్తున్నారు. వాళ్ళు ఎందుకు వస్తున్నారని ఒకమారు, వాళ్ళు ఏంచేస్తున్నారు వాళ్ళకేమయిందని ఒకమారు అంటున్నారు. వారేదో ఆపదలో చిక్కుకున్నట్లు వారి గురించి అడుగు తున్నారు. సాయంకాలం వరకు బాబా ఉండి వారు వెళ్ళడానికి సమయం అయినపుడు విమానాశ్రయానికి మళ్ళీ టెలిఫోన్ చేయమన్నారు బాబా. వాతావరణం బాగాలేదని మాత్రం తెలుసుకున్నారు. అంతకంటే ఏమీ వారి గురించి తెలియలేదు బాబా వారి యింటికి వెళ్తానని ఒకవేళ ఆ కళాకారులు వస్తే ఉదయాన్నే 7 గంటలకు వారిని 5 నిమిషాలపాటు చూస్తానని చెప్పండి అని బాబా బయలుదేరి గేటువరకు వెళ్ళారు. యింతలో టెలిఫోను మ్రోగింది మిర్టిల్‌బీచ్ విమానాశ్రయం నుంచి ఆ పార్టీవారు చేశారు వారికి ప్రయాణం చాలా కష్టంగా జరిగిందని ఒక ప్రయివేటు విమానం తీసుకుని వచ్చామని అన్నారు మామూలు విమానం వాతావరణం బాగాలేదు గనుక బయలుదేరలేదు. అందుచేత విమానం అద్దెకు తీసుకుని వచ్చారు. టెక్స్‌హైటవర్, కాథరైన్‌థామస్, జెబ్రానెర్విన్స్, సురాగెస్బెన్ అనువారలు వచ్చినవారు. వీరందరూ

వారికి వచ్చిన దర్శనావకాశం పోగొట్టుకొనకూడదని చాలా పట్టుదలతో మిన్నియా పోలిస్ నుంచి బయలుదేరి వచ్చామన్నారు ఇంక 15 నిమిషాలుంటే విమానంలో గాన అయిపోయేది అన్నారు- అంటే మిడ్డిల్‌వీక్ రావడానికి సరిగ్గా సరిపోయింది. ఈ తుఫాను వాతావరణంలో రావడమే బ్రహ్మాండమయి పోయింది.

బాబా ఆ నలుగురిని మరునాడు ( 19, మే ) ఉదయాన్నే చూసారు. బాబా ఒక్కొక్కరిని ఆలింగనం చేసుకున్నారు వారిని సోఫామీద కూర్చోమని వారి యెదుట కొంతసేపు మౌనంగా నిలబడ్డారు బాబా వద్ద నుంచి వారికి ప్రేమతరంగాలు అపూర్వంగా ప్రసరించాయి దానికి వారు ఉక్కిరి బిక్కిరి అయి కళ్ళ వెంట ఆనంద భాష్పాలతో ఏడ్చారు బాబా వారిని విమానం ఏది దొరికితే అందులో బయలుదేరి వెళ్ళమని పంపించేసారు. వృత్తిరీత్యా వారికి తరువాత ఉన్న నాట్య ప్రదర్శనం యివ్వటానికి సరిఅయిన సమయంలో చేరుకునేందుకు వీలుగా వెళ్ళ మన్నారు కానీ వారు దానికి అందుకోలేక పోయారు అందుకు వారు విచారించలేదు వారికి కావలసిన బాబా దర్శనం దివ్యంగా అయింది వారు నలుగురు వెళ్ళిన తరువాత బాబా కిట్టీని ఎలిజబెత్ వగైరాలను పిలిచి — "వారి విమానం అనేక మార్లు అపాయంలో పడింది, వారి ప్రయాణంలో చాలా అపాయం ఎదుర్కొన్నారు మొదటినుంచి చివరి వరకు సురక్షితంగా చేరుకుంటారో లేదో అని అనుమానంగానే ఉంది" ఇందుకే కాబోలు నిన్నటిదినం అంతా వారి మీదే బాబా తమ దృష్టిని కేంద్రీకరించారు బాబాయే వారిని కాపాడి ఉండాలి సందేహం లేదు — ఈ ప్రయాణంలో కూడా

ఒక రోజున ఫిల్లిస్ కి జ్వరం వస్తే డాక్టరు దానికేవో మాత్రలు యిస్తే అవి ఆమె మెడక్రింద బ్లౌజులో దాచుకుంది. బాబా అవి యిలాతేఅని అడిగి పుచ్చుకుని కొంచెంసేపు బాబా చేతిలో ఉంచుకుని ఆ మాత్రలకి ఆధ్యాత్మిక బలం యిచ్చి ఆమెకు తిరిగి యిచ్చేసారు.

తరువాత ఆ మధ్యాహ్నం మెహెరా కాలికోతో చేసిన హృదయం ( అరకు ఆను ) ఆకారంలో ఉన్న ఒక సంచిలో పెట్టి బాబా యొక్క శిరోజాలను ఫిల్లిస్‌కి 'అడీల్ కి యింకా యితరులకు యిచ్చింది ఫిల్లిస్ ఆమె వంతుకు వచ్చిన తలవెంట్రుకలను ఆ మాత్రలున్న కాగితంలో దాచింది. వెంటనే ఆమెకు గతరాత్రి వచ్చిన ఒక కల జ్ఞాపకం వచ్చింది ఒక మెరపు కాగితం పొటంలో ఎవరో "ఇదిగో

యిది బాబాజాన్ తలవెంట్రుకలు " అని యిచ్చినట్లు, విప్పి చూస్తే తెల్లవి నల్లవి వెంట్రుకలు కలిసి ఉన్నాయని ఆమె చూసినట్టు జ్ఞాపకం తెచ్చుకుంది ఒక విధంగా ఆమె కల నిజమయింది ఆమె జ్వరం కూడా పోయింది

అడీల్ కళ్ళలోకి చూసి బాబా "నీకళ్ళు బాబాజాన్ కళ్ళలా ఉన్నాయి" అన్నారు పెద్దగా ఉన్న నీలిరంగు బూడిదరంగు కలిసిన కళ్ళు ఆమెవి ఈమాట విని ఫిల్లిస్ కి అడీల్ మీద కొంచెం అసూయ కలిగింది

ఒక రోజున మిర్టిల్ బీచ్ లో లాగూన్ కేబిన్‌లో చూర్చుని యుండగా బాబా వద్దకు ఒక చీమ వచ్చింది. బాబా దానిని చేతితో తీసి ద్వారంలో నుంచి బయటకు పారేసారు. ఎవరి చేతికిందయినా నలిగి పోతుందేమో అని బాబా దయతో అలాచేసారు. ప్రతి రోజూ బాబా ఎలిజబెత్‌తోను నోరీనా తోను మాట లాడేవారు శాన్‌ఫ్రాన్సిస్కోకి, మెహెర్‌మౌంట్‌కి (ఓజై) లాస్ ఏంజలెస్ కి ప్రయాణం చేయాలని చర్చించేవారు. బాబా విమానాల్లో వెళ్దామన్నారు. కానీ దానికి ఖర్చు ఎక్కువయేలా ఉంది చివరికి విమానం మానేసి కారుల్లో వెళ్దామని నిశ్చయించారు సూఫీ పని గురించి మాటలాడ డానికి ఐవీడ్యూక్ చాలాసార్లు బాబాని కలిసింది మొదటి రెండు వారాల్లోనూ సంభాషణలు చేయలేదు బాబా. ఆయన ఏకాంతవాసంలో ఉన్నారు. ఆయన అభీష్టం ప్రకారం ఆ 2 వారాలలోను ఎవరూ బాబానుచూడడానికిరాలేదు చాలామంది మిర్టిల్‌బీచ్‌కి వచ్చి బాబాతో రెండువారాల పాటు ఉందామనుకున్నారు. కానీ మే 17 వ తేదీన బాబా చాలా మందిని చూసి ఒక్కొక్కరిని అయిదు నిమిషాలలో పంపించేసారు.

బయట ఆడే ఆటలు ఆడదామని బాబా శిష్యురాండ్రను పిలిచేవారు. మార్గరెట్‌ను ముందు పిలిచేవారు గెస్ట్‌హౌస్ ఆవరణలో స్థలం బాగా ఉన్నందున అక్కడ ఆడేవారు ఈ ఆటలలో ఎవరు గెలిచేవారు ఎవరు ఓడేవారు అనికాదు ప్రశ్న. బాబాతో ఆడడమే వారికి కావలసినది బాబా ఎప్పుడూ నెగ్గేవారు. ఆయన ఆటలు నెగ్గుతూంటేనే మిగతావారికి సంతోషంగా ఉండేది ఒక్కొక్క రోజున చెరువుమీద పడవలో యెక్కి షికారుకి వెళ్ళేవారు పడవ ఎలా నడపాలో బాబా వారికి నేర్పేవారు. తరువాత యీ నేర్చుకున్నవారు స్వంతంగా వెళ్ళేవారు వారు వెళ్ళి వచ్చేవరకు చెరువు చివర ఒక వైపున ఉన్న వంతెనపైన నడిచేవారు బాబా "బాబా ! చెరువులో మొసళ్ళున్నాయి కదా ఎలాగ. ఒకటి 14 అడుగుల పొడవుందన్నారు కదా" అని

కిట్టీడేవీ అడిగింది. దానికి బాబా "నన్నేంచేయమన్నావు వాళ్ళ వెళ్ళామన్నారు" అని రెండు చేతులు పైకి ఎత్తారు నాకేం దానితో నిమిత్తం లేనట్లు

సాయంకాలాల్లో బాబా గెస్టుహవుస్‌కి వచ్చేవారు స్త్రీలందరినీ అక్కడికి రమ్మనేవారు మెహెరా, మణి, మెహ్రూ, గోహర్‌లతో కాలక్షేపం చేసేవారు ఎన్నో తమాషాలు చెప్పుకుని నవ్వుకునేవారు. భారతీయ స్త్రీలు, బాబా గురించిన కథలు మిగిలినవారికి చెప్పేవారు హాఫీజ్ కవి రచనల కొన్నిటిని మణిచేత చదివించేవారు బాబా సాధువులగురించి సద్గురువుల గురించి మాట్లాడుకునేవారు రామకృష్ణ (పరమ హంస) గొంతుకలో కేన్సర్‌తో బాధ పడేవాడు. సెయింట్‌ఫ్రాన్సిస్ తలనొప్పితో ఎంతో బాధ పడేవాడు. తల గోడకేసి కొట్టుకునేవాడు, బాధ తగ్గుతుందేమోనని. రమణమహర్షి చేతిమీద కురుపులతో బాధపడ్డాడు సాయంత్రం 7-30 అవగానే బాబా వారందరి వద్ద సెలవు తీసుకుని వారింటికి వెళ్ళేవారు. అక్కడ గేటు బయట ఆదీ (సీనియర్) వచ్చి బాబాకోసం వేచియుండేవాడు ఆదీతో కలిసి బాబా అక్కడ నుంచి వారి యింటికి నడిచి వెళ్ళేవారు.

పగలు బజారుకి వెళ్ళాలన్నా స్నానానికి వెళ్ళాలన్నా అందరి పురుషమండలిని తీసుకువెళ్ళేవారు బాబా. బాబా కావాలన్నపుడు సిద్ధంగా ఉండాలని శిష్యులు ఎప్పటికి వారు అనుకునేవారు బ్రియర్‌క్లిఫ్ ఏకర్స్ అనే చోట టోనిరూత్‌బర్ట్‌యొక్క అందమయిన బంగళాఉంది. అదిచూడడానికి మెహెరాను యింకా కొంతమందిని బాబా అనుమతించారు. ఆబంగళాలో ఆధునిక అమెరికన్‌పరికరాలన్నీ అమర్చబడి ఉన్నాయి వాటినన్నిటిని వారు చూసి ఆనందించారు ఇలాంటివి ఇండియాలో ఎక్కడాలేవు ఆ బంగళానుంచి ప్రకృతి దృశ్యం మనోహరంగా ఉంది చూడడానికి. అపుడు మెహెరా కూడా వచ్చిన పాశ్చాత్యస్త్రీలకి బాబా గురించి కొన్ని విషయాలు చెప్పింది — బాబాకి మంచి అందమైన చక్కటి స్వరం ఉండేదని టోని రూత్ బర్ట్ కొత్తయింటికి చూడ డానికి వెళ్ళినపుడు చెప్పింది. ఆయన పాడేటప్పుడు ఎంతో శ్రావ్యంగా ఉండేదిట.

మెహెరా అంటే స్త్రీ రూపంలో ఉన్న బాబాయే అని చెప్ప వచ్చును. బాబా యెడల ఆమెకు ఉన్నప్రేమ యింతని యిటువంటిదని వర్ణించ వీలులేదు ప్రపంచంలో అంత పరిశుద్ధమయిన ఆత్మ కలిగినది ఆమెయే అని బాబా చెప్పారు అయినా ఆమె సహజంగా, సరళంగా మాతృదేవిలా ఉంటుంది ఎవరు వెళ్ళినా ఆప్యాయతతో

హృదయపూర్వకమైన స్వాగతం యిస్తుంది మెహెరా స్త్రీ లోకానికీ నాయకీ ప్రతీక వంటిది మెహెరాతో బాబా గావించిన పని స్త్రీ లోకానికి వారి అభ్యుదయానికి కారణ మయింది మణి అంతకంటె చిన్నది ఆమెకు తరుచుగా ఉత్తరాలు వ్రాసే పాశ్చాత్య ప్రేమికులను కలుసుకొని మణి ఎంతో సంతోషించింది. ఆమె చాలా చురుకయిన మనిషి బాబా అక్షరాల పలకమీద ఎదో చెప్తూంటే ఫలానా అని, అది చదివి చెప్పడంలో బాగా ఆరితేరింది డా॥ గోహర్ నెమ్మదిగా మృదువుగా మాట్లాడు తుంది. ఆమె పాశ్చాత్య స్త్రీ మిత్రమండలితో తన గురించి చెప్తూ బాబాను ఆమె మొదటలో ప్రేమించలేనని, ఆయన ఆశ్రమంలో తనను చేరమన్నారని, ప్రేమించక పోతే పోనీ. ఆయనకి విధేయత చూపించగలవా అని అడిగారని ఆమె సరి అని చెప్పి ఆయన ఆశ్రమంలో ఉంటూ ఉండగా ప్రేమించడం ప్రారంభించానని చెప్పింది.

ఒకరోజున బాబా వారిక్రొత్తయింటిని స్త్రీ పురుష ప్రేమికులందరికి చూపించారు. అందరూ హాలులో నిలబడి యుండగా బాబా ఒక మీట నొక్కారు అంతట మండలి గదిలోని గంట మ్రోగింది అది మ్రోగగానే అందరూ లేచారు ఇంటిలోపలికి ప్రవేశించే ముందు బాబా అడీల్ వాల్కిన్‌కి తాళం చెవి యిచ్చారు తలుపు తియ్యమని. ప్రపంచ వ్యవహారాల్లో రష్యా చేతిలో తాళం చెవి పెట్టుకుని ఉంటుందని ఒకనాడు బాబా చెప్పారు అడీల్ రష్యన్ స్త్రీ గనుక ఆ మాట యిప్పుడు జ్ఞాపకం వచ్చింది.

ఇంకొకమారు యింకొక బృందానికి యిల్లు చూపించినపుడు అందరూ లోపలకు వెళ్ళే వరకూ బయట వసారాలో నిలబడి ఉన్నారు అడీల్‌తోను ఫిల్లిస్‌తోను. ఆయన వారిద్దరి చేతులు పట్టుకుని లోపలకు వస్తూండగా అడీల్ నవ్వుతూ "బాబా! మనం పెళ్ళి చేసుకున్నామా?" అంది వెంటనే బాబా ఆయన హృదయం వేపు చూపించారు.

ఒక రోజున ఎలిజబెత్ నడుపుతున్న నీలిరంగు ఫోర్డుకారులోకి అడీల్‌ని ఫిల్లిస్‌ని వెనుకసీటు లోనికి ఎక్కి కూర్చోమని బాబా పిలిచారు ఆయన ముందు సీటులో ఎలిజబెత్ ప్రక్కన కూర్చున్నారు. మిర్టిల్‌బీచ్ మెహెర్‌సెంటర్ తాళం చెవులు ఆయన చేతిలో పెట్టుకున్నారు. అవి యేడు ఉన్నాయి ఏడు భూమికలకు ఏడు తాళం చెవులులాగ ఆధ్యాత్మిక సామ్రాజ్యపు తాళంచెవులు ఆయన చేతిలో పెట్టుకున్నట్లుగా ఉన్నారు ఇలాగే అనేక మారులు షికారుకి వెళ్ళడానికి అడీల్‌ని

ఫిల్లిస్‌ని కారులో ఎక్కి కూర్చోమనేవారు ఒకమాటు వెనుకసీటులో తలగడాలనేకం ఉండగా వాటిని ఒక్కొక్కదాన్ని చేతితో తీసి బాబా వారివైపు విసిరారు.

అనేకమందికి బాబాను తమ కారులో త్రిప్పుదామని ఉండేది ముఖ్యంగా ఫ్రెడ్ వింటర్ ఫెల్డ్‌కి బాబా అతనిని తన పాత నల్లకారుని నడపమని అందులో ఎక్కుతూ "నీకు దారితెలుసునా" అని అడిగారు బాబా 'ఓ! బాగా తెలుసును. ఎన్నోమార్లు వెళ్ళానుకదా బాబా!" అన్నాడు. బాబా యింటిదగ్గరనుంచి లాగూన్ కేబిన్‌ద్వారా వెళ్ళాలి ముప్పాతిక మైలు దూరం ఉంటుంది బాబా మాయ ఏమిటో గాని ఫ్రెడ్ దారితప్పి యింక దారిలేనిచోటికి కారుని తీసుకు వచ్చాడు. ఎదురుగా చెట్లే ఉన్నాయి రోడ్డులేదు. బాబా మౌనంగా నవ్వుకుంటున్నారు బాబా మాయ కాకపోతే అతను ఎన్నిమారులు ఆ దారి వెంట వెళ్ళలేదు గనుక. ఇప్పుడు తప్పడ మేమిటి!

భోజనాల గదిలో బల్లమీద అమెరికా మాపు పెట్టుకుని చార్మియాన్‌డ్యూక్ చూస్తోంది బాబా రాగానే ఆమె "బాబా! మీరు కాలిఫోర్నియా వెళ్ళినప్పుడు నేను కారు నడపవద్దూ," అని గునుస్తూ అడిగింది బాబా అదేవిధంగా ఆమె వైపు చూసారు. ఆయన కళ్ళల్లో వద్దన్నట్లుగా ఉంది ఆయన చూపు మాపులో నగంవరకు ఆమె ఎఱ్ఱ పెన్సిలుతో మార్కు చేసినట్లు ఉంది అనుకుంది ఫిల్లిస్ కాలిఫోర్నియా కి వెళ్ళే మార్గం అది సరిగా తరువాత నగంలోనే ఓక్లహామా ఉంది. అదే ప్రమాదం జరిగిన స్థలం వరకు ఎఱ్ఱ పెన్సిల్‌తో గీసి ఉంది

ఒకమారు ఫిల్లిస్ మనసులో ఏదో చెడ్డ ఆలోచన రాగానే బాబా "ఏమిటి ఆలోచిస్తున్నావు! అన్నారు. "మీ గురించే బాబా!" అని ఆమె అబద్ధం చెప్పింది. తెలిసి ఉండి చేసిన పాపం పోవాలని బాబా ప్రేమ దానిని కడిగివేస్తుందని ఆమె తలంపు లోకి వచ్చింది.

ఒకరోజున నీకేమి కలవచ్చిందిది రాత్రి? అని బాబా ఫిల్లిస్‌ను అడిగారు. "బాబా! నాకు కలలో ఒక పెద్ద తాబేలు కనిపించింది. దాని కళ్ళు మీ కళ్ళలాగే ఉన్నాయి తరువాత పెద్దసర్పం కూడా కనిపించింది తరువాత ఒక పెద్ద చెట్టుకూడా కనిపించింది దాని పై భాగం మాత్రం నాకు కనబడలేదు దానిమీద నేను చెయ్యి

వేసాను. వేయగానే మీరే అని తెలుసుకున్నాను. అప్పుడు బాబా, "మాసావా? అన్నిటిలోనూ నన్ను చూస్తున్నావు ఏది మాసినా నీవు భయపడరాదు." అన్నారు.

ఒకరోజున, యిలా మాట్లాడుతూ బాబా "ఐవీ చాలా పని చేసింది ఇంకా చేస్తుంది" అన్నారు. తరువాత "నాకు యిష్టమయిన స్త్రీ సాధువులు — సెయింట్ తెరెసా (అవిలా) సెయింట్ కాథరైన్ (సియెనా) పురుషులలో సెయింట్ ఫ్రాన్సిస్, సెయింట్ అగస్టైన్, ఫిల్లిప తెరెసాలా ఉంది. అడీల్ కాథరైన్‌లా ఉంది" అన్నారు బాబా. వారిద్దరూ యీ నలుగురు భక్తుల జీవితాలు చదివారు. మెట్రొపాలిటన్ మ్యూజియంలో సెయింట్ కాథరైన్ విగ్రహం చూసి యీమె నాకీనాలా ఉంది అనుకున్నారు బాబా.

"పాశ్చాత్య దేశాలలో నాపని స్త్రీలచే చేయబడుతుంది" అని బాబా చెప్పారు. అందుకే స్త్రీలు ఆయన ప్రేమలో ముఖ్య పాత్ర వహిస్తున్నారు సెంటరులో ఉండగా ఒక వారం అంతా బాబా ఫిల్లిస్‌కి ఒక ముఖ్యమయిన పని యిచ్చారు—బాబా బట్టలు పరిశుభ్రంగా ఉతికి ఆరేసి యిస్త్రీ చేయడం ఆ పని చేస్తుంటే ఆమెకు ఎంతో తృప్తి కలిగింది. దేవుని బట్టలు యివి అని ఆమె తన భాగ్యానికి పొంగిపోయింది అవి ఉతుకుతూ తనలోని అరిషడ్వర్గాలను బాబా ఉతికి పోగొడుతున్నారని ఆ విధంగా తన హృదయం పరిశుద్ధం అవుతోందని ఊహించుకునేది ఫిల్లిప్ అనేక సంస్కారాలు ఆమెలోనివి యీ విధంగా క్షయం అయిపోయాయి. అనేకమంది స్త్రీలు ఫిల్లిస్‌కి వచ్చిన యీ పనిలో పాల్గొని ఆమెకు సహాయం చేస్తామన్నారు. కాని బాబా ఏపని ఎవరికి చెప్తారో వారే ఆ పని చెయ్యాలి. అలాగే బాబా 'ప్రసాదం' యిస్తే ఎవరికి యిచ్చారో వారే తినాలి లేక ఉంచుకోవాలి. బాబా ఎవరికయినా ఒక పీచ్‌గాని మరి యే పండయినా యిస్తే అది తిని దాని రుచి జ్ఞాపకం ఉంచుకుని బాబా ప్రేమను చూర గొంటున్నట్లు అనుభూతి పొందుతారు.

ఒకమారు డా॥ డాన్‌కిన్ అమెరికా సహవాస్‌కి వెళ్ళి వచ్చినపుడు అతని స్నేహితులు "బాబా నీకు యేమి యిచ్చారు?" అని అడిగారు. అతని జవాబు ఏమిటంటే "బాబా నాకు ఏమి యిచ్చారు అని కాదు చూడవలసినది, బాబా నా నుంచి యేమి తీసుకున్నారు అని" అలా జవాబు చెప్పాడు ఈ పాశ్చాత్య స్త్రీలతో బాబా అందరూ తన కుటుంబములోని వారుగా సన్నిహితంగా (బాబాతో) వారితో కలిసిమెలసి ఉంటారు.

ఒక స్పర్శతో, భుజంమీద తట్టి, అక్షరాల పలకతో తాకి, ఆయన కర్రతో ముట్టుకుని యిలా వారితో ఆడుతూ పాడుతూ ఉన్నపుడు ఆయా చేష్టలతో బాబా వారికి తగిలినప్పుడల్లా వారిలోని దుష్ట భావాలను పోగొడుతున్నారని వారు భావించేవారు. నలిగిపోయిన కాగితాన్ని సరిచేసినట్లుగా వారిలోని వంకరలను సరిదిద్ది వారి బ్రతుకు తిన్ననైన రాజమార్గంమీద పెట్టేవారు బాబా.

మిర్టిల్‌బీచ్‌లో నిప్పర్, బింజో అనే పేర్లుగల రెండు కుక్కలుండేవి. అవికూడా బాబా చేతినుంచి చాకొలెట్లు ప్రసాదం తీసుకునేవి నిప్పర్ అనే కుక్క వాళ్ళ యింటి వద్దనుంచి పారిపోయి వచ్చి మిర్టిల్‌బీచ్ మెహెర్ సెంటర్లో బాబా దర్శనంకోసం రెండేళ్ళు వేచియుంది.

ఒక రోజున భోజనశాలలో బల్లమీద ఆదీ ఏవో పుస్తకాలు పెట్టాడు. ఆదీ, ఫిల్లిస్ మొదలైనవారు అప్పుడక్కడ ఉన్నారు. ఆ పుస్తకాలు వైట్‌లైట్, సైలెంట్ రెవలేషన్స్ అనేవి ఇంతలో బాబా వచ్చి 'నీకు ఏది ఇష్టం ?' అని ఫిల్లిస్‌ను అడిగారు. 'అన్నీను బాబా' అని ఆమె జవాబు చెప్పింది. బాబాకి సంతోషం కలిగింది. ఆదీ ఏదో పనిమీద బయటకు వెళ్ళాడు. బాబా బల్లమీద నుంచి ప్రవచనాలు ఒక పుస్తకం తీసుకుని తెరిచిన 41 వ పేజీ (ఆత్మజ్ఞానం ఆర్జించుట — గురువుయొక్క ఆవశ్యకత)లోని విషయం చదవమన్నారు. ఫిల్లిస్ ఒక పేరా చదివింది. ఇలాగే యింకో రెండు చోట్ల ఆమె చేత చదివించారు

ఒకరోజున వంటింటి చీడీలమీద బాబా నిలబడి ఉన్నారు. ఫిల్లిస్ ఆయన వద్ద లోపల ఉన్నది. ఇంతలో బాబా శరీరం గాజులా అయిపోయి అందులోంచి అవతలవన్నీ ఆమెకు కనబడుతున్నాయి. తూర్పున సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. చెరువులో నీరు కదులుతోంది. చెట్లు గాలికి అల్లల్లాడుతున్నాయి. ఈ దృశ్యాలన్నీ బాబా శరీరంలోనుంచి ఆమె చూసింది. మళ్ళీ యింతలో ఆయన శరీరం ఘనీభవించింది మామూలుగా. బాబా చిరునవ్వుతో ఆమెవైపు చూస్తున్నారు. ''నేను యీ శరీరాన్ని కాదు'' అని చెప్తున్నట్టుగా. ఇటువంటి అతిలోకమయిన అనుభవాలు ఫిల్లిస్‌కి అనేకం కలిగాయి.

ఒక ప్రాతఃకాలమున ఫిల్లిస్ వంతెన దిగివస్తూంటే మార్గంలో బాబాను కలిసింది. బాబా ఆమె సమీపాన నిలబడ్డారు. ఆమెకు ఆయన ఆకాశాన్నంటుతున్నట్లు

ఎంతో పొడుగుగా కనిపించారు. ఆమెకు ఆశ్చర్యం వేసింది. స్వర్గంలో భగవంతుని కలిసినట్లుగా ఆమె ఊహించింది. "గుడ్‌మార్నింగ్ బాబా" అని మాత్రం ఆమె అనగలిగింది ఆ భగవంతుడు ఆమె కళ్ళలోకి చూసి వెళ్ళిపోయారు.

ఇంకొకమారు ఫిల్లిస్ వంతెనమీద ఒక చివర ఉండగా బాబా రెండో చివరనుంచి వంతెన దాటడానికి వస్తున్నారు. ఆమెకు వంతెన మధ్యన బాబాకు ఎదురవడం భయంవేసి వెంటనే వెనుకకు తిరిగి వంతెనదిగి తప్పుకొని ఆయనకు దారి యిచ్చింది బాబా వచ్చి వంతెనదిగి ఆయన గడ్డంక్రింద చెయ్యి పెట్టుకుని రాత్రి బాగా నిద్రపోయావా ? అని అడిగారు ఫిల్లిస్‌ని.

ఒక సాయంకాలం సరిగ్గా 5 గంటలకు లాగూన్ కేబిన్ వద్దకు అందరిని రమ్మన్నారు. బాబా సరిగ్గా 5 గంటలకు అక్కడికి వచ్చారు. ఆయన వచ్చేసరికి 5 గంటలకు అక్కడకు ఫిల్లిస్ ఒక్కతే వచ్చింది. అస్తమిస్తూఉన్న సూర్యుని బంగారు కిరణాలు ఆయన శిరస్సును బంగారుమయం చేస్తున్నాయి. ఆయన తల చుట్టూ బంగారం రంగులా గుండ్రంగా ఏర్పడింది నమ్మరానంత అందంగా ఉన్నారు బాబా. ఈ అందం చూసి ఫిల్లిస్ ఆనందం పట్టలేకపోయింది. అయ్యో ! మిగిలినవారు కూడా వచ్చి యీ ఆనందం పంచుకుంటే ఎంత బాగుండేది అనుకుంది. కొంచెం సేపయిన తరువాత నీ పద్యరచన పుస్తకం ఏదీ అని బాబా అడిగారు. ఆ మరునాడు ఆమె బాబాకి ఆ పుస్తకం తీసికొని వెళ్ళి యిచ్చింది. అది ఆయన బల్లమీద పెట్టుతున్నారు అందులో నుంచి పద్యాలు మణిచేత చదివించుకునేవారు బాబా. తరువాత బాబా ఆమెకు పుస్తకం తిరిగి యిస్తూ "ఫ్రాన్సిస్ (బ్రాబజాన్) హాఫీజ్‌లాటి కవి" అన్నారు "ఎన్నో సంవత్సరాల తరువాత ఫ్రాన్సిస్ ఆంగ్లంలో గజల్‌లు కూడా వ్రాసాడు" అని అన్నారు. తరువాత ఆమెలో ఏమయినా అహంకారం ఉంటే అది పూర్తిగా పోయింది.

మిర్టిల్‌బీచ్ నుంచి వెళ్ళేముందు ఒకనాటి మధ్యాహ్నం చాలాసేపు మాల్కంస్లాస్, జాన్‌బాస్‌వచ్చి బాబాతో గడిపారు. వారితో బాబా అనేక విషయాల గురించి సాధువుల గురించి యితరుల గురించి మాట్లాడారు. బాబా అన్నారు — "నా వద్దకు దేవుని ప్రేమికులను తీసుకురండి ; నేను వారికి ప్రణామం చేస్తాను. లేకపోతే నాకు నేనే ప్రణమిల్లుతాను."

బాబా కాలిఫోర్నియాకి బయలుదేరేందుకు ఒకటి రెండు రోజులు ముందు ఎలిజబెత్ ను ఆమె యింటికి (యూవన్‌డ్యూన్స్‌కి) తీసుకువెళ్ళమన్నారు బాబాను. ఆమె యిల్లు మెహెర్ సెంటరుకి దక్షిణంగా 8 మైళ్ళ దూరంలో ఉంది. సముద్రానికి ఎదురుగా ఉంది కొద్ది సేపట్లోనే యూవన్ డ్యూన్స్ చేరుకున్నారు బాబా. అప్పుడు బాబా ఆ యింటిలో అన్ని గదులలోకివెళ్ళి అన్నిటిలోను నడిచారు. ఎన్ని గదులున్నాయో అవి బాబా చూసారు సెంటరులో కొన్ని మార్పులు చేయించాలని బాబా అదీ తోను మెహెర్‌జీతోను కిట్టీ తోను చర్చించారు. ఇదంతా వారు తిరిగి వచ్చిన తరువాత చెయ్యాలన్నారు సెంటరులో యింతకంటె నిరాడంబరంగా జీవించాలి. ఇంతకంటె తక్కువ సిబ్బందితో అంతే సహాయం చేసేవారు, యింకంటె తక్కువగా ఉండాలి అన్నారు పప్పు అన్నం తినండి అన్నారు.ఆయన మాటలు మళ్ళీ సెంటరుకు వచ్చేటట్టుగానే ఉన్నాయి.

ఒక్కవారం తరువాత మండలి వారందరూ, స్త్రీలు, పురుషులు, సామానులు సర్దడం ప్రారంభించారు. 21 వ తేదీన మెహెర్ మౌంట్‌కి ఒక కారు ముందు పంపించారు బాబా వస్తారని ఆగ్నెస్ బోర్న్‌తో చెప్పమని బాబా రాకకి ఏర్పాట్లు చేయించమని చెప్పమని కబురు పంపించారు. ఓజై (కాలిఫోర్నియా) కి.

మే 21 వ తేదీన మధ్యాహ్నం 2-30 గంటలయింది ఇంక ఒక గంటకి మిర్టిల్ బీచ్ నుంచి బాబా బయలుదేరుతారు వర్షం జోరుగా కురుస్తోంది. ఉరుములు మెరుపులు వస్తున్నాయి ఒక స్థలం నుంచి బాబా బయలుదేరే ముందు యిలా కురవడం కొత్త కాదు. ఆ సమయంలో టోనీ వచ్చాడు. అతనితో ఒక రచన వ్రాతప్రతి తీసుకు వచ్చాడు " బాబా మౌనం ఎలా మాట్లాడుతోంది " అనే రచన టోనీ యింటివద్ద ఒకడు రచించాడు. అతని పేరు మిస్టర్ బార్‌స్లాగ్. ఇతడు మే 17 వ తేదీని బాబా దర్శనం చేసుకున్నాడు. ఈవ్యాసం ఒక పత్రికకి ప్రచురణార్థం పంపుదామనున్నాడు. అది బాబాకు చూపించి ఆయన అనుమతితో పంపుదామని టోనీ అది తీసుకు వచ్చాడు. డెలియా టోనీ తో చెప్పింది. బాబా విశ్రాంతి తీసుకుంటున్నారని; అయినా అది వారికి చూపెస్తానని తీసుకుంది. బాబా దానిని చూసారు. బాగానే ఉందన్నారు బాబా డెలియాకి అది యిచ్చి మళ్ళీ టోనీకి యిమ్మని చెప్పారు. అది తీసుకుని అతడు పత్రికా ముద్రణాలయానికి వెళ్ళాడు.

బాబా బయలుదేరే సమయం వచ్చింది. వాన వెలిసింది. సూర్యరశ్మి వచ్చింది అందరూ గెస్టుహౌస్ గేటు బయట నిలబడి ఉన్నారు సామానులన్నీ కార్లలో ఎక్కిస్తున్నారు బాబా ఎలిజబెత్ వద్దకు వెళ్ళారు. ఆమె కారు నడపడానికి ఎక్కి అప్పుడే కారులో సిద్ధంగా కూర్చుంది. బాబా ఆమెను అడిగారు — "నీ ఇన్స్యూరెన్స్ పాలసీ నీతో తెస్తున్నావా ?" అని ఆమె "లేదు బాబా - అది యూపన్ డ్యూన్స్‌లో ఉంది ఎక్కడుందో నాకు తెలుసు." అని చెప్పింది "అయితే మనం వెళ్ళేటప్పుడు యూపన్‌డ్యూన్స్ వద్ద ఆగి అది నీతో తీసుకురా" అన్నారు బాబా. ఎలిజబెత్ అది తీసుకుని ఆమె సామానులోని ఒక సంచీలోపల పైన పెట్టింది - సులభంగా తీయడానికి వీలుగా.

ఎలిజబెత్ కారు నీలిరంగు నాష్. అది ఆమే నడుపుతోంది బాబా ప్రక్కనే కూర్చున్నారు. మెహెరా, మణి, మెహెరూ వెనుకవైపు కూర్చున్నారు. సరోష్ నడిపే స్టేషన్ వాగన్‌లో కిట్టీదేవి, రానో, డా॥ గోహర్, డెలియా కూర్చున్నారు మొదటి రోజు మధ్యాహ్నం కార్లలోనే భోజనం చేసారు. చూడవలసిన చోట్లలో కార్లు ఆపి బాబా అందరికీ చూపించారు రాత్రి కొలంబియాలో (నార్త్ కెరోలినా) ఒక మోటెల్‌లో ఆగారు. రెండవనాటి రాత్రి మర్ఫీ అనేచోట (22-5-52) ఆగారు ఆ మరునాడు అంటే 23 వ తేదీ (మూడవనాడు)న రాక్‌సిటీలో క్రిస్టల్ రాక్‌వద్ద ఆగి రుబీ జలపాతం చూసారు ఎలిజబెత్ - "ఈ విధంగా మనం ప్రతిచోటా ఆగుతూంటే కాలిఫోర్నియా ఎప్పటికీ చేరుకోలేము." అంది బాబా "ఇదే ఆఖరిసారి మనం దృశ్యాలు చూడడం" అన్నారు.

23 వ తేదీ రాత్రి ఓజార్క్స్ అనే చోట పాంచ్ క్రెస్ట్‌మోటారు కోర్ట్‌వద్ద ఆగారు దగ్గరలో ఉన్న ఒక భోజన హోటల్‌కి పంపి భోజనం చేసి రమ్మన్నారు సరోష్ వగైరాలను ఆ హోటలులోనే ఉండి బాబా, మెహెరా, మణి, మెహెరూ, డా॥ గోహర్ అయిదుగురు రొట్టె పాలు కిట్టీచేత తెప్పించుకుని తీసుకున్నారు. సరోష్. డెలియా, రానో, కిట్టీలను ఉదయాన్నే హోటలుకి వెళ్ళి అల్పాహారం తీసుకు రమ్మన్నారు 23 వ తేదీ సాయంకాలం బాబా అందరినీ దగ్గర కూర్చోబెట్టుకుని, మాట్లాడారు. వారిని బాబా చాలా సంవత్సరాలనుంచి ఎరుగుదురు వారందరు అప్పటి నుంచి బాబాను ప్రేమిస్తున్నవారే. ఆ సమయంలో ఒకరి మీద ఒకరికి ప్రేమ, అవగాహన ఎక్కువగా కావాలి

## ఇది ముఖ్యమయిన రోజు :—

24 వ (మే, 1952) తేదీ ఉదయం మామూలుగానే పెందరాళే 5 గంటలకు అందరూ లేచారు. బాబా కారు, స్టేషన్ వాగన్ రెండూ బయలుదేరడానికి సిద్ధంగా ఉన్నాయి. అంతా ఆ హోటలు వద్ద వేచియున్నారు. బాబా ఎక్కమంటే కార్లలో ఎక్కడానికి సిద్ధంగా ఉన్నారు. కాని బాబా ఎందుకో ఆలస్యం చేస్తున్నారు. ఆయన గదిలోనుంచి బయటకు వస్తూ గుమ్మంలో నిశ్చలంగా కొంతసేపు నిలబడ్డారు. ముఖంలో చింతిస్తున్న రేఖ కనిపిస్తోంది. అటువంటి సమయంలో మామూలుగా వేసే ప్రశ్నలేవి వేయలేదు. బయలుదేరడానికి చాలా ఆతురత కనపరచలేదు. బాబా కోసం నిరీక్షిస్తూ ఎలిజబెత్ డ్రైవర్‌సీట్లో కూర్చుని సిద్ధంగా ఉంది. పది నిమిషాలసేపు అయాక బాబా తరువాత మెహెరా, మణి, మెహెరూ, గోహర్ వచ్చారు. వారు బాబా కారులో ఎక్కారు. బాబా ఎలిజబెత్ ప్రక్కన మిగిలినవారు వెనుక సీటులోనూ కూర్చున్నారు. తతిమ్మావారంతా నరోష్ కారులో ఎక్కారు, యిదివరకు లాగే. కొంచెం దూరం వెళ్ళిన తరువాత బాబా కారు హఠాత్తుగా ఆపారు. రోడ్డుకు ఒకప్రక్కన పైకి క్రిందికి కొంచెంసేపు పచారు చేసారు. నరోష్ కారులో వారుకూడా కారు ఆపి క్రిందికి దిగి నిలబడ్డారు. ఒక్కమాటకూడా ఎవరూ మాట్లాడలేదు. ఈ విధంగా రెండుసార్లు జరిగింది.

బాబా కారు ముందు వెళ్ళాలనీ దాని వెనుకనే నరోష్ నడిపే స్టేషన్ వాగన్ వస్తూండాలనీ ఏకారణం చేతకూడా అది మరీ వెనకపడి పోకూడదనీ బాబా స్పష్టంగా చెప్పారు. ఇలా చేయడం నరోష్‌కి కొంచెం కష్టం అనిపించింది. బాబా కారులోంచి చూస్తూనే ఉన్నారు. వెనుక కారు కనిపించకపోతే కొంచెంసేపు అది అందుకునే వరకు ఎలిజబెత్‌ని కారు ఆపమని చెప్పేవారు. లేక ముందుగానే ఆగాలని ఊళ్ళో కారు ఆపించి ఉండే వారు. 24 వ తేదీన యీ ఏర్పాటు గురించి ఎలిజబెత్ తోను, నరోష్ తోను మళ్ళీ బాబా చెప్పారు. ఎండవేడిమి ఎక్కువగా ఉంది. అంత ఎండలోనూ వెనుక కారు వచ్చేవరకూ నిలబడి ఉండడం బాబాకు కష్టంగానే ఉంది. నరోష్ తన కారు ముందు పోనిస్తాను బాబా అంటే అందుకు బాబా ఒప్పుకోలేదు. నరోష్ కారులో కిట్టీ వగైరాలు దారిలో దాహం వేస్తే కారు ఆపవచ్చునా అని బాబాను అడుగితే, "ఆపుకోండి, కాని ఆలస్యం చేయకుండా వెంటనే బయలుదేరి రావాలి" అని బాబా చెప్పారు. నరోష్ కారు చాలా వెనుకబడి పోతూ ఉంటే "ఇలా అయితే కుదరదు. ఇంక ముందు యిలా

వెనుకబడి పోవడానికి వీలులేదు. మళ్ళీ అలా చేస్తే నేను నిన్ను క్షమించను" అని తీవ్రంగా సరోష్‌తో చెప్పారు చెప్పి కారు ఎక్కి బాబా ముందుకి వెళ్ళారు కొంత దూరం వెళ్ళాక బాబా కారు ఆపించి దిగి తలవంచుకుని రోడ్డుకి కుడివైపున ముందుకి కొంతదూరం నడిచారు. అది 64 వ నెంబరు రోడ్డు కొంతదూరం అలా వెళ్ళి మళ్ళీ కారులో కూర్చున్నారు. క్రితం రాత్రి వర్షం పడింది రోడ్డు జారుగా ఉంది. రోడ్డుకి రెండు ప్రక్కలా గోతులుకూడా ఉన్నాయి బాబా కారు ఒక చిన్న కొండమీద ఎక్కి పోతూ ఉంటే ఎడమప్రక్కనుంచి ఎదురుగా యింకొకకారు ఏదో వస్తూంది. అమెరికాలో కుడిప్రక్కనుంచి రోడ్డుమీద కార్లు నడవాలి ఎలిజబెత్ కారు వేగం తగ్గించింది. ఎదురుగా వచ్చేకారు వేగంగా బాబా కారువైపుకి వస్తోంది. బాబా చేయిజాపి కారు వస్తోందని ఎలిజబెత్‌కి చూపారు. బాబా కారు నడుస్తూనే ఉంది. ఇంతలోనే ఎదుటికారు వచ్చి బాబాకారు బంపర్‌కి కొట్టుకుంది ఎలిజబెత్ ఆ కారు నడిపేవాడు తప్పించుకుంటాడు కదా అనుకుంది. తాను యింకా కుడిప్రక్కకు వెళ్ళడానికి వీలు లేదు. రోడ్డుప్రక్కన గోతులున్నాయి. అందుకోసం కారు గోతుల్లో పడకుండా నెమ్మదిగా అలాగే కారు నడిపిస్తోంది ఎలిజబెత్. ఎదుటికారువాడు బ్రేక్ వేసాడుగానీ కారు ఆగలేదు. బాబా కారుకి కొట్టుకుంది ఆకారు. ఆ కారు అడ్డంగా తిరిగిపోయింది ఆ కారు నడిపేవాడు క్రొత్తగా కొరియానుంచి వచ్చాడు. జపాన్, కొరియాలలో ఇండియాలోలాగే ఎడమవైపు నుంచి అన్నికారులు బళ్ళు నడుస్తాయి. అక్కడ వాడికి ఎడమవైపు నుంచి వెళ్ళే అలవాటు అతడు కొరియా యుద్ధంలో పనిచేసిన వాడు చాలా అనుభవం ఉన్నవాడే ఎలాగైతేనేం ప్రమాదం జరిగి పోయింది.

బాబా క్రింద పడిపోయారు. ఆడవారంతా చెల్లాచెదురుగా రోడ్డుమీద పడిపోయారు ఇంతలోకే వెనకాల కారు వచ్చేసింది. అది ఆలస్యంగా రావడానికి కారణం — సరోష్ ఒక గ్రామంవద్ద కాఫీకోసం కారు ఆపాడు. అక్కడికి బాబా కారు కనుచూపుమేరలో కనిపించడం లేదు. కాఫీలు తాగాక అందరూ కారు ఎక్కి చూస్తే బాబా కారు కన బడటంలేదు ; ఆనవాలుకూడా లేదు. అయ్యబాబోయ్ ! ఎలా కలుసుకుంటాం బాబా కారును అనుకున్నాడు సరోష్. అప్పుడు సమయం 10 గంటల 5 నిమిషాలయింది. త్వరగా నడిపించి పది నిమిషాలలో సరోష్ ప్రమాదస్థలం చేరుకున్నాడు- అప్పటికే చాలామంది ప్రజలు కూడారు. కారులోంచి ఏం జరిగినదీ తెలియడం లేదు బాబాకి చుట్టూ నిలబడి ఉన్నారు ప్రజలు. బాబా నేలమీద పడిఉన్నారు సరోష్‌చూసి అయ్యో! భగవంతుడా ! ప్రమాదం జరిగింది అన్నాడు మెరుపులా క్రిందికి ఉరికాడు. ముందుకి

వెళ్ళాడు. బాబా తల బ్రద్దలయి రక్తంతో ముఖం తడిసింది. ఆయన కళ్ళు తెరిచే ఉన్నాయి. చూపు ఎక్కడికో దూరాలకు ఏ లోకాలో చూస్తున్నట్లుంది. ఆ క్షణంలో ఆ దృశ్యం చూసినపుడు కలిగినఆవేదన యింతా అంతా కాదు. బాబా ఏ శబ్దము ఏ సంజ్ఞ చేయడం లేదు. నిశ్చలంగా భూమిమీద పడి ఉన్నారు ఎలిజబెత్ ఆమె కూర్చున్న చోటే స్టీరింగ్ చక్రం మీదపడి ఉంది. ఆమె మొదటిప్రశ్న "బాబా బ్రతికిఉన్నారా ?" అని దెబ్బలు తగలకుండా తప్పించుకున్నది మరి ఒక్కర్తే.

ఎదుటి కారులో డ్రైవరూ, యింకా యిద్దరూ ఉన్నారు. వారికి దెబ్బ తగలలేదు. ఆరోజే అతడు తనకోసం ప్రత్యేకంగా తయారుచేసిన కారు నడుపు తున్నాడు. (యుద్ధంలో తగిలిన దెబ్బలవల్ల అతనిది ఒక కాలు తీసివేసారు.) ఇంతలో ఒక కారులో ఒకతను భార్యతో వస్తున్నాడు. ఆమెను పురిటికి ప్రేగ్‌లో ఒక ఆసు పత్రిలో చేర్చడానికి తీసుకువెళ్తున్నాడు ఆ ఆసుపత్రి అక్కడికి 7 మైళ్ళ దూరం ఉంది. ఆస్పత్రికి భార్యను తీసుకుని పెళ్తున్నవాడు వెంటనే కారు ఆపి అంబులెన్సులకి కబురు చేసాడు. బాబా కారులోని వారందరూ మట్టిలోకి విసిరివేయబడినట్లు తలొకచోట పడిపోయారు. వెనకాల కారులో వచ్చిన డెలియా, రానో, కిట్టీ వీరు తమతమ కోట్లు తీసుకువచ్చి పడిపోయినవారికి కప్పారు. కిట్టీవద్ద చిన్న * తలగడ ఉంటే అది బాబా తలక్రింద పెట్టింది ఇంతలోకే అంబులెన్సు కార్లు వచ్చాయి. అందులో పడిపోయిన వారిని ఎక్కించారు. బాబాతో రానో, కిట్టీ, గోహర్ అంబులెన్సు కారులో వెళ్ళారు. నరోష్‌తో డెలియా ఫోన్ చేయడానికి కేబిల్సు పంపడానికి వెళ్ళింది.

ప్రేగ్ ఆస్పత్రి అంతా వీరికి సదుపాయాలు కలిగించడానికి తలక్రిందు లయారు. ప్రేగ్ ఆస్పత్రికి సరిగా 11 గంటలకు అంబులెన్సు చేరింది. ఆస్పత్రి సర్జన్ యొక్క స్వంతగదిలో బాబాను మంచం వేయించి పరుండబెట్టారు. ఇంక ఒకే గది ఉంటే ఎలిజబెత్, మెహెరాలు యిద్దర్నీ అందులో పరుండబెట్టారు. వీరివద్ద కిట్టీ ఉంది. బాబా వద్ద రానో, గోహర్ ఉన్నారు.

పీలయిన వెంటనే మెహెర్ మౌంట్ వెళ్ళిన మండలిని రప్పించి వారికి ఒక మోటెల్‌లో బస ఏర్పాటు చేసారు. మండలి ప్రతిరోజూ ఆస్పత్రికి వెళ్ళి

(* ఈ తలగడ యిప్పటికీ మిర్టిల్‌బీచ్ సెంటరులో ఉంది - చూడవచ్చును)

వస్తున్నారు ఈ విధంగా బాబాకు దెబ్బతగిలి ఆస్పత్రిలో చేరారని తెలియగానే ప్రేగ్ పట్టణ ప్రజలు బాబాకి పువ్వులు కానుకలు పట్టుకురావడం ప్రారంభించారు.

ఓక్లహామా నగరం సమీపంలోనే ఉంది బాబాను యితర్లను పరీక్ష చేయడానికి నగరం నుంచి ప్రత్యేక నిపుణులు అయిన వైద్యులను రప్పించారు బాబా, మెహెరా, ఎలిజబెత్‌లకు తీవ్రమయిన గాయాలు తగిలాయి అదృష్టవశాత్తు ప్రాణాపాయ కరమయిన దెబ్బలుగాని యితర చిక్కులేమీ లేకుండా పోయాయి కొద్దిరోజుల లోనే ఐవీడ్యూక్, చార్మియాన్ వచ్చారు. తరువాత మార్గరెట్ క్రాస్కీ వచ్చింది. వీరంతా బాబాకి యితరులకు సహాయం చేయడంకోసం వచ్చారు మార్గరెట్ బాబాచేత ఐసొలేషన్ మజల్ ఎక్సర్‌సైజు చేయించేది. (శరీర కండరాలకి సంబంధించిన అభ్యాసం) చార్మియాన్ బాబా బట్టలు శుభ్రపరచి యిచ్చేది

ఎలిజబెత్‌కి శరీరంలో 11 రిబ్‌లు (ఛాతీలోని ఎముకలు) విరిగాయి ఆమెకు ప్లాస్టర్‌కట్టు కట్టేసారు. పాపం ఆమె ప్రయాణీకుల చెక్కులు సంతకం పెట్టడానికయినా ఒకవేలు కూడా కదపలేకపోయింది. ఆమె చేతులలో కలం పెట్టించి మిసెస్ బర్లీసన్ x మార్కు పెట్టించింది భీమా కంపెనీకి పంపవలసిన పేపరులో. ఈమె ఆస్పత్రి శస్త్రవైద్యుని భార్య. బాబాకి మిగిలినవారికి చికిత్సచేసిన శస్త్రవైద్యుడు డాక్టర్ బర్లీసన్ ముందు అంబులెన్స్‌లో నుంచి ఎలిజబెత్‌ని తీసుకురాగానే ఆమెను పరీక్షించడం ప్రారంభించాడు ఆమెకు ఎంతవరకు దెబ్బలు తగిలాయో పరీక్షచేసి నిర్ణయించేసరికి మెహెరాను తీసుకువచ్చారు. ఆమెకు తగిలిన దెబ్బలు చూస్తూంటే డా॥ గోహర్, బాబాను చూడమని డాక్టరుతో చెపుతోంది. బాబా అంటే ఎవరో, ఆమెను అలా ఉంచి ముందు బాబాను ఎందుకు చూడాలో ఆ డాక్టరుకి ఎలా తెలుస్తుంది, అందుచేత అసలు అతడు ఆమె మాటలు అంత పాటించలేదు. అతని పనిలోనే మనసు కేంద్రీకరించాడు. చివరికి బాబా దగ్గరకు అతడు వచ్చి చూచ్చేసరికి బాబాను చూసి డాక్టర్ ఆశ్చర్యపోయాడు. ఇన్ని దెబ్బలు తగిలిన మనిషి చిరునవ్వు కనబరుస్తున్నాడేమిటి? అయ్యో! అమ్మా! అబ్బా! అని అనకుండా యితడు ఒక్కమాటయినా పలకడం లేదేమిటని రెండో ఆశ్చర్యం డాక్టర్‌కి కలిగింది. ఇతడు మాట్లాడలేడు కాబోలని డాక్టర్ అభిప్రాయపడ్డాడు. ఆయన కావాలనే మాట్లాడటంలేదని డా॥ గోహర్ చెప్పేసరికి అతని ఎముకలు సరి చేయడానికి పెంటథాల్ అనే అనాస్థెటిక్—బాధ తెలియకుండా స్పృహ పోయేందుకు

యిచ్చే మందు యిచ్చి చికిత్స చేసినపుడయినా నోటితో ఏదో అనకుండా ఉండలేదని డాక్టర్ అనుకున్నాడు కానీ అప్పుడుకూడా ఒక్క శబ్దమైనా బాబా చేయలేదని ఆశ్చర్య పడ్డాడు ఆయనకు చికిత్స చేస్తుంటే ఆ పెద్ద కళ్ళతో బాబా డాక్టరు ముఖంవైపు చూస్తుంటే డాక్టర్ మనసులో ఏమి ఉన్నదీ ఆయన గ్రహిస్తున్నారనీ డాక్టర్ అనుకునే లాగ బాబా చూపు కనిపించింది మిగిలిన వారంతా అంత భక్తితో బాబావద్ద ఉండి ఆయన సేవచేస్తూంటే బాబాలో ఏదో గొప్పతనం ఉండాలనుకున్నాడు, డా॥ బర్లీసన్. ఇంతభక్తి శ్రద్ధలకు ఆయన తగినవాడు గనుకనే వారంతా అలా ప్రవర్తిస్తున్నారు అనుకున్నాడు. బాబాను వీడి వెళ్ళిపోయిన వారికి, దర్శనం చేసుకున్న వారికి, యితరులు చాలామందికి డైలీ న్యూస్ మొదలయిన అన్ని వార్తా పత్రికలలోను ప్రచురించబడిన ప్రమాద వార్త చూడగానే షాక్ తగిలింది. అనేకమంది ప్రేగ్ హాస్పటల్‌కి టెలిఫోనుచేసారు. చాలామంది స్వయంగా బయలుదేరి డా॥ నెడ్ బర్లీసన్ యొక్క ప్రేగ్ క్లినిక్‌కి వచ్చారు బాబాను చూడడానికి. కొందరు బాబా ఎముకలు విరిగినందున సరిగా సవరించి కట్టు కట్టేరని తెలుసుకున్నారు. ఆయన మాంసం తిన్నారని కూడా తెలుసుకుని కొందరు బాబా అంతటివాడు అలా చేసాడని ఆయనంటే వారికున్న గౌరవాన్ని తగ్గించుకున్నారు ఇంతటి మహానుభావుడికి అసలు ప్రమాదం రావడమేమిటి ? ఇంక ఆయన ఏమి శక్తిపరుడు మామూలు మానవుడే అయిపోయి అన్నిటికి లోబడి పోయాడు అని ఆయనను నిందించారు ఇంక ఆయన మహానుభావుడేమిటి ! కాని అవతారపురుషుని సంగతి వారికేమి తెలుసు ? క్రీస్తుకూడా శిలువ వేయబడి హింసించ బడి మృత్యువు వాతపడినాడుకదా యిదెందుకు సంభవం కాకూడదు అని వారికి అంత వరకు ఆలోచన పోలేదు. ఈ ప్రమాదం లోని విశిష్టత వాళ్ళకి తెలియదు. ఇంత ప్రమాదం జరిగినా ఆయన మౌనానికి ఏమీ భంగం రాలేదని నోటివెంట ఒక్క శబ్దం కూడా వెలువడలేదని, ఆయన పూర్తి తెలివితోనే ఉన్నారని స్పృహపోకుండా ఉన్నారని వారికి తెలియదు. ఆ సంగతి తెలిసాక వారు బాబాను మెచ్చుకుంటూ బాబా వద్దకు వారు వచ్చారు. మళ్ళీ ఎప్పుడో సెంటరుకి వచ్చి కొన్నాళ్ళు ఉండాలని వారు ఆశించారు.

ఎలిజబెత్‌కి తగిలిన తీవ్రమయిన దెబ్బలవల్ల ఆమె యింకా నెమ్మదిగా కోలుకుంటోంది. బాబా ఆమెను ఊరికే ఉండనిచ్చేవారు కాదు. ప్రతి ఉదయం బాబా

మణిని ఆమె గదికి పంపించి ఆ రోజున ఏమిచేయాలో మణిచేత చెప్పించేవారు. ఒకనాడు బాబా వారి చక్రాల కుర్చీలో కూర్చుని ఎలిజబెత్ గదికి వచ్చారు అప్పుడు కిట్టీని కూడా రమ్మని కబురుచేసారు బాబా కిట్టీని మిర్టిల్‌బీచ్‌లో నీవు ఉండిపోతావా అని ఆమెను అడిగారు. ఇండియాకు వారితో వెళ్ళకుండా ఉంటావా అని, ఉండి ఎలిజబెత్‌కు సహాయం చేస్తావా అని అడిగారు ఎలిజబెత్ కొద్ది దినాలు దెబ్బలనుంచి కోలుకుంటోంది ఎలిజబెత్‌కి, ఆస్పత్రినుంచి అక్కడ హృద్రోగానికి చికిత్సపొంది యింటికి రాబోయే నొరీనాను సహాయం చేయమన్నారు బాబా. ఏమీ సంకోచం లేకుండా "అలాగే బాబా"! అని ఆమె జవాబు యిచ్చింది

బాబా కిట్టీకి యిచ్చిన పనులలో మొదటిది ఎలిజబెత్‌కు నొరీనాకు సహాయం చెయ్యాలని. ఎలిజబెత్‌కు ప్రమాదంలో దెబ్బలు తగిలాయి నొరీనా హృదయం జబ్బుతో బాధ పడుతోంది. ఆమెకు అలసట కలగకూడదు రెండవది సెంటరులో పని చెయ్యాలి కేబిన్‌లు బాగా ఉంచడం మొదలైన పనులు మరునాడు బాబా కిట్టీని ఎలిజబెత్ గదికి పిలిచి నిన్న చెప్పినసంగతి బాబా ఎలిజబెత్‌కి చెప్పమన్నారు (ఇక్కడే ఉండిపోవడం సంగతి) ఆమె "కొద్దినెలలా బాబా?" అని అడిగింది. బాబా "బహుశా ఒక సంవత్సరం" అన్నారు "నీవు నేను వచ్చేవరకు ఉండాలి" అన్నారు. ఒక సద్గురువు సేవలోను అవతారపురుషుని సేవలోను అనుకోని పనులకు సిద్ధం కావాలి.

బాబాను వదలి అంతకాలం ఎలా ఉండడం అంటే ప్రతివారూ బాబాకు దగ్గరగానో దూరంగానో ఉంటారు. అంటే వారున్న ప్రదేశాన్నిబట్టి వారు బాబావద్దకు వెళ్ళాలంటే ఎన్ని రోజుల్లో వెళ్ళగలరు? ఎంతదూరం ప్రయాణం చేయగలరు? సముద్రాలు దాటాలా అని కాదు చూడవలసినది. మనం హృదయంలో ఆయనకు ఎంతవరకు చోటిచ్చాము. ఎంత తరచుగా ఆయన్ని మనం తలుచుకుంటున్నాము? బాబా ప్రేమ ఎంతవరకు మనమీద పనిచేస్తోంది అని చూసుకోవాలి. ఎన్నో వేలమైళ్ళ దూరంలో ఉన్నా ఆయన మనకి సన్నిహితంగానే ఉంటారు, ఎప్పుడూ మన హృదయంలో ఆయనను తలుచుకుంటూ ఉంటే. కిట్టీడేవిని మిర్టిల్ బీచ్‌లో బాబా ఉండిపొమ్మన్నారు. ఇరవై సంవత్సరాలు బాబాతో ఇండియాలో ఉన్నమనిషి యిలా యిప్పటినుంచి ఆయన వియోగం సహించడం కష్టమే అయితే యిండియాలో ఉండే అవకాశం లేనపుడు మిర్టిల్ బీచ్‌లో ఉండడమే ఆమెకి యిష్టం, ఎందుచేతంటే బాబా "నా హృదయాన్ని యిక్కడ వదలి పెట్టాను" అన్నారు, మిర్టిల్‌బీచ్ సెంటరులో.

ఎలిజబెత్ వంటి నిర్మల హృదయం కల బాబా ప్రేమికురాలుతో ఉండడం తన అదృష్టం అనుకుంటే కిట్టీ బాబా ప్రేమికుల మధ్యలో బాబా వెంబడినే ఉండడం యింకా అదృష్టం ఆమెకు

డా॥ నిల్సన్ ఆ ఆసుపత్రిలో 13 రోజులున్నారు బాబా మిగిలినవారితో 14వ రోజున అంబులెన్సులో మిర్టిల్ బీచ్‌కి వెళ్ళారు. ఆయన వెంబడికి వెళ్ళాక యూదన్ డ్యూక్స్‌కి వెళ్ళారు ఎలిజబెత్‌ను ఆమె స్వగృహంలో చేర్చారు అది ఉన్న రోడ్డు ఓషన్ బూల్‌వార్డ్ అంటారు ఈ మోటారు ప్రమాదం సందర్భంలో యింకో సంగతి పాఠకులకు జ్ఞాపకం చెయ్యాలి ఆ రోజుకి (24-5 52) సరిగా 20 సంవత్సరాలకి వెనుక అమెరికాకు వచ్చినపుడు హడ్సన్ నదీతీరాన ఉన్న హార్మన్ అనే గ్రామంలో బాబా బసచేసారు 24-5-32 వ తేదీన బాబా ఎలిజబెత్‌తో షికారువెళ్తూ ఒక పొలంలో నడుస్తూ దారిప్రక్కన ఉన్న చెట్టునుంచి ఒక పువ్వు కోసి ఎలిజబెత్‌కి యిచ్చి ఆమెతో బాబా—"ఈ పువ్వు దాచుకో ఈ వేళ తారీకు వ్రాసి ఉంచుకో దీని విశిష్టత నీకు ఏనాడు తెలుస్తుంది" అన్నారు అదే తారీకున అనగా మే 24 వ తేదీన బాబా 20 ఏళ్ళ తరువాత ఎలిజబెత్ కారులో వెళ్ళడము, ఆయనకి ఆమెకి బలమయిన దెబ్బలు తగలడము సంభవించింది. అవతార పురుషుని పనిలో ఎలిజబెత్ పూర్తిగా పాలు పంచుకుంది. ఆయన బాధను ఆమె పంచుకుంది. ఓక్లహామాలో బాబాకు చికిత్స చేసిన డా॥ నెడ్‌బర్గ్‌సెన్ జూన్ మొదటివారంలో బాబాకు యీ విధంగా తను వ్రాసిన ఉత్తరంలో వ్రాసాడు.

" మీరూ, మీ పరివారమూ క్రీస్తు బోధలను ఆచరణలో పెట్టడం మేము చూసాము. అనేకమంది అమెరికనులు చెప్తారే కాని ఎప్పుడూ ఆచరణలో పెట్టడం అరుదు. మీతో ఉన్న పరివారమంతా మీకు ఎంత వినయ విధేయతలతో, ఎంత భక్తి గౌరవాలతో ఉన్నారో మేము చూసినపుడు అదంతా మీకు తగినట్టుగానే ఉందని మేము అనుకున్నాము. అంత భక్తి బలవంతంగా తెచ్చిపెట్టుకుంటే రాదు. అది మీ యెడల వారికి ఉన్న ప్రేమవల్లనే సాధ్యమయింది అంతమంది వారి ప్రేమను ఆచరణలో పెట్టి చూపించడం నిజంగా మాకు ఆశ్చర్యాన్ని కలిగించింది నిజంగా అది నమ్మడానికి వీలులేనంతగా ఉంది మా కృషిని మీ మోస్తరుగా మెచ్చుగోవడం మాకు అలవాటులో లేదు మీరు అంతగా మమ్మల్ని మెచ్చుకుంటూంటే ఆ మెప్పుదలకి మేము అర్హులము కాదేమో అనిపిస్తోంది మాకు ఎందుచేతంటే మా లోపాలు మా బలహీన

తలు మాకు తెలుసును మీరు వ్రాసిన విధంగా మా కృషి మీకు సంతోషప్రాయ మయింది....”

ముందుగా ఎలిజబెత్ యొక్క బంగళా తగినట్లు తయారు చేయటానికి డా॥ డాన్‌కిన్‌ను రానోని పంపించారు బాబా. మణి, గుస్తాద్‌జీ, మెహ్రా, డెలియా లను ఆదీ (సీనియర్) కారులో తీసుకువెళ్ళాడు. రెండు అంబులెన్సు కారులలోను ఒక దానిలో బాబాను, రెండవదానిలో ఎలిజబెత్, మెహెరాలను తీసుకువెళ్ళారు వారితో కిట్టీ, మార్గరెట్ సరోష్‌లు వెళ్ళారు రాత్రింబగళ్ళు ప్రయాణం చేసి 1500 మైళ్ళు మళ్ళీ వెనక్కి వెళ్ళారు మెహెర్‌జీ, నీలూలు ఎలిజబెత్ బంగళా యూపన్‌డ్యూన్స్‌లో బాబాని పరివారాన్ని కలిసారు వారంతా బాబాని ప్రతిరోజూ వచ్చి చూసేవారు. ఆయనకి బాధ ఎక్కువగా ఉన్నా ఆయన ఆరోజుకారోజు నయంగా ఉంటున్నారు జూన్ 13 వ తేదీన బాబా వారి ప్రేమికులకు ఒక సర్క్యులర్ లేఖ పంపించారు.

“నాకు వ్యక్తిగతంగా ఒక విపత్తు కలుగుతుందని నేను కొన్ని సంవత్స రాలుగా చెప్తున్నాను అది ఆఖరికి రానేవచ్చింది అది అమెరికాలో కారులో వెళ్తూంటే జరిగింది అందువల్ల నాకు ముఖానికి దెబ్బలు, ఒక కాలు విరిగిపోవడం, ఒక చెయ్యి విరిగిపోవడం, అందువల్ల మానసికంగాను శారీరకంగాను అమితమయిన బాధ కలిగింది. అది అమెరికాలో జరుగవలసి ఉండినది భగవంతుని ఇచ్ఛ అలా ఉంది ” అజ్ఞానాంధకారములో ప్రపంచ మాయా మోహజాలంలో పడి కొట్టుకుంటున్న ప్రజానీకం చేసే పాపాలయొక్క ఫలితాలను బాబా తన మీదకు వేసుకుని లోక కళ్యాణం కోసం యీ విధంగా తనరక్తాన్ని అమెరికా గడ్డమీద చిందించి ఆ బాధలను అనుభవిస్తున్నారు.

క్లిష్టమయిన స్వేచ్ఛా జీవితంలో బాబా నవ్యజీవిత సర్క్యులర్ పంపించారు. అందులో బాబా చెప్పారు — జూలై 10 వ తేదీ వరకు బలహీనత బలాన్ని అధిగ మిస్తుంది బంధనాలు స్వేచ్ఛను అణగద్రొక్కుతాయి గాని జూలై 10 వ తేదీ నుంచి నా సంపూర్ణస్వేచ్ఛా జీవితంలో శక్తి విజృంభించి బలహీనతను జయిస్తుంది. స్వేచ్ఛ విజృంభించి బంధనాలను అణగద్రొక్కుతుంది. తరువాత నవంబరు 15 వ తేదీ నుంచి నా జ్యోతిర్మయ స్వేచ్ఛా జీవితంలో బలాబలాలు, స్వేచ్ఛా బంధనాలు అన్నీ దివ్య ప్రేమాగ్నిలో దహించబడతాయి” అని బాబా చెప్పారు. పురుష మండలి

వారు వెంటరుకు వచ్చి వారంతటవారు కావలసినవి చేసుకుంటూ ఉంటున్నారు కిట్టీ వంటయింటిలో వారికి వెస్సీకి సహాయం చేస్తోంది పగలు పురుషమండలివారు బాబాను చూడడానికి యూపరేడ్యాన్స్‌కి వెళ్ళేవారు ప్రతి రాత్రి డాక్టరు నీలూ అక్కడ పనిచేస్తూ ఉండేవాడు తరుచుగా పగలు కూడా అతడు పని చేసేవాడు దాదా సరోష్‌కి అడికి పనిచెప్పి వేయిస్తూ ఉండేవారు ప్రతిరోజూ సరోష్ చెయ్యవలసిన పనులలో ఒకటి కిట్టీని బజారుకు తీసుకుని వెళ్ళి ఆహార పదార్థాలు కొనడం. బాబా 11 గంటల ప్రాంతంలో భోజనం చేయడం అలవాటు పరిస్థితులను యింకా చిక్కుపరచడానికి ఎంత తీవ్రమైన వేడిగాడ్పులు వీచుతుండేవి ఇండియాలో కంటె వేడిగా ఉందని మండలి అనుకునేవారు. బహూశా అందుకు ఒక కారణం పాశ్చాత్యదుస్తులు వారు ధరిస్తూన్నందువల్ల కావచ్చు గుస్తాద్‌జీ షర్టుమీద వేస్టుకోటు ధరించేవాడు కోటు, హాట్ గదిలో ఎక్కడో తగిలించేవాడు ముఖాన్ని చెమట కారిపోతుంటే తుడుచుకునేవాడు. గుస్తాద్‌జీ చిరునవ్వు లొలికించే కన్నులు, గులాబీరంగు దవడలు, ఎప్పుడూ సంతోషంగా ఉండే వైఖరి ముఖ్యంగా బెస్సీకి బాగా నచ్చేవి అతడు 25 ఏళ్ళనుంచి మౌనంగా ఉంటున్నాడు అతడు వంటయింటి ద్వారం వద్దకు వచ్చి నిలబడి ఉండేవాడు బెస్సీకి అర్థమయేది అతనికి ఆమె ఒక గ్లాసుడు చల్లని నీరు అందిచ్చేది. మండలిని టీ కాకుండా తీయని పానీయాలు కూడా త్రాగనిచ్చేవారు బాబా. బాబా వారికి రోజుకి రెండు డాలర్లు భోజనం ఖర్చుకింద యిచ్చేవారు మండలి వారి యిష్టమయిన చోట భోజనం చేయవచ్చునని చెప్పేవారు బాబా గుస్తాద్‌జీ కొంచెమే ఖర్చుచేసి ఉడికించిన ఒక గ్రుడ్డు యింకా ఏదో కొద్దిగా తినేవాడు. అతడు ఆదా చేసిన డబ్బుతో తనకి బట్టలు కొనుక్కుందామనుకున్నాడు

బాబాకు తగిలిన దెబ్బలవల్ల ఆయన చాలా బాధపడుతూండడం వల్ల ఎవరినీ ఆయనను చూడడానికి వెళ్ళనిచ్చేవారు కాదు. అయినా జూన్ నెలాఖరున బాబా మెహెరాను మణిని వెంటరు చూడడానికి తీసికొని వెళ్ళారు వారు వెంటరుని చూసి తిరిగి వచ్చారు. జూన్ 17 వతేదీని మిర్టిల్ బీచ్‌లో బాబా యీక్రింది సందేశాన్ని సూఫీలందరకూ యిచ్చారు_

“మెహెరా బాబాకు ఇస్లామ్ తోను సూఫీమతం తోను సమంగా సంబంధం ఉంది క్రిస్టియన్ మతం తోను, గుప్త విద్యతోను, ప్రాచ్య దేశాలలోని వేదాంతం తోను, పరివ్యాప్తమైన బౌద్ధమతంతోను, ఆచరణయోగ్యమయినజొరాస్ట్రియనిజమ్‌తోను

జైనమతంతోను, దివ్యసత్యప్రభోదకమయిన మతాలన్నీ ఒకేదివ్యత్వానికి దారితీస్తాయి గనుక బాబాకి అన్నిటితోను సంబంధం ఉంది బాబా నిస్సంగుడై యుండి యీ మతాలన్నిటికీ అతీతంగాను అనాసక్తుడై కూడా ఉన్నారు ఈ వివిధ మతానుయాయులందరినీ మేలుకొలుపుతారు. ఆయన మతాలన్నిటినీ సంస్కరించాలని ఉద్దేశంతో ఉన్నారు. అందుకే ప్రాచ్య పద్ధతిలో సూఫీజంను సంస్కరించారు అది విశ్వవ్యాప్తంగా అవలంబించేలా చేసారు ''

మెహెర్ సెంటర్‌లో ఒకనాటి ఉదయం _ అప్పుడు నోరీనా, యింకా నలుగురైదుగురు అక్కడ నివసిస్తున్నారు_బాబా వారి శిష్యులను వారి యింటి ముందు పోర్టిలోకి పిలిచి వారు వచ్చాక అక్షరాల పలకమీద మణి బాబా ఏమంటున్నారో చెప్పింది___సెంటరులో ముందు చెయ్యవలసిన పని గురించి చెప్పారు అయిదు విషయాలు పేర్కొన్నారు బాబా ___

(1) అభివృద్ధి చెందిన ఆత్మలకు ఒక గృహం
(2) సాధువుల సదనం
(3) ధ్యానం కోసం ఏకాంత గృహం
(4) క్లేశాలు కలిగినవారికి విశ్రాంతి స్థలం
} ఇవి నిర్మించుట

(5) నిస్వార్థ సేవ చేసే కార్యకర్తలకి శిక్షణ యిచ్చే ఏర్పాటు మానవకోటికి నిజమైన సేవ చేసేలా వారిని తయారు చేయడం

బాబా, ఎలిజబెత్ వగైరాలు ఓక్లహామా నుంచి మిర్టిల్‌బీచ్‌కి వచ్చినరోజునే డాక్టర్ వాప్‌మన్ (ఎలిజబెత్ సోదరుడు) ఎలిజబెత్‌కు శుశ్రూషచేసేందుకు ఒక నర్సును పెట్టాడు. ఆమెపేరు శాడీ మార్టిన్. ఆమెకు సేవ చేస్తూండగా ఒకరోజున నర్సు వెళ్ళిపోతూంటే "మేడమీద బార్బరా వరున్నది చప్పుడు చేయకుండా వెళ్ళు" అని శాడీకి చెప్పారు. బార్బరా ఎవరో ఆ నర్సుకి తెలియదు ఆమె కూడా మోటారు ప్రమాదంలో దెబ్బతిన్న మనిషే కాబోలు అనుకున్నది తరువాత శాడీ ఎలిజబెత్ గదిలోనుంచి మంచి గాలికోసం కాస్సేపు బయటకు రాగా ఆ వసారాలో ఎండలో నిలబడియున్న బాబాను ఆమె చూసింది అంతకుముందు అక్కడ ఉన్న యువతులు బాదా, బాబా అని పిలుస్తూండడం, అనడం విన్నది శాడీమార్టిన్- అప్పుడు బార్బరా అంటే మగవాడు కాబోలు యీయన అసాధారణమయిన వాడు కాబోలు అనుకుంది బార్బరానే బాబా

అంటారనుకుంది. ఆయన కళ్ళు మాస్తే చమత్కారం ఉట్టి పడుతోంది వాటిలోనుంచి. అప్పుడు బాబా ఆమెవైపు చేయెత్తారు ఆమెవైపు చిరునవ్వు నవ్వారు. ఆమె కూడా బాబాకు తిరిగి నమస్కారం చేసింది

తరువాత ఆమె బాబాను అనేకసార్లు కలిసింది. ఆయన అనేక విధాలుగా ఆమెనర్సు పనిలో ఆమెకు సహాయం చేస్తున్నట్లుగా ఆమె భావించింది ఒక రోజున నర్సు శాడీమార్టిన్‌ను పిలిచి బాబా — 'మిసెస్ పాటర్సన్ ఎదురుగా నిన్ను నేను కోప్పడితే నీవేమైనా అనుకుంటావా?" అని అడుగగా "అనుకోను బాబా !" బాబాను ఆమె అర్థం చేసుకున్నట్లుగా జవాబిచ్చింది తరువాత బాబా చెప్పగా ఎంతో కష్టం మీద ఎలిజబెత్ మేడమీద నుంచి క్రిందకి దిగింది బాబా అక్కడ ఉన్నారు అప్పుడు బాబా శాడీతో ఎలిజబెత్‌కి కొంచెం శరీర పరిశ్రమ కావాలి అది కలిగేలా చూడు అన్నారు పక్కమీద నుంచి లేచి ప్రతిరోజూ కొంచెం నడవాలి అన్నారు బాబా చెప్పినదానికి ఎవరూ ఎందుకు అని ప్రశ్న వెయ్యకుండా అలాగే అని అంగీకరించారు. అది లగాయతు నర్సుకి ఆమె చేతిలో ఉన్న రోగి ఎలిజబెత్ మీద అపూర్వమైన ప్రేమానురాగాలు కలిగాయి బాబాను కలుసుకుందామని ఎంతోమంది ఉవ్విళ్ళూరుతున్నారు బాబాను చూసి చాలా రోజులయిందని వారు బెంగపెట్టుకున్నారు. ఈ సంగతి ఆయనకు తెలియపరచగా వారు తిరిగి ప్రయాణం చేసేటపుడు న్యూయార్క్‌లో 3 రోజులుంటానని అప్పుడు చూడవచ్చునని బాబా కబురుచేసారు అయితే ఎవరూ బాబాని ప్రశ్నలు వేయకూడదన్నారు. బాబా పరివారంతో బయలుదేరి న్యూయార్క్ వస్తున్నట్లు అక్కడ 18 మందికి ఒక వసతిగృహం చూడాలని న్యూయార్క్ నుంచి అర్ధగంట ప్రయాణం చేసే దూరంలో ఉండాలని ఆ యింటికి ఒకతోట ఉండాలని ఆ తోటలో ఉండగా దగ్గర యిళ్ళలో నుంచి తోటలోకి చూడడానికి వీలులేకుండా ఉండాలని కబురుచేసారు కిట్టీద్వారా. హార్ట్స్‌డేల్ (స్కార్స్‌డేల్) అనే ఊరిలో కేటీ ఫెర్రిస్ అనే స్నేహితురాలుందని ఒక ప్రేమికురాలికి జ్ఞాపకం వచ్చింది. కేటీ కూడా బాబా గురించి ఒకమారు విని ఉంది. ఆమె యిల్లు పెద్దది అందమైనది ఆ ప్రేమికురాలు (ఫిల్లిస్ ఫ్రెడెరిక్) హార్ట్స్‌డేల్ స్నేహితురాలిని కలుసుకుని మాట్లాడింది.

"నీ యిల్లు రెండువారాలపాటు మెహెర్ బాబాకి అద్దెకిస్తావా?" "అలాగే యిస్తాను" అని ఆమె చెప్పగానే బాబాకి వ్రాసి ఆయన అంగీకారం బడసింది ఫిల్లిస్— ఒక్క షరతుమీద. బాబా ఫిల్లిస్‌ను స్వయంగా వెళ్ళి బాబా అందులో ఉండేందుకు

అన్ని ఏర్పాట్లు చేయాలన్నారు తన స్నేహితురాలి యింటి విషయాలు ఫిల్లిస్‌కి చేతకాకపోయినా బాబా ఆజ్ఞ శిరసావహించింది పైగా ఆమెకి న్యూయార్క్ నగరంలో ఉద్యోగం ఒకటి చూచుకోవాలి హార్ట్సుడేల్‌కి అరగంట ప్రయాణం చేయాలి కూడాను ఎలాగయితేనేం తెలిసిన వారంతా సహాయం చేసారు బాబాకి పరివారానికి ఒక వంట, మనిషిని ఒక పరిచారికను కుదిర్చింది బాబా మండలిలో వారిలో కొంతమంది యింకా జబ్బుగానే ఉన్నారు గాన ఫిల్లిస్ వారికి కావలసిన సదుపాయాలు, మంచాలు, పరుపులు పంఖాలు మొదలయినవన్నీ అమర్చింది బాబా పరివారంతో కూడా జూలై 15 వ తేదీనాడు హార్ట్సుడేల్‌కి వచ్చారు ఫిల్లిప్ ఆయనకి ప్రేమతో స్వాగతం యిచ్చింది. మిసెస్ ఫెర్రిస్ (యింటి యజమానురాలు) తాళం చెవులు యిచ్చి బాబాకు జోహారు చేసింది బాబాకు కుడికాలు, కుడిచెయ్యి కట్లు కట్టబడి ఉన్నాయి. మెహెర్జీ, ఆదీ బాబా కోసం చక్రాల కుర్చీ కారులోంచి తీసి అమర్చారు అందులో కూర్చుని "ఏమీ దుఃఖం చెందకు," అని బాబా ఫిల్లిస్‌కి సైగ చేసారు. ఆమె సమాధాన పడింది — బాబా మిర్టిల్‌బీచ్‌లో చెప్పినట్లుగా — "భగవంతుడు, శిలువ వేయబడినపుడు కూడా, ఎప్పుడూ సంతోషంగానే ఉంటాడు, తేలకయిన హృదయంతో" అని. ఫిల్లిప్ ఏర్పాటు చేసిన మంచంగాక యింకొక దానిమీద బాబా పడకకి తగిన ఏర్పాట్లు చేసారు మండలి. బాబా కాలు చెయ్యి, ఎలా పెట్టుకుంటే ఆయనకి సుఖంగా ఉంటుందో గమనించి, అది చూసి ఆస్పత్రి మంచం ఒకటి తెప్పించవలసిందనుకుంది ఫిల్లిస్ – ఈ యింటికే కేటాయింపుగా ఉన్న తోటలోకి బాబా వారి స్త్రీ మండలి వెళ్ళారు. బాబా చక్రాల కుర్చీలో వెళ్ళారు వీరికి వీలుగా చుట్టుప్రక్కల ఉన్న మూడు యిళ్ళవాళ్ళు సెలవులకు ఊళ్ళకి వెళ్ళారు. బాబా యిదివరకులా లేరు వారి ఆకారంలో ముఖంలో కొద్దిమార్పు వచ్చింది. మోటారు ప్రమాదంలో ముక్కు చితికింది. ముందరి పళ్ళు ఊడిపోయాయి. అయినా ఆయన అందానికి ఏమీలోపం రాలేదు. బాబా అక్షరాల బోర్డుమీద "అమెరికా నారక్తం కోసం చాలాకాలం నుంచి నిరీక్షిస్తోంది" అన్నారు అమెరికాలో నారక్తం. చిందించవలసిన అగత్యం ఉన్నదని బాబా యిదివరకు రెండుమారులు చెప్పారు. అంతా ఆయన ఇచ్ఛప్రకారమే జరిగింది. బాబా ఉన్నట్లుండి "వింటర్ ఫెల్టు అని అక్షరాల పలకమీద చూపించారు తరువాత కొంచెం సేపటికి ఫ్రెడ్ వింటర్‌ఫెల్ట్, ఎల్లా వింటర్ ఫెల్ట్ కారులో వచ్చారు వారు బాబాను ప్రమాదం తరువాత యిదే చూడడం బాబాను చూడగానే "బాబా! ఇది జరగవలసి ఉందా?" అని అడిగారు. బాబా "జరుగవలసి

ఉంది గనుకనే జరిగింది" అన్నారు. వారినవుడు బాబా పాదాలమీదపడి యేడ్చారు. బాబా వారిని లేవమని సంతోషంగా ఉండండి అని చెప్పారు.

ఫిల్లిస్ వద్ద చప్పుడు చేయని కొత్తచెప్పుల జోళ్ళు ఉంటే అవి బాబాకి యిచ్చింది. ఏడవ నెంబరు ఆమె సైజు. అది బాబాకి సరిపోతుంది కానీ కుడికాలుకి తాకిగి తీసేసి "నీవే ఉంచుకో" అని బాబా తిరిగి యిచ్చేసారు అంతట ఆమె ఆధ్యాత్మిక మార్గానికి తాను తగలేదని అనుకుంది.

ఆరోజు మధ్యాహ్నమే బాబా ఫిల్లిస్‌వైపు చూస్తూ కుడిచేతి బొటనవ్రేలు చూపుడు వ్రేలు కలిపి ఒక వలయం చేసి "నీవు నా 102 శాతం ప్రేమికురాలవు" అన్నారు అన్నారు బాగానే ఉంది గాని ఎందుకిలా పొగుడుతున్నారో అందులోని రహస్యమేమిటో అని ఆమె భయపడుతోంది.

మెహెరాకి మోటారు ప్రమాదం వల్ల కంటిదృష్టికి ఏదోలోపం జరిగింది. ఒకనాడు బాబా ఆమెకు యిష్టమని గుర్రాలను చూడడానికి తీసుకువెళ్ళారు. ఆవిడకు గుర్రాలంటే చాలా యిష్టం వాటిని ఆతురతతో చూస్తుంటే ఆవిడ కంటిచూపు ఎప్పటిలా సరిగా వచ్చేసింది బాబా కారులో వెళ్ళారుకదా. కారులో కూర్చున్న బాబాను చూసింది ఒక గుర్రం అది పొలం అవతల కొంతదూరంలో ఉంది. ఆ గుర్రం పొలానికి అడ్డంగా పరుగెత్తుకుని వచ్చి కారు కిటికీలోకి కాళ్ళు పైకెత్తి బాబాని స్పృశిద్దామని ఆరాటపడుతోంది బాబాను గుర్రం గుర్తించి ఆయన దర్శనంకోసం ఆయన స్పర్శ కోసం ఒక జంతువు యింత తహతహ లాడిందంటే బాబా "నేను విశ్వంలోని మానవులకోసమేకాదు అన్ని జీవాలకోసమూ వచ్చాను." అన్న మాటలోని అర్థం మనకు అవగాహన అవుతుంది.

ఆ తరువాత రోజుల్లో న్యూయార్క్ నగరంలో ఐవీడ్యూక్ నివాసస్థల మయిన పడమట 68 వ వీధిలో చాలామందికి జూలై 18, 19, 20 తేదీలలో బాబా దర్శనం యిచ్చారు. అప్పుడు వేసంగి ఎండ ఎక్కువగా ఉంది. వేడి 90 డిగ్రీలకు మించింది. బాబాకి చెయ్యికాలు కట్టుకట్టి ఉన్నందువల్ల ఆయనకి చాలా యిబ్బందిగా ఉంది. అందుచేత మంచుగడ్డలు తెచ్చి వాటిమీద నుంచి ఫాన్‌లు పెడితే బాబాకి కొంత చల్లదనం కలిగింది బాబా చొక్కా తీసివేసి కూర్చునే వారు మామూలు సమయాల్లో.

మొదటి దర్శనం కార్యక్రమం రోజున మూడు గార్డెనియా పుష్పాలు ఒక రిబ్బన్‌లో కట్టి బాబాకోసం తీసుకువచ్చి ఫిల్లిస్ ఆయన తలమీదపెట్టి బాబాను ఎదను వదిలమీద ముద్దుపెట్టుకుంది బాబా ఆమెను చూసి నవ్వారు ఆమె ప్రేమను గూర్చి సంతోషించారు. ఆ రోజున చాలామంది మొదటిసారిగా బాబా దర్శనం చేసుకున్నారు. వారిలో మిర్టిల్‌బీచ్‌కి వెళ్దామనుకుని వెళ్ళలేనివారు చాలామంది ఉన్నారు అవతార పురుషుడు వారికి యింకొక అవకాశమిచ్చి రప్పించుకున్నాడు. అయినా కొందరు యీ సారి కూడా రాలేకపోయారు. జీన్ ఏడ్రియల్ ఫ్రాన్స్‌నుంచి వచ్చి బాబా దర్శనం చేసుకుంది.

మూడు రోజులు వెళ్ళాయి అనేకమంది బాబా దర్శనం చేసుకున్నారు. రానివారిని తలచుకుని విచారిస్తున్నారు వారి స్నేహితులు ఫిల్లిస్ కూడా కొందరిగూర్చి విచారిస్తూంటే "నేను రావాలనుకున్నవారెవరో వచ్చారు, చూసారు, వెళ్ళారు. నీవు రాలేనివారికోసం ఎందుకు విచారిస్తావు, విచారించకు" అన్నారు బాబా. కావాలనుకున్నా కొందరు బాబాతో వేరేగా సంభాషించలేకపోయారు.

బాబా న్యూయార్క్‌కి వెళ్ళినపుడు చాలామంది ఆయనను దర్శించినందుకు బాబా చాలా సంతోషించారు అనేకవందలమంది వచ్చి ఆయనను కలినారు ఇంకొక రోజు మధ్యాహ్నం కావ్‌ఒలో షైడ్స్ (ఈమెకు పారిస్‌లోనే కాక న్యూయార్క్‌లో కూడా యిల్లు ఉంది) అనే ఆమె యింటిలో ఆమె స్నేహితులు 40 మందికి దర్శనం యిచ్చారు. పారిస్ వెళ్ళినపుడు బాబా ఆమెకు అక్కడ ఉన్న యింటిలో ఒకమారు దిగారు హార్ట్స్‌డేల్‌లో డార్విన్‌షా, ఫ్రెడ్ వింటర్‌ఫెల్ట్, జాన్‌బాష్‌లు బాబాతో ఉండగా, భవిష్యత్తులో అచిరకాలంలోనే ప్రపంచంలో ఒక పెద్ద ఉపద్రవం వచ్చి అనేకమంది చనిపోతారు అని బాబా చెప్పారు. "బాబా! ఈ వినాశనం మానవ నిర్మితమా? దైవనిర్మితమా!" అని ఫ్రెడ్ బాబాను అడిగాడు. బాబా అందుకు రెండూ కూడాను అని బాబా జవాబు చెప్పారు. స్కార్స్‌డేల్‌లో ఉండగా ఒక ఉదయం గేబ్రియల్ పాస్కల్ అనే ఫిలిం నిర్మాత హాలివుడ్ నుంచి వచ్చి బాబాను కలిసాడు. వారు పాస్కల్ తీయబోయే 'మహాత్మా గాంధీజీ జీవితం" అనే ఫిలిం గురించి మాట్లాడారు ఆ ఫిలింకు ఆధ్యాత్మికమయిన వాతావరణం ఉండాలి గనుక అది ఇండియాలో తీయమని బాబా సలహా యిచ్చారు

ఒక శనివారం ఉదయం బాబా ఐవీడ్యూక్స్ యింటికి వెళ్ళేసరికి అనేక మంది బృందాలుగా వచ్చి వారాసు చూశారు. డార్బరామహన్ బాబాను రెండవసారి న్యూయార్క్‌లో చూసింది. బాబా పిలుపుకోసం ఆమె వేచి ఉంది. అలా కూర్చుని ఉండగా మార్గరెట్ క్రాస్క్‌ఆమెని బాబావద్దకు ఆమెను పంపించింది. ఈమాటు బాబాను ఆమె ఒక్కతే వెళ్ళి దర్శించింది. బాబా ఒక మంచంమీద జేరబడి పడున్నారు. ఆయనను చూడగానే మోటారు ప్రమాదం ఆనవాళ్ళు కనిపిస్తూనే ఉన్నాయి. బాబా ఆయన చేతితో అసామాన్యమైన శక్తితో డార్బరా చేతిని పట్టుకున్నారు. అందులకు ఆమె ఎంతో ఆశ్చర్యపోయింది. నమ్మడానికి వీలులేనంత శక్తిని కనపరచారు బాబా. బాబా శరీరంలోనుంచి ఆమె శరీరంలోకి ఏదో విద్యుచ్ఛక్తి ప్రవహించినట్లు ఆమె అనుభవించింది. ఆయన దర్శనం చేసుకుని ఆమె వెళ్ళిపోయింది. వీధిలోకి వెళ్ళగానే డార్బరాకి ఏడుపు వచ్చేసింది. బాబానుంచి వచ్చినవారు కొందరు సెంట్రల్ పార్క్‌లో బెంచిలమీద కూర్చున్నారు. వారు కూడా ఏడుస్తున్నట్లు ఆమె గమనించింది. బాబాను యీ మాటు యింక చూడడం పడదని డార్బరాయొక్క విచారానికి ముఖ్యకారణం. ఇంటికి వెళ్ళి కూడా డార్బరా విశ్రాంత మనస్కురాలై చాలాసేపు కూర్చుంది. అలాంటి వ్యక్తికి బాబాను చూసే అవకాశం కలిగింది.

జూలై 20 వ తేదీని ఐవీ యింటిలో న్యూయార్క్ బాబా సెంటర్ల వారందరికీ ఒక ప్రసంగం చేస్తానని బాబా అంగీకరించారు. అందుకోసం దర్శనం చేసుకున్న తరువాత అందరినీ వెళ్ళిపోకుండా ఉండమన్నారు. ఐవీ డ్యూక్స్ యింటిలో ఒక పెద్దగదిలో బాబా చుట్టూ అందరూ కూర్చున్నారు. కొందరు కుర్చీలమీద, కొందరు నేలమీద అనేకరకాలుగా కూర్చున్నారు. ఇంకా కొందరు గోడవారల నిలబడి ఉన్నారు. చుట్టూను చక్రాల కుర్చీలో కూర్చుని బాబా ఆయన అక్షర ఫలకం మీద చెప్పారు — "... ప్రపంచం అంతా భగవంతుని కోసం ఆక్రోశించే దినం వస్తుంది. భగవంతుడు నాకు అప్పజెప్పిన పని చేయడానికి నేను ఇండియా వెళ్ళాలి. నాపని నన్ను శరీరం వదిలేలా చెయ్యకపోతే ఒక సంవత్సరం తరువాత నేను మళ్ళీ అమెరికా వస్తాను. కాని నేను శరీరం వదిలేస్తే మళ్ళీ 700 సంవత్సరాల తరువాత వస్తాను."

ఇలాచెప్పి మిల్‌డ్రెడ్‌కైల్ వైపు తిరిగి (ఈమెకు వయసు 93. ఈమె బాబా ప్రేమికురాలు. అవతారుని దర్శనం కోసం 18 సంవత్సరాలనుంచి వేచియుంది)

ఆమె గడ్డం క్రింద మృదువుగా చేతితో స్పృశించి "మిల్‌డ్రెడ్ ! నీవు అప్పుడు నాతో ఉండవచ్చును" అన్నారు బాబా అందుకామె "అంతకంటేనా సంతోషంతో బాబా" అంది. ఆయన శిష్యురాండ్రయిన నోరీనా మాటెచెల్లీ, ఎలిజబెత్ పాటర్‌సన్ గురించి ప్రశంసా వాక్యాలు పలుకుతూ బాబా — "వారు నన్ను యిన్ని సంవత్సరాలు ప్రేమతో సేవిస్తున్నారు అయినా యీ రోజున వాళ్ళు మనమధ్య యిక్కడ లేరు వాళ్ళు చాలా అమూల్యమైన వారు. నా హృదయంలో చోటు చేసుకుని పవిత్రంగా ఉన్నారు" అన్నారు.

అయిదేళ్ళ కుర్రాడు తన యింటిలో తండ్రి వీపుమీద సవారీ చేస్తున్నాడు వాడింట్లో. "బాబూ! ఈ వేళ నీవు ఎవరిని చూసివచ్చావు ?" అని అడిగితే "దేవుని" అని సంకోచం లేకుండా చెప్పాడు మిల్‌డ్రెడ్ క్రైల్‌ను చూపి "నేను అందరికంటె పెద్దవాడిని నేను ఆ సనాతనుడను" అన్నారు బాబా.

ఒక బాలిక బాబాను యితరులకు ఎలా సేవ చేయగలను ? అని అడుగగా బాబా "ఎవరికి నిజంగా తెలుసునో వారికి ఏమీ చేయనక్కరలేదని తెలుసు" అన్నారు.

ఒక దంపతి యుగ్మమును గూర్చి బాబా "వారు నన్నెరుగరు నాకు వారిని తెలుసును" అన్నారు. ఒక్కొక్కరికి బాబా ఒక ద్రాక్షపండు యిచ్చారు మనసులో ఎంతో వ్యాకులతతో వచ్చిన ఒక స్త్రీ యొక్క భర్తకి బాబా ఏడు చెర్రీపళ్ళు యిచ్చి ఆమెకు రోజు కొకటి చొప్పున ఏడు రోజులు యిమ్మన్నారు. ఆ ప్రకారంగా ఆమె తిన్న తరువాత ఆమె పూర్తిగా ఆరోగ్యవంతురాలై ఆమెకు మనశ్శాంతి ఏర్పడింది.

మనోవ్యాధి గల వారెందరో వచ్చి బాబాను కలిసారు. అందులో ఒకామె పిచ్చాసుపత్రిని ఒక నెలలో విడిచిపెట్టి ఆరోగ్యవంతురాలై బయటకు వచ్చేసింది ఆయన రోగాలు కుదర్చనని అంటారుగాని ఆయన దయ ఎప్పుడూ చూపిస్తూనే ఉంటారు తలనొప్పితో బాధ పడుతున్న ఒక రిటైరయిన మాంటిస్సోరీ టీచరు తల మీద బాబా చెయ్యివేసి దీవించారు మళ్ళీ ఎప్పుడూ ఆమెకు తలనొప్పి రాలేదు.

న్యూయార్కులో ఉన్న రోజుల్లో 16, 18 ఏళ్ళ మధ్య వయసు ఉన్న పిల్లవానికోసం బాబా అడిగారు. అతడు బాబా ప్రేమికుడు కానివాడుగా ఉండాలి బలం

కలిగినవాడు బాబాయొక్క చక్రాల కుర్చీని తోసేందుకు కావాలి ఈ సంగతి విన్న ప్రేమికులంతా తలొక కుర్రవానిని బాబా వద్దకు తీసుకువచ్చి చూపించారు

ఫిలిస్ యిద్దరు బాలురను బాబా వద్దకు తీసుకువెళ్ళింది ఒకడు పోర్టోరికా నుంచి వచ్చినవాడు. ఇంకొకడు ఐర్లండువాడు ఓటో అనేవాడు ఆమె యింట్లో ఆడుతూ బాబా చిత్రాన్ని చూసి "ఆయన దేవుడు కాదూ!" అని అడిగేవాడు. కాని బాబా యీ యిద్దరినీ కూడా చూసి "వీరు బలహీనులు" అని పనికిరారన్నారు.

ఆఖరికి ఫిల్లిస్‌కు సోదరుడు వరుస అయిన కీత్‌మార్‌గఫీ అనే అతనిని క్నెనెక్టడీలో చూసి "కీత్! నీవు ఒక జబ్బు మనిషికి సహాయం చేయగలవా? అని అడుగగా "చేయగలను గాని మా నాన్న నాకు యింటిలో రంగు వెయ్యడం పని అప్పగించాడు. "కానీ బాబూ! అతడు చాలా జబ్బు స్థితిలో ఉన్నాడు. ఆయనకొక చెయ్యి, కాలు విరిగిపోయాయి" అంది. అది విని 'సరే వస్తాను' అన్నాడు. రేపు ఉదయం డాల్విన్‌షాతో ఉదయాన్నే 5 గంటలకే బయలుదేరి రావాలి. అలాగే కీత్ వచ్చాడు. అతడు బాబాకి నచ్చాడు అతనికి బాబా అక్షరఫలకం చదవడం కూడా చేతనయింది. కీత్ అడిగాడు — "బాబా! బ్రహ్మ సాక్షాత్కారం అంటారు ఏమిటి యీ గొడవ అంతాను?" బాబా యిలా జవాబిచ్చారు. "అది తలనొప్పి లాంటిది. నీకు తలనొప్పి వస్తేగాని అది ఎలా ఉంటుందో నీకు తెలియదు." కీత్ అనుకున్నాడు "ఏదో తలనొప్పి. నేనెప్పుడయినా తీసుకుంటాను" బాబా ఎంత చతురులో. ఎవరికి ఎలా చెప్పాలో ఆయనకే తెలుసును కీత్ వచ్చి పనిలో చేరగానే బాబా అడిగారు — "నీవు నాకు విధేయుడవుగా ఉంటావా?" "ఉంటాను' అన్నాడు. "నేనేదయినా చెడ్డపని చేయమన్నానరే" "అలాగే," అన్నాడు కీత్ ఈ సంగతి కీత్ వాళ్ళ బంధువులకి వ్రాసాడు అందుచేత వాళ్ళంతా ఒక కారులో ఎక్కి "మనవాడు సేవచేసే ఆయన ఎలాటివాడో చూడాలి" అనుకుని వచ్చారు హార్ట్స్‌డేల్‌కి. బాబాను చూడగానే వాళ్ళ అనుమానాలు సందేహాలు అన్నీ తీరాయి.

కీత్ ఆమ్‌హర్స్ట్‌లో చదువుకుంటున్నాడు, రెండవ సంవత్సరం కాలేజీలో. ఒక రోజున బాబా కీత్‌ని అడిగారు నీవేమి అవాలనుకుంటున్నావు? అని "నాకు తెలియదన్నాడు అతడు "డాక్టరువవుతావా?" అన్నారు ఈ రోజున కీత్ ఒక డాక్టరు

బాబా యొక్క అసాధారణమైన కొన్ని కోర్కెలను హూవా కీత్ పాటిస్తున్నాడు — ఉదాహరణకి — భారతీయ స్త్రీ మండలి అగు మెహెరా మొదలయిన వారిని అతడు చూడకూడదు మోటారు ప్రమాదం తరువాత హూవా స్త్రీ మండలి (మెహెరా, మణి మొదలయినవారు) యిదివరకులాగే కొంతవరకు ఘోషాస్త్రీల లాగానే ఉంటున్నారు బ్రాంక్స్ జూకి (జంతుప్రదర్శన శాల) వెళ్ళినప్పుడు – మార్శీ వాళ్ళని తీసికొని వెళ్ళింది – మార్శీ తన చెప్పు పాడవగా అలాగే కుంటుకుంటూ. దాన్ని యీడుస్తూ నడిచింది ఈమె కదలలేక వెనకబడిపోయింది వాళ్ళకు దారి తెలియలేదు. బాబా చక్రాల కుర్చీలో వస్తున్నారు పైనుంచి జల్లుపడుతోంది ఆయన కట్టు తడవడానికి వీలులేదు. ఆయన కుర్చీ ఏ చెట్టుక్రిందో కొంత తడవు నిలిపాడు కీత్ బాబా ఆదేశం ప్రకారం ఎప్పుడు మెహెరా, మణి, మెహ్రా కనిపించాలో అప్పుడు అటు చూడకుండా దాక్కొనేవాడు.

ఆ జూలో కీత్ ఒక్కొక్కప్పుడు యిలా దాక్కోడానికి వెళ్తే డార్విన్‌షా బాబా కుర్చీ కొంతదూరం నడిపించాడు అందరూ పెంగ్విన్ పక్షులశాలలోకి వెళ్ళారు. బాబా అక్కడ నీటిమీద ఉన్న ఒక పెంగ్విన్ పక్షినిచూసి "పెంగ్విన్, పక్షులలో ఆఖరి జన్మ తెలుసునా" అన్నారు బాబా మండలితో, అంటే యింక ఆ జీవి పక్షి జన్మ అయిపోయి ఏ జంతువుగానో జన్మిస్తుంది. ఇంక పక్షులలో జన్మించదు.

ఒక రోజున న్యూయార్కులో తూర్పు 66 వ వీధిలో "మన్హట్టన్‌హౌస్"లో కాపురం ఉన్న వింటర్‌ఫెల్డ్స్ ఆహ్వానించగా, వారి యింటికి వెళ్ళారు బాబా వారి యింటిలోనే మన్‌డే నైట్‌గ్రూప్ (ఒక బాబా ప్రేమిక బృందము) ప్రతి సోమవారం రాత్రి సమావేశమవుతుంటారు. బాబా ఎల్లాకి హెచ్చరిక చేసారు టీ మాత్రమే యివ్వాలిసుమా అని బాబా స్త్రీ మండలితో వచ్చారు గనుక మగవారి నెవరిని లోపలికి రానివ్వలేదు ఫ్రెడ్ అక్కడ కాపలాకాసాడు వారు కూర్చున్నగది బయట ఎల్లా టీ తీసుకువచ్చింది ఫిల్లిస్ పంచదార కలిపింది బాబా ఒక చెంచాతో పంచదార తీసుకుంటూ చిలిపిగా ఫిల్లిస్ చేతిమీద కొంత పోసారు. ఫిల్లిస్ బాబాకి ప్రక్కనే దగ్గరగా కూర్చుంది. ఆయన చెయ్యి దానిమీద రోమాలు చూసి ఫిల్లిస్ "ఆయన పురుషుడు, భగవంతుడు మగవాడు. భగవంతుడు ప్రక్కనే నేను కూర్చున్నాను" అనుకుంది. బాబా టీ బాగుందంటే ఎవరో అన్నారు "ఎల్లా దేవతలాటిది" అంటే బాబా "దేవతలకి కూడా భగవంతుని యెడల యింత ప్రేమ లేదు. వాళ్ళు భగవంతుని

పొందాలంటే ఒంటు వాళ్ళు మానవజన్మ ఎత్తాలి మానవునికి భగవత్సాక్షాత్కారం అయింపంటే రెంపు మూడు రోజుల్లోనే శరీరం వదిలేస్తారు, చాలా కొద్దిమందే శరీరంతో ఉంటారు కానీ వాళ్ళు యీ ప్రపంచంతో (ఈ సృష్టితో) పనిలేకుండా ఉంటారు వాళ్ళు మజ్జూబ్‌లవుతారు చాలా చాలా కొద్దిమంది శరీరం ఉంచుకొని భగవంతుని ప్రపంచాన్ని కూడా తెలిసి ఉంటాయి. వారు సద్గురువులవుతారు. కాని అది ఈశ్వరేచ్ఛప్రకారం జరుగుతుంది.)

మార్గరెట్ క్రాస్కీని బాబా — "నీకీ గౌడుప అక్కర్లేదా — భగవత్సాక్షాత్కారం?" అని అడిగారు. ఆమె "బాబా! నేను మాయను ప్రేమిస్తున్నాను. అది చాలా అందమయినది కానీ మీతో కూడా ఉండాలినేను." "బాగా చెప్పింది" అనుకుంది ఫిల్లిస్. "ప్రియతమా! నీ వెక్కడ ఉంటావో అదే నాకు స్వర్గం" అని ఒక సూఫీ కవి చెప్పాడు. ఒకమారు మార్గరెట్ యొక్క చిత్రాన్ని ఫిల్లిస్ లిఖించింది. ఆమె ఫాలభాగంలో మూడోకన్ను ఉన్నట్లు అందులో నుంచి తెల్లటి వెలుతురు కిరణాలు వస్తున్నట్లు చిత్రించింది 'చూసారా బాబా! నా బొమ్మ ఎలా వేసిందో. ఈ కన్నేమిటి? ఈ కిరణాలేమిటి?" అని మార్గరెట్ ఫిర్యాదుచేయగా బాబా "అవును, ఆమె నిన్ను ఎలా చూసిందో అలా లిఖించింది!" అన్నారు

అందరూ టీ తీసుకున్న తరువాత ఎల్లా టెలివిజన్ త్రిప్పగా అందులో బేస్‌బాల్ ఆట కనిపిస్తోంది ఆ ఆటలో మిక్కీ మాంటెల్ అనేవాడు బాగా ఆడాడు. అతనిని చూసి మణి అనుకరించబోయింది అందరూ నవ్వారు. బాబా కూడా. ఇంక వెళ్ళడానికి సమయం అయింది. అందరూ లేస్తుంటే ఫ్రెడ్ మగవారెవరూ దారిలో లేకుండా చూసి తాను కూడా తొలగి వాళ్ళు వెళ్ళేవరకూ చాటున ఉన్నాడు. బాబా స్త్రీలతో హార్ట్స్‌డేల్‌కి వెళ్ళిపోయారు.

ఒక రోజున అడీల్‌ని ఫిల్లిస్‌ని బాబా భోజనానికి హార్ట్స్‌డేల్ రమ్మని పిలిచారు. వారు హార్ట్స్‌డేల్ స్టేషన్‌లో దిగి అక్కడ గులాబీలు కనిపిస్తే తీసుకుని బాబాకి మిగిలినవారికి గుచ్చాలు (బొకేలు) తయారుచేసారు బాబాకి ఎఱ్ఱగులాబీలు మెహెరాకి రోజారంగువి తయారుచేసి చూడగానే ఆదీ కనిపించాడు. బాబాకి వారు స్టేషన్‌లో ఉంటారని తెలుసును ఆదీని, వారిని తీసుకుని రమ్మని పంపించారు. వెళ్ళగానే బాబా శిరసుమీద ఎఱ్ఱ గులాబీలు ఉంచారు బాబా సంతోషించి వారికి 'ప్రసాదం'గా ఒక పటికిబెల్లం ముక్క యిచ్చారు. మెహెరా బాబా చెయ్యి రాస్తోంది.

అప్పుడు రువానో బోగిస్లాఫ్ కూడా లక్కీకి వచ్చింది. బాబా ఆమెను "గరుడ" అని అనేవారు, ఆమె కేకవేస్తే గరుడపక్షి కూతలా ఉంటుందని గ్రెస్ట్ లంటే నాకు యిష్టం అంది రువానో ఆమె ఆల్బకర్కీ స్టేషన్‌లో బాబాతో కూడా ఒక 'ఇండియన్' ప్రతినిధివద్దకు వెళ్ళి వచ్చింది ఆమె ఒక జ్యోతిష్కురాలు దగ్గరకు వెళ్ళగా ఆమె చేతిసున్న వైసెప్ పడియం తీస్తేనేగాని అదృష్టం కలిసి రావన్నది. అది అన్నీ పోగొట్టుకున్న ఒకామెది అని రువానో చెప్పింది రువానో ఆమె చెప్పినట్లు చేసింది అది తీసేసిన కొద్ది రోజుల్లోనే అయిదువందల డాలర్ల చెక్కు అందింది రువానోకి అది తీసుకుని ఇండియాకి ప్రయాణం చేసింది.

ఈ మాటవిని బాబా (మణి అక్షరాల పలక చదివి చెప్పింది) "నిజమే. కొన్ని పదార్థాలు, కొన్ని జంతువులు, కొన్ని లోహాలు, రత్నాలు, నల్లటిప్పాలు, పిల్లులు, కుక్కలు, అదృష్టాన్ని కలిగిస్తాయి. అయితే వీటి గురించి అట్టే చెప్పుకో కూడదు. అది మూఢనమ్మకాలు కలిగిస్తుంది" అన్నారు.

రువానోకి 70 సంవత్సరాలుంటాయి. "బాబా! నేను మరల ఇండియా వచ్చి మీతో ఉంటానా!" అని ఆమె బాబాను అడిగింది. బాబా ఆమె కళ్ళలోకి చూసారు. ఆమె కళ్ళు ముదురు నీలం రంగులో ఉన్నాయి. తెల్లగా మంచుగడ్డలా జుట్టు నెరిసిపోయింది. ఆమె "ఇది యింక నా జీవితానికి వీడ్కోలు చెప్పడమేనా" అనుకుంది. ఆమె ఆలోచన తెలిసి "కావచ్చు" అన్నారు బాబా.

రువానో చెప్పింది అక్కడి స్త్రీలకి — "ఒకమారు యూరప్‌లో నేను మొదట బాబాను దర్శించినపుడు నా కుమార్తె కూడా నాతో వచ్చింది. బాబా మా నదు పాయాల గురించి ఎంతో ఆలోచించారు. నేను అడిగాను బాబాను "బాబా! నా మీద నా కూతురుమీద మీరెందుకంత దయ చూపిస్తున్నారు?" అని "మీరు వెనక ఈజిప్టులో నన్ను ఎంతోదయగా చూసారు. అందుకని" అన్నారు బాబా ఇది యింకో అవతారంలో జరిగినసంగతి. ఈజిప్టులో దేవుడెత్తిన అవతారులయిన — హెర్మిస్, మెల్చిసాదెక్, ఇక్నాటన్, ఓసిరిస్ — వీటిలో ఎవరయినా కావచ్చు.

బాబా — "మీకు యిష్టమయిన ఐస్‌క్రీమ్ ఏది?" అని అడుగగా వారు "స్ట్రాబెర్రీ" అన్నారు — ఫిల్లిస్, అడీల్‌లు. బాబా వారివైపు తిరిగి — మీకు ఎంత అప్పు ఉంది? అని అడిగారు. ఫిల్లిస్ సిగ్గుపడుతూ "45 డాలర్లు" అని చెప్పింది.

అకీల్ "15 డాలర్లు" - అందులో 5 ఫిలిప్స్‌కే యివ్వాలి. బాబా రానో గేలీని పిలిచి పర్సు తీయమని ఆ డబ్బు వారికి యిప్పమని చెప్పి యిప్పించారు. (ఫిలిప్‌కి 50 డాలర్లు అకీల్‌కి 10 డాలర్లు ) అకీల్ ఫిల్లిప్‌కి యివ్వవలసిన 5 డాలర్ల అప్పు యీ విధంగా అప్పుడే తీరిపోయింది వాళ్ళ అప్పులన్నీ తీర్చేసుకున్నారు. ఎప్పుడయినా అవసరం ఉంటే అడగమన్నారు బాబా. వారు బాబా కుటుంబానికి చెందినవారన్నారు. తరువాత వారి ఆర్థికస్థితి బాగా మెరుగయింది.

బాబా ఫిల్లిప్ వైపు తిరిగి "నీవు ఉద్యోగం చేస్తున్నావుకదా. నీవు యిక్కడికి వస్తూంటే నీ బాస్ (అధికారి) ఏమీ అనడా ?" అని అడుగగా "అనడు బాబా !" అంది ఫిల్లిప్. బాబా "అతడు దేవత, ఈ ఉద్యోగం మాత్రం వదలకు" అన్నారు.

బాబా అడీల్‌ని జబ్బుగా ఉన్న ఆమె తల్లి వద్దకు వెళ్ళి శుశ్రూష చెయ్య మన్నారు. అంతకుముందు ఆమె ఎమ్ ఎ (వేదాంతం) పరీక్ష పాసవుదామని ప్రయత్నం చేస్తోంది కొలంబియా విశ్వవిద్యాలయంలో. కానీ ఆమె ఎమ్. ఎ. లో సబ్జెక్టు మార్చటం మొదలుపెట్టింది. ఆమె ప్రొఫెసర్ "ఇలా నీవు మార్చేస్తున్నావేమిటి? రీన్‌హోల్డ్‌నీభుర్, తరువాత ప్లాటినస్, సెయింట్ ఆగస్టైన్, తరువాత సెయింట్ ఫ్రాన్సిస్. నీకు ఎమ్. ఎ అక్కరలేదులాగుంది ముక్తికావాలి మిస్ వాల్కిన్ !" అని మందలించాడు.

మొదటిరోజున బాబాను కలిసినపుడు దిగులుగా ముఖం పెట్టుకుని వెళ్ళింది అడీల్ "అలా ఉన్నావేం?" అని బాబా అడిగారు. "నేను నా థీసిస్ పూర్తి చేయలేదు బాబా !" అని చెప్పింది అడీల్. బాబా నవ్వి ఆయన ఛాతీవైపు చూపించుకుని "నేనే నీ థీసిస్‌సు" అన్నారు. ఒకరోజున బాబా అడీల్ వద్దగా కూర్చుని యుండగా రానో ఏడుస్తూ వచ్చింది. బాబా "ఏమిటిసంగతి ?" అని అడిగారు. బాబాకి భోజనం తయారయిందా అని అడిగితే వంటమనిషి నానా మాటలు అంది. ఆల్బర్టా ఆ వంట దాని పేరు. ఆమె నీగ్రోమనిషి. ఆమె వంట చాలా బాగా చేస్తుంది. కాని త్వరగా చేయలేదు. బాబా రానోని "నీవు నన్ను ప్రేమిస్తున్నావా ?" అని అడుగగా "అవును బాబా" అన్నది రానో. బాబా "అయితే వెంటనే వెళ్ళి ఆమెకు క్షమాపణ చెప్పుకునిరా" అన్నారు. రానోగేలీ వెంటనే వంటయింటికి వెళ్ళింది. ఫిల్లిప్ వద్దగా రాలు — "ఏమో

బాబా చేతలు అర్థంకావు ఈ నల్లపింట వానికి డానోకి పెద్దిలాట ఆయనే పెట్టి మళ్ళీ యిద్దరికీ రాజీ చేస్తున్నారేమో వీరిద్వారా బాబా నల్లవారికి తెల్లవారికి సామరస్యం కలిగేలా చేయవచ్చు" — అనుకున్నారు.

డువానోకి డాన్‌కిన్‌లాగే రోజుకొక్క నల్లచుట్ట కాల్చవచ్చునని బాబా అనుమతి యిచ్చారు. ఒక రోజున అందరూ డాబామీద కూర్చున్నారు డువానో చుట్ట కాలుస్తోంది చార్మీ ఏవో సినిమా టిక్కెట్లు చూస్తోంది. బాబాను స్త్రీ మండలిని "చార్లీస్ ఆంట్" అనే సినిమాకి ఆర్. సి ఎ. థియేటరుకి, తీసికొని వెళ్ళామని అనుకుంటు న్నారు టిక్కెట్లు కొనేసారు ఆర్ సి ఎ. అమెరికాలో అన్నిటికంటె పెద్ద సినిమా హాలు. ఫిల్లిస్ వెంటనే రైలుమీద న్యూయార్క్‌కి వెళ్ళిపోయి ఒక కారులో ఆర్. సి ఎ సినిమాహాలుకి వెళ్ళి మొదటి బాల్కనీలో యిద్దరు బ్రహ్మచారిణులకు (నన్‌లు) మధ్య కూర్చుంది.

కొంతసేపయాక ఎవరో భుజంమీద తట్టారు తిరిగి చూసేసరికి బాబా చార్మీని పంపించారు ఆమెను పలకరించమని బాబా ఆయన చక్రాల కుర్చీలో దగ్గర లోనే ఉన్నారు. ఫిల్లిస్ అనుకున్నది — "ఇన్ని వందలమందిలో క్రీస్తుకూడా ఉన్నారు" ప్రక్కన కూర్చున్న నన్‌లను మోచేత్తో పొడిచి మీరు నమ్ముతారా అని అడగాలనుకుంది ఇంతలో మళ్ళీ భుజం మీద చార్మీ తట్టి "బాబా నిన్ను సినిమా చూడమంటున్నారు" అని చెప్పింది. సినిమాలో బాబా ఏదో చూసి నవ్వుతున్నారు. తరువాత కొంతసేపటికి చార్మీ మళ్ళీవచ్చి "బాబా వెళ్తున్నారు నిన్ను కూడా రమ్మంటున్నారు" అని చెప్పింది బాబా ఫిల్లిస్‌కి ఒకపని చెప్పారు బాబాను చక్రాల కుర్చీలో ఎలివేటర్‌లో క్రిందకు దింపి తీసికొని వెళ్ళాలి ఆమె ఒక్కతే బాబాతో ఉన్నానని ఆ అవకాశానికి సంతోషిస్తోంది. ఆమె ఆయన చెవిమీద ముద్దు పెట్టుకుంది. బాబా క్రిందకి వెళ్ళేసరికి సినిమా అయిపోయింది కుర్చీలోనే ఉండి బాబా కారుకోసం వేచియున్నారు అనేక వందలమంది అవతారుని ప్రక్కనించే ఒక్క అంగుళం దూరం నుంచి ఆయన ఎవరో తెలుసుకోకుండా వెళ్ళిపోతున్నారు కదా అనుకుంది ఫిల్లిస్. ఇంతలో చార్మీ కారు తీసుకువచ్చింది. ఎవరిళ్ళకు వారు వెళ్ళారు బాబా హర్ట్స్‌డేల్ వెళ్ళారు. ఒక రోజున ఆఫీసు నుంచి ఫిల్లిస్ తిన్నగా హార్ట్స్‌డేల్ వచ్చింది. బాబా యెదుటకి వెళ్ళగానే బాబా "నీదే తప్పు!" అన్నారు ఆమె నిర్ఘాంతపోయింది.

నిన్ను పోలీసులు వచ్చాక తలుపులు వాడారు ఫెరిస్ తన భార్య యిల్లు ఎవరికి యిచ్చిందో చూసిరమ్మని పంపించాడు ఏకోమంచికే అయి ఉంటుంది " అన్నారు బాబా.

తరువాత ఇండియాకి విమానంలో వెళ్ళడం గురించి చర్చ జరిగింది. మళ్ళీ "నీ తప్పే ఫిల్లిస్" అన్నారు ఆమెకు ఏమీ అర్థం కాలేదు. ఏదో విమాన ప్రయాణంలో పొరపాటున తలుపు తెరుచుకుని ఎవరో స్త్రీ సముద్రమధ్యంలో పడిపోయింది పాపం ఫిల్లిస్ ఒక విమానంలో వెళ్తుంటే వాషింగ్టన్ నుంచి నెవార్క్‌కి యిలాగే తలుపు తెరుచుకుంది. కాని ఎవరికీ అపాయం జరగలేదు. బాబాకి ముందు జరిగేదేదో తెలిసి ఫిల్లిస్‌కి రక్షణ కల్పిస్తున్నారేమో.

బాబా జాన్‌బాప్ వైపు తిరిగి – "ఈజిప్టులో విప్లవం – అది జాన్ యొక్క తప్పు" ఆ రోజులలో ఫరూక్ రాజుని పదవిచ్యుతుని చేశారు కెయిరోకి విమానాలు వెళ్ళడం లేదు బాబా కెయిరోకి చాలాకాలం నుంచి వెళ్ళాలనుకుంటున్నారు కాని యిప్పుడు వారి పథకం మార్చుకున్నారు. ఈజిప్టు గురించి తరుచుగా చెప్తున్నందువలన పరిస్థితుల గురించి ఆధ్యాత్మికంగా బాబా పనిచేస్తున్నారేమో

బాబా వారి 'గోపిక'లతో తోటలోకి వెళ్ళారు. బాబా ఫిల్లిస్‌ను ఆలింగనం కోసం పిలిచారు ఎందుకో గాని ఆమె సంకోచించింది వెళ్ళలేదు. బాబా మళ్ళీ పిలిచారు. అప్పుడు ఫిల్లిస్ వెళ్ళి మెహెరాను కౌగిలించుకుంది బాబాను కాకుండా.

బాబా మరునటి రోజు ఉదయాన్నే బయలుదేరి వెళ్ళిపోతారు అందుచేత ఫిల్లిస్ ఆ రాత్రికి అక్కడ ఆగి మిసెస్ ఫెరిస్‌కి యిల్లు జాగ్రత్తగా మళ్ళీ అప్ప జెప్పాలి గనుక అక్కడ ఉండి పోయింది. సామాను సర్దడంలో ఆమె కిట్టీకి సహాయం చేసింది. బాబా యొక్క చిన్న తోలుపెట్టెమీద ఎమ్ ఎస్ ఐ. అనే అక్షరాలు ఉన్నాయి అందులో ఆయన సద్రా, చెప్పులు ఉన్నాయి ఇంకా, చొక్కా, క్షవరం చేసుకునే సామాను ఉన్నాయి

జూలై 31 వ తారీఖు అది తెల్లవారేసరికి 6 గంటలకే ఒక స్త్రీ వచ్చి బాబాను చూడాలని కూర్చుంది ఆమె యిదివరకు ఐవీ యింటిలో ఒకమారు బాబాను దర్శనం చేసుకుంది అప్పుడు బాబా "నీవు నన్ను మళ్ళీ 700 సంవత్సరాలకే చూడడం." అన్నారు ఆమాట ఆమె యింటికి వెళ్ళి ఆలోచించి ఆయనమాట

నమ్మ చేయాలని యిప్పుడు మళ్ళీ వచ్చి చూస్తానంటూ పట్టుపట్టింది రానో బాబాకి చెప్పింది- ఆమెను చూడదలుచుకోలేదు అన్నారు బాబా మూడుసార్లు రానో చెప్పగా మూడు మారులూ అలాగే అన్నారు బాబా ఆఖరికి "రెండు నిమిషాలు మాత్రం చూస్తాను. ఆమె మాట్లాడకుండా కూర్చోవాలి." అన్నారు ఇలా జరుగగా ఆమె మొండితనానికి ఆమె జీవితంలో అనేక కష్టాలు ఎదుర్కోవలసి వచ్చింది సంపూర్ణ గురువులను యిలా పివాల్ చేయవచ్చునా ? ఇందులో బాబా చేసినదేమీ లేదు ఆమె చేసినదానికి ప్రతిఫలం అనుభవించి తీరవలసిందే.

ఆరోజున మేరియన్ ఫ్లోరెన్స్ బాబాను కారులో కూర్చోబెట్టుకుని న్యూయార్క్ విమానాశ్రయానికి తీసుకువెడుతోంది. దారిలో ఒక పక్షి వేగంగా ఎగురుతూ ఎదురుగావచ్చి కారు ముందరి అద్దానికి కొట్టుకుంది కారులు అసలు ఆదేశంలో చాలా వేగంగా పోతాయి బాబా — "జాగ్రత్త ! ఆ పక్షి వచ్చిపోయిందంటే దాని పరిణామానికి సహాయం చేయడం కోసం నీవు యింకో జన్మ యెత్తాలి సుమా !" అన్నారు బాబా కూర్చున్నకారులో స్త్రీ మండలి కూడా కూర్చున్నారు పురుషమండలి వెనకాల యితర కార్లలో వస్తున్నారు. బాబా పశ్చిమదేశాలకి మరల వస్తావన్నారు 'భగవంతుని ఇచ్ఛప్రకారం.' బాబా ఉపయోగించడంకోసం ఒక దుప్పటీ మీద చేతితో అయిదు మతాల చిహ్నాలు — టార్చి, ఓమ్, సిలువ, పద్మం, చక్రం నక్షత్రం — చంద్రవంక బొమ్మలు వేసింది ఫిల్లిప్. అది బాబాకి చూపించగా సంతోషించారు. ఆయన అందుకొని ఎలిజబెత్‌కి యిచ్చి "నేను పిచ్చేవరకు — భగవంతుని ఇచ్ఛప్రకారం - నీ వద్దనే ఉంచు." అని బాబా అన్నారు బాబా ఫిల్లిప్‌ని పిలిచి బాబా కోసం కొన్నవన్నీ నీవు ఉంచుకో అన్నారు అన్నిటికంటె విలువగలవిగా ఫిల్లిప్ బాబా భోజనం చేసిన ప్లేటు వగైరా ఎంచుకుంది. తనతో భద్రంగా దాచుకుంది బాబా వరుండిన దుప్పటీ ఆమెయే తెచ్చేసింది అది కూడా ఎంతో పవిత్రంగా తనతో ఉంచుకుంది.

1952 జూలై 31 వ తారీఖున విమానం బయలుదేరే సమయానికి గంటన్నర ముందుగా విమానాశ్రయానికి వెళ్ళారు బాబా బహుశా ఆయన ఆధ్యాత్మిక ప్రతినిధిని ఎవరినో కలుసుకోవడానికి అయి ఉండవచ్చును విమానాశ్రయంలో బాబా ఒక కుర్చీలో కూర్చున్నారు. బాబాకు ఎదురుగా జాన్‌బాస్ మౌనంగా నిలబడి యున్నాడు. ఒక మనిషి బాబా ఎదుటికి వచ్చి మౌనంగా బాబా కి 7 అడుగుల

దూరంలో నిలబడి ఆయన ముఖం వైపు తేరిపారచూసి వెళ్ళిపోతూ మళ్ళీ ఒకమారు వెనుకకు తిరిగి బాబాను చూసాడు. తరువాత వెళ్ళిపోయి యింక కనబడలేదు. ఇది వరకు ఎవరినో బాబా విమానాశ్రయంలో కలుసుకోవాలని ఎవరూ ఆయనకి దగ్గరగా ఉండకూడదని చెప్పి ఉంచారు దగ్గర ఎవరయినా నిలబడితే వారిని బాబా దూరానికి పంపించారు ఆయన ఒక్కరే ఉన్నారు. బాబా ఆంతరికమైన పని ఏదో అప్పుడు చేసారు బాబాకు ఎన్నో దెబ్బలు తగిలినా అమెరికా భూమిమీద తమ రక్తాన్ని చిందించి అమెరికన్ ప్రేమికుల హృదయాలలో ప్రేమామృతాన్ని చిలికించి జూలై ఆఖరున ఆయన ఇంగ్లండుకి బయలుదేరి వెళ్ళారు. అక్కడనుంచి ఇండియాకి వెళ్ళే లోపున కొద్దిరోజులు స్విడ్జర్లాండు వెళతానన్నారు. వెళ్ళి ఆయన జీవితంలో మూడవ ఘట్టానికి తగిన ఏర్పాట్లు చేసుకుంటానన్నారు. బాబా ఇంగ్లండులో దిగారు. బాబా లండన్‌లో ఉన్నారు అక్కడ ఉన్నన్నాళ్ళు సాయంకాలాల్లో ప్రతిరోజు ఎక్కడికో ఒక చోటుకి వెళ్తూండేవారు. ఆయనకి బాధ మిక్కుటముగా ఉన్నా మెహెరా మణి లకు ఆశాభంగం కలుగకుండా ఆయన వారితో సాయంత్రం కార్యక్రమాలకు వెళ్తూండేవారు మెహెరా ఆ ప్రమాదం తరువాత మామూలు మనిషి అయింది. ఒక రోజున బాబా మెహెరా, మణి మొదలయిన ఆడవారితో స్ట్రాట్‌ఫర్డ్‌-ఆన్‌-ఎవన్ అనే చారిత్రాత్మకమయిన స్థలానికి వెళ్ళారు. షేక్స్పియర్ మహాకవి నివసించిన ఊరు అది. బాబాతో చార్మియాన్ డ్యూస్ కూడా వెళ్ళింది. డెలియా చెల్లెలు మింటా ఆమె కారులో వెళ్ళింది అందరూ అక్కడ ఆ రోజు ఆనందంగా గడిపారు.

ఇంకోరోజున మాడమ్ టస్సాడ్ ప్రదర్శనానికి వెళ్ళారు. బాబాతో స్త్రీ బృందం అంతా వెళ్ళారు బాబా ఆరోజున డెలియా యింటికి వెళ్ళి క్యూ గార్డెన్స్‌కి నడిచి వెళ్ళారు ఆ రోజున బాబా దర్శనార్థం క్రొత్తవాళ్ళు చాలామంది వచ్చారు విలియం. మేరీ బాకెట్టు, చార్లెస్ పర్డమ్‌కూడా వచ్చారు. వారితో బాబా ప్రత్యేక సంభాషణలు చేసారు. ఆగస్టు 6 వ తేదీన (1952) లండన్‌లో అయిదు రోజులు గడిపాక బయలుదేరి జూరిచ్‌కి వెళ్ళారు లండన్ విమానాశ్రయంలో అనేకమంది భక్తులువచ్చి బాబాకు వీడ్కోలు యిచ్చారు బాబాతో డెలియాకూడా జూరిచ్‌కివెళ్ళింది. ఇండియాలో బాబాతో అనేక సంవత్సరాలు గడిపిన ఐరీన్ బిల్లో జూరిచ్‌లో బాబాను దర్శించింది. అక్కడనుంచి లొకార్నోకి బాబా కారులో వెళ్ళారు దారిలో బాబా బృందం అందరు మంచి భోజనం చేసారు జూరిచ్‌లో మొత్తం 2 వారాలున్నారు బాబా అక్కడ

బాబాతో ఆయన భక్తులు — స్విట్జర్లాండు, ఫ్రాన్సు. ఇంగ్లండు నుండి వచ్చినవారు చాలామంది యీ రెండు వారాలు ఆనందంగా గడిపారు హెడిమార్టిన్ యింటిలో బాబా బస చేసారు అనితారోజర్లు వచ్చి బాబాను దర్శించారు. సాయంకాలాల్లో అందరు బాబాతో కూర్చుని గడిపేవారు అప్పుడు మంచి ఆధ్యాత్మికమైన పద్యాలు చదివేది సాధు పురుషుల కథలుకూడా ఆమె చదివేది

లండన్‌లో ఉండగా చార్మియాన్ వచ్చి అక్కడ అయిదురోజులు డెలియా గదిలో ఉండేందుకు బాబా అనుమతించారు పాశ్చాత్య పర్యటనలో బాబా ఎక్కడికి వెళ్తే అక్కడికి బాబాతోకూడా ఉంది డెలియా.

ఇంక ఇండియా వెళ్ళడానికి బాబా జెనీవాకి వెళ్ళి అక్కడ విమానం ఎక్కారు. డెలియా ఇంగ్లండుకు వెళ్ళే విమానంలో బాబా కంటె ముందుగా వెళ్ళింది బాబా విమానంలో జెనీవా నుంచి బయలుదేరి బొంబాయికి 21 ఆగస్టున చేరుకున్నారు

బాబా యొక్క జ్యోతిర్మయ స్వేచ్ఛా జీవితం నవంబరు 15 వ తేదీన గత రెండు ఘట్టాల యొక్క ప్రారంభం అవుతుంది అందులో బలము, బలహీనత. స్వేచ్ఛ, బంధనము, దివ్య ప్రేమాగ్నిలో భస్మీపటలం అయిపోతాయి అందరూ బాబాకోసం జీవించాలని వారి నిత్యజీవితాలను ప్రారంభించారు. వారిలో బాబా ప్రేమ పెరగాలని బాబా మరల వారి దేశానికి రావాలని కోరుకుంటూ కలలు కంటున్నారు

1952 అక్టోబరు 6 వ తేదీన రాత్రి జాల్ కేరావాలా అనే సుప్రసిద్ధ బాబా శిష్యుడు నాగపూర్‌లో బాబా నామం స్మరిస్తూ మరణించాడు ఈ సందర్భంలో బాబా యిలా అన్నారు — “ అతనికి నాతో సంబంధము అద్వితీయమైనది నా యెడల అతనికున్న ప్రేమ అపారమయినది నా యందు అతనికున్న నమ్మకం సంపూర్ణమయినది, నా యందు అతనికున్న విధేయత పరిపూర్ణమయినది నా ఇచ్ఛకు అతని సమర్పణాభావము పూర్తి అయినది.

నా యొక్క జ్యోతిర్మయ స్వేచ్ఛా జీవితంలో జాల్ చాలా ముఖ్యపాత్ర వహించి ఉండేవాడు. నేను యీ సంవత్సరం అమెరికాకి వెళ్ళేముందు జాల్‌కి చెప్పాను, నవంబరు 1 వ తేదీనుండి మెహెరాబాద్‌లో 15 రోజులుండమని, నా జ్యోతిర్మయ స్వేచ్ఛా జీవితంలో అతడు పాల్గొనే అవకాశం గురించి అతనికి చెప్పాలనుకున్నాను.

ఈ సంగతి జాల్‌కి తప్ప ఎవరికీ తెలియదు నేను అమెరికా నుంచి వచ్చేవరకు, జ్యోతిర్మయ స్వేచ్ఛా జీవితంలో నేను ప్రవేశించేటప్పుడు అతన్ని నావద్ద ఉండ మన్నాను ఈ విధంగా నవంబరులో 15 రోజులపాటు ఉండమని ఆహ్వానించిన వారిలో జాల్ భౌతికంగా హాజరుగా ఉండడు.

జాల్ మరణ సంఘటనతో మాయ నా పనిమీద తీవ్రమయిన దెబ్బతీసింది. కాని నా పని ఎక్కువ కష్టాలు అనుభవం ద్వారా అది ఎక్కువ శక్తివంతమయింది. జ్యోతిర్మయ స్వేచ్ఛాజీవితం నన్ను ఆహ్వానిస్తోంది. ఇప్పుడందులో దూకడానికి నేను యింకా ఎక్కువగా కృతనిశ్చయుడనై యున్నాను ఆ స్వేచ్ఛా జీవితంలో నేను ప్రజా దర్శనాలిస్తాను మహాత్ములకి, పేదలకి, ప్రజా బాహుళ్యానికి నేను ప్రణమిల్లుతాను. జ్యోతిర్మయ స్వేచ్ఛా జీవితం బాబా, మరి ప్రతియొక్కరు దేవునితో ఒకటిగా ఉన్నారని ప్రపంచం అర్థం చేసుకునేలా చేస్తుంది.

నా ప్రియతమ జాల్ (కేరావాలా) శాశ్వతంగా శాంతిలో నా వద్దకు వచ్చేసాడు 17 వ తేదీన (అక్టోబరు) పింపలగామ్‌లో జాల్ జ్ఞాపకార్థం పేదలకు అన్నదానం చేస్తాను.

ఈ పై విధంగా బాబా డా॥ సి డి. దేశ్‌ముఖ్‌కి చెప్పి అతనిచేత వ్రాయించారు

1952 అక్టోబరు 8 వ తేదీన బాబా పింపలగామ్‌లో ఉన్నారు. బాబాకు అమెరికాలో జరిగిన కారు ప్రమాదం వల్ల ఏమనీ చేయలేని స్థితిలో ఉన్నారు అయిదు గురు పేదవారిని పిలిపించి బాబా దేశ్‌ముఖ్ చేత అయిదేసి రూపాయిలిప్పించారు. ఆ రూపాయిలిచ్చినపుడు అతడు బాబా ఆజ్ఞప్రకారం ప్రతివానికి యిలా చెప్పాడు. "ఓ భగవాన్! నేను యీ సొమ్ము జాల్‌కేరావాలా స్మారకార్థం యిస్తున్నాను" అని చెప్పాడు. జాల్‌కేరావాలా సంస్మరణార్థము అక్టోబరు 17 వ తేదీన అనుకున్న ప్రకారం బాబా పేదవారితో కార్యక్రమం జరిపించారు.

నవంబరు 1 వ తేదీనుంచి బాబా తమకు ఎవరూ ఉత్తరాలు వ్రాయకూడదని నిషేధించారు. ఈ లోపుగా పూనా వెళ్ళి అక్కడ బింద్రాహౌస్‌లో 3 రోజులుండి దర్శన కార్యక్రమం జరిపించారు బాబా తమ జోతిర్మయ జీవితము 15 నవంబరు

మంచి ప్రారంభం అవుతుందని ఫిబ్రవరి (1952) లోనే చెప్పారు. అమెరికాలో మోటారు ప్రమాదం అయిన తరువాత ఏ ఆసరా లేకుండా బాబా యిప్పుడే నడువ గలుగుతున్నారు. అయినా ఆయన కదలిక పరిమితంగానే ఉండవలసి వస్తోంది. అయితే యిది ఆయన చేసుకునే పనికి ఏమీ అడ్డు రావడం లేదు నవ్యజీవితం అయి పోయిన తరువాత ఆయన ప్రారంభించిన స్వేచ్ఛా జీవితంలో యిది ఆఖరుభాగం ఈ జ్యోతిర్మయజీవితంలో స్వేచ్ఛాబంధమనికూడా ఆయన దివ్యప్రేమలో లీనమైపోయి ద్వంద్వయుతమైన మాయ సమూలంగా నాశనమయిపోతుంది.

"నవంబరు 15 వ తేదీనుంచి నా జ్ఞానము, దివ్య సత్యము గురించే నేను చేయవలసిన పని ఉంటుంది. అది కావాలని అన్వేషించేవారికి నేను దానిని అంద జేయాలని నాకు అభిలాష కలదు . అంతరికంగా నేను ఏమి చేయాలో అంతాచేస్తాను ... భవిష్యత్తుకు కావలసిన పునాది నేను యిప్పుడే వేయాలి.... నా ఆధ్యాత్మికకార్యంలో యిది చాలా క్లిష్టమయిన సమయం ఈ జ్యోతిర్మయ జీవితానికి బాహ్యంగా కావలసి నవి కూడా నేను చూసుకోవాలి అందుకుగాను ఎన్నో పనులు చేయకోవాలి." అని బాబా చెప్తూ వచ్చారు వారి మండలితో. తరువాత హమీర్‌పూర్‌లో ఎవరో బాబా చెప్పినపని సరిగా చేయనప్పుడు యిలా అన్నారు—"నేను లోపల మండిపోతున్నాను. మీ అశ్రద్ధవలన బయటనుంచి కూడా నన్ను తగలబెట్టకండి" యీ విషాదపుమాటల వలన బాబా చెప్పినపనులు ఎంత శ్రద్ధగా తు-చ- తప్పకుండా ఆయన చెప్పినట్లు చేయాలో అలా కాకపోతే ఆయనకు ఎంత బాధగా ఉంటుందో తెలుస్తోంది

మూడు నెలలు దేశంలో తిరిగిన తరువాత బాబా "ఈ జ్యోతిర్మయ జీవితంలో ప్రాధానమయినపని యింకా నేను ఒక్కడినే చేయవలసి ఉంది" అన్నారు. ఆయన గావించిన పనులలో పైకి వినిపించేలా నిరంతరమూ పదిరోజులు అహో రాత్రులు 12 గురు శిష్యులచేత "యాయజ్‌దాన్" అనీ, "అల్లాహూ_అక్బర్" అనీ, "గాడ్ ఆల్‌మైటీ" అనీ, "పరబ్రహ్మ పరమాత్మ" అనీ భగవన్నామం ఉచ్ఛరింప జేసారు ఈ పన్నెండుగురు చేత వంతులువారీగా యీవిధంగా చేయించారు బాబా.

ఇంకా యిద్దరిచేత ప్రతిరోజూ "ఓం పరబ్రహ్మ ! పరమాత్మ !" అని అయిదువేల సార్లను, "ఓ దైవమా ! ఆయన జ్యోతిర్మయ జీవితంలో తనకు బలం ప్రసాదించమని బాబా కోరుతున్నారు" అని పదునాల్గు వందలసార్లను పదిరోజులు

చెప్పేంవారు ఈ విధంగా నవంబరు 3 వ తేదీనుంచి 14 తేదీవరకు జరిపించారు. తరువాత నవంబరు 2 వ తేదీనుంచి 5 వ తేదీవరకు నాలుగు రోజులు అయిదుగురు శిష్యులచేత జెంద్ అవెస్తా, బైబిల్, గ్రంథ్‌సాహెబ్, ఖురాన్, జ్ఞానేశ్వరి నుంచి కొన్ని భాగాలు చదివించారు

పైన చెప్పిన భగవన్నామాలు రోజుకొక్క గంటసేపు యీ కార్యక్రమాలలో మొదటి నాలుగు రోజులు ఒక శిష్యునిచేత గట్టిగా ఉచ్చరింప జేసారు.

ఇంతేగాక నవంబరు 5 వ తేదీనుండి అయిదు మతాల ప్రకారము బాబా ప్రార్థనలు చేసారు. అప్పుడు వివిధ మతాలకు చెందిన అయిదుగురు శిష్యులను ఒకడు శాస్త్రిగాను, ఒకడు దస్తూర్‌గాను, ఒకడు ముల్లాగాను, ఒకడు గ్రంథిగాను మరియొకడు పురోహితుడు గాను ఉండమని బాబా నియమించారు.

ఈ బాహ్య ఆచారాల గురించి బాబా యిలా చెప్పారు "పవిత్ర గ్రంథాలనుంచి పైకి చదవడము, పైకి వినిపించేలా భగవన్నామోచ్చారణ, యితర భగవత్ప్రార్థనలు యివన్నీ అమిత మైన భక్తిశ్రద్ధలతోను నమ్రతతోను చెయ్యాలి అలా చేయకపోతే అవి ఎందుకు పనికిరాని అర్థరహితమయిన వాటిగా ధూళిలో కలిసిపోతాయి అందుకనే అవి జాగ్రత్తగా సక్రమంగా చెయ్యాలి. మతాభ్యాసాలన్నీ దివ్య జీవనానికి ఓనమాల వంటివయినా నాకోసం నేను చెప్పినపుడు చాలా శ్రద్ధ వహించి మీరు చెయ్యాలి" అని బాబా చెప్పారు.

నవంబరు (1952) 7, 8, 9 తేదీలలో తమతో సహవాస్ ఉండడానికి రమ్మని బాబా కొంతమంది ప్రేమికులను పిలిచారు. వారిలో ఆంధ్ర కేంద్రఅధ్యక్షుడు తోట ధనపతిరావు, కార్యదర్శియైన వి. వి. నారాయణరావు, యింకా కాకినాడ పురస్తుడు ఏడిద సత్తిరాజు వగైరాలున్నారు. అందరికీ ఉచిత వసతి భోజన సదుపాయాలు బాబాయే ఏర్పాటు చేసారు. వచ్చిన వారందరు 7 వ తేదీ సాయంత్రానికి వచ్చి 9 వ తేదీ సాయంకాలం వెళ్ళిపోవాలి. ఏలూరునుంచి రంగారావు అతని కుమారుడు సూర్యప్రకాశ్ కూడా మెహెరాబాద్ వెళ్ళారు. సమావేశానికి వచ్చిన వారంతా బాబాకి అతిథులుగానే ఉన్నారు బాబా సామాన్య మానవుని స్థితిలోకి దిగి సహవాస్‌లో కొన్ని

ప్రసంగాలు చేశారు. మొత్తం 180 మంది ప్రేమికులు హాజరయ్యారు ఆంధ్రదేశం నుంచి 20 మంది వెళ్ళారు.

సమావేశమయిన ప్రేమికుల ఎదుట విలబడి బాబా నవంబరు 7 వ తేదీన యీ క్రింది సందేశం యిచ్చారు—"ఈ రోజు చాలా ప్రధానమయినది. అయితే మిమ్మల్ని ఎన్నుకుని నా వద్దకు రమ్మని పిలిచాను. మీరు నేను రమ్మనగానే వచ్చి నందుకు నా యెడల మీకు ఉన్న ప్రేమ విశ్వాసాలకు నేను ప్రణమిల్లుతున్నాను నా జ్యోతిర్మయ జీవితం 15 నవంబరు (1952)తో ప్రారంభం అవుతుంది. ఈ జీవితం ఏప్రెల్ (1953) నాటికి తారాస్థాయి అందుకుంటుంది అప్పటికి ఆంతరికంగా చేసిన పనికి బాహ్యాటోపం ప్రదర్శితమవుతుంది ఆ ఏప్రెల్ నెలలోనే జ్యోతిర్మయ జీవితానికి అంతిమ ఫలితం దేవుని అనుగ్రహంతో ప్రపంచం మొత్తానికి తెలుస్తుంది పెర్షియన్ భాషలో బాబా యిలా అన్నారు—

"మా పెర్వరీమ్ దుష్మనోమా
మీకోషీమ్ దుస్త్ కస్ రా
మజాల్ నీస్త్ జే చుమ్ ఓ చెరయె మా"

దీనికి అర్థం — "నా శత్రువులను బాగా పర్గిల్లచేస్తాను నా మిత్రులను తుది ముట్టిస్తాను. ఇలా నేను ఎందుకు చేస్తున్నానని బాబా యింకా యిలా అన్నారు—

"అనేకమయిన యుగాలనుంచి భగవత్ప్రేమికులు అసంఖ్యాకమయిన బరువులు మోయవలసి వస్తుంది, అనుతాపం లేని విరోధాలు ఎదుర్కోవలసి వస్తుంది. విఫలత, అవమానం కూడా బాధిస్తాయి. మానసిక వ్యధే కాకుండా శారీరక రుగ్మత కూడా కలుగుతుంది దివ్యప్రియతమునితో ఐక్యత కలిగేవరకు యివన్నీ ఉంటాయి. అందుచేత నేనూ, యీ జ్యోతిర్మయ జీవితంలో నాతో ఉండేవారూ దృఢంగా నిలబడాలి. కష్టాలు కలిగినా, ఇడుమల పాల్పడినా యింకా ఎన్ని క్లేశాలు సంభవించినా మనకున్న ఆయుధాలు—భగవంతునిలో అచంచల విశ్వాసం, ఆయన ఇచ్ఛకు పూర్తిగా లోబడి ఉండడం, అని మనం మరచిపోకూడదు. మనకు కలిగే బాధలన్నీ మన జ్యోతిర్మయ జీవితం జయప్రదంగా నెరవేరే వరకు యీ విధంగా భరించాలి."

7 వ తారీఖున సాయంత్రం సమావేశంలో దేశ్‌ముఖ్ బాబాని యీ విధంగా ఒక ప్రశ్న అడిగాడు — "నేను ఏప్రెల్ ఆఖరికి విమోచనం అయిపోతాను అని

అన్నారే దాని భావం వివరింపవంటి బాబా చెప్పారు. —"నేను బంధనంలో ఉంటున్నాను కదా ఈ ప్రాపంచిక బాధ్యతల నుంచి నేను విముక్తి పొందుతాను విముక్తి పొందడం అంటే యేమిటో రేపు వివరిస్తాను రేపు నాకు చాలా ముఖ్యమైన రోజు" మనసు తోను హృదయంలోను నేను పాలు పంచుకోవడానికి మీరంతా యిక్కడ ఉండాలి

"ఉండడం అంటే బాబాతో మనసుతోను హృదయంతోను ఉండడం అన్న మాట" మీ రందరూ నేను చెప్పేది సావధానంగా వినాలని కోరుతున్నాను —

"బాబా అవతారుడు, సద్గురువు." అని అందరికి తెలుసును. "బాబా భక్తుడుగా ఉంటాడు. బాబా భక్తుని పాత్ర అవలంబిస్తాడు. కొన్ని యుగాలయిన తరువాత యీ విశ్వాసానికి అంతం కలుగుతుంది. అప్పుడు నేను జ్యోతిర్మయ విముక్తుణ్ణవుతాను "భగవంతుడొక్కడే సత్యం. మిగతాదంతా మాయ ఇదిగో నా సందేశము —

"1952 నవంబరు 15 తేదీ నుంచి 1953 ఏప్రెల్ నెలాఖరునాటికి భగవంతుని సత్యత్వము తెలుస్తుంది మెహెరాబాదు తప్ప మీ ఆలోచనలో బయటది యింకేదీ రాకూడదు అందుకనే అంతంత దూరాల నుంచి మిమ్మల్ని రమ్మని పిలిచాను. నాలుగు భాషలలో నలుగురు చేత భగవంతుని ప్రార్థన చేయిస్తాను.

"ఓం పరబ్రహ్మ పరమాత్మ" అని హిందువులు
"యా యజ్‌దాన్" అని ఇరానీలు
"యా ఇలాహి ఇల్లల్లా" అని ముసల్మానులు
"ఓ గాడ్ ఫాదర్ ఇన్ హెవెన్" అని క్రైస్తవులు

ఉచ్చరించాలి ఈ నాలుగు ఒకే భగవంతుని గూర్చియే ఆ భగవంతుడు మన ప్రార్థన వింటాడు. కపటం వదిలేసి తెరచిన హృదయంతో భగవంతుని ప్రార్థించండి. ఇంటి దగ్గర మీ యిల్లు, భార్య పిల్లల గురించి ఆలోచించవద్దు మీ ఆస్తుల గురించి రేపటిరోజున ఏమవుతుంది అనేది మీ మనసులోకి రాకూడదు ఉదయం నుంచి సాయంత్రం వరకు భగవంతుని గూర్చే మీరు ఆలోచించాలి. అప్పుడే మీరు యిక్కడికి వచ్చినట్లవుతుంది" 8-11-52 న జ్యోతిర్మయ స్వేచ్ఛా జీవితం గురించి బాబా వివరిస్తారు.

"ఈరోజు నాకు నా భక్తులకు చాలా ప్రధానమయిన రోజు. జ్యోతిర్మయ జీవితం నవంబరు 15 తో ఆరంభం అవుతుంది. అందుచేత నాకు ప్రియమైన వారిని కొందరిని యీ రోజున యిక్కడికి రమ్మని పిలిచాను. నా పిలుపును మన్నించి వచ్చినందుకు మీ ప్రేమకి నా ప్రణామాలు. నేను చెప్పేమాటలు మీరు ఓర్పుతో వినండి. నేను ఏమి నిశ్చయించానో మీకు చెబుతాను. నా జ్యోతిర్మయి జీవితం మొదలు కాక ముందు మీతో భక్తుల గురించి చెబుతాను. మామూలు భక్తునికి అజ్ఞానంవల్ల అన్ని రకాల కోరికలు, రాగములు ఉంటాయి. వారికి కోరికలు ద్వంద్వాలు ఉంటూనే ఉంటాయి. వారి అజ్ఞానంవల్ల మంచి, చెడ్డ, సుగుణాలు, దుర్గుణాలు వారికిఉంటాయి. సందేహాలు, అలజడులు, దుఃఖాలు ఆ అజ్ఞానమువల్లనే ఉంటాయి. జ్ఞాని అయినవానికి యివి ఉండవు. ఇవి లతన్ని బాధించవు. జ్ఞానం కలిగేవరకు అతనికి యీ ద్వంద్వ తత్వాలు ఉండకతప్పదు. ఈరోజున నేను మామూలు భక్తుని పాత్ర తీసుకున్నాను — అతడు భగవంతుని తన తప్పులకు క్షమాపణ కోరుకుంటాడు — మీలో కొందరికిగాని అందరికి గాని సంగత్వ బంధనాలుంటాయి. అందుచేత మీరు మామూలు భక్తుని స్థానంలో ఉన్న నాతో చేరి దేవుని క్షమాపణ అడగాలి.

"జ్ఞాని అయిన వానికి భగవంతుడు తప్ప యింకేదీ ఉండదు. అతనికి అందరూ భగవంతుడే. సర్వమూ భగవంతుడే. అతనికి బుద్ధిచేత తెలుసుకోవడం ద్వారానే కాదు అతడు అనుభవపూర్వకంగా ఆ సంగతి తెలుసుకున్నాడు. అనాదినుంచి అనంతము వరకు శాశ్వత విశ్వాసం అతని అనుభూతి ద్వారా ఏర్పడిపోయింది. భగవంతుడే, భగవంతుడు మాత్రమే, ఉన్నవాడు. ప్రపంచానికి నా సందేశము ప్రేమయే. ఈ ప్రేమ రెండు విధాలుగా ఉంటుంది. ప్రధానమయినది నిర్గుణుడయిన దేవుని యెడల గాని సగుణుడయిన దేవుని యెడలగాని ఉండే ప్రేమ. దానితో దాని ప్రియతమునితో ఏకం కావాలనే కాంక్ష. ఈ ప్రేమికుడు అన్నీ మరిచిపోతాడు; అందరినీ వదిలేస్తాడు; దివ్య ప్రేమయొక్క అగ్నిలో అతడు ఆహుతి అయిపోతాడు. రెండవదానిలో ప్రేమికుడు మానవకోటినే ప్రేమిస్తాడు. ఇతరులు సుఖపడాలని యీ ప్రేమికుడు కోరుతాడు. ఈ ప్రేమ ఉన్నతమయినప్పుడు దివ్య ప్రేమికుని వలెనే యితడు కూడా తనను తాను పూర్తిగా మరిచిపోయి తనను తాను ఆ ప్రేమలోనే పోగొట్టుకుంటాడు.

"నా జ్యోతిర్మయ జీవితం నవంబరు 15 న ప్రారంభమై, 1953, ఏప్రెల్ మాసాంతానికి ప్రేమికుడు ప్రేమాగ్నిలో ఆహుతి అయి తన్ను తాను మరచిపోతాడు.

"భగవంతునిలో అచంచలమయిన విశ్వాసము ఆయనకు సంపూర్ణమయిన ఆత్మార్పణ నా యొక్క జ్యోతిర్మయ జీవితాన్ని మరింత జయప్రదముగా నొనర్చును" — బాబా మనలను యిక్కడ సమావేశపరచిన కారణము దాని గురించిన ప్రకటన యీ విధంగా చేసారు.

"ఆయన ఇచ్ఛ ప్రకారము జరుగునని భగవంతుడు నన్ను ప్రకటించమని కోరాడు. ఎన్ని యుగాలయిన శాశ్వతంగా ఆయన ఇచ్ఛయే చెల్లుతుంది"

ఇప్పుడు నేను ప్రకటించిన యీ మాటలు ఏప్రెల్ మాసాంతము వరకు జ్ఞాపకముంచుకోవాలి.

"1953 ఏప్రెల్ మాసం రెండవ పక్షంలో భగవంతుడు సర్వమూ నాశనమయినా చేస్తాడు లేక ఎలా ఉండాలో అలాగ సరిదిద్దుతాడు.

"ఇది నేను వివరిస్తాను విశ్వవ్యాప్తమయిన యీ అస్తవ్యస్త పరిస్థితి, సందేహాలు, అనుమానాలు, విద్వేషాలు, వినాశకరమయిన చర్యలు అన్నీ అంతమవుతాయి — సరిదిద్దబడతాయి ఇదివరకెప్పుడూ జరగని విధంగా భగవంతుడు ప్రకటీకరణం కావాలి. లేకపోతే విశ్వవ్యాప్తంగా గందరగోళం అయోమయ స్థితి ఏర్పడుతుంది అప్పుడు నా తనువు నేను త్యజిస్తాను. 700 సంవత్సరాలకు నేను మరల అవతరిస్తాను మీలో కొందరు అప్పుడు శరీరధారులై వస్తారు. నా జ్యోతిర్మయ స్వేచ్ఛా జీవితానికి మీ ఆశీస్సుల నివ్వండని నేను కోరుతున్నాను. ఇక్కడ హాజరుగా ఉన్న దేవుని ఏప్రెల్ నెలాఖరుకి నా పని జయంగా పూర్తి చేయడానికి నాకు శక్తి నిమ్మని వేడుకోండి"

8-11-52 వ తేదీన బాబా యిచ్చిన సందేశం యిలా ఉంది — "కొద్ది క్షణాలలో నా పాపాలను, నాకు సంబంధించిన వారి పాపాలను క్షమించమని నేను భగవంతుని కోరబోతున్నాను. ఈ పశ్చాత్తాపములోను యీ ప్రార్థనలోను నన్ను కూడా కలుపుకుంటున్నాము గనుక తాత్కాలికంగా నేను ఒక సాధారణ భక్తుని స్థానం

తీసుకుంటున్నానని మీరు తెలుసుకోవటం ముఖ్యం ఆ భక్తుని భక్తి. భగవంతునితో ఐక్యత చెడ్డ ఆలోచనలతోను, చెడ్డ భావాలతోను, చెడ్డ మాటలతోను చెడ్డ కార్యాల తోను బలహీన పడిపోయింది

"ఉన్నవాడు భగవంతుడొక్కడే అని నాకు తెలుసును మంచి చెడు అనేవి భగవంతుని వ్యక్తీకరణాలే. సాధారణ మానవుడు సాధారణ భక్తుడు యీ మంచి చెడు అనేవి భగవంతుని యందున్న విశ్వాసానికి ఫలాలే అని తెలుసుకుంటాడు. "అందుచేత అది నిజమైన జ్ఞానము కాదు — సిద్ధాంతమును తెలుసుకోవటం మాత్రమే కావున అది కర్మధర్మాన్నుండి విముక్తిచేయదు. ఆ ధర్మము భగవంతుని ఇచ్ఛమీద ఆధారపడియుండే న్యాయము. శాశ్వతంగా ఉండిపోయే న్యాయం అది

"జ్ఞాని మాత్రం అనుభవపూర్వకంగా తెలుసుకుంటాడు గనుక అన్ని బంధాలనుంచి అతడు స్వేచ్ఛను పొందుతాడు కర్మధర్మాన్నుంచి కూడా అతడు ముక్తుడని అతనికి తెలుసును. మంచి చెడు లక్షణాల నిజము అతడు తెలుసు కున్నాడు గనుక అతడు ఏది ఆలోచించినా, ఏమి చెప్పినా, ఏమి చేసినా, దానికి అతడే జవాబుదారీ అనికూడా అతనికి తెలుసును ఇంకా యీ మంచికి చెడుకి ఫలితాలు అంటే స్వర్గనరకాలు, మరణము, పునర్జననము కర్మసూత్ర ప్రకారం భగవంతుని ఇచ్ఛచేత 'జరుగుతాయ'ని కూడా అతనికి తెలుసును ఈ స్వర్గనరకాలు ఉన్నాయని అజ్ఞానం వల్ల అతనికి నమ్మకం కలుగుతుంది.

"మానవకోటి కోసం జ్ఞాని భగవంతుని అడిగి వారికి ఉపకారం చేద్దామని ప్రయత్నిస్తాడు గాని తన కోసం క్షమాపణ కోరడంగాని తనకోసం భగవంతుని ఏదీ అడుగడు భగవంతుని ప్రత్యేకమయిన ఆజ్ఞప్రకారం ఉన్నత దశానికి చెందిన, భక్తుడు ప్రియతముడయిన దేవుని మీదే ఆధారపడి యుంటాడు అతడు జ్ఞాని అయినచో కర్మధర్మం అతనికి వర్తించదు భక్తుడికి యీ విధంగా వర్తించే కర్మ సూత్రం జ్ఞానికి వర్తించదన్నమాట తెలియనే తెలియదు.

"మామూలు భక్తుడు అతడు తన భక్తిలో ఎంత నిజాయితీగా ఉన్నా కర్మ ధర్మానికి బంధితుడై ఉంటాడు. ఈ న్యాయాన్ని అతడు తన ఆధ్యాత్మిక లాభానికి ఉపయోగించుకోవడమే మంచి పని. సద్గుణాలు నిరంతరము అభ్యాసం చేసుకోవటము, పాపాలు చేయకుండా ఉండడంవల్ల యీ కర్మ న్యాయాన్ని అతడు

ఆచరణలో పెట్టుకుంటాడు. పుణ్యపాపాలు ఆవరించినప్పుడు అతడు దేవుడికి పూర్తిగా వశుడై ఆయనయొక్క కృపకి పాత్రుడై క్షమాపణ కోరుకోవాలి"—

ఇలా ప్రసంగించిన తరువాత బాబా నాలుగు ముఖ్య మతావలంబుల చేత మొదటి రోజువరె (7-11-52) "ఓం పరబ్రహ్మ పరమాత్మ" అని హిందువుల చేతను, ఓ గాడ్ ఫాదర్ ఇన్ హెవెన్' అని క్రైస్తవులచేతను, "యా యజ్దాన్" అని ఇరానీల చేతను, 'యా ఇలాహి ఇల్లల్లా' అని మహమ్మదీయుల చేతను ప్రార్థనలు చేయించి అందరిచేత బాబా క్షమాపణ ప్రార్థన (పశ్చాత్తాప ప్రార్థన) చేయించారు

9-1-52 వ తేదీన వారి సేవను ధనములను, జీవితాలనే అంకితం చేసు కోవడానికి కొన్ని నమూనా కాగితాలను బాబా ప్రేమికులకు పంపించారు. ప్రేమికులు ఆ ఫారాలు పూర్తిచేసి బాబాకి పంపించారు బాబా అన్నారు.

"మీరందరూ నన్ను ప్రేమిస్తూ నేను చెప్పినట్లు చేయడానికి మీ శాయ శక్తులా ప్రయత్నిస్తారని నేను నమ్ముతున్నాను డబ్బు సంగతి మీరేమి చెయ్యలేక పోతే అందుకోసం ఎంతమాత్రం మీరు విచారించరాదు నాకు మీరు నా యెడల ప్రేమ కలిగి ఉంటే చాలును. దాని కోసం ఎవరూ బెంగ పెట్టుకోకూడదు. మీరు సొమ్ము యిస్తే అది అనేక విధాలుగా నేను ఉపయోగిస్తాను. లేకపోతే నా యెడల మీరు చూపించే ప్రేమకి మీకు అడ్డుతెర వేసుకోకండి. మీకు పంపిన ఫారాలలో సరే అని వాటిమీద సంతకం చేసి యిచ్చినా మీరేమీ చెయ్యలేకపోయినా నేను మీకు దాని నుండి విముక్తి కలిగిస్తున్నాను. ఒక జాబితా తయారు చేయించి సరే అని సంతకం పెట్టిన వారి పేర్లను జాబితా ప్రకారం చదివించారు బాబా. మీరు యివ్వగలిగిందేదో అదే యివ్వండి.

"బాబా డబ్బుకావాలని కోరడం లేదు. మీరు పది రూపాయిలు గాని అంత కంటె యెక్కువగాని యివ్వగలిగితే అది మెహెర్‌జీకిగాని నారిమన్‌జీకిగాని యివ్వండి. కొందరు ప్రతీనెలా కొంత పంపుతామని వ్రాసారు. కానీ బాబా ప్రతీనెలా కొంత పంపే పద్ధతివద్దు అనిచెప్పారు. "ఏప్రెల్ తరువాత డబ్బు అవసరమే ఉండదు, అందువలన యివ్వగలిగిందేమిటో యిప్పుడే యివ్వండి." అని బాబా అడిగారు. మీరు యివ్వలేక

పోతే దానికేమీ బాధపడవద్దు బాబా మిమ్మల్నందరిని ప్రేమిస్తున్నారు ఇప్పుడివ్వలేని వారు యింటికి వెళ్ళి డబ్బు పంపించవచ్చును. కాని నవంబరు 15 వ తేదీలోపుగానే అది నాకు అందాలి మీరు ఏమి పంపినా స్వీకరించడానికి నేను అంగీకరిస్తున్నాను అలా పంపితే యిప్పుడిచ్చినట్లే భావిస్తాను నవంబరు (1952) 15 వ తేదీ తరువాత డబ్బు పుచ్చుకోబడదు నేను అధికారంతో చెప్తున్నాను బాబా పేదవారిలో పేదవాడు ధనికులలో ధనికుడు. ఇది లాంఛనంగా చెప్పడం కాదు. నిజంగానే నేను చెప్తున్నాను. నేను మౌనం ప్రారంభించినప్పటి నుంచి నేటివరకు నేను డబ్బు ముట్టుకోలేదు, మస్తులకి బీదవారికి యిచ్చేటప్పుడు తప్ప. బాబాతో ఉన్నవారికి లెక్కలు వ్రాసేవారికి గత 27 సంవత్సరాలలోను 80 లక్షల రూపాయిలు యీ చేతులతో ఖర్చు పెట్టాము

ఆధ్యాత్మిక సాధకులకి డబ్బు ఉపయోగంగా ఉంటుంది, నాశనకరంగానూ ఉంటుంది. సర్వసంగ పరిత్యాగులకి యిది ముఖ్యంగా అవసరం. గురువుల విధానాలు విభిన్నంగా ఉంటాయి. సాయిబాబా మూర్తీభవించిన సంపూర్ణత్వం. ఆతడేమి చేస్తాడంటే దర్బారులోకి అడుగుపెట్టిన ప్రతివాని వద్దనుంచి డబ్బు తీసుకుని తన జేబు నింపుకుంటాడు. మళ్ళీ ఆ డబ్బంతా పంచి పెట్టేస్తాడు. మొదట సాయిబాబాకి ఎదుటనే కూర్చుండే బడాబాబాకి యిస్తాడు. కొంత మందివద్ద తిరిగి వెళ్ళడానికి కూడా డబ్బు ఉండేదికాదు. దగ్గిర ఉన్నదల్లా సాయిబాబా తీసుకునేవాడు పూర్ణపురుషుడయిన సాయిబాబా యిలా ఎందుకు డబ్బడిగేవాడో మరి ఉపాసని మహరాజ్ అప్పుడు విరోబా ఆలయంలో ఉండేవాడు ఇవి అర్థంగాక ఉపాసనీ మహరాజ్‌ని అడిగాడు కూడా ఒకడు ఆ రోజుల్లోనే పూనాలో బాబాజాన్ ఉండేది. ఆమె ఆధ్యాత్మిక చక్రవర్తి, ఆమె విధానాలు వేరు. ఆమెను చూసినవారికి ఆమె ఒక చెట్టుక్రింద ఉండేదని తెలుసు. చలికాలమయినా పైన ఏమీ కప్పు లేకుండానే ఉండేది ఆమె తెల్లవారు జామున 4 గంటలు మొదలు 9 గంటలవరకు ఆమె అక్కడే పడుండేది నేను గుస్తాద్‌జీని ఆమెవద్ద రాత్రంతా కూర్చోమని పంపేవాడిని. ఆమె ఎదురుగా ధునిలో నిప్పు రాజుతూ ఉండేది ఆమెకి ఎవరయినా డబ్బు యివ్వడానికి వస్తే ఆమె ధునిలో పుల్లవేసి రగుల్కొలిపేది. ఆమె డబ్బు యిస్తానన్నవాడిని తరిమేసేది. డబ్బు తీసుకునేది కాదు. సద్గురువుల పద్ధతులు విభిన్న రకాలుగా ఉంటాయి. ఈముగ్గురు సద్గురువులను యీ వేళ జ్ఞాపకం చేసుకోవడానికి నాకు సంతోషంగా ఉంది. ఇప్పుడు వారు నాలోకి వచ్చేసారు. నాయెడల ప్రేమగల వారంతా ఆ సద్గురువులకు నేను జోహారు చేస్తుంటే నాతో కలవండి." ఈ ప్రసంగంతో ఆరోజు కార్యక్రమం ముగిసింది.

9-11-52 మరునాడు సకల ప్రేమికులంతా ఉదయం సమావేశ మయినారు బాబా—"నా జ్యోతిర్మయ జీవితం తమాషా కాదు ప్రజా దర్శన కార్యక్రమం వారి పనికి అంతరాయం కలుగ జేస్తుంద'ని బాబా అన్నారు నమస్కారాలు చేయడం బాబాకి యిష్టం లేదు తద్వారా పేరు సంపాదించడం అసలే యిష్టం లేదు. వేరే వేరే వ్యక్తులతో సంభాషణలు లేవు. అందరితోనూ ఉన్నప్పుడే బాబాను చూడవచ్చును "నేను బంధింపబడేఉన్నాను నేను శాశ్వతంగా, స్వతంత్రంగాను, స్వచ్ఛంగాను ఉన్నాను" బాబా యింకా యిలా చెప్పారు.

"నాకు అక్కర్లేదని తోచినప్పుడు కార్యక్రమం కట్టేసి వెళ్ళిపోతాను. ప్రపంచం అంతటికోసం నేను ఏ పనయినా చేస్తాను కాని ప్రజాదర్శనాలంటే నాకు అక్కరలేదు

నీ యిల్లు చక్కదిద్దుకోలేని వాడవు యింక ప్రజానీకానికి ఏం చేయగలవు? నిన్న నేను ప్రకటించినట్లుగా నా జ్యోతిర్మయ జీవితంలో నాతో ఉన్నవారు అన్ని రకాల కష్టాలకి, మానసికంగా నిరాశకి, శారీరకమైన జబ్బులకి, అవహేళనలకి గురి అవుతారు కాని అందువల్ల నా జ్యోతిర్మయ స్వేచ్ఛా జీవితానికి ఏవిధంగానూ అడ్డు తగలరు కాని ఎవరితోనయినా సంభాషణలు చేయవలసి వస్తే అవి అడ్డుగానే ఉంటాయి. నా పనికి అవి అంతరాయం కల్పిస్తాయి నేనెక్కడికన్నా రమ్మంటే వస్తాను సందేశాలు యిస్తాను వ్యక్తులతో సంభాషణలు మాత్రం చెయ్యను. నేను ఒక బిడ్డలాటివాడిని నేను ప్రజాదర్శన కార్యక్రమాలకి వెళ్ళడం లేదు కాని నా జ్యోతిర్మయ స్వేచ్ఛాజీవిత కార్యక్రమాలకి వెళ్తాను. అవి నాకు అంత బాధాకరంగాదు.

ఆలి అక్బర్ నా వద్ద చిన్నతనం నుంచి ఉన్నాడు. బాబాను అతడు అమితంగా ప్రేమిస్తాడు. ఒక్కొక్కప్పుడు అతడు తన ప్రేమను నిగ్రహించుకోలేడు. నేను ఎలా పనిచేస్తానో మీకు తెలియదు. ప్రేమ వ్యక్తం చేయడానికి అడ్డం ఉండ కూడదు. ఎంతమందయినా రావచ్చు. వారి ప్రేమను చూపించి వెళ్ళవచ్చు

ఎన్నివేల జన్మలయినా జ్ఞానం రావడం కష్టం. జ్ఞానం త్వరగా వస్తుందన్నే మాట సరికాదు జ్ఞానం అనేది ఊహకి అతీతమయినది. ఊహయే అపరిమితంగా వెడుతుంది అసలు – మానవుడు అసంపూర్ణుడయినా, వాని ఊహకి ఏమీ అడ్డులేదు

కదా. ప్రపంచం అంతా సృష్టింపబడటం మనసులోని ఊహ చేతనే అయినప్పటికి జ్ఞానం చేత అది అరికట్టబడుతుంది ఊహాశక్తిచేత అనాదిగా ఉన్నది అనంతంగా ఉన్నదీ ఎవరూ వివరించి చెప్పలేరు ఊహకి అది అతీతమయినది. జ్ఞానం శాశ్వతమయినది దాన్ని ఊహ అందుకోలేదు ఆది అంతము లేనివాడు భగవంతుడు.

ఎంతటి ఊహాశక్తి అయినా అది జ్ఞానాన్ని అందుకోలేదు అది జ్ఞానం విషయంలో చాలా నిస్సహాయత కలిగి ఉంటుంది. ఊహ పోవడానికి మనసుపోయి చైతన్యం మిగిలి ఉండాలి వేదాంతం కాని, సూఫీజం కాని, జ్ఞానాన్ని వివరించలేవు. అపారమైన పారావారాన్ని ఊహించవచ్చు గాని అగణితమయిన బిందువులని లెక్క పెట్టరాదు.

అందుచేత జ్ఞానం ఊహించరానిది ఉదాహరణకి భగవంతుని ముందు ఏమి ఉంది అంటే భగవంతుడే అని చెప్పాలి తరువాత కూడా భగవంతుడే. అందుకే జ్ఞానం మునులకి ఋషులకి అందనిది అన్నారు

ఊహ యొక్క వలలో కాళీ తప్ప ఏదీలేదు. స్వయంభువం గాని ఆత్మ జ్ఞానం గాని హేతువుమీద గాని ఊహమీద గాని ఆధారపడిలేదు స్త్రీ గాని, పురుషుడు గాని, బిడ్డగాని, వ్యక్తిగతమయిన అస్తిత్వాన్ని సంపాదించదు. దాని అవసరమూ లేదు స్త్రీకి తాను స్త్రీ అని తెలుసును దీనికి హేతువాదం అక్కరలేదు తన స్త్రీత్వం గురించి తనకి తెలుసును. జ్ఞానం ఒక మనిషికి కలిగితే తాను అన్నిటిలోనూ చూసుకోవడమే గాక తనలో భగవంతుని కూడ చూసుకుంటాడు. అలాగే దివ్య స్వయంభువు జ్ఞానము, శక్తి, ఆనందము కూడాను ఏ నిమిషంలో నయినా జ్ఞానం రావచ్చును. అతడు భగవంతుని ఇచ్ఛకు సమర్పణ అవాలి లేకపోతే ఊహను నాశనం చేసుకోవాలి. అందుకనే తుకారాం గురువు సహాయంలేనిదే మార్గం లేదంటాడు.'' అని చెప్పి బాబా అక్కడ సమావేశమైన వారందరికి ప్రణమిల్లారు తరువాత మరల యిట్లు చెప్పారు.

''మీరంతా ఓపికతో నేను నిశ్చయించుకున్నది నేను చెప్పబోయేది సావధానులై వినండి నా జ్యోతిర్మయ జీవితం గురించి ఒక భక్తునిగా నేను యీ రోజున మీకు వివరిస్తాను.

"సాధారణమయిన ఒక భక్తునికి అస్థిరకాల ఆసక్తులు ఉంటాయి. అజ్ఞానం వల్ల అతనికి కోరికలుంటాయి ద్వైతభావ ముంటుంది. ఈ అజ్ఞానం వల్లనే పుణ్యము, పాపము, మంచి, చెడు అనేవి అన్నీ ఉంటాయి. సంశయాలు, సందేహాలు, పొరపాట్లు, దుఃఖాలు యివన్నీ కూడా అజ్ఞానంవల్ల కలిగినవే. జనన మరణాలు జ్ఞానంలో నిజంగా వట్టివయినా, అజ్ఞానంలో వాటికి అర్థం ఉంది. అందుచేత భక్తునికి జ్ఞానోదయమయ్యే వరకు మంచీ - చెడూ, యివన్నీ ఉంటాయి. అందుచేత యీ రోజున తప్పులుచేసి భగవంతుని క్షమాపణ కోరుకునే మామూలు భక్తుని స్థానంలో నేను యిప్పుడు ఉంటున్నాను.

తరువాత బాబా యీ క్రింది విధంగా చదివించారు. "కొద్ది క్షణాలలో భగవంతునికి పశ్చాత్తాపం వెలిబుచ్చి నా పాపాలకు నాతో సంబంధమున్న వారందరి పాపాలకు ఆయనను క్షమాపణ కోరుకుంటాను. ఈ ప్రార్థనలోను యీ పశ్చాత్తాపంలోను నన్ను కలుపుకుంటున్నాను. కనుక నేను యీ ప్రస్తుత సమయానికి ఒక సాధారణ భక్తుడుగా ఉంటున్నానని మీరు తెలుసుకోవడం ముఖ్యం. అంటే ఆ భక్తుడుకి భగవంతునితో ఐక్యత కలగాలని మనసులో భావం కలుగుతూ ఉంటుంది. మళ్ళా ఆ మనసులోనే చెడ్డ ఆలోచనలు కలుగుతూంటాయి, వాటి ప్రకారం చెడ్డమాటలు చేతలు కూడా అనుసరిస్తూంటాయి.

"భగవంతుడు మాత్రమే ఉన్నాడని నాకు తెలుసును. అలాగే మంచీ, చెడూ అనేవి ఆ భగవంతుని యొక్క ప్రకటనలని కూడా తెలుసు. మామూలు మనిషికి, మామూలు భక్తుడికి కూడా, యీ మంచి చెడుల యొక్క స్వభావము యొక్క ఎరుక నమ్మకము హేతువుయొక్క ఫలమే. అది యొక సిద్ధాంతమే గాని నిజమైన జ్ఞానము కాదు. అందుచేత అది కర్మసూత్రము నుండి వానిని విముక్తి చేయదు. ఈ ధర్మము భగవదిచ్ఛమీద ఆధారపడి యుండును. శాశ్వతంగా ఎల్లకాలముల యందును అమలులో నుండునదై యున్నది.

జ్ఞాని తనకు అనుభవపూర్వకముగా సత్యమును తెలుసుకున్నాడు గనుక అనుబంధముల నుండి పూర్తిగా విముక్తుడై నాడు. అందుచేత కర్మ సూత్రము అతనిని ఏమీ బంధించలేవని అతనికి తెలియును. మంచి చెడుల యొక్క నిజస్వభావము అతనికి తెలియును గనుక తను అనుకున్న దానికి భావించిన దానికి చేసినవానికి

ఎవరూ బాధ్యులు కారని కూడా అతనికి తెలియును పుణ్యపాపముల ఫలితాలు - స్వర్గనరకాల లాంటివి మరల మరల పుట్టుట, గిట్టుట - ఇవి ఈశ్వరేచ్ఛ ప్రకారం విశ్వధర్మాన్ననుసరించి జరిగేవి అవి అజ్ఞానము వలన ఉనికి ఏర్పరచుకున్నవి

భక్తుల కొరకు, మానవాళి కొరకు భగవంతుని కోరే జ్ఞాని తనకోసం పశ్చాత్తాపం తెలుపుట గాని క్షమాపణ వేడుకొనుట గాని ఎన్నడూ చేయడు దివ్య ప్రియతముని పై ఎల్లప్పుడు చిత్తము ఆయత్తము చేసికొనియున్న అత్యుత్తమమైన భక్తుడు జ్ఞానివలెనే కర్మధర్మము నుండి సంపూర్ణముగా విడివడిన వాడై యున్నాడు. అది భగవంతుని ప్రత్యేక ఆదేశము. అట్లు కర్మ సూత్రమునకు తాను బద్ధుడుకాడని తనకు తెలియును. జ్ఞానానికి తెలియును. కాని మామూలు భక్తుడు ఎంత శ్రద్ధ కలవాడయినా కర్మధర్మమునకు బద్ధుడవుతున్నాడు. అందుచేత యీ ధర్మము తన ఆధ్యాత్మిక ప్రయోజనము కొరకు ఉపయోగిస్తూ పాపములు చేయకుండా పుణ్యకార్యములే ఆచరించుట దానికి ఉత్తమ మార్గము ఒకవేళ వాడు సత్కార్మలకు దూరుడై పాపాచరణయందు నిమగ్నమైనచో అతడు భగవంతుని కరుణకు పాత్రుడగుటకు ప్రయత్నించాలి భగవంతుని క్షమాపణ వేడుకోవాలి

ఇప్పుడు పశ్చాత్తాప క్షమాపణ ప్రార్ధన నా తరఫున, మీ కొరకు నాతో సంబంధించిన అందరి కొరకు కూడా వ్రాయబడుతుంది" తరువాత బాబా యిలా అన్నారు —

"కావచ్చు — మీలో కొందరో, చాలామందో లేక అందరూనో బంధ రహితులై, కోరికలు లేక, విరాగులై యుండవచ్చును కానీ యీ రోజున నేను యీ స్థితిలో ఉన్నందువలన మీరందరూ నేను భగవంతుని క్షమాపణ వేడుకొనుటలో నాతో చేరండి"

అప్పుడు ప్రేమికులందరు బాబాతో లేచి నిలబడి భక్తి తత్పరులై తమ భావాలను బాబా చదివించిన ప్రార్థనలో ఏకం చేసారు.

## పశ్చాత్తాప క్షమాపణ ప్రార్థన —

"ఓం పరబ్రహ్మ ! పరమాత్మ! యాయజ్దాన్! లా ఇలాహీ యా అల్లా ! ఓ గాడ్, ఫాదర్ ఇన్ హెవెన్ !"

అని భగవంతుని సంబోధించి బాబా మండలిలో నలుగురు ఏడుమార్లు యీ విధంగా ప్రార్థన చదివారు.

"పరమదయానిధివగు ఓ ఈశ్వరా !

"మా పాపము లన్నిటికిని మేము పశ్చాత్తాప పడుచున్నాము.

అసత్యము, అధర్మము, అపవిత్రమునగు మా ప్రతి తలంపునకు, పలికి యుండరాని పలికిన ప్రతిమాటకు, చేసి యుండరాని చేసిన ప్రతి పనికిని మేము పశ్చాత్తాప పడుచున్నాము.

"స్వార్థముచే ప్రేరేపింపబడిన ప్రతిపనికి, ప్రతి మాటకు, ప్రతి తలంపునకు, ద్వేషముచే ప్రేరేపింపబడిన ప్రతి పనికి, ప్రతి మాటకు, ప్రతి తలంపునకు మేము పశ్చాత్తాప పడుతున్నాము.

"ముఖ్యముగా కామముతో కూడిన మా ప్రతి తలంపునకు, కామ ప్రేరితమగు మా ప్రతిచేతకు, పలికిన ప్రతి అన్ృతమునకు, సమస్త కపట వర్తనమునకు, ఆడితప్పిన ప్రతి వాగ్దానమునకు, సమస్త పరనిందలకు, పరోక్ష నిందలకు, మేము పశ్చాత్తాప పడుతున్నాము.

"ఇంకను ముఖ్యముగా కూడ, పరులకు నాశన మొనగూర్చిన మేము చేసిన ప్రతిపనికి, ఇతరులకు బాధ కలుగజేసిన మే మాడిన ప్రతిమాటకు, చేసిన ప్రతి చేతకు, ఇతరులకు బాధ కలుగవలెనని మేము కోరిన ప్రతి కోర్కెకు మేము మిక్కిలి పశ్చాత్తాప పడుతున్నాము.

"అపార దయానిధివగు ఓ ఈశ్వరా ! మేము చేసిన యీ పాపము లన్నిటికి మమ్ములను క్షమింప వేడుకొంటున్నాము.

"తలపులలో, మాటలలో, చేతలలో నీ యిచ్ఛానుసారము చేయజాలక నిరంతరము విఫలులమగుచున్న మమ్ములను క్షమింప వేడుకొంటున్నాము."

ఈ ప్రార్థనకు మరాటీ భాషలోను హిందీభాషలోను అనువాదాలను చదివే వరకూ కూడా బాబా వారి శిష్యులందరితోను గౌరవముగా నిలబడి యున్నారు. ప్రార్థనలు చదివిన తరువాత అందరూ కూర్చున్నారు.

అప్పుడు బాబా యిలా చెప్పారు —

"జ్ఞానికి గాని ప్రేమికునికి గాని సామాన్యముగ ఉండే యీ ఆసక్తులు ఉండవు జ్ఞానికి భగవంతుడు తప్ప యింకేమీ లేదు అతనికి ప్రతియొక్కరు ప్రతి వస్తువు భగవంతుడే ఆ విధంగా బుద్ధివిశేషం చేత తెలుసుకోవడమే కాదు, కాని నిజమైన అనుభవం చేత అతను తనకున్న నమ్మకం చేత తెలుసుకున్నాడు — అనాదినుంచి అనంతము వరకు నిరంతరాయముగా ఉన్న అతని అనుభవం వలన భగవంతుడు ఒక్కడే, ఒక్కడు మాత్రమే - ఉన్నాడని తెలుసుకున్నాడు.

ప్రపంచమునకు నా సందేశము అనాదినుండియు ఉండనే ఉంది అదే ప్రేమ ఈ ప్రేమకు రెండు రీతులున్నాయి అవి రెండూ నిజమైనవే మొదటిది స్వచ్ఛమైన ప్రేమ. రెండవది మాయతో కూడుకొనిన అనురాగము ఇంక ఏ విధమయిన రాగమయినా మనము ప్రేమ అంటే అవదు అది మాయ తప్ప వేరుకాదు.

సాకారుడు అయినా లేక నిరాకారుడయినా ప్రియతమునితో ఐక్యతకొరకు ఉండే తీవ్రమయిన వాంఛ అసలైన ప్రేమయొక్క ఒకరీతి అటువంటి ప్రేమికుడు అన్నీ మరచిపోతాడు. ప్రతి యొక్కరిని వదిలేస్తాడు దివ్య ప్రేమాగ్నిలో తాను ఆహూతి అయిపోతాడు. రెండవ రీతిలో భగవంతునిలో మానవకోటి ఒక భాగంగా ప్రేమిస్తాడు. తన ప్రయోజనాలను ప్రేమికుడు మరచిపోతాడు. తన సుఖాలను వదులుకొని యితరులను సుఖపెట్టడం కోసం యితరులకు అభ్యున్నతి కలుగజేయడం కోసం ప్రయత్నిస్తాడు. ఈ ప్రేమ శిఖరాగ్రాన్ని అందుకుంటే అతడు కూడా దివ్య ప్రేమికుని వలె తన్ను తాను పూర్తిగా మరిచిపోయి ప్రేమలో, ప్రేమ ఒక్కదానిలో మాత్రమే తనను పోగొట్టుకుంటాడు."

జ్యోతిర్మయ జీవితంయొక్క సాధ్యముల గురించి, భగవంతునిచే నిర్దేశింపబడినదాని ఫలితము గురించి చెప్పి సభలో కూర్చుని ఉన్న కృష్ణాజీ అనునాక స్వామిని "భగవంతుడు నిర్ణయించిన దానిని నెరవేర్చుటకు నాజ్యోతిర్మయ జీవితంలో భగవంతుడు నాకు సహాయం చేయుటకు ప్రార్థించుము" అన్నారు.

అప్పుడు కృష్ణాజీ లేచి ప్రార్థన చేయుచుండగా బాబా తన మండలి అందరితోను లేచి నిలబడ్డారు ఉద్రేకంతో కూడిన ప్రార్థన ఆంగ్లములో చేస్తూ కృష్ణాజీ యిట్లు ముగించాడు.—"నేను బాబాయే భగవంతుడని భావిస్తున్నాను" ఇది అందరికీ

ఆశ్చర్యాన్ని కలుగజేసింది. ఎందుచేతనంటే నిష్క్రియ జీవితంలో బాబా తన ఆధ్యాత్మిక స్థితి గురించి బహిరంగంగా చెప్పడానికి ఎవరినీ అనుమతించలేదు.

తరువాత మెహెరాబాదులో బాబా ఆ క్రితంరోజున చెప్పి వ్రాయించిన సందేశం చదివించారు—

## బాబా సందేశం :—

ఇన్ని సంవత్సరాలూ నేను ఒక సద్గురువుగా, గుర్తింపబడుతూ వచ్చాను. తరువాత నా నిష్క్రియ జీవితంలో ఒక సాధకునివలె సంపూర్ణ మనోనాశనం పొందుటకు నేను జీవించాను. నా స్వేచ్ఛా జీవితకాలంలో బలము, దుర్బలము కలిగిన ప్రభువుగాను భక్తుడుగాను రెండు పాత్రలు వహించాను. ఇప్పుడు జ్యోతిర్మయజీవితంలో ప్రవేశించే ముందు మొదటిసారిగాను ఆఖరిసారిగాను నేను సాంగత్యం చేసిన ముగ్గురు సద్గురువులకు జోహారు చేయాలని నా ఉద్దేశము—షిర్డీలో సాయిబాబాకు, సాకోరీలో ఉపాసనీ మహరాజ్‌కు, పూనాలో బాబాజాన్ కు. తరువాత బొంబాయి వెళ్ళి అక్కడ వున్న మస్తులకు సాధువులకు ప్రణమిల్లి జ్యోతిర్మయ స్వేచ్ఛా జీవితంలో ప్రవేశించి అందులో నేను భగవత్ప్రేమికుడుగా ఉంటాను."

ఉపాసనీ మహరాజ్, సాయిబాబా, బాబాజానుల సమాధులవద్దకు పోవుటకు ప్రత్యేకమయిన బస్సులు ఏర్పాటు చేసారు. బాబా మండలివారు బాబా ఆజ్ఞ ప్రకారం బస్సులో బయలుదేరారు. గురువుల సమాధుల సందర్శనానికి బాబా కారులో బయలుదేరారు. అందరు సాకోరీ వెళ్ళేటప్పటికి సూర్యాస్తమయం అయింది. ఇంతకు ముందు బాబా సాకోరీ వచ్చి 30 ఏళ్ళు అయింది. ఆ రోజులలో సాకోరీ యింత జన సమ్మర్దముగా ఉండేది కాదు. ఇప్పుడు సాకోరీ భవనాలతోను మందిరాలతోను ఆరామాలతోను మహరాజ్ సమాధిచుట్టూ అనేక కట్టడాలతో కళకళలాడుతోంది. అక్కడి మహరాజ్ భక్తులు బాబాకు భక్తితోను ఉత్సాహంతోను స్వాగతం యిచ్చారు. ఇదివరకు తనకు పరిచయమయిన స్థలాలన్నీ శిష్యులకు చూపిస్తూ వెళ్ళారు బాబా. మహరాజ్ సమాధిముందు మోకరిల్లి శిరస్సుతో ప్రణమిల్లారు బాబా. బాబా మహరాజ్ సమాధికి రావడం యిదే మొదటిమారు. బాబా శిష్యులలో కొందరు 1941 వ సం॥లో డిసెంబరు నెలలో బాబా ఆదేశం ప్రకారం మహరాజ్ అంత్యక్రియలకు హాజరై

యున్నారు. వారు యిప్పుడవంతా తలచుకుంటూ అపవశపడసుస్తై ఉన్నారు. వెంటనే బాబా లేచి నిలబడి తమవైపు వేలుతో చూపుకొని తరువాత సమాధివైపు చూపించి

'మహరాజ్ యిక్కడ ఉన్నాడు — అక్కడకాదు" అన్నారు.

ఇదివరకు మహరాజ్‌తో బాబా కూర్చునియుండి అనేక రాత్రులు గడిపిన కుటీరం యిప్పుడు ఒక చిన్న భవనంగా రూపొందింది. "ఈ స్థలంలోనే ఒకనాటి రాత్రి మహరాజ్ నన్ను అవతారుడనని చెప్పాడు."

నాకోరీ ఆశ్రమవాసులు అర్పించిన అల్పాహారాలు స్వీకరించి బాబా షిర్డీ సాయిబాబా దర్గాకు బయలుదేరారు అక్కడ కూడా యిదివరకు మామూలుగా ఉన్న స్థలంలో యిప్పుడు అధునాతనమైన భవనాలు నిర్మింపబడ్డాయి సాయిబాబాతో ఆ కాలంలో ఉండి యిప్పుడు చూసిన వారికి ఆ స్థలం అంతా ఆనవాలు తెలియకుండా మారిపోయినట్లుంటుంది.

రాత్రి ఆలస్యమయినా ఎవరో భక్తులు సాయిబాబా సమాధికి యింకా వస్తూనే ఉన్నారు అప్పుడు వచ్చిన బాబా ఎవరో తెలుసుకోకుండా యీయనలోనే సాయిబాబా ఉన్నాడని గుర్తించలేకుండా వెళ్ళిపోతున్నారు. మిగిలినవారిలాగే ఆ చలువ రాతి సమాధికి తమ జోహారు లర్పించారు, బాబా వారి మండలిని సాయిబాబా కూర్చుంటూ ఉండిన చిన్న మసీదు (ద్వారకామాయి) వద్ద మండలివారిని తీసుకు వెళ్ళి చూపించారు బాబా. అక్కడ సాయిబాబా ప్రతీరోజూ ఒక అరగంట ఖురాన్ చదివించుకుని వింటూ ఉండేవాడు అలాగే భగవద్గీత మొదలైన పవిత్ర గ్రంథాలు కూడా చదివించుకుని వినేవాడు ఖండోబా ఆలయానికి వెళ్ళి చూసారు బాబా అక్కడ మహరాజ్ మూడు సంవత్సరాలు ఆహారం లేకుండా ఉన్నాడు ఈ సంగతి బాబా చెప్పి "సాయిబాబా ఆహారం చాలా తీసుకుంటూ యింకా ఆకలిగా ఉంటోందని అంటూ ఉండేవాడు" అని అన్నారు.

తెల్లవారితే నవంబరు 13 వ తేదీ. రాత్రికి రాత్రే పూనా వెళ్ళి 2 గంటలకు బాబాజాన్ దర్గా చేరుకున్నారు. బాబా కోసం వారి మండలికోసం తాళంతీసి వారిని లోనికి వెళ్ళనిచ్చారు. అందరూ బాబా జాన్‌కి జోహర్లు అర్పించారు.

1952 నవంబరు 14 వ తేదీ మధ్యాహ్నం మెహెరాబాద్‌కి అనుకున్నదాని కంటె ముందుగానే బాబా పాతికమంది గల శిష్యబృందంతో తిరిగి వచ్చారు అక్కడ నుంచి పర్యటనకు బయల్దేరుతారు.

బాబాకు ఆరోగ్యం బాగాలేదు ఆయనకు జ్వరం తగిలింది. గొంతుకలో నొప్పి, పొత్తికడుపులో ఏదో బాధగానూ ఉంది "వైద్యులు యిప్పుడు నాకు జ్వరం ఎందుకు వచ్చిందో చెప్పలేరు. అది ఎలాగయినా భరించవచ్చును. అయినా యిది వరకు నిర్ణయించుకున్న కార్యక్రమం ప్రకారం జరుపుదాము." అన్నారు బాబా. కొంచెంసేపు విశ్రాంతి తీసుకొని తిన్నగా బొంబాయికి బయలుదేరారు.

"బొంబాయిలో యిప్పుడు పదిమంది మంచి మస్తులున్నారు. ఉమర్‌బాబా, మంగ్‌సాజీ మహరాజ్ వీరు బొంబాయికి ఆధ్యాత్మిక ప్రభువులు వీరందరికీ యిది వరకు జరగని సంఘటనలు జరుగుతాయని తెలుసును. ఈ మస్తులంతా అంతరికంగా ఆధ్యాత్మిక సహాయం చేస్తూంటారు. ఇక్కడ ఏడుగురు మస్తులనే నేను సాంగత్యం చేయాలి నలుగురిని యిదివరకే నేను చూసాను. ఇప్పుడింక మిగతా ముగ్గురు మస్తులను చూస్తాను. ఈ రాత్రి హమీద్‌పూర్‌కి బయలుదేరే ముందు యీ పని ముగించిన తరువాత కొంత విశ్రాంతి తీసుకుందాము. ప్రపంచం నా అనుగ్రహం పొందినప్పుడు అది బాబాజాన్, సాయిబాబా, మహరాజ్‌ల వల్ల నాకు కలిగిన కరుణ వల్లనే అవుతుంది. అని బాబా చెప్పారు

బొంబాయిలో ఒక సన్నిహిత శిష్యుని యింటిలో దిగారు. నవంబరు 14 వ తేదీనే లండన్‌నుంచి బాబా ప్రేమికురాలు ఐరీన్‌కోనిబీర్ బొంబాయిలో స్టీమరు దిగింది 15 వ తేదీనుంచి బాబాకి జ్యోతిర్మయ జీవితం ప్రారంభం అయింది. బాబా వచ్చినట్లు బొంబాయిలో చాలామందికి తెలిసిపోయింది ఆ మధ్యాహ్నం అనేకమంది బాబా దర్శనం చేసుకున్నారు బాబా మెడనిండా పూలదండలు వేసారు. కొంతసేపయిన తరువాత యిదంతా చూస్తూ కూర్చున్న ఐరీన్‌ను వెళ్ళి విశ్రాంతి తీసుకోమన్నారు.

జ్యోతిర్మయ జీవితంలో పదిహేను రోజులలో బాబా మస్తుల గురించి, గురువుల గురించి చేసిన ప్రసంగాలు ఒక గ్రంథం అవుతాయి. గురునానక్, బాబా

ఫకీద్, అక్కల్ కోట్ స్వామి, అక్మల్ ఖ్వాజాసాహెబ్, ఏక్‌నాథ్, బియాజీద్, ఘని వాలా మహరాజ్ బంద్రాలోని మౌలానా సాహెబ్, యింకా యితరులగురించి అనేక సంగతులు చెప్పారు బాబా. 'సాయిబాబా బాబాజాన్‌ల గురించి చెప్తూ బాబా వారి గొప్ప తనం వర్ణించ శక్యము కాదు' అని అన్నారు

బాబా జ్యోతిర్మయ జీవితంలో పర్యటనకై బయలుదేరారు ముందుగా ఒక శిష్యుని యిచ్చి బాబా ఐరీనని పంపించారు ఆమె రైలులో మొదటి తరగతిలో ప్రయాణం చేసింది వారు మరునాడు కాన్పూరు చేరుకున్నారు. ఆ మరునాడు బాబా మండలితో బయలుదేరి తెల్లవారేసరికి అక్కడికి వెళ్ళారు. బాబా మండలితో మూడవ తరగతిలో ప్రయాణం చేసారు కొంతసేపు కాన్పూరులో విశ్రాంతి తీసుకుని అక్కడికి 45 మైళ్ళదూరం లోని హమీర్‌పూర్‌కి వెళ్ళారు మండలి ఒక బస్సులో ముందు వెళ్ళారు బాబాతో ఐరీన్‌కూడా కారులో వెళ్ళి కూర్చుని వెళ్ళింది ప్రయాణంలో బాబా ఆంతరికమయిన పని ఏదో చేసుకున్నారు ఆయన చేతి వ్రేళ్ళు వేగంగా కదులుతున్నాయి అప్పుడు రైలులో తరువాత బాబా ఒక శిష్యునిచేత వార్తా పత్రిక చదివించుకున్నారు ప్రయాణంలో ఎవరూ బాబాను గుర్తించలేదు ఉదయాన్నే రైలులో ఒక స్త్రీ సాధువు బాబా దర్శనం చేసుకుంది ఒక సద్గురువు వచ్చారని ఆమె తెలుసుకుంది. హమీర్‌పూరు ప్రయాణం ఆనందకరంగా ఉంది. అహమద్‌నగర్ చుట్టూ ఉన్న బీడు ప్రదేశంలా గాక అక్కడ ఆకుపచ్చని చేలతో కన్నులకి ఇంపుగా ఉంది బాబా అన్నీ ఐరీన్‌కు చూపుతూ అసలు ఇండియా చూస్తున్నావు నీవు అని చెప్పారు. యమునానది వద్దకు వచ్చేసరికి అక్కడ తాత్కాలికంగా పడవలు వేర్చి కట్టి ఒక వంతెన తయారుచేయడం అప్పుడే పూర్తి అయింది బాబా కారే మొట్టమొదట కారు ఆ వంతెనమీద నుంచి వెళ్ళటకు వంతెనమీద రెండు వైపుల ప్రజలు బాబాను చూసి నమస్కారం చేసారు. హమీర్‌పూర్ జిల్లా యమునా బెత్వా నదులమధ్య ఉంది ఈ నగరంలో రెసిడెంటు మేజిస్ట్రేటు తాలూకు ఒక పెద్ద బంగళా బాబాకు ఏర్పాటు చేయడం జరిగింది బాబా మండలితో అందులో దిగారు. ఐరీన్‌కోనిచెర్ ఒక్కతే స్త్రీ వారిలో ఉన్నందువల్ల ఆమెకు ఆ ఆవరణలో ప్రత్యేకంగా బాబా ఒక గుడారం నిర్మింపజేసారు ఇదివరకు యీ బంగళాలో ఒక ఐ. సి. ఎస్. ఆఫీసరు ఉండేవాడు అందుచేత పాశ్చాత్య దేశాలలోవలె బంగళా ఆవరణలో చక్కటి తోట పెంచబడియుండెను ఆ స్థలంలో పూర్వకాలం ఒక మరాఠీ సౌధ

ఉండేటిదని బాబా చెప్పారు. ఆ బంగాళా యిచ్చిన మేజిస్ట్రేటు ఒక కాశ్మీర్ మహమ్మదీయ యువకుడు. అతని భార్య ఒక ఆంగ్లోఇండియన్ యువతి. ఇక్కడి ప్రజలు బాబాకు జేజేలు కొట్టారు.

పూర్వం యీ ప్రాంతంలోని వనాలలో శ్రీరాముడు జగద్ధ్యాన నిమగ్నులయిన మునులను సాంగత్యం చేసాడు. బాబా అవతారంలో యిప్పుడు ఆయనే సతతం దైవధ్యాన పరాయణులగు మస్తులను కలిసినట్లే బాబా ఒక ఆవరణలో బహిరంగ దర్శనం యిస్తారని హమీర్‌పూర్‌లో ఏర్పాట్లు జరిగాయి. ఇక్కడి ప్రజలు బాబా దర్శనం కోసం అనేక సంవత్సరాల నుంచి వేచియున్నారు. ముందు ఒక గదిలో బాబా ఆరుగురు స్త్రీ పురుషుల కాళ్ళు కడిగారు. బాబాకోసం ఒక ఎత్తయిన వేదిక ఏర్పాటయింది. బాబా ప్రక్కనే యింకొక కుర్చీ ఐకిన్ కూర్చొనుటకు వేయబడింది. బాబా మండలివారు 24 గురు పురుషులున్నారు. వారంతా బాబా చుట్టు నిలబడి ఉన్నారు

మొదట బాబా కొన్ని సందేశాలను మైక్‌లో చదివించారు. తరువాత భజన సంకీర్తన జరిగింది. అప్పుడప్పుడు మెహెర్‌బాబాకి జై అనే జయధ్వానాలు చేసారు భక్తులందరు.

బాబా ముందుకు వచ్చి ఒకడు కర్పూరహారతి యిచ్చాడు. అతనిని బాబా ఆలింగనం చేసుకున్నారు. ఇతడు బాబా దర్శనార్థం 27 మైళ్ళు రోడ్డుమీద పొర్లుతూ వచ్చి హమీర్‌పూర్ చేరుకున్నాడు. బాబా దర్శనం అయేవరకు ఉపవాసదీక్ష కూడా అవలంబించాడు. బాబా అతనిచేత ఒక పండు తినిపించి ఆ ఉపవాసం విరమింపజేసారు.

భక్తులు ఒక్కొక్కరే వరుసలో వచ్చి బాబా దర్శనం చేసుకున్నారు. ఈ కార్యక్రమం అయిన తరువాత బాబా ఒకరి యింటికి వెళ్ళారు. బాబా వెళ్ళిన దారిలో ప్రజలు బారులు తీర్చి రెండువైపులా నిలబడ్డారు.

హమీర్‌పూర్‌లో కారులో తిరుగుతూ పుకార్‌కి బాబా కొన్ని పొలాలు చూపించి ఏదో సైగచేసారు. అతనికి సరిగా అర్థంకాక "అవును బాబా అదంతా జొన్నపైరు" అన్నాడు. కాని బాబా చెప్పినది "ఈ భూమిమీద యీ స్థలంలో

మెహెర్‌పురి నిర్మాణం చేయ" మని మూడవ అన్నమాట కాని యీ మాట తరువాత గాని పుకార్‌కి బోధపడలేదు.

బాబా హమీర్‌పూర్ జిల్లా పర్యటిస్తూ సుప్రసిద్ధ బాబా ప్రేమికుడు కేశవ నారాయణ నిగమ్ ఉన్న గ్రామము మహేవాకు వెళ్ళారు. బాబా అప్పుడు కేశవనారాయణ నిగమ్‌వద్దనే బస చేసారు అతడు బాబాకు తన ఆవరణలో ఎత్తుగా ఉన్న ప్రదేశంలోని ఒక కుటీరంలో వసతి ఏర్పాటు చేసాడు

అప్పుడు నిగమ్‌యొక్క మరదలు (భార్యకి చెల్లెలు) చాలా జబ్బు స్థితిలో నుండెను. ఆమెకు బాబా దర్శనము చేసుకోవలెనని బలమైన కోరిక యుండెను ఆమె తన అక్కని పిలిచి "అక్కా ! నేనెట్లాగూ బ్రతకను అవతారపురుషుడయిన బాబాను ఒక్కమారు దర్శిస్తే చాలు నా ప్రాణాలు పోయినా నాకు చింతలేదు." అని చెప్పెను ఆమె యీ విషయము తన భర్తయగు కేశవనారాయణ నిగమ్‌తో చెప్పెను కాని ఆ రోగి మంచము మీదనుండి లేవలేదు. బాబా వద్దకు ఆమె వెళ్ళజాలదు కదా బాబా ఆయనంతట ఆయన రావలయునే కాని నిగమ్ బాబాను తన మరదలును వచ్చి చూడమని చెప్పడానికి సాహసించలేదు.

ఆ మరునాడు బాబా తమ కుటీరమందుండగా నిగమ్ బయట కావలికాయు చుండెను. ఆ సమయాన నిగమ్ భార్య పరుగెత్తుకుని వచ్చి తన చెల్లెలు కదలడం లేదని మరణించినదేమో అని భయం వేస్తోందని ఒక్కమారు వచ్చి చూడవలసి ఉందని నిగమ్‌ని ప్రార్థించెను అతడు "ఇప్పుడెలా వస్తాను బాబావద్ద పనిలో ఉన్నాను కదా నీవు మాట్లాడకుండా వెళ్ళిపో గొడవచేస్తే బాబాకు శాంతి భంగము కాగలదు " అని నెమ్మదిగా తన భార్యతో నిగమ్ చెప్పుతుండగా లోపలినుంచి బాబా చప్పట్లు కొట్టి పిలిచారు. కేశవుడు లోనికి వెళ్ళిన తరువాత—ఈ క్రింది సంభాషణ వారిరువురికి జరిగింది—

బాబా — ఏమిటీ సంగతి ?

కేశ — ఏమీలేదు బాబా !

బాబా — ఏమిటో చెప్పు సందేహించకు.

కేశ — జబ్బుగా ఉన్న మా మరదలికి ప్రాణం మీదకే వచ్చేలావుందట.

బాబా — ఎక్కడ ఉంది ?

కేశ — ఇక్కడే మా యింట్లోనే బాబా....

ఆమాట వినగానే బాబా లేచి కేశవుని యింటిలోనికి వెళ్ళుటకు బయలుదేరారు. ఆయన వెనకాల కేశవుడు అతని భార్య వెళ్ళుతున్నారు అక్కడికి చేరేసరికి అతని మరదలు మరణించి శయ్యపై నిశ్చలంగా ఉన్నది. అది చూసి ఆమె అక్క తన చెల్లెలు మీద పడి గొల్లున ఏడ్వసాగెను.

అప్పుడు బాబా—"ఎందుకు ? ఏడుపెందుకు ? నీ చెల్లెలు చనిపోయిం దనేనా పోతేపోయింది అందరికీ ఉంది మరణం – దానికింత విచారమెందుకు ?"

అని బాబా మంచం మీద మరణించిన ఆ పిల్ల (18 సం॥ వయసు)ను శరీరము మీద నిమిరి—"ఏమీ విచారించకండి భగవంతుని లీలలు ఎవరికీ అర్థము కావు" అని బాబా ఆ చోటు వీడి తమ కుటీరమునకు వెళ్ళారు కేశవనారాయణ కూడా ఆయన వెనుకనే వెళ్ళాడు

బాబా అటువెళ్ళగానే యీ మరదలు పిల్ల మంచము మీద లేచి కూర్చుం డెను బాబా ఆమెకు పునర్జీవితం అనుగ్రహించారు ఆమె ఎంత ధన్యురాలు! ఆమె అక్క ఆ ఆనందాన్ని భరించలేక కేకలు వేసుకుంటూ యీ వార్త భర్తతో చెబుదా మని బాబా కుటీరానికి పరుగెత్తుకుని వచ్చి బాబా పాదాలమీద పడి "చచ్చిపోయిన నా చెల్లెలును బ్రతికించారు" అని ఏడ్వడం ప్రారంభించింది బాబా ఆమెను లేవనెత్తి అనునయించి పంపించారు. అది లగాయితు కేశవుని యింటిలో అందరు బాబా 'కొంగు'ను విడవకుండా పట్టుకున్నారు కేశవుని కుటుంబం అంటే బాబాకు అమిత మైన ప్రేమ. ఇలాగే బాబా యొక్క హమీర్‌పూర్ జిల్లా పర్యటనలో బాబా మీద విశ్వాసం పెంపొందించే సంఘటనలు అనేకం జరిగాయి.

హమీర్‌పూర్ జిల్లాలోనే అమర్‌పురా అనే గ్రామంలో ఒక యింటిలో బీదలయిన వృద్ధ దంపతులుండేవారు. బాబా ఆ ఊరు వెళ్ళినపుడు ఆ వృద్ధుడు తనకున్నదానితో వారి యింటిముందు ఒక చిన్న వేదిక నిర్మించి బాబాకు స్వాగతం చెప్పాలని ఉబలాటపడుతున్నాడు కాని అతని భార్య "ఇదంతా మన పిచ్చిగాని

ఆ పరమాత్ముడు తన దారిని తాను పోక ప్రత్యేకంగా యిక్కడికి మన పేద కొంపకు ఎందుకు వస్తాడూ, యీ ఊళ్ళో యింతమంది గొప్పవారుండగా? అవతారపురుషుని వారి పూరింటికి ఆహ్వానించుటకు వారికి ధైర్యం చాలలేదు కానీ ఆ వృద్ధుడు మాత్రం తన ప్రేమయే తన ప్రియతముని తన యింటికి గొనితెచ్చునని ధైర్యంతో ఉండెను.

అమర్‌పురాలో ఏర్పాటుచేసిన దర్శన కార్యక్రమం అయిపోయింది. ఆ మరునాటి ఉదయం బాబా అమర్‌పురానుంచి తరువాత గ్రామానికి వెళ్ళడానికి బయలు దేరారు. చాలామంది ప్రజలు బాబాను సాగనంపుతూ బాబా కారుతో వస్తున్నారు రాజ వీధిలోనుంచి బాబా కారు వెళ్తుంది ఇంతలో బాబా కారును ఒక సందులోనికి మళ్ళిం చారు అలాగే వేరొక సందులోకి తిరిగింది అందరూ ఆశ్చర్యంగా చూస్తున్నారు, యిదేమిటి యిలా ఎక్కడికి వెళ్తున్నారని. తిన్నగా కారువెళ్ళి కొన్ని మలుపులు తిరిగి ఆ పేదవాని యింటిముందు ఆగింది బాబా కారు దిగి ఆ వృద్ధుడు నిర్మించిన యింటి ముందరి వేదికమీద కూర్చున్నారు బాబా ఆ బీద దంపతుల ఆనందానికి మేరలేదు బాబాకి స్వాగతం యివ్వడానికి వారివద్దనేమున్నది? వారి హృదయకుసుమాలు తప్ప. వారికి నోటవెంట మాటలు రాలేదు. నేత్రాలనుంచి మాత్రం బాష్పవారి అవ్యారిగా ప్రవహించింది బాబా లేచి వారిద్దరును ఎంతో ఆప్యాయంగా ఎంతో ప్రేమతో కౌగిలించుకున్నారు మానవరూపధారి అయిన ఆ దేవుని కాళ్ళకడిగి వారు తమ శిరస్సులను ఆ దివ్య పాదాలమీద ఉంచి మ్రొక్కారు వారి యిల్లు పావనంఅయింది వారి జన్మలు ధన్యత చెందాయి. అవతారపురుషుడు వారిని దీవించి వెళ్ళారు

హృదయపూర్వకంగా ఆ పేదలు చేసిన సపర్య అల్పమని యెంచక బాబా ఆది తృప్తిగా స్వీకరించారు తరువాత బాబా కూర్చున్న ఆ వేదిక ఉన్న స్థలంలో ఆ ఊరివారు ఒక మందిరమును నెలకొల్పి బాబాచిత్రము నందుంచి నిత్యము పూజ చేసుకుంటున్నారు.

హమీర్‌పూర్ జిల్లాలో బాబా చేసిన ప్రయాణాలలో ఒక పాశ్చాత్యుని ప్రశ్నలకు బాబా యీ క్రింది విధముగా జవాబు చెప్పారు

ప్రశ్న – బాబా: క్రీస్తు రెండవమారు రావడం గురించిన ఆయన మాటలు వివరించి చెప్తారా?

బాబా :— "ఎవరయినా యిదిగో యిక్కడ క్రీస్తు ఉన్నాడు, అడుగో అక్కడ క్రీస్తు ఉన్నాడు అని అంటే అది మీరు నమ్మవద్దు" — "కాని ఆ రోజులలో ఆ కష్టాలయిన

తరువాత మానవ వృత్తిని గొప్పశక్తి వైభవాలతో మేఘాలంపై వచ్చియున్నట్లు వారు చూస్తారు ఆతడు, అతని దేవతలు నాలుగు వాయువులచేత తన ఎన్నిక అయిన వారిని స్వర్గమర్త్య లోకాలలోపలి మూల మూలల నుండియు చేరవేస్తారు '' బాబా యింకా యిలా చెప్పారు

బాబా:— ఈ దేవదేవుడు మనిషి వలెను ఆయన యొక్క అనుచరులను శిష్యులను ఆయన రెండవమారు వచ్చినపుడు జన్మమెత్తేలా చేయడమన్నమాట రెండవమారు రావడము వెయ్యేండ్లు ధైర్య చేయాలితోగాని వెయ్యి సంవత్సరాలు శాంతితో గాని, తీర్పు చెప్పే ఆఖరిరోజుతోగాని జతపరచడం తప్పు

గూఢతత్త్వవాదులందరు "మేఘములు" అనే మాట చైతన్యస్థితులకు అంటే ఆధ్యాత్మిక భూమికలకు వాడిన మాటగా అర్థము చెప్పారు. అనంతమయిన ఆ ఏడవ భూమికనుండి క్రీస్తు అవరోహించినపుడు యీ భూమికి ఆయనతో కూడా అనంతమయిన మంచితనమును, జ్ఞానమును, శక్తిని, ప్రేమను, మిగిలిన ఆరు క్రింది భూమికల నుండి శక్తులను, విజ్ఞానములను, అనుభవములను గూడ తనతో గాని వచ్చును

ఒక సూఫీ సాధువు యొక్క మాటలలో —

"ఈ ప్రపంచాన్ని, ఆకాశాన్ని, మేఘాలను చూడు మొదటిది భగవంతుడు, రెండవది భూమికలు, మూడవది వ్యక్తి ఈ మూడు ఒకదానితో ఒకటి సంబంధం కలిగి ఉన్నాయి "

క్రీస్తు పర్వతము నెక్కినపుడు అతని రూపంలో మార్పు వచ్చెనని సెయింట్ మార్క్ వ్రాసెను —వారిని ఆచ్ఛాదించిన మేఘం ఉండెను. ఆ మేఘము నుండి ఒక వాక్యము వినబడెను. "ఇతడే నా ప్రియ తనయుడు అతడు చెప్పేది వినండి" అని అల్వెర్నియా పర్వతంమీద సెయింట్ ఫ్రాన్సిస్ యొక్క దృశ్యము సంగతి లియో సోదరుడు చెప్పుతున్నాడు అది మిక్కిలి సుందరమయిన తేజస్సు కలిగినది. అది దిగి సెయింట్ ఫ్రాన్సిస్ శిరము మీద ఆగినది ఆ జ్యోతినుండి యీ మాటలు వచ్చినవని సెయింట్ ఫ్రాన్సిస్, లియోకి వివరించెను—"అప్పుడు నేను ధ్యానపు వెలుగులో నున్నాను అందులో అనంతమయిన అగాధమును చూసాను. అది భగ

వంతుని యొక్క అనంతమయిన మంచితనము, జ్ఞానము, శక్తి అయి ఉండెను. నేను చూసిన ఆ జ్యోతిలో భగవంతుడుండెను. పూర్వము మోజెస్‌తో ఆయన మాట్లాడి నట్లు నాతో ఆయన అదే విధముగా మాట్లాడెను. సినాయి పర్వతంమీద దట్టమయిన మేఘంతోను విద్యుత్తోను భగవంతుడు కనబడెను అందుచేత "మేఘములు" "మేఘాలయము" (మంజిల్) అనేమాట 'ఆరు భూమికలకు' వాడిన గుప్తపదములు.

ప్రశ్న :—ఎంతోమంది అసత్యపు మెస్సయ్యాలు ఉండేవారు ఇప్పటికీ ఉన్నారు. నిజమైన మెస్సయ్యాను మేము ఎలా గుర్తించగలము ?

బాబా జవాబు :—ఎవరయినా అతనితో సాంగత్యంచేసినవారికి అసలయిన మెస్సయ్యా దివ్య ప్రేమను కలిగిస్తాడు. దివ్యమైన ఉత్తేజాన్ని కలుగజేస్తాడు. అసత్యపు మెస్సయ్యా యిది కలిగించలేడు అతని దివ్యత్వంవలన నిజమైన మెస్సయ్యా అద్భుతాలతో ప్రమేయం లేకుండానే ప్రపంచాన్ని తనవద్దకు ఆకర్షిస్తాడు. ప్రజలు అతడు నిజమైనవాడని తెలుసుకుంటారు అట్లు భావిస్తారు ఆయన మాటలలోను ఆయన పనులలోను యీ జ్ఞానము యీ భావన నమ్మకాన్ని కలుగజేసి అది క్రమంగా నిజమని తెలిపి ప్రజలు ఆయనను అనుసరించేలా చేస్తాయి. ఎండమావులు దాహముగా ఉన్నవారిని ఆకర్షిస్తాయి కాని త్వరలోనే అది మరీచిక యని మాయయని వారు తెలుసుకుంటారు. అది ప్రాణమిచ్చే నీరు కాదని తెలిసిపోతుంది అసత్యపు మెస్సయ్యా బాహ్య దృశ్యాలవలన ప్రజలను ఆకర్షించవచ్చును—అతని వ్యక్తి రూపం వల్లను గాని, అతని తెలివితేటలవల్ల గాని, ఆధ్యాత్మికత్వం వద్ద అతడుచేసే ప్రసంగాలవల్ల కాని నిజమైన మెస్సయ్యా చేసేపని అతడు చేయలేడు—మానవుల లోని ఉత్తమ ఆదర్శాలను రేకెత్తించి మానవకోటి హృదయాలను స్పృశించుట నిజమైన మెస్సయ్యా తప్ప యింకొకడు చేయలేడు.

ప్రశ్న :—సద్గురువు మానవాతీతుడయినా ఆకలిదప్పులుండడం, నిద్ర అవసరం అవడం ఎట్లు ?

జవాబు :—సద్గురువు వివిధ లోకాలలో పని చేస్తాడు—ఆధ్యాత్మిక, మానసిక, సూక్ష్మ, స్థూల లోకాలలో.

భిన్న వ్యక్తులతో భిన్న పరిణామస్థితులలో పనిచేయుటకు వారి స్థాయికి అతడు దిగివస్తాడు భౌతిక శరీరంలో ఉన్నా, అతడు బాగా అభివృద్ధి చెందిన

ఆత్మలను మానసిక లోకంలోను తక్కువ అభివృద్ధి చెందినవారికి సూక్ష్మలోకంలోను, యీ లోకంలోని మానవులకూ సహాయం చేయగలడు. అందువలన ఏ శరీరం వాడితే అది ఉపయోగిస్తాడు. ఏ లోకానికి తగిన శరీరం ఆ లోకంలో తన పని కోసం ఉపయోగిస్తాడు నిజమైన గురువు తన శిష్యుని స్థాయికి దిగివస్తాడని చెప్పిన మాట సరియయినదే ఈ ప్రపంచాన్ని ఉద్ధరణ చేయుటకు గురువు యీ ప్రపంచ-స్థాయికి దిగివస్తాడు భౌతిక శరీరంతో పని చేసేటప్పుడు దాని అవసరాలు - ఆహారము, పానీయము, విశ్రాంతి - అన్నీ భౌతికంగా కావలసివస్తాయి. అవసరమయినపుడు ఎన్నిరోజులయినా ఆహారపానీయాలు లేకుండానే జీవించగలడు. సద్గురువులు అనేక మారులు దీర్ఘోపవాసాలు చేసారు. అతని భౌతిక శరీరావసరాలు తీర్చడం పైకి ఒకలాగే కనిపించినా అంతరికంగా భేదాలున్నాయి. మామూలు మనుష్యులలోవలె వారి ఆకలి దప్పులను తీర్చుకొనుట నిద్రపోవుట మొదలగు అవసరాల కొరకు కాదు. శరీరము యొక్క భౌతికావసరాలు శరీరమును నిలుపుకొనుటకే తీర్చుకుంటారు. మానవకోటి కొరకు తాను చేయనెంచిన గొప్పకార్యము యీ భౌతిక లోకమునందొనర్చుటకే శరీరమును నిలుపుకొనవలెను

జ్యోతిర్మయ స్వేచ్ఛా జీవితంలో నవంబరు (1952) మాసములో బాబా యీ క్రింది సందేశము నిచ్చారు—"భగవంతుడు నిరంతరమూ మౌనంగా ఎవరూ వినకుండా, ఎవరూ చూడకుండా పనిచేస్తూనే ఉన్నాడు ఆయనయొక్క అనంత మౌనాన్ని అనుభవించేవారు మాత్రం చూడగలరు.

నేను అమెరికాలో ఉన్నపుడు ప్రజలు నన్ను నా మౌనం ఎప్పుడు విరమిస్తానని అడిగారు. నేను వారిని తిరిగి అడిగాను—"నా మౌనమే మాటలాడలేకపోతే నాలుకతో చెప్పిన మాటలవల్ల ప్రయోజన మేమిటి" అని భగవంతుడు నేను మాటలాడితే విశ్వమంతా వినిపిస్తుందని ఎప్పుడనుకుంటాడో అప్పుడు నన్ను నామౌనమును భంగపరిచేలా చేస్తాడు. అయినప్పటికీ, మౌనం ఉన్నా, లేకపోయినా, నేను ప్రకటించిన సత్యాలగురించి లోతుగా ఎవరు ఆలోచిస్తారో, వారు చివరికి శాశ్వత జీవనంలోకి ప్రవేశిస్తారు"

1952 వ సం॥ నవంబరులో బాబా ఇండియానుంచి సూఫీజం అనేమతాన్ని ఏ విధంగా సంస్కరించినది వివరాలు తెలియజేస్తూ చార్టర్ పంపించాడు. బాబా

యొక్క సత్యప్రేమ సందేశవ్యాప్తికి సూఫిజం రిఓరియంటెడ్ అనే నూతనవాదంతో యీ నూతన సంస్థ యెక్కువగా పని చేసింది. ఈ సంస్థవారు బాబా గ్రంథాలను గాడ్ స్పీక్స్ (భగవద్వచనము) "లైఫ్ ఎట్ ఇట్స్ బెస్ట్" (ఉత్తమోత్తమ జీవనము) అనే గ్రంథాలద్వారా బాబా సందేశాలు వ్యాప్తం చేసారు

బాబా హమీర్‌పూర్ జిల్లాలో రాత్ అనే పట్నానికి 27 నవంబరు 1952వ తేదీన వెళ్ళారు ఆ రోజు సాయంకాలం బి ఎస్ వి. ఇంటర్ కాలేజీ విద్యార్థులకు దర్శనమిచ్చినపుడు వారికిచ్చిన సందేశంలో యీ విధంగా చెప్పారు—

"మనము జాతీయ స్వేచ్ఛను పొందాము. ఇప్పుడు మనం ఆధ్యాత్మిక స్వేచ్ఛ బడయుటకు పాటుబడదాము. అది లేనిదే ఏ యితర స్వేచ్ఛ ఉన్నా అది బంధనమే అవుతుంది. కామము, పదవి, ఆశ, కోపము, ద్వేషము, అసూయ, నీచ మయిన కోరికలు వీటివలన బంధాలలో చిక్కుకున్న మనకి ఆధ్యాత్మిక స్వేచ్ఛ పాడయిపోయింది ఎప్పుడయితే యీ బంధాలు పటాపంచలవుతాయో అప్పుడు అనంత శక్తి, జ్ఞానము, శాంతి, ప్రేమ, ఆనందము కలుగుతుంది. ఈ స్వేచ్ఛ పొందడానికి దీనికి మూలమయిన భగవంతుని తెలుసుకోవాలి భగవంతుని తెలుసుకోవడానికి ఆయన అనంతాత్మలో మనలను పోగొట్టుకుంటూ మనం ఆయనను ప్రేమించాలి. ఆయనతో ఐక్యం కావాలన్న తీవ్ర కాంక్షద్వారా ఆయనను మనం ప్రేమించగలం. దేవుని మూర్తియొక్క వ్యక్తీకరణమయిన సద్గురువుకి సమర్పణ అవడంద్వారా దేవుని మనం ప్రేమించగలం. మన తోటి మానవులను ప్రేమించడంవల్లకూడా దేవుని ప్రేమించగలం వారికి మనం మన సుఖాన్ని పోగొట్టుకుని అయినా సుఖం కలుగ జేసినందువల్ల, మన ప్రయోజనాలు పాడయినా, అవి త్యాగం చేసి అయినా వారికి సేవ చేసినందువల్ల, పీడిత ప్రజలకోసం నిస్వార్థమయిన సేవ చేయడానికి మన జీవితాలు అంకితం చేసినందువల్ల మనం భగవంతుని ప్రేమించగలం భగవంతుని మనం యీ విధంగా తీవ్రంగా ప్రేమించినపుడు చివరికి మన ఆత్మయే పరమాత్మ అని తెలుసు కుంటాము"

హమీర్‌పూర్ జిల్లా పర్యటన బాబా ప్రేమికులగు కేశవ్, పుకార్, ఖరే, శ్రీపతిసహాయ్ భవానీప్రసాద్ మొదలగు ప్రేమికుల కృషిచేత జయప్రదమైనది ఈ జిల్లాలో దాదాపు ప్రతిగ్రామంలోను ప్రతి యింటిలోను బాబా చిత్రపటములు కనిపిస్తాయి.

1952 నవంబరులో హమీర్‌పూర్ జిల్లా పర్యటన అయిన తరువాత బాబా ఢిల్లీ ప్రేమికుల ఆహ్వానం మీద నవంబరు 28 నాటికి ఢిల్లీ వెళ్ళారు. అక్కడ బాబా వాసుదేవకైన్ అను ప్రేమికుని యింటిలో బసచేసారు. మండలి అంతరు టాగూర్ రోడ్డులో 10 వ నెంబరు యింటిలో దిగారు. ఢిల్లీలో అనేకమంది ప్రముఖులు బాబాకు స్వాగతం యిచ్చారు. బయట ఊళ్ళనుంచి కూడా ప్రేమికులు వచ్చారు. ఉదాహరణకు నాగపూర్ నుంచి డా॥ దేశ్‌ముఖ్ తన కుమార్తె సంజీవనితో వచ్చాడు. ఢిల్లీలో ఉండగా సంత్‌కృపాల్‌సింగ్ అతని యింటికి బాబాను రమ్మని ఆహ్వానం చేసాడు. అయితే తీరుబడిలేక బాబా వెళ్ళజాలక దేశ్‌ముఖ్‌ను పంపించారు యీ సంగతి చెప్పిరమ్మని - అక్కడ అనేక వేలమంది బాబా వస్తారని కనిపెట్టుకుని ఉన్నారు. వారందరికి దేశ్‌ముఖ్ బాబా వర్తక ప్రేమ సందేశాలు గురించి ఉపన్యసించాడు. తరువాత కృపాల్‌సింగ్ బాబా వద్దకు వెళ్ళి ఆయన దర్శనం చేసుకున్నాడు. అతడు యింకొక దర్శన కార్యక్రమంలో బాబా గురించి ప్రసంగం చేసాడు

1952 డిసెంబరు 2 వ తేదీన ఢిల్లీలో అవతార్ మెహెర్‌బాబా ఢిల్లీ పౌరులకు బహిరంగ దర్శనం యిచ్చారు. న్యూఢిల్లీ టౌన్‌హాల్‌లో బ్రహ్మాండమైన బహిరంగసభ జరిగింది. అందులో చాలామంది యిదివరకు బాబాను దర్శించని వారనే కులు బాబా దర్శనభాగ్యం పొందారు

ఆ సాయంకాలం నిరంజన్‌సింగ్ - అనే ప్రిన్సిపాలు యాజమాన్యంలో నడుపబడుతున్న క్యాంప్ కాలేజీలో ఆచార్యులు, అధ్యాపకులు, నాలుగువేల మంది విద్యార్థులు బాబా దర్శనము చేసుకున్నారు. ఆనాడు బాబా వారికొక ప్రత్యేక సందేశం యిచ్చారు. —— "భగవంతుని మనలో సాక్షాత్కరింప జేసుకొనుటయే మానవ జీవితము యొక్క పరమోద్దేశ్యము. మన ప్రపంచకపు విధులను నెరవేరుస్తూనే యీ కార్యము నిర్వహింపవచ్చును. మనదైనందిన చర్యలలో అనేకమైన పను లున్నప్పటికిని మనము మన కార్యములను ప్రియతముడైన దేవునికి అంకితమొనర్చి వాటికి అంటకుండా అనాసక్తులమై జీవితము సాగించాలి.

ప్రజలు తమ ఆహారం కోసమే పాటుపడేలా చేయడానికి చాలా చెప్ప బడింది. ఇప్పుడు వారి మనసులు దేవునిపైకి తిరగాలి. బీదవారు, పీడిత ప్రజానీకము, ఆధ్యాత్మికంగా వారి దుఃఖాలు దురదృష్టాలు సత్యంకోసం సంఘర్షణ జరిపేందుకు

ఆయుధాలుగా చేసుకోగలరని వారికి తెలియజెప్పాలి. ఈ క్లేశాలన్నీ దేవుని కృప వలన కలిగిన కానుకలుగా భావించాలి. అవి ధైర్యంతో ఎదుర్కొంటే శాశ్వత సుఖానికి మార్గం కాగలవు.

అనంతమయిన భగవంతుడు తప్ప మిగిలినదంతా మిథ్య, అసత్యము మాయాన్వితము. మన అందరిలోనూ నివసిస్తున్న భగవంతుని మీరు అర్థం చేసుకొనుటకై నా ప్రేమను ఆశీస్సులను మీ అందరికి యిస్తున్నాను." — అని బాబా చెప్పారు.

ఒకనాడు బాబా ఒక ప్రేమికుల సమావేశంలో యిలా చెప్పారు – "సత్యము వచ్చినపుడు లోపల ఒక మెరుపులా వస్తుంది. జ్ఞానం కలిగినప్పుడు ఆ మానవునికి సమస్తమూ తెలుస్తుంది. కాని సత్యము గాని జ్ఞానముగాని హృదయపూర్వకంగా అన్వేషిస్తేగాని దొరకవు. 'అది లేకుండా జీవించలేను' అని ఎప్పుడు భావన కలుగుతుందో తనలోనే మానవుడు దానిని తాను కనుగొంటాడు. మీకు నా ప్రేమను యిస్తున్నాను ఈ ప్రేమ మీరు సత్యమును కనుగొనుటకు సహాయం చేస్తుంది."

డిశెంబరు (1952) 8 వ తేదీన ఢిల్లీ సర్వకళాశాల విద్యార్థులకు ప్రత్యేక దర్శన కార్యక్రమం ఏర్పాటయింది. 4000 మంది విద్యార్థులు వరుసలో వచ్చి బాబా దర్శనం చేసుకున్నారు. ఆ సమయంలో బాబా వారిని దీవిస్తూ ఒక చిన్న సందేశం కూడా యిచ్చారు. —

## బాబా సందేశం :—

లోకమంతా వట్టి శూన్యమయినా, దేవుని యొక్క, సత్యము యొక్క ఛాయ మాత్రమే అయినా సాధారణ మానవులు యీ జగత్తుయొక్క మాయలలో, ఆకర్షణలలో చిక్కుకుంటారు.

గురువులు ఎల్లప్పుడూ దేవునితో ఐక్యత వలన కలిగే సుఖంలో మునిగిపోయి ఉంటారు. వారిని యీ ప్రపంచంలోని ఎట్టి మాయలూ ఆకర్షింపజాలవు. మామూలుగా మనం నీడలను చూసి ఏ విధంగా పట్టించుకోమో అలాగే గురువులు యీ జగత్తును ఏమీ పట్టించుకోరు. వారు నీడనుండి అసలు పదార్థం వేరని మాన

వులకు తెలియజెప్తారు అనంత పరమాత్మునితో ఐక్యం కావడమే యీ జీవితం యొక్క పరమావధి ఇది దేవుని ప్రేమించడం వల్లనే పొందగలం

దివ్యప్రేమ మనలను మన మెదలను యితరుల మెదలను విజాయితీ పరులనుగా చేస్తుంది దేవుడు అనంతమయిన నిజాయితీతనం అని మనకు అర్థం అయేలా చేసి మనంను మన జీవితాలను నిజాయితీతో జీవించేలాచేస్తుంది మన చిక్కులన్నిటికీ మన సమస్య లన్నిటికీ దివ్యప్రేమయే పరిష్కారం అన్నిరకాల బంధనాల నుండి మనల్ని విడిపడేలా చేస్తుంది అది మనలను సత్యం మాట్లాడేలా, సత్యంగా ఆలోచించేలా, సత్యంగా ఆచరించేలా చేస్తుంది. విశ్వమంతటితోను మనం ఒకటే అనే భావం కలుగజేస్తుంది దివ్యప్రేమ మన హృదయాలను పరిశుద్ధపరచి మనలను మహిమాన్వితులను చేస్తుంది. నేను మీకు నా ప్రేమను ఆశీస్సును యిస్తున్నాను "—బాబాయొక్క యీ సందేశం విశ్వకళాశాలలో ఆచార్యపదవిలో ఉన్న డా॥ చా అనే చీనా విద్వాంసుని చేత బాబా చదివించారు.

బాబా లేచి వెళ్ళాక డా॥ దేశ్‌ముఖ్ విద్యార్థులందరకు బాబా జీవితాన్ని గురించి తన ఉపన్యాసంలో చెప్పాడు అతని కుమార్తె సంజీవనికూడా మాట్లాడింది. తమతో ఒకరిద్దరు శిష్యులను మాత్రముంచుకుని మిగిలిన పరివారమును తిన్నగా ఖుల్దాబాద్ పంపించి తాము అహమద్‌నగర్ వచ్చి అక్కడ ఒక డాక్టరుచేత పరీక్ష చేయించుకుని, 1952 డిసెంబరు 12వ తేదీనాటికి బాబా వారి యీ కొద్ది అనుచరులతో కూడా తిరుగుతూ ప్రయాణంలో ఖుల్దాబాద్‌కి వెళ్ళి అక్కడ విశ్రాంతి గృహంలో మకాం పెట్టారు. ఇదివరకే చేరిన మండలి బాబాతో కలిసారు. ఈ ఊరు ఎల్లోరా గుహలవద్ద ఉన్నది. ఈ స్థలం మిక్కిలి శాంతియుతంగా ఉన్నందువల్ల పూర్వంనుంచి అది ఋషులకు మునులకు ఆవాసంగా ఉంటోంది. కొన్ని వందల సంవత్సరాలక్రితం భగవంతుని మిత్రులగు అవులియాలు 1400 పల్లకీలలో స్వర్గంనుంచి దిగివచ్చారని అక్కడి మహమ్మదీయులలో నమ్మకం ఉంది. ఒక్కటిమాత్రం నిజం. ఖుల్దాబాద్ అయిదు శతాబ్దాలపాటు మిషనరీల సాహచర్యంలో వర్ధిల్లింది. ఈ ఊరులో చుట్టు ప్రక్కల ఎక్కడా లేనంతమంది సాధువులుండేవారు ఈ సంగతి అక్కడ ఉన్న సాధు సమాధులు గురువుల దర్గాలు చాటిచెబుతున్నాయి. ప్రజలు వీటిని దర్శనం చేసి యిప్పటికీ జోహార్లు అర్పిస్తూఉంటారు ఇందులో ముఖ్యమయినవి జలాలుద్దీన్

గంగ్రజవాన్, ముంతాజెబుద్దీన్ అతని శిష్యుడు జైనుద్దీన్‌ల సమాధులు బుర్హానుద్దీన్ గొప్ప ముల్లా. ఇప్పటికీ ప్రజలు వీరి సమాధులకు మ్రొక్కుతారు.

ఖుల్దాబాద్ లోని జర్‌జరీజర్ బక్ష్ (ఐశ్వర్యదాత) యొక్క దర్గాకు అనేకవేలమంది ప్రతి సంవత్సరం వస్తూంటారు దక్కన్ పీఠభూమిలో మహమ్మదీయులలో యిది చాలా ప్రసిద్ధిగాంచింది ఈ గురువు యొక్క అసలుపేరు ఖ్వాజా ముంతాజెబుద్దీన్ అని అందరకూ తెలియదు. ప్రజలు యితనిని దులేమియాం అని పిలుస్తూంటారు ఈ మాటకు గౌరవనీయమయిన పెళ్ళికొడుకు అని అర్థము. భగవంతునితో ఐక్యము పొందిన వానిని అలా అంటారు సంపదలలో ఉత్తమ సంపదనిచ్చు వాడని అతనిని అంచుటూ కొలుస్తారు

సద్గురు సాయిబాబా యొక్క గురువు పైన చెప్పిన జర్‌జరీజర్ బక్ష్ అని 20 సంవత్సరాల క్రిందట బాబా చెప్పారు. ఆతని శిష్యరికపు రోజులలో సాయిబాబా ఏకాంతంగా నుండిన యొక గుహను బాబా శిష్యులకు చూపించారు అనేక మంది ఎల్లోరాగుహలు చూసిపోతూ ఉంటారు. గనుక అక్కడి ప్రజలకు అది పరిపాటి అయింది కొంతమంది గ్రామీణులకు బాబా అంటే ఒక గొప్ప ధర్మదాత అనీ అప్పుడప్పుడు బీదవారికి అన్నవస్త్రదానాలు చేస్తూ ఉంటారని ఆ ప్రజలకు తెలుసును. బాబా ఒక సద్గురువనీ ఆయన ఏలి స్తేగాని వారికడకు పోరాదని ప్రజలు బాబావద్దకు వచ్చి మూగలేదు. ఆ విశ్రాంతి గృహంలో ప్రజల ఒత్తిడి లేకుండా బాబా అయిదు రోజులున్నారు తమ శిష్యులతో ఈ విశ్రాంతి గృహానికి ఖుల్దాబాద్ పట్టణ బాహ్య పరిసరాలలో ఊరికి రెండుమైళ్ళదూరంలో ఉంది ఈ గృహానికి ఎదావెడా ఎల్లోరా గుహలున్నాయి. ఈ రోజులలో బాబా భక్తుడుగానూ గురువుగానూ కూడా తన పాత్రను నిర్వహిస్తున్నారు. ఆయన స్థితిగురించి "నేను ఎవరిగా ఉన్నానో అదే నేను" అని అంటూఉండేవారు. భగవంతుడుగాను మానవుడిగాను ఉండిన అవతారపురుషుడు ఎన్ని విధాలుగానయినా అన్ని సమయాలలోను ఉండగలడు ఈ ద్విపాత్రా నిర్వహణము నిస్స్వార్థప్రేమ పరాయణులకు గాని అవగాహన కాదు. ఖుల్దాబాద్‌కి రాక బాబాకు ఆయన శిష్యులకు ఒక యాత్ర వంటిది బాబా శిష్యులకి మాత్రం మానసికం గాను శారీరకంగాను కష్టంగానే ఉంది యీ యాత్రలో. ఉదయాన్నే వారికి ప్రతిరోజూ మామూలుగా ఉండూ ఉన్న అల్పాహారం లేదు టీ మాత్రం తీసుకునేవారు భోజనానికి బాబా శిష్యులకు 11 గంటలకు పప్పు అన్నము తప్ప యింకేమీ ఉండేది కాదు.

సాయంకాలం 6 గంటలకు రొట్టె ఏదో కూర తప్ప యింకేదీ దొరికేది కాదు - ఇద్దరిద్దరు రాత్రిపూట కాపలా ఉంటూఉండేవారు వారు రాత్రిపూట నిద్రపోవడానికి వీలులేదు గనుక ప్రతిరాత్రి యిద్దరికి నిద్రలేకుండా ఉండేది. పంతులు వారిగా శిష్యులకు ఉదయం 5 గంటలనుంచి రాత్రి 9 వరకు ఏదోపని అప్పజెప్పేవారు.

ప్రతి సాయంకాలము శిష్యులందరితోను కూర్చుని బాబా వారికి భక్తుల కథలు చెప్తూ ఉండేవారు ఒక్కొక్కప్పుడు బాబా శిష్యులనే ఆ కథలు చెప్పమని వారు వింటూండేవారు గురువుల చరిత్రలకంటె భక్తుల చరిత్రలలోని విశేషాలంటే బాబాకి చాలా యిష్టం ఆయన దైవభక్తుల గురించిన ప్రేమగాథలు అద్భుత కార్యాలు గురించి చెప్తూ, వింటూ ఉండేవారు భగవంతుని యెడల ప్రేమ, విశ్వాసము కలిగిన వారి యుదంతాలంటే బాబాకు చాలా ప్రీతి అలాటివి చెప్పడమన్నా వినడమన్నా వారికి ఆసక్తి మెండు.

బాబా శిష్యులచేత ఎవరిమతం ప్రకారం వారిని దైవ ప్రార్థనలు చేయమని వారిచేత చేయించేవారు. బాబా కూడా చాలా భక్తితో ప్రార్థన చేస్తున్నట్లు కనపడేవారు. అందరిని కాళ్ళు కడుగుకొని రమ్మని వారి పాదాలకు శిరసు సోకునట్లు ప్రణమిల్లే వారు ప్రతి శిష్యుడు వారి ముందుకు వచ్చి నిలబడి ఆయన ప్రణామం చేసిన తరువాత ముందుకు పోయిన వెంటనే యింకొకడు వచ్చి నిలబడేవాడు ఈ విధంగా అందరికీ ప్రణమిల్లెడివారు ఈలాటి పనులు గురించి బాబా శిష్యులతో "నేను ఏ పని ఎందుకు చేస్తున్నానో తెలుసుకోవడానికి ప్రయత్నించకండి నేను చెప్పినట్లు చేయండి నేను మీ పాదాలు స్పృశించినపుడు మీరు పట్టి రాళ్ళమని భావించుకోండి" అని చెప్పేవారు బాబా

నవంబరు 8 వ తేదీన మెహెరాబాద్‌లో సమావేశమయినపుడు చెప్పిన పశ్చాత్తాప ప్రార్థన ఉర్దు మరాఠీ భాషలలోకి అనువాదం గావింపబడింది. దర్గాలలోను సమాధులలోను యీ అనువాదాలు కూడా చదివించ బడ్డాయి (తరువాత దర్గాలలోను సమాధులలోను బాబా వారి పాల భాగముతో వాటిని స్పృశించి గేటుకి చేరేవరకు వీపు చూపకుండా వెనుకకు అడుగులు వేసుకుంటూ బయటకు వచ్చేవారు.)

డిసెంబరు 13 వ తేదీన యీ విధముగా ఉదయం 7 గంటలు మొదలు 11 గంటల వరకు హజ్రత్ జర్‌జరీజర్ బక్షె దర్గాకు బుర్హానుద్దీన్ దర్గాకు, సయ్యద్

జైనుద్దీన్ షిరాజీ దర్గాకు. (ఇతనినే దావిస్పేన్ ఖ్వాజా లేక 22 వ సద్గురువు అని పిలిచేవారు) ఇంతా యిద్దరి దర్గాలకు నడిచివెళ్ళి వారికి జోహర్లర్పించారు ప్రవక్త మహమ్మదు యొక్క చొక్కా 21 గురువులకు పరంపరగా యివ్వబడి తుదకు 22 వ వాడయిన జైనుద్దీన్‌కు సంక్రమించగా అతడు మరి యెవరికీ యివ్వనందున యితని దర్గాలో నిక్షిప్తమయి (భద్రపరచబడి) పూజింపబడుతున్నది. సంవత్సరాని కొక తూరి దానిని ప్రజాదర్శనానికై ప్రదర్శిస్తారు ఈ 18వ తేదీయే అనేకవందల మంది మహమ్మదీయులు యీ దర్గావద్దచేరి తమ జోహారుల నర్పించుదినమయినది. కాక తాళీయంగా బాబా అక్కడికి వెళ్ళిన రోజునే యీ ప్రదర్శనము జరిగింది. ఇలాగే చదువరులకు అనేక స్థలాలలో ముఖ్యమైన పర్వదినాల సందర్భాలలో బాబా ఆయా స్థలాలకి చేరడం తటస్థించిందని తెలుసు

"భగవంతుడు అన్ని స్థలాలలోను అంతటా ఉన్న సర్వాంతర్యామి అయినపుడు అసలయన భక్తుడు యాత్రలకంటూ ఎందుకు వెళ్ళాలి?" అని బాబా ప్రశ్నించి దానికి తామే యిట్లు జవాబు చెప్పారు.

"ఎందువల్లనంటే ఒక్కొక్క భక్తునకు ఒక్కొక్క స్థలమునందు భగవంతునికి ఎక్కువ సన్నిహితముగా నుండునట్లు అనుభూతి కలుగుతుంది కొందరికి కొన్నిచోట్ల ప్రత్యేకంగా భక్తిభావం పొంగి వస్తుంది." తిరిగి బసకి రాగానే బాబా తమ శిష్యునొకనితో యిట్లన్నారు—"ఇంటికి వెళ్ళినతరువాత సమాధులకు దర్గాలకు నేను చేసాను కదా అని యాత్రలకు బయలుదేరకు ఎప్పుడూ నేను చేసినట్లు చేయాలని చూడకు నేను చెప్పినది మాత్రం తప్పక ఆచరించాలి. ఈ రోజులలో నేను ఏమి చేస్తున్నానో ఏమి చెప్తున్నానో దానికి యీ గురువులందరినీ నేను వారి దర్గాలకు వెళ్ళినందున సాక్షులుగా చేసుకున్నాను."

హమీర్‌పూర్‌లో చేసినట్లుగా బీదలసేవ చేయుటకు హిందువులు కొందరిని మహమ్మదీయులు కొందరిని దర్యాప్తుచేసి అర్హులయిన వారిని బాబావద్దకు తీసికొని వచ్చారు డిసెంబరు 16 వ తేదీ ఉదయం 40 మంది మహమ్మదీయ పురుషులు వచ్చారు గుల్బర్గాలోని హజ్రత్ బందానవాజ్ గెసూదరజ్ యొక్క తండ్రియయిన షేరజూక్వట్వాల్ హుస్సైనీ యొక్క దర్గా ఆవరణలో వారందరికి బాబా కాళ్ళుకడిగి వారి పాదాలకు ప్రణమిల్లి తలొక పదిరూపాయిలు పంచిపెట్టారు. అలాగే ఆ

మధ్యాహ్నం బాబా దిగిన విశ్రాంతి గృహానికి ఉన్న ఆవరణలో 25 మంది హిందువులు_ మగవారు 15 మంది, ఆడవారు 9 మంది, 1 పిల్లవాడు—రాగా బాబా వారికి ఒక్కొక్కరికి ప్రణమిల్లి రు 20/- చొ॥ దక్షిణనిచ్చారు ఆ సాయంకాలం బాబా ప్రత్యేకంగా హజ్రత్ జర్ జరీ జర్ బక్ష్ దర్గాకి వెళ్ళారు అక్కడ బాబా ఒక మహమ్మదీయునికి ప్రత్యేకంగా సేవ చేసారు. "నేను వీరికి ప్రణమిల్లుతున్నానంటే ఊరికే లాంఛన ప్రాయంగా ప్రణామం చేయడం లేదు "ఖుదాకో లేకర్ ఖుదాకో ఝుక్తాహూఁ"— (భగవంతుని పొంది నేను భగవంతునికే ప్రణమిల్లుతున్నాను) ' అని బాబా చెప్పారు

తరువాత రెండు రోజులు ఔరంగాబాద్ వెళ్ళి అక్కడ బాబా శిష్యులతో రహదారీ బంగళాలో ఉన్నారు ఇది మొగలాయి చక్రవర్తి ఔరంగజేబు పేరుతో నిర్మాణం చేసిన నగరం. అక్కడ కొంతమంది మస్తుల సాంగత్యం చేసారు బాబా ఔరంగాబాద్‌లో ఔరంగజేబ్ బేగంయొక్క సమాధి బీబీకా మక్బారా అనే పేరుతో విలసిల్లుతోంది. అంతేగాక బాబా దౌలతాబాద్‌లోను ఔరంగాబాద్‌లోను హిందూ గురువుల సమాధులను దర్శించారు ఎలాగో బాబా వచ్చారని ప్రజలకు తెలిసి చాలామంది బంగళాకు వారి దర్శనంకోసం 18 వ తేదీ సాయంకాలం వచ్చారు. ఆఊరిలోని అధికారులుకూడా చాలామంది వచ్చారు. వారందరికి బాబా దర్శనం యిచ్చారు.

మరునాడు ప్రొద్దున్న చీకటితోటే బయలుదేరి ఔరంగాబాద్ వదిలివెళ్ళారు. 19 వ తేదీన అక్కడనుంచి బద్నేరాలో ఉండే ఒక గొప్ప మస్తుని సాంగత్యం చేశారు బద్నేరా గ్రామం అమరావతి రోడ్డున ఉంది.

డిసెంబరు (1952) 20 వ తేదీన బాబా మండలితో కూడా అమరావతి వెళ్ళారు అమరావతి మధ్యప్రదేశ్‌లో ఒక ముఖ్యమయిన విద్యా కేంద్రము (గుంటూరు జిల్లాలో వేరే యింకొక అమరావతి పట్టణముంది). ఈ పట్నంలో విదర్భ మహావిద్యాలయ కాలనీలో అప్పుడు ఉంటున్న ఆచార్య సి డి దేశ్‌ముఖ్ యింటికి బాబా మండలితో వెళ్ళి అతని కుటుంబాన్ని చూసారు. బాబా ఆ రోజున ఏడుగురు బీద విద్యార్థులను రావించి వారి పాదాలుకడిగి ప్రణమిల్లి ఒక్కొక్కరికి రు 5/-చొ॥ దక్షిణ నిచ్చారు. ఇది బాబాకి పూర్తి సంతుష్టి నీయలేదు. అందువల్ల ఒక బీదవానిని కుటుంబసహితంగా రప్పించి వానిని మ్రొక్కి ఆ కుటుంబానికి నూరు రూపాయిలిచ్చారు బాబా.

బాబా అమరావతి విశ్వవిద్యాలయానికి యితర విద్యా కేంద్రాలకి వెళ్ళి చూసారు తరువాత భక్తుల గృహాలకి కూడా వెళ్ళి వారి కుటుంబాలను దీవించి ఇచ్చారు. శివాజీ ఆర్ట్సుకాలేజి వారు ఆహ్వానింపగా బాబా అక్కడకు వెళ్ళి రమణ మహర్షి హాల్ అని పేరు పెట్టిన ఒక పెద్దహాలుకు ప్రవేశ మహోత్సవం జరిపారు అమరావతిలో నడివయస్కురాలయిన ఒక సాధువమ్మ ఉంది ఆమె పేరు తాయి మహరాజ్. బాబాను చూడగానే ప్రేమపూరితమయిన ఆమె హృదయం బాబాను గుర్తించింది బాబా అక్కడికి వెళ్ళగానే ఆమె అవతారమూర్తి వచ్చారని తన వద్ద ఉన్నవారితో చెప్పింది. బాబా ఆమెవద్ద ఉన్న అరగంటసేపు ఆయన పాదాలవద్దనే కదలకుండా కూర్చుంది. భక్తులు ఎంతోమంది ఒకరి తరువాత ఒకరు వచ్చి బాబాకు ప్రణామాలు చేస్తున్నాగాని ఆమె తొలగిపోక అక్కడే బాబాను ఆరాధిస్తూ కూర్చుంది. ఆమె ఒక దేవాలయంలో ఉంటూంది బాబా వెళ్ళిపోవానికి లేవగానే మందిరం లోపల కూడా చూద్దురుగాని రండని బాబాని లోపలకు తీసికొని వెళ్ళింది అక్కడ ధగద్ధగాయ మానంగా ఆభరణాలతో మెరిసిపోతున్న శ్రీకృష్ణదేవుని విగ్రహం బాబాకు చూపించింది. బాబా "నేనే అందులో ఉన్నాను" అని నవ్వుతూ చెప్పారు.

అమరావతిలో బాబా గౌరవార్థం కొన్నిచోట్ల బ్రహ్మాండమయిన ఏర్పాట్లు చేయగా బాబా అదిచూసి "భాగ్యవంతులలోకెల్లా నేను భాగ్యవంతుడను అదే సమయంలో పేదలలోకెల్ల పేదవాడిని నాకు బీదలను మస్తులను ప్రజలను సాంగత్యం చేయాలని ఉంటుంది." అన్నారు బాబా.

అమరావతిలో మొదటిమాటుగా బాబా తమ హారతి తామే యిచ్చుకున్నారు. ఇది డిసెంబరు 21 వ తేదీన ఒక బాబా ప్రేమికుని యింటిలో బాబా జీవిత సైజు చిత్రపుపుకు ఎదురుగా జరిగింది అప్పుడు తమ ప్రసంగంలో అన్నారు—"నాకు అసలయిన హారతి నిజంగా నేనే యివ్వగలను" అని

21 వ తేదీన సాగ్నే అనేవాడు జోషి హోటలులో బాబాకు స్వాగతసభ ఏర్పాటుచేసి సత్కరించాడు ఆ రోజున మధ్యప్రదేశ్ మంత్రి మండోలీ బాబాదర్శనం చేసుకున్నాడు.

22 వ తేదీన కేంద్రమంత్రి పంజాబ్‌రావ్ దేశ్‌ముఖ్ జనతా కాలేజీలో రమణమహర్షి చిత్రపటం ఆవిష్కరణ బాబాచేత జరిపించినపుడు బాబాకు ఘనమయిన స్వాగతం యిచ్చారు

23 వ తేదీన బాబా డా॥ దేశ్‌ముఖ్ యింటికి వెళ్ళి అక్కడ మండలి వారితో కలిసి ప్రార్థనచేసి విడివిడిగా వారి పాదాలకి నమస్కరించి వారితో కలిసి తమ చిత్రపటానికి బాబా హారతి యిచ్చారు ఈ జ్యోతిర్మయ జీవితంలో యీ సంఘటన చాలా విశిష్టమైనది ఆ రోజున అమరావతిలో జయరామ్ బువా అనే ఒక సుప్రసిద్ధ సాధుపురుషుడు ఉండగా అతనిదగ్గరకు వెళ్ళారు బాబా అక్కడ బాబా కోసం సంగీతం పాడించారు. మొదటిపాట అయిన తరువాత బాబా ఎందుకు మౌనం వహించారన్నట్లుగా జయరామ్ బువా బాబావైపు చూడగా బాబా "నేను మౌనంగాఉన్నప్పటికీ ప్రపంచంలోని అందరి నోళ్ళతోను నేను మాట్లాడుతూనే ఉన్నాను." అన్నారు.

అమరావతికి అయిదుమైళ్ళ దూరంలో కుష్ఠురోగుల ఆశ్రమం ఉంది. ఆ సాయంకాలం బాబా అక్కడికి వెళ్ళి ఆ రోగులందరితోను చనువుగా తిరిగి వారి యోగక్షేమాలు కనుక్కున్నారు. నిర్వాహణాధికారి ముందు నడుస్తూ బాబాను అన్ని చోట్లకు అందరిదగ్గరకు తీసికొని వెళ్ళి చూపించాడు. అలా ఒక అరగంట తిరిగి బాబా అక్కడ ఉన్న ఆసుపత్రి వారి నివాసాలు చూసారు బాబా వారి ప్రార్థనామందిరంలో రోగులందరి మధ్యా కూర్చున్నారు బాధపడుతూన్న యీ రోగుల ఆనందం కోసం బాబా అక్కడ వారికి ఉత్తేజం కలిగిస్తూ యీ క్రింది సందేశం వ్రాయించి చదివించారు.

"ఎక్కువగా బాధలు పడేవారే భగవంతుని ప్రేమకు పాత్రులు. వారే భగవంతునికి సన్నిహితులు మనకు తెలియకుండా కొన్ని కష్టాలు సంప్రాప్తం అవుతాయి అవి మనము ఎదురు చూడకుండా వస్తాయి వాటి ద్వారా భగవంతుడు మనలను దీవిస్తాడు సుఖాలు వచ్చినా కష్టాలు వచ్చినా యీ అనుభవాలన్నీ శూన్యమయిన యీ ప్రపంచం ద్వారానే కలుగుతాయి అందుచేత అవి కూడా శూన్యాలే కుష్ఠురోగులు ఆనందంతో వారి కష్టాలను రోగాలను భరించాలి వారు నిరుత్సాహం పొందకూడదు నిరాశ, నిస్పృహ దరికి రానీయరాదు భగవంతుని దరిజేరడానికి మీ రోగము ఆయన కల్పించిన ఒక అమూల్యావకాశంగా మీరు భావించాలి. శారీరకమైన యీ వ్యాధితో బాధపడుతున్న మీరు ప్రపంచంలో బహు అల్ప సంఖ్యాకులు కానీ మానవకోటిలో చాలా మంది మానసిక కుష్ఠువ్యాధితో బాధపడుతున్నారు. నేను ప్రపంచంలోని అన్నిరకాల కుష్ఠురోగులకు ఒక ఆశ్రమం పెడదామనుకుంటున్నాను. అన్నారు బాబా.

ఆ రోజు మధ్యాహ్నం విదర్భ మహావిద్యాలయ ఫిలసాఫికల్ ఎసోసియేషన్ (వేదాంత సంఘం) వారు బాబా గౌరవార్థం ఒక గొప్ప సభ ఏర్పాటుచేసి బాబాను సన్మానం చేసారు. ఆ సభలో డా॥ పంజాబ్‌రావు దేశ్‌ముఖ్ ఉపన్యసించాడు.

డిశెంబరు 24 వ తేదీన బాబాను దేవర్‌గామ్ అనే సమీపగ్రామానికి రమ్మని ఆహ్వానించగా పదిహేనుమైళ్ళ దూరంలో ఉన్న ఆ ఊరికి వెళ్ళారు ఆ సాయంకాలం ఆ గ్రామంలోని బీదల నివాసము వద్ద ఒక మైదానంలో ఒక బహిరంగ ప్రజా సమావేశమయింది. ఆ ఊరిలో పీరఖాన్ మహరాజ్ అనే సాధువును కలిసారు బాబా. అక్కడ ఆ సాధువు ఎవరికీ తెలియకుండా సన్యాసి జీవితంలో కాలక్షేపం చేస్తున్నాడు బాబావద్ద అతడు మాట్లాడిన మాటలను బట్టి తన అంతరాత్మ ప్రబోధం వల్ల బాబా ఎవరో అతడు గుర్తించినట్లు తెలిసింది బాబా గురించి ఆయన గురువులకు పరమగురువని బాబావద్ద అతడన్నాడు. బాబాకు స్వాగతం యిస్తూ గీతలో శ్రీకృష్ణు డిచ్చిన వాగ్దానం నెరవేర్చడానికి భగవంతు డిప్పుడు మెహెర్‌బాబా రూపంలో అవతరించాడని చెప్పాడు

క్రిక్కిరిసిన ఆ బహిరంగ సమావేశంలో హారతి యిచ్చే కార్యక్రమంలో జయరామ్ బువా బాదా శిష్యులతో చేరాడు హారతి యివ్వడానికి రామచంద్ర కాజోజీ గడేకార్ అను పూనా నివాసి అయిన సుప్రసిద్ధ బాబా ప్రేమికుడు, పాట ప్రారంభించి పాడుతుండగా మిగిలినవారు అనుసరించారు

ఆ సాయంకాలం విఠల్ మందిరంలో బాబా సమక్షంలో చక్కని సంకీర్తన జరిపారు పావానేర్ చిన్న పట్టణమయినా అక్కడ నివసిస్తూన్న బాబా ప్రేమికుల ప్రేమవలన వారు నిశ్శబ్దంగా చేస్తున్న సేవ వలన ఆ చుట్టుపక్కల గ్రామాలకి అది కేంద్రమయింది కొన్ని సంవత్సరాల క్రిందట బాబా మొదటిసారిగా యీ వూరు వచ్చినపుడే యిది మరియొక "హమీర్‌పూర్" అనుకునేలాగ బాబా యెడల అపరిమిత ప్రేమానురాగాలు అక్కడ వెల్లివిరిసాయి.

డిసెంబరు 30 వ తేదీన బాబా ఆ వూరు వచ్చినప్పుడు పూరథితా జెండాలతోను, తోరణాలతోను అలంకరింపబడి చాలా చక్కగా కనిపించింది ఒకేచోట పెద్ద పందిరి వేసే దానికి బదులు మైలు పొడుగున ఉన్న పెద్దతోట్టలో అక్కడక్కడ చిన్న చిన్న పందిళ్ళు వేసారు. బాబా ఆ పందిళ్ళలో ఆగడానికి ఎక్కువమంది

ప్రజలు వారి దర్శనం చేసుకోవడానికి వీలయింది. బీదలకు సేవ చేసినతరువాత బాబా అక్కడ బాబా ప్రేమికుల యిండ్లకు వెళ్ళి వారి కుటుంబాలకు వారి దర్శనమిచ్చి వారిని దీవించారు బాబా పరిసర గ్రామాలనుంచి వేలకొలదీ ప్రజలు వచ్చి వారి దర్శనం చేసుకున్నారు.

సావొనేర్‌లో 31, డిసెంబరు (1952) 1, జనవరి (1953) రెండు రోజు లున్నారు సంవత్సరాది పండుగనాడు (జనవరి 1, 1953) సావొనేర్‌లో బాబా, బహి రంగంగా ప్రజలకు దర్శనం యిచ్చారు ఆ రోజున అనేక వేలమంది ప్రజలు చుట్టు ప్రక్కల గ్రామాలనుంచి వచ్చి బాబా దర్శనం చేసుకున్నారు. దర్శన కార్యక్రమం కోసం ఒక పందిరి వేయబడింది. వచ్చినవారు సావొనేర్‌లో ఆరు బయటనే కటిక నేలమీద పరున్నారు. కాస్త రొట్టె పచ్చడితో తిని కడుపునింపుకుని సంతృప్తి పడ్డారు. అవతారమూర్తి అయిన బాబా దర్శనంవలన కలిగిన ఆనందంతో పోలిస్తే యీకష్టాలు ఏపాటివని వారు వీటిని లెక్కచేయలేదు వారంతా చాలామంది అమాయకులు, అక్షర జ్ఞానము లేని గ్రామీణులు వారందరికీ బాబా ప్రసాదం పంచి పెట్టబడింది అనేక స్థలాల్లో బాబా దర్శనం యిచ్చారు బాబా తరువాత అక్కడినుంచి నాగపూర్ ప్రయా ణమై వెళుతూ ఐరీన్‌కోనిబేర్‌కు సుస్తీ చేయుటచేత ఆమెను వెనుక అట్టే ఉంచి ఒక శిష్యునికి ఆమెను అప్పగించి వెళ్ళిపోయారు సావొనేర్‌కి నాగపూర్ నగరం 60 మైళ్ళ దూరం ఉంది గీత్‌వాద అనే ఆంగ్ల దినపత్రిక సావొనేర్‌లో బాబా కార్యక్రమాలు ప్రచురించింది. జ్యోతిర్మయ స్వేచ్ఛాజీవితంలో బీదలకు ప్రణమిల్లి వారికి ప్రసాదంగా దక్షిణను యివ్వడం బాబా ఒక పనిగా పెట్టుకున్నారు. ఒకచోట బాబా గౌరవార్థం జరి గిన సత్కారసభలో బాబా సందేశమిస్తూ "అందరిలోనూ అన్నిటిలోనూ భగవంతుని చూడటం, భగవంతునితో ఐక్యమవడం యిదే భగవత్సాక్షాత్కారానికి అర్థం. అదే దానికి ఫలితం చనిపోయిన వారిని బ్రతికించడం అద్భుతం కాదు గాని బ్రతికి ఉన్న వారిని తమ అహానికి చచ్చినట్లుగా చేయడమే అద్భుతం. అంటే ప్రపంచ జీవితంలో భాగం నశింపచేయడం. ఎప్పుడయితే విరాగి అయాడో అహంకారం నాశనం అయిం దన్నమాటే ప్రపంచం అనే పెద్ద మాయలో అద్భుతాలనేవి చిన్న చిన్న మాయలు" అని బాబా చెప్పారు.

ప్రసిద్ధ బాబా ప్రేమికుడగు అలెగ్జాండర్ మార్కీ (జాండర్) అప్పుడు ఆల్వార్‌లో ఉన్నాడు. అతడు బాబాను ఆల్వార్‌కి రమ్మని పిలిచారు. కానీ బాబా

వారికి వ్యవధిలేక ఆల్వార్ వెళ్ళడానికి నిరాకరించారు జాండర్ అప్పుడు చేస్తూన్న ఫిలిం దర్శకత్వానికి తాత్కాలికంగా సెలవు పెట్టి బాబా దర్శనార్థం సావొనేర్ వచ్చాడు. జాండర్ "సైలెంట్ రెవలేషన్స్ (మౌనప్రకాశములు) అనే గ్రంథం రచించాడు.

జనవరి (1953) 1 వ తేదీ మధ్యాహ్నం బాబా వక్కార్ దారాలో తాజుద్దీన్ బాబా సమాధి స్థలాన్ని చూసారు.

## సూర్యప్రకాశ్ :—

సావొనేర్‌లో ఉన్నపుడు బాబాకు ఆంధ్రదేశాన్నుంచి ఒక బాలుని ఉదంతం చేరింది. సుమారు 15 ఏళ్ళ ప్రాయం కలిగిన యీ బాలుడు బాబాను ఒక్కమారే దర్శించాడు ఆ బాలునికి బాబాను చూసినప్పటినుండి ఆయన అంటే విపరీతమయిన ప్రేమ కలిగింది. అతడు మౌనము వహిస్తూ ఉండేవాడు అప్పుడప్పుడతనికి స్పృహ తప్పిపోతూ ఉండేది ఆ బాలుడు చాలా రోజులు ఉపవాసం ఉండేవాడు పైకి అన్ని విధాలా ఒక సాధువులాగే కనిపించేవాడు త్వరలోనే బాబా ఆంధ్రదేశ పర్యటన ఏర్పాటు చేయకున్నప్పటికీ ఆయన అతనికి రాసూపోసూ ఖర్చులవుతాయని ఆలోచించక ఎంత యిబ్బంది అయినా తండ్రిని ఆ పిల్లవానిని వెంటనే సావొనేర్ తీసుకు రమ్మని ఆదేశించారు బాబా. పిల్లవాని తండ్రి ప్రముఖ బాబా ప్రేమికుడయిన రంగా రావు. రంగారావు ఏలూరు కాపురస్థుడు ఆ బాలుని పేరు సూర్యప్రకాశ్. గత నవంబరు 7,8,9 తేదీలలో మెహెరాబాద్ సమావేశానికి వెళ్ళాడు యితడు కూడా. బాబా ఆజ్ఞప్రకారం సావొనేర్ వచ్చాడు. ఈ బాలుడు ఎక్కువ ప్రయత్నం లేకుండానే సమాధిస్థితిలోకి వెళ్ళేవాడు చుట్టూ ఎంతమంది జనం ఉన్నా సూర్యప్రకాశ్‌కి పరవశత్వం కలిగేది ఇతని పూర్వచరిత్ర కొంచెం తెలుసుకుందాం

1952 ఆగస్టు 10 వ తేదీన ఏలూరులో తండ్రితో కూడా బాబా ప్రేమికుల మండలి సమావేశానికి సెంటరుకి వెళ్ళాడు ఆనాటి సాయంకాలం 5–30 గంటలకు తండ్రికొడుకులు యిద్దరు సమావేశానికి చేరారు లోపలికి వెళ్ళి సూర్యప్రకాశ్, ప్రియతమ బాబా యొక్క పెద్దసైజు చిత్రం వైపు అదేపనిగా చూస్తూ నిలబడ్డాడు. తరువాత నెమ్మదిగా అక్కడ వేసిఉన్న దివాన్ పైకి ఒరిగేడు. అప్పుడు సాయంకాలం 6–30 గంటలయింది ఆ హాలులోని ఎలక్ట్రిక్ దీపాలన్నీ ఒక్కమారుగా ఆరిపోయాయి.

మిగిలినవోట్ల ఆ చుట్టుప్రక్కల దీపాలన్నీ వెలుగుతూనే ఉన్నాయి ఆ యింటిలో కూడా ఎలక్ట్రిక్ ఫ్యూజులన్నీ సరిగానే ఉన్నాయి ఆ చీకటిలో ఆ హాలులో సూర్యప్రకాశ్ ముఖము నుండి వెన్నెలవలె వెలుతురు ప్రసరించసాగింది అయిదు నిమిషాలలో ఆ బాలునికి తెలివి వచ్చి లేచాడు కన్నుమూసుకుని బాబా చిత్రానికి ఎదురుగా ఠీవిగా నిలబడ్డాడు, ఇదేమిటా అని అందరూ ఆశ్చర్యపోతూ చూస్తున్నారు అంతట ఆ కుర్రవాడు ప్రేమికులవైపు తిరిగి చెయ్యెత్తి వేలుతో ఒక ప్రేమికుని వైపు చూపించాడు. అప్పుడా ప్రేమికుడు కన్నీరు విడుస్తూ "బాబా ! నీ పాదపద్మాలు చూడటానికి నేనెంత అదృష్టవంతుడను" అని ఆ బాలుని చరణాలు తాక బొచ్చెను. అలాగే సూర్యప్రకాశ్ యింకా కొందరివైపు తిరిగి చేతివేలితో చూపించసాగెను ఒకతడు ఏడుస్తూ "బాబా ! బాబా !" అంటూ ఆ హాలంతా కోతివలె గంతులు వేయ సాగెను ఇంకొకతడు ఒక స్తంభానికి జేర్లబడి ఏడ్వసాగెను. ఆ యింటి యజమాని "బాబా ! నేను స్థూలకాయుడను నేను లేస్తే దేనిమీదయినా పడిపోతాను నన్ను దయగా చూడాలి" అని ప్రార్థించగా సూర్యప్రకాశ్ అతనిని వదిలివేసెను. అంతకుముందు సభ్యులలో కొన్ని భేదాభిప్రాయాలకు కారకులైన ఎవరికోసమో సూర్యప్రకాశ్ వెదకు తున్నాడు. ఈ విధంగా బాబా సూర్యప్రకాశ్ రూపంలో కొందరి సభ్యులపని పడు తున్నారని కొందరు మెల్లగా బయటికి జారుకున్నారు.

ఆ హాలులో యింకా చీకటి రాజ్యం చేస్తోంది 'బాబా' 'బాబా' అని నామం చేస్తూ కొందరు ఏడుస్తూ లేచి నృత్యం చేస్తున్నారు ఈ విధంగా రాత్రి 8-30 వరకు సాగింది. అప్పుడు సుబ్రహ్మణ్య శాస్త్రి అనే ప్రేమికుడు "రంగారావూ ! నీవే యీ సమయంలో బాబాని ప్రార్థించి శాంతి నెలకొనేలా చేయగలవాడవు ఇలా ఉంటే మేమింక భరించలేము. అంతట సూర్యప్రకాశ్ అదే ఠీవితో బాబా చిత్రంవైపు తిరిగి చూసి తరువాత తన తండ్రివైపు తిరిగిచిరునవ్వుతో చూసి అక్కడ ఉన్న ప్రతి సభ్యుని దయతో స్పృశించెను ఈ స్పర్శయిదివరకటి అధికారయుతమయిన వైఖరికి విరుద్ధంగా ఎంతో మృదువుగా ఉంది బయటకు వెళ్ళిన ప్రేమికులంతా తిరిగివచ్చి హాలులో కూర్చు న్నారు.సూర్యప్రకాశ్, రంగారావు బాబా చిత్రం వైపుతిరిగి ప్రార్థించారు. రాత్రి 10 గంట లయింది. దీపాలన్నీ తిరిగి వెలిగాయి. సూర్యప్రకాశ్ మామూలు స్థితిలోకి వచ్చాడు. సమావేశం ముగిసింది. తండ్రి కొడుకు లిరువురు ఇంటికి చేరుకున్నారు

కొన్నిరోజుల తరువాత రంగారావు మెహెరాబాద్ వెళ్ళినపుడు అడుగగా బాబా తానే అట్లు సూర్యప్రకాశ్ ద్వారా ఏలూరులో జరిగించానని చెప్పారు తరువాత

ఒకరోజు (16-12-52 న) ఉదయం కొంచెము బాబా ప్రేమికులు (కలుపలపల్లి సుబ్రహ్మణ్యశాస్త్రి, డి జగన్నాథరావు, బి బలరామయ్య వగైరాలు) ఏదో పని మీద కైకరం వెళ్ళి కాలవరోడ్డున ఒక పాత కారులో ఏలూరు తిరిగి వస్తున్నారు. ఆ కారులో సూర్యప్రకాశ్ కూడా కూర్చుని వస్తున్నాడు. కొంతదూరం వచ్చిన తిరువాత కారు ఆగిపోయి కదలలేదు. డ్రైవర్ చక్రానికి ఏదయినా అయిందేమో అని చూస్తున్నాడు. తరువాత ఇంజన్, గియర్ యివన్నీ పరీక్షగా చూసాడు ఏమి చేసినా ఏమీ లాభంలేకపోయింది కారులో ఉన్నవారు కొందరు ఏలూరులో ఉద్యోగస్తులు వారు ఆఫీసులకి వెళ్ళాలి సమయం అవుతోంది సూర్యప్రకాశ్‌ను సహాయం చేయమని వారితో ఆ కారులో ప్రయాణం చేస్తూ ఉన్న వారంతా బ్రతిమాలారు. వెంటనే ఆ కుర్రవాడు కళ్ళు మూసుకొని సీటుమీద జేరబడి ఒక కాగితం మీద యీ విధంగా వ్రాసాడు .—

"నిన్న రాత్రి 3 గంటలకు పొట్టి శ్రీరాములు చనిపోయాడు అందుచేత మీకు యీ రోజున ఆఫీసులకు సెలవు." అని వ్రాసి "కారు దిగిన వాళ్ళంతా ఎక్కండి. భయపడరా! కారుస్టార్ట్ చెయ్యవోయ్!" అని చెప్పాడు. అందరూ లోపలికి ఎక్కి కూర్చున్నారు. కారు యీ మారు పేచీ పెట్టకుండా బయలుదేరింది. తిన్నగా కారు జిల్లాకోర్టు వద్దకు 11 గంటలలోపుగానే వెళ్ళి ఆగింది లోపలికి వెళ్ళి కనుక్కుంటే పై కారణంచేత ఆరోజున ఆఫీసులకు సెలవు యిచ్చారని తెలిసింది. బాబా దయవల్ల అందరూ ఎవరి యిళ్ళకు వాళ్ళు సురక్షితంగా చేరుకున్నారు.

తరువాత సూర్యప్రకాశ్ తన యింట్లోంచి వచ్చేసి సెంటర్లో బాబా మండలి హాలులోనే ఉంటూ వచ్చాడు అక్కడ మౌనం అవలంభించి తెలుగు అక్షరాల బోర్డును దగ్గర పెట్టుకున్నాడు. తనకు అవసరమయినప్పుడు అది ఉపయోగించేవాడు.

అది లగాయతు బాబా భజన సంకీర్తనలకు అనేకమంది ప్రజలు వచ్చేవారు వారు బాబాకి పువ్వులు పళ్ళు అనేకంగా తీసుకువచ్చి అర్పించేవారు. ఒక రోజున సూర్యప్రకాశ్ రమ్మంటే జిల్లాజడ్జి కృష్ణారావు భార్యా సమేతంగా బాబా భజనకు వచ్చాడు. వచ్చి ఆ పిల్లవాని చేతినుండి ప్రసాదం తీసుకుని వారిరువురు వెళ్ళారు.

1952 అక్టోబరు 7 వ తేదీన బాబా ఎరచ్‌చేత రంగారావుకి ఒక లేఖ వ్రాయించారు అందులో రంగారావును అతని కుమారుడగు చిరంజీవి సూర్య ప్రకాశ్‌ను మెహెరాబాద్ వచ్చి నవంబరు (1952) 7,8,9 తేదీలు మూడు రోజులు ఉండవలసినదని తెలియపరచాడు తరువాత డిసెంబరు 23 వ తేదీన బాబా "31, డిసెంబరున నీవు నీ తనయుడు సూర్యప్రకాశ్ నాగపూర్ స్టేషన్‌కి వచ్చి యుండవలయును" అని తంతి రంగారావు పేర పంపించారు. ఆ ప్రకారంగా వారిద్దరు బయలుదేరి వెళ్ళి, బాబా ఆజ్ఞప్రకారం నాగపూర్ స్టేషన్‌కి వెళ్ళి, ఆనాటి (30-12-52) మధ్యాహ్నం బాబాను కలిసారు. బాబా వారిరువురిని సావానేర్ తీసికొని వెళ్ళారు సావానేర్ వెళ్ళి బాబాను వారిద్దరు ఆ రాత్రి దర్శించారు. బాబా రహదారి బంగళాలో బసచేసారు. బాబా ఆ బాలుని స్పృశించి ఆశీర్వదించారు మరునాడు ఉదయం మండలితో బాబా కూర్చుని రంగారావుకి సూర్యప్రకాశ్‌ని తీసికొని రమ్మని కబురుపంపారు బాబా ఆ బాలుని గురించి మండలికి వివరిస్తూ సూర్యప్రకాశ్‌ని నేనొక సాధువును చేస్తాను అన్నారు అప్పుడు బాబా, సూర్యప్రకాశ్‌ని ఏ విధంగా పెంచాలో తండ్రికి వివరించి చెప్పారు.

సావానేర్ లో 1-1-1953 వ తేదీన ప్రజాదర్శన కార్యక్రమం జరుగుతోంది అప్పుడు బాబా ప్రసాదం యిస్తూంటే సూర్యప్రకాశ్ నేను కూడా యిస్తానన్నాడు. బాబా అతనిని "నీవు చూస్తూ కూర్చో." అన్నారు ఆ బాలుని, బాబా తమ ఎడమవైపున వేదికమీద కూర్చోబెట్టుకున్నారు. బాబాకు కుడివైపున రంజూ అబ్దుల్లా, జాండర్, మొదలయిన వారు కూర్చున్నారు సూర్యప్రకాశ్ నెమ్మదిగా కళ్ళు మూసుకొని బాబావేసుకున్న రోజాపుష్పమాలలో ఒక పువ్వునుతీసి మండలిలో ఒకనికియిచ్చాడు బాబా ప్రసాదం పంచి యిచ్చే సమయానికే సరిగా మాలలో నుంచిఒక పూవు తీసేవాడు సూర్యప్రకాశ్. సూర్యప్రకాశ్ ఎంతమందిలో ఉన్నా అకస్మాత్‌గా చైతన్య రహితుడయేవాడు. నిద్రపోతున్నట్లు అతని కళ్ళు మూతలు పడేవి. బాబా ఎక్కడ కూర్చుని ఉన్నా ఆయనచేతులు ఎట్లాడించునో అట్లే కనులు మూసుకొనియున్న అతని చేతులు అట్లాడును బాబా మండలి ఫలానా వానిని చూపుమని చెప్పగానే ఎంతమంది ఉన్నా సూర్యప్రకాశ్ కళ్ళు మూసుకొని అతని వద్దకు వెళ్ళి ఆ శిష్యుని చేయిపట్టుకునేవాడు ఇంకొకరెవరయినా అడ్డుగా వచ్చి చేతిని యిస్తే అది పట్టుకోక తోసేసేవాడు. కళ్ళు మూసుకుని అతడు అలా ఎలా చేయగలుగుతున్నాడని జాండర్ బాబాను అడిగాడు.

ఆ పిల్లవానిలో ఉన్న దాదా యే అట్లు చేస్తున్నాడని బాబా జవాబుచెప్పారు తరువాత బాబా ఆజ్ఞప్రకారం సూర్యప్రకాశ్ వేదిక మీద కొంతసేపు పరుండి విశ్రాంతి తీసుకున్నాడు. కార్యక్రమం పూర్తి అయేవరకు అతడు పరుండియే యున్నాడు రాత్రి భోజనం అయిన తరువాత బాబా సెలవు యివ్వగా రంగారావు కొడుకుని తీసుకొని బసకు వెళ్ళాడు 2 వ తేదీన బాబావద్ద సెలవు తీసుకుని వారిరువురు బయలుదేరి ఏలూరుకు తిరిగి వెళ్ళిపోయారు. విజాయితీగాను సహజంగాను ఉన్నప్పటికీ నిజంగా సాధువు కాకపోయినా సాధువువలె మిథ్యావాదుడై చరించే అపాయం భవిష్యత్తులో రాగలదని ప్రస్తుత మార్గంనుండి తప్పించి బాబా ఆ పిల్లవాని తండ్రికి అతని విషయంలో ఎట్లు జాగ్రత్త తీసుకోవలెనో రంగారావు వెళ్ళేముందు బాబా వివరించి చెప్పి పంపారు. అప్పటినుండి సూర్యప్రకాశ్ మామూలుగా ఉండెను.

సావానేర్‌లో బాబా 1 వతేదీ సాయంకాలం ప్రేమికుల యిళ్ళకు వెళ్ళి వారి కుటుంబాలను ఆశీర్వదించారు. ఒక భక్తుడు అతని భార్య వచ్చి బాబా దర్శనం చేసుకుని వారి యింట్లో బాబా వినోదార్థం ఒక కార్యక్రమం ఏర్పాటు చేసారు. అందులోని హాస్యరస ప్రధానమయిన ఒక సంభాషణ విని బాబా ఆనందించారు.

## కృష్ణజీ :—

మెహెరాబాద్‌లో యిదివరకు (1952, నవంబరు 8 న) జరిగిన ఒక సమావేశానికి హాజరై బాబా దర్శనము చేసుకొని యున్న కృష్ణజీ అను భక్తుడు కూడా యిప్పుడు సావానేర్ వచ్చి యుండెను దాదా సాకోరీ వెళ్ళినపుడు యితడు కూడా మహరాజ్ ఆశ్రమానికి వచ్చాడు బాబా అతన్ని సావానేర్ రమ్మనగా యిప్పుడు వచ్చాడు కృష్ణజీకి బాబా తాము, నాగపూర్‌కి బయలుదేరి వెళ్ళేముందు అతనిని ఉత్తర హిందూస్థానమంతయు బైరాగివలె తిరిగి రమ్మని కొంత గడువుపెట్టారు ఇంకా అతన్ని యీ విధంగా బాబా ఆదేశించారు

"(1) నీవు ఎక్కడ ఉన్నా ప్రజలకు నా ప్రేమ గురించి చెప్పు. అరణ్యంలో అగ్ని జ్వాలవలె నా ప్రేమ సందేశం వ్యాప్తి చెయ్యాలి.

(2) ఎట్టి పరిస్థితులలోనయినా నీ ఆహారం భిక్షాటనంచేసి సంపాదించుకోవాలి నీకు ఏది లభిస్తే అదే తిని తృప్తి పొందాలి. నీవు భిక్ష అడిగి తీసుకున్నది గాక యితర ఆహారము లభ్యమైనా అది నీవు తీసికొనకూడదు. నీవు తినగలిగినది

మాత్రమే భిక్ష అడుగవలెనని జ్ఞాపకముంచుకో. అంతకన్న ఎక్కువ తీసుకోవద్దు. రెండవపూట కోసమేమీ నిలువ చేసుకోకూడదు.

(3) నీవు ఎక్కడయినా సరే స్త్రీని తాకరాదు

(4) నీవు ఎవరయినా యిచ్చినా ధనం స్వీకరించరాదు టిక్కెట్టు లేకుండా నీవు ప్రయాణం చేయరాదు అందుకోసం నేను ధనమొస్తున్నా పుట్టనివాడినయినా, నీకు ప్రయాణపు ఖర్చులకోసం నే నిస్తున్నాను ఈ ధనము నీవు యితర ఖర్చులకు వినియోగించవద్దు.

(5) నీ ప్రాణం పోయినానసరే నేను చెప్పినట్లు గడువులోపల నీ పర్యటనకై తయారు చేసిన కార్యక్రమం ప్రకారం యావత్తు ముగించుకుని తిరిగి రావాలి —"
అని బాబా అతనికి చెప్పి పంపించారు.

1953, జనవరి 2వ తేదీ ఉదయం, సావొనేర్‌లో బయలుదేరి బాబా నాగపూర్ వెళ్ళారు మధ్య 'అంగెవాడా' లో 10 గంటలకు చేరి అక్కడ బాబా కొంచెంసేపు విశ్రాంతి తీసుకున్నారు నాగపూర్ చేరుకున్న తరువాత బాబా గోకులపేటలో ఎ డి. దేశ్‌ముఖ్ అను ప్రేమికుడు ఏర్పాటు చేసిన యింటిలో బసచేసారు మంచలి పేరే ధర్మపేటలో గోపాలరావు అనే అతని యింటిలో బస చేసారు ఆ రోజున పదిమంది బీదవారిని పిలిచి వారిని సంభావనచేసి పంపించారు. తరువాత ఇందుమతి దేశ్‌ముఖ్ బాబాను తన పూజామందిరానికి ఆహ్వానించగా బాబా అచ్చటకు వెళ్ళి ఆ మందిరమును పావనము చేసారు. దానికి ఆమె మెహెర్ మందిరమని పేరు పెట్టింది బాబా దానికి ప్రారంభోత్సవం చేసారు అందుకు చిహ్నంగా బాబా ఒక రిబ్బనును కత్తిరించారు ఆ మందిరము నందు ఈశాన్యమూలను బాబా పడమట ముఖంగా కూర్చున్నారు. హారతి స్వీకరించి బాబా అందరికి దూధ్‌పేడా ప్రసాదం పంచిపెట్టారు. ఈ విధంగా బాబాకు దేశ్‌ముఖ్ దంపతులు హారతి యిచ్చుట ఒకరి తరువాత ఒకరుగా బాబా పాదములకు మొక్కుట బాబా ప్రసాదము పంచుట వగైరా దృశ్యములన్నీ ఫిలిం తీసారు

ఆ సాయంకాలం బాబా నాగపూర్ లోని సెమినరీహిల్స్ మీద నున్న ఆరామ్‌ఘర్‌ను (పార్సీవారి సమాధులను) చూసి అందులో జాల్‌కేరావాలా అను బాబా

ప్రేమికుని సమాధికి ఒక గులాబీ పుష్పమాలను సమర్పించారు బాబాతో వెళ్ళిన భక్తు లందరు ఆ సమాధిమీద ఒక్కొక్క గులాబీ పుష్పమును ఉంచారు. జాన్ కేరావాలా బాబాను అత్యంతముగా ప్రేమించి యుండెను ఇతడు జ్యోతిర్మయ స్వేచ్ఛా జీవితం ప్రారంభించిన రోజునే మరణించాడు "జాన్ కేరావాలా నాకోసం జీవించి నాకోసమే మరణించాడు" అన్నారు బాబా.

అక్కడినుంచి వచ్చేదారిలో హజ్రత్ తాజుద్దీన్‌బాబా భక్తుడగు రాజా రఘూజీ భోంస్లే ఆహ్వానము మీద బాబా అతని కోటలోనికి వెళ్ళి ఆతిథ్యము స్వీకరించారు. అక్కడ కొంతసేపు ఉండి బాబా, హజ్రత్ తాజుద్దీన్‌బాబా తనువు చాలించిన స్థలము నివాసస్థలము వగైరా చూసారు తాజుద్దీన్‌బాబా దర్బారు చేసిన స్థలమును కూడా చూచి వారి గౌరవమును తెలిపారు. అటువంటి సద్గురువును భక్తితో సేవించిన మీకు ఏమీ విచారం అక్కరలేదని బాబా ఆ రాజాతో అన్నారు.

జనవరి (1953) 3 వ తేదీన నాగపూర్‌లో బాబా నగరమధ్యంలో శుక్రవార కాసార తీరమున నిర్మాణము చేయబడిన గీతామందిరమందు బడి పిల్లలకు దర్శన మిచ్చారు. ఆ ఉదయమంతా బాబా పిల్లలతోనే గడిపారు. 12 సంవత్సరముల లోపు వయసు ఉన్న బాలబాలికలు 1500 మంది సమావేశమయినారు వారి ఉపాధ్యాయులు వారిని బృందాలుగా తీసుకుని వచ్చారు బాబా ముందుగా వారందరి మధ్యను తిరిగి పిల్లలను పరిచయం చేసుకున్నారు ఒకని చిరునవ్వుతో పలకరించి, మరి యొకనిని వీపుమీద తట్టి వేరొకనిని ముఖమును మృదువయిన వారి హస్తముతో నిమిరి బాబా ఆ పిల్లల మధ్య ఎంతో చనువుతో తిరిగారు పిల్లలచేత కవాతు చేయించగా బాబా చూసారు బాబా గౌరవార్థము వారిచేత శారీరకముగా అనేక అభ్యాసాలను చేయించారు నారద మునీంద్రుని గురించిన ఒక నాటిక ఆ పిల్లలచేత ఆడించారు. బాబా వారితో ముందుగానే స్నేహం చేసుకున్నారు గనుక పిల్లలు నాటకం నిర్భయంగా నటించి రక్తి కట్టించారు ఒక గంట అయిన తరువాత ఒక్కొక్క బృందంవారు బాలబాలికలు వరుసగా వచ్చి బాబా దర్శనం చేసుకుని బాబా ప్రసాదంగా పంచిపెట్టిన మిఠాయిని స్వీకరించారు. నాటకంలోని ముఖ్యపాత్రధారి అయిన బాలుడు ఆవేషం తోనే బాబావద్దకు వచ్చాడు పది సంవత్సరాల వయసు ఉన్న ఆ బాలుడు పెద్ద మీసాలు పెట్టుకుని ఉన్నాడు. బాబాకు దగ్గరగా వెళ్ళి ఆయన చెవిలో ఏదో రహస్యంగా చెప్పాడు. అది చూసి అందరూ ఆశ్చర్యపడ్డారు. ఆ రహస్యాన్ని బాబా, ముందుకు

వంగి చెవి యొగ్గిలి విన్నారు ఆ మీసాల బాలుడు బాబాతో "మీ శిష్యుడనవుదామని నాకు ఉంది" అని చెప్పాడు. పిల్లలతో గడిపినంతసేపూ బాబా చాలా ఆనందించారు. పిల్లలకు బాబా ఒక సందేశం కూడా యిచ్చారు. ఆ రోజునే మధ్యాహ్నం స్త్రీల కొరకు ఆ స్థలముననే ప్రత్యేక కార్యక్రమం ఏర్పాటు అయింది అంతమంది స్త్రీలున్న సభకి రావడం బాబాకు అదే మొదటిసారి - ఆ సమయమునందు బాబా భక్తురాలగు ఐరీన్‌కోనీబీర్ అనునామె ఆరోగ్యవంతురాలై సావానేర్ నుంచి బాబా కోసం వచ్చింది. స్త్రీల సభలో వారికి బాబా యిచ్చిన సందేశమును ఇందుమతి దేశ్‌ముఖ్ మరాటీ భాషలో చదివి వివరించింది బాబా అందులో జీవిత పరిణామమునందు స్త్రీలు వహించవగిన పాత్ర గురించి చెప్పారు వారిని జీవిత పరమావధి యగు భగవత్సా క్షాత్కారమును పొందుటకు కృషి చేయవలెనని బాబా ఉద్బోధించారు

ఆ సాయంకాలం గీతామందిరంలో ఏర్పాటయిన బహిరంగ దర్శనమునకు అనేక వేలమంది ప్రజలు వచ్చి బాబా దర్శనభాగ్యము పొందారు. గీతా మందిరం బ్రహ్మాండమయిన నిర్మాణం. ఒకేమారు అనేక కార్యక్రమాలు జరపడానికి స్థల ముంది.

ఆ సాయంకాలం కార్యక్రమంలో జనం గుంపులు గుంపులుగా వచ్చి ఎంతో ఉత్సాహంతో పాల్గొన్నారు. అందరికీ ప్రసాదం పంచి యిచ్చి బాబా గీతా మందిరం నుంచి కదలివెళ్ళేటప్పుడు ప్రజలు ఆయన్ని చుట్టుముట్టారు. బాబాని కారులో ఎక్కించడం మండలికి ఎంతో కష్టమయింది.

నాగపూర్ టైమ్స్ పత్రికలో వేలాది ప్రజలు గీతామందిర్‌లో బాబా దర్శనం చేసుకున్నారని ప్రచురించారు ఆ రాత్రి పదివేలమంది బాబా దర్శనం పొందారు.

మరునాడు (4-1-53) ఆదివారం ఉదయం అనేకమంది ప్రేమికులు సమావేశమయినపుడు భాస్కరేశ్వరానంద స్వామి అనే ఒక యతి బాబా దర్శనార్థం రాగా అతనిని రమ్మని బాబా తమ ప్రక్కన కూర్చోమని చెప్పారు. అప్పుడు బాబా యిచ్చిన సందేశాన్ని కామత్ అనే ప్రేమికుని చేత చదివించారు సమావేశం ముగియ గానే ఘాటే అనే ప్రేమికుడు బాబాకు హారతి పాడాడు.

ఆ రోజున గీతామందిరం లో జరిగిన కార్యక్రమం అందరికీ కూడా ఉద్దేశించబడింది స్త్రీలు, పురుషులు, బాలురు, బాలికలు అందరూ వెళ్ళారు. కుత్తేవాలా

(కుక్కలను ఉంచుకునేవారు) అనే మస్తు ఆ ఉదయం అక్కడికి వచ్చాడు కార్య క్రమం ప్రారంభం కాకముందే యితడు వచ్చి లోపలికి వెళ్ళి కూర్చున్నాడు ఆ మస్తు ఆ సభాస్థలిలో బాబాకు ఎదురుగా కూర్చున్నాడు. అతనిని మండలి లేవగొడదామని అనుకుంటూంటే బాబా వారిని వారించారు. బాబా సభ్యులందరకు నమస్కారం చేసారు ఆ సమయంలో ఒక ప్రత్యేక సందేశాన్ని బాబా చదివించారు. ఆ సందేశం మస్తు కూడా సావధానంగా విన్నాడు అది చదవడం అయిన తరువాత అతడు లేచి ఎలా వచ్చాడో అలాగే వెళ్ళిపోయాడు.

ఆ మధ్యాహ్నం బాబా ప్రేమికుడయిన కాకా షెర్లేకర్, బాబాకు తన యింటిలో విందు భోజనం ఏర్పాటు చేసాడు భోజనానంతరం బాబా మండలితో బసకు వచ్చిన తరువాత కొంతసేపు విశ్రాంతి తీసుకున్నాక ఖవ్వాలీలు పాడించారు తరువాత ఉపాధ్యాయ అనే కళాకారుడు సితార్ వాయించి బాబాను తన సంగీతంతో ఆనంద పరిచాడు. అప్పుడు బాబా ముఖ్యమైన కొందరి ప్రేమికుల గృహాలకు (నానా, పంఖ రాజ్ మొదలయిన వారి యిళ్ళకు) వెళ్ళి బాబా వారి కుటుంబాలను ఆశీర్వదించారు

4 వ తేదీ సాయింకాలం బాబా తమ శిష్యులతో అలహాబాద్‌కి బయలు దేరారు రైలులో 3 వ తరగతిలో బాబాకు వారి మండలికి చోటు దొరకడానికి రైలు రాగానే మండలి ఒక పెట్టెలో ప్రవేశించి ఆక్రమించుకున్నారు బాబాకు ఆతిథ్యం యిచ్చిన కుటుంబాలు యింకా యితరులు అనేకమంది బాబా ప్రేమికులు బాబాకు వీడ్కోలు చెప్పడానికి రైలుస్టేషన్‌కి వచ్చారు చాలాసేపటి వరకు బాబా పూలదండల బరువు మోయవలసి వచ్చింది.

నాగపూరునుంచి అలహాబాదుకి 36 గంటలు ప్యాసింజరు బండిలో బాబా తమ శిష్యులతో ప్రయాణం చేసారు. ఖుల్దాబాదులో లాగే బాబా అలహాబాదులో ఉన్న అయిదు రోజులు మస్తుల సాంగత్యం చేస్తూను సాధువులను కలిసి మాట్లాడుతూను మండలితో ఉంటూను గడిపారు ఇక్కడ కుంభమేళా ఉత్సవానికి త్రివేణి సంగమ స్నానానికి వేలకొలదీ సాధువులు వచ్చారు బాబా అనేకమంది సాధువుల సమాధు లకు, దర్గాలకు వెళ్ళారు. అప్పుడు వారి శిష్యులకే ఆయన గురువుగాని మిగతా ప్రజలకు మామూలు మనిషిలాగే బాబా వ్యవహరించారు. అందుకే అనేకమంది సాధువుల సందర్శనం చేసారు. ఇక్కడ ఉన్న 5 రోజులలోను బహిరంగ దర్శన కార్యక్రమాలు ఏర్పాటుచేయలేదు.

జనవరి 9 వ తేదీ ఉదయం తమ శిష్యులలో పదిమందిని ఎన్నుకొని వారిని తెల్లవారగానే తమ ఎదుట నుంచి ఒకరొకరినే రమ్మనమని వారి పాదాలకు శిరస్సు తగిలేటట్లు ఒక్కొక్కరికి 50 మార్లు ప్రణమిల్లిన తరువాత - అందరిని గంగా నది యొడ్డునకు గొనిపోయి అక్కడవారి అఖాడాలలో మార్గురు పవిత్రమైన సాధు పురుషులను ఎన్నుకుని వారికి ప్రణామం చేసారు తరువాత ఒక్కొక్క శిష్యుడినే వెళ్ళి వారికి కనిపించిన సాధువులకు బాబా ఎన్నిమారులు ఆ శిష్యుల పాదాలకు నమస్కరించారో అంతమందికి అంటే 50 మందికి వారి పాదాలకు శిరస్సుతో ప్రణామం చేయమని చెప్పినారు

బాబా అక్కడ ఉన్న అయిదురోజుల లోను అలహాబాదులో కొన్ని లక్షల మంది జనాభా ఉన్నప్పటికీ అది త్రివేణీ సంగమ క్షేత్రమయిన పుణ్యనగరమయినా అక్కడ నలుగురే నిజంగా ఉత్తమ ఆధ్యాత్మిక భూమికలలో ఉన్నారని బాబా చెప్పారు.

ఒకనాడు బాబాకు ఒక నాస్తికుడు తారసిల్లాడు. అతనితో సంభాషిస్తూ బాబా యిట్లుచెప్పారు (“స్వానుభవము వలన భగవంతుని కనుగొనేవరకు ప్రతివాడు నాస్తికుడే. భగవద్భక్తుడనని చెప్పుకుంటూ మోసకారిగా జీవించేవానికన్న తన మాటలలోను చేతలలోను నిజాయితీగా ప్రవర్తించే నాస్తికుడే మేలయినవాడు. భగవంతుడు స్వతంత్రుడు. ఆయనకు మన పూజలక్కరలేదు మనం పూజ చేసామంటే అది మనకోసం గాని ఆయనకోసం గాదు ఆయన మనలను నిజాయితీగా ఉన్నామా లేదా అని మాత్రం గమనిస్తాడు.”)

తరువాత అలహాబాదు నుంచి బాబా వారి మండలితో 11 వ తేదీన మదరాసు పయనమయారు ఈ ప్రయాణము అతి దీర్ఘమయిన దగుటచే అందరికీ విసువు జనింపజేసింది అంత ఖాళీ లేకపోయినా బాబా తమ శిష్యులచేత వారు కూర్చున్న పెట్టెలో ఒకనాటక ప్రదర్శన కూడా చేయించారు బాబా. క్రిక్కిరిసియున్న ఆ 3 వ తరగతి పెట్టెలోని యితరులందరు ఆ నాటకం చూసి చాలా ఆనందించారు. బాబాకు కూడా అది ఎంతో సంతోషకరమయింది బాబా తమ మండలితో 14 వ తేదీ (జనవరి, 1953) న మదరాసు చేరారు

మదరాసు చేరిన తరువాత మూడు రాత్రులు మూడు పగళ్ళు ఎవరూ తమ్ము గుర్తించని విధంగా కావలసినపని ముగిసేవరకు నిద్రపోవలదని బాబా

శిష్యులను ఆజ్ఞాపించారు. ఈ సమయమునందు వారు ఉపవాసము కూడా చేయాలని చెప్పారు. కావలసినంత నీరు త్రాగుటకు, వారి యిష్టము వచ్చిన రూపమునందు పొగాకును ఉపయోగించుటకు బాబా వారికి అనుమతి నిచ్చారు. మస్తులను సందర్శించు కాలమునందు బాబా శిష్యులు ఏదీ తినకూడదు. మాటలాడుట తప్ప నోటితో ఏమీ చేయరాదు.

మధ్యాహ్నము 2 గంటలకు బాబా సముద్రతీరానికి వెళ్ళారు. అక్కడ నుంచి బాబా కొద్దిమందిని వెంబెట్టుకుని మోతీబాబాయను మస్తు నివసిస్తున్న ఒక మహమ్మదీయ శ్రీమంతుని గృహానికి వెళ్ళారు ఆ మస్తును చూసి కొంత తడవున్న తరువాత సంతోషంతో బయటకు వచ్చి తమ శిష్యులను కూడా మోతీబాబా మస్తును దర్శించి త్వరగా రమ్మని చెప్పారు. "ఇంక నీ అనుచరులకు భోజనం పెట్టు" అని మస్తు చెప్పగా బాబా వారితో తొందరగా బయటకు వెళ్ళిపోయారు.

తరువాత బాబా ఎంతో శ్రమపడి ఎన్నో సందులు గొందులు తిరిగి ఒక హిందూ కుటుంబముతో ఉన్న ఒక మహమ్మదీయ మస్తును కలుసుకున్నారు. ఆ మస్తుకి 60 సంవత్సరాల వయసుంటుంది అతడు దృఢగాత్రుడు. మతభేదములేక అతడు హిందువులచేత కూడ మిక్కిలి ప్రేమింపబడుతున్నాడు. బాబా దర్శనము కలిగినందుకు యీ మస్తు చాలా ఆనందించాడు.

తరువాత మదరాసు నగరమున మరియొకవైపున నౌకాశ్రయము వద్ద ఒక భవనం యొక్క ఆవరణలో ఉన్న ఒక చిన్న గృహంలో ఆరబ్‌షాయను మస్తును బాబా సాంగత్యం చేసారు మదరాసులో మోతీ బాబా ఆరబ్‌షా అనే యీ యిరువురు శ్రేష్ఠమయిన మస్తులని బాబా చెప్పారు. వీరి సాంగత్యము కొరకే ముఖ్యముగా బాబా యిక్కడికి వచ్చారు.

ఎన్నో సంవత్సరాలుగా బాబాని ఆంధ్ర ప్రేమికులు తమ దేశానికి రమ్మని ఆహ్వానిస్తున్నారు.

జనవరి (1953) 16 వ తేదీని బయలుదేరి మదరాసునుండి బాబా మండలితో ఆంధ్రదేశానికి ప్రయాణం చేయడానికి అన్ని ఏర్పాట్లు పూర్తిచేసుకున్నారు.

## ప్రథమాంధ్రదేశ పర్యటనము :—

1953, జనవరి 16 వ తేదీన ఉదయం మదరాసు నుండి కాకినాడ పాసెంజరు బండిలో బయలుదేరి ఆ సాయంకాలానికి బాబా మండలితో బెజవాడలో దిగారు. బెజవాడలో రైల్వేస్టేషన్‌లో ప్లాట్‌ఫామ్ మీదే ఆ రాత్రి ఆగారు. మరునాటి రోజున (17 వ తేదీన) ఉదయం 9 గంటల బండిలో తాడేపల్లిగూడెం వెళ్ళారు. అక్కడ రైల్వేస్టేషన్‌లో దిగేసరికి అనేకమంది పురప్రముఖులు బాబా ప్రేమికులను వెంటపెట్టుకుని వచ్చి బాబాకు అఖండమయిన స్వాగతం యిచ్చారు స్టేషన్‌కు వచ్చిన బాబా భక్తులలో ప్రధానుడు డా॥ తోట ధనపతిరావు ఆ రోజులలో అతడు తాడేపల్లిగూడెంలో ప్రభుత్వం వారి ఆస్పత్రిలో డాక్టరుగా ఉన్నాడు బాబా అక్కడ కాలు పెట్టగానే దేవతలు పుష్పవర్షము కురిపించినట్లు మేఘుడు ఆ శుభసమయాన ఒక జల్లువర్షం కురిపించాడు బాబాతో వచ్చినవారు స్త్రీలు పురుషులు కలిసి మండలిలో 59 గురు ఉన్నారు అందులో యిద్దరు స్త్రీలు అయిదుగురు పురుషులు హమీర్‌పూర్ నుండి వచ్చారు మదరాసు సైదాపేట వాస్తవ్యులు కీ॥శే॥ ఘలయిన సంపత్తయ్యంగారి జ్యేష్ఠకుమార్తె జానకి ఆమె కూతురు వసుమతి కూడా బాబాతో ఆంధ్రదేశం పర్యటించుటకు వచ్చారు బాబా ప్రయాణికుల బంగళాలో ప్రవేశించిన సమయంలో మళ్ళీ యింకో జల్లు వానకురిసి అందరికీ చల్లతనాన్నిచ్చి హాయిని సమకూర్చింది. బాబాతో పర్యటించే మండలిలో నాగపూర్ నుంచి చక్రధర్ దేశ్‌ముఖ్, అతని భార్య ఇందుమతీదేవి, పిల్లలు సంజీవని, ప్రణవ కూడా వచ్చారు మరునాడు 18 వ తేదీన ఉదయం వారినుంచి రైలుబండిలో హైదరాబాద్ మీదుగా డా॥ డాన్‌కిన్ మరికొందరు వచ్చి చేరారు. వారు 9 గంటలకు డా॥ ధనపతిరావు యింటికి వచ్చారు. ఆ రోజున బాబా ఏడుగురు పేదవారి పాదాలు కడిగి వారికి శిరసుతో ప్రణమిల్లి ఒక్కొక్కరికి రు 50/– చొ॥ దక్షిణ యిచ్చారు ఇందులో పేదవాడగు ఒక ఉన్నత పాఠశాల ఉపాధ్యాయుడొకడు కాకినాడ వాస్తవ్యుడగు కీ॥ శే॥ వావిసెట్టి వీరన్న అనే బాబా ప్రేమికుని కుమారుడు మురళీధరరావు అనే 16 ఏళ్ళ బాలుని పాదాలు కడిగి అతనికి బాబా రు 14 లు యిచ్చారు. తరువాత అతనికి రోజుకొక్కరూపాయి చొప్పున ఆరు రోజులు యిమ్మని బాబా మండలితో చెప్పారు. ఆ బాలునికి బాబా—

(1) ప్రతిరాత్రి పరుండ బోయేటప్పుడు బాబా నామం ఉచ్చరించాలి.

(2) అసత్యం ఎప్పుడూ పలుకకుండా ఉండాలి.

(3) ఎప్పుడూ చెడ్డపనులు చేయకుండా ఉండాలి.

అని ఆతనికి హితవు ఉపదేశించి ఆ ప్రకారం తప్పక ఆచరించమని చెప్పారు. ఇలాగే వి వి నారాయణరావు (ప్రసిద్ధ బాబా ప్రేమికుడు) కుమారుడయిన జగత్ కుమార్ అనే వానికి శ్రీబాబా యిచ్చారు. అతనికి కూడా అలాగే హితవు చెప్పారు ఇవంత్యా డా॥ ధనపతిరావు యింటిలో జరిగింది. తరువాత డాక్టరుగారి కుటుంబ సభ్యులందరు బాబాకు పరిచయం చేయబడ్డారు. వారంతరు ఒకరి తరువాత ఒకరు బాబా దర్శనం చేసుకున్నారు ఇది అయిన తదుపరి బాలగోపాల రామభద్ర రాజు రచించిన "నమో మెహెర్‌బాబా" అను కళ్యాణి రాగకీర్తన, బాబా సన్నిధానంలో మోదకటిమనాటుగా బాలగోపాల భాస్కరరావు గానం చేసాడు. అది విని బాబా చాలా ఆనందించారు హారతి యిచ్చిన వెంటనే బాబా అక్కడి నుంచి లేచి 50 గజాల దూరం నడిచి వెళ్ళి అక్కడ ఉన్న ఒక ఎరుకల వాని యింటిని పావనం చేస్తూ ఆ అరుగుమీద రెండు నిముషాలు కూర్చుని బంగళాకు వెళ్ళిపోయారు దీనికి కారణం బాబా చెప్పలేదు. ఆ యెరుకలవాడు ఎప్పుడో చేసిన మహత్తరమయిన పుణ్యమే బాబా చూపిన అవ్యాజమైన యీ కరుణకు కారణమై ఉండాలి. అది చూసిన మండలివారికి ఎంతో ఆశ్చర్యం కలిగింది. ఆ యెరుకలవాని కుటుంబం వారి ఆనందానికి ఆశ్చర్యానికి మేరలేకపోయింది. మరునాడు 19 వ తేదీ ఉదయం బాబా డా॥ ధనపతిరావు యింటిలో కొంతసేపు విశ్రమించారు ఆ సమయంలో ధనపతిరావు రెండవ కుమార్తె డా॥ కౌసల్య, ఎమ్ బి. బి యస్ బాబాను ప్రస్తుతిస్తూ రెండుపాటలు పాడింది. అవి విని బాబా ఆమె భక్తికి చాలా సంతోషించారు ఆ రోజున బహిరంగ దర్శన కార్యక్రమం ఏర్పాటయింది. అందుకు గాను పెద్ద పందిరి వేయబడింది. అందులో మైక్రోఫోన్ వగైరాలు అమర్చబడ్డాయి.

బాబా దర్శనం కోసం పందిట్లో ప్రజానీకం కిటకిట లాడుతూ కూర్చున్నారు. బాబా పందిట్లోకి వచ్చి వారి వేదికమీద ఏర్పాటయిన కుర్చీవద్దకు వెళ్ళి ప్రజలందరకు నమస్కారం జేసారు అది చూసి అశేష ప్రజానీకము "బాబాజీకి జై" అని దిక్కులు పిక్కటిల్లినట్లు జయనాదం చేసారు తరువాత బాబా నమస్కారం చేయడంలో విశిష్టత గురించి డా॥ కేఫల్కార్ అను బాబా శిష్యుడు ఆంగ్లమున మాట్లాడెను దానికి డా॥ ధనపతిరావు తెలుగున అనువదించెను

[ఏ]

ఆ సభలో తాడేపల్లిగూడెం మెహెర్ సమితి తరఫున డా॥ ధనపతిరావు, అప్పాకెట్ల సంఘము తరఫున జె వెంకటేశ్వరరావు, గాంధీ సేవాసమితి తరఫున డా॥ కె కేశవరావు, వినతిపత్రాలు బాబాకి సమర్పించారు కావవరం నుంచి వచ్చిన సుబ్బయ్య అను సాధువు బాబాకు సాధునామస్తోత్రం సమర్పించెను బాబా యితనిని ఆశీర్వదించారు.

అప్పుడు బాబా జ్యోతిర్మయ స్వేచ్ఛా జీవితమునందున్నారు ఈ జీవితము యొక్క విశిష్టత భాకేఫల్కార్ ఆంగ్లమునందు ప్రసంగించి చెప్పగా నిడదవోలు నివాసి, ప్రముఖ బాబా భక్తుడు అయిన తాడిమేటి సూర్యకుటుంబ శాస్త్రి తెలుగులో అనువదించి చెప్పాడు తరువాత దర్శన కార్యక్రమం సాగింది ఆరోజున ఉదయం పదివేలమంది సాయంకాలం ఇరవై వేల మంది వరుసలో వచ్చి బాబా దర్శనం చేసుకుని ప్రసాదం తీసుకుని వెళ్ళారు

20 వ తేదీ ఉదయాన తాడేపల్లిగూడెంలో ఉన్న ప్రేమికులలో ముఖ్యుల యిళ్ళకు వెళ్ళి బాబా వారి కుటుంబాలను చూసి వారికి దర్శనావకాశం యిచ్చారు. వారిని ప్రేమతో ఆశీర్వదించారు ఆ రోజున స్థానిక దివ్యజీవన సంఘంవారు బాబాను సత్కరించారు అక్కడ ఉన్నటువంటి సాయిబాబా ఉపాసనీ మహరాజ్‌ల మందిర-ములను బాబా దర్శించారు

డా॥ ధనపతిరావు యింటిలో బాబా ప్రత్యేకంగా కార్యకర్తలందరికి దర్శనావకాశం యిచ్చారు అప్పుడు వారితోబాటు స్వచ్ఛంద సేవకులు, భజనమండలి వారు కూడా బాబా దర్శనం చేసుకుని వారి ఆశీర్వాదం బడశారు. మదరాసు నుంచి వచ్చి కవి, యోగి శుద్ధానంద భారతి ప్రత్యేకంగా బాబా దర్శనం చేసుకున్నాడు.

ఆనాటి సాయంకాలం కొవ్వూరు నుంచి వచ్చిన ఎం ఆర్. శాస్త్రి అను గాయకుడు హిందూస్తానీ గాత్ర సంగీతం గానం చేసి బాబాను అలరించాడు. తరువాత బాలగోపాల భాస్కరరాజు బృందంవారు భజనకీర్తనలు పాడారు తరువాత భాస్కర రాజు స్వయంగా ఉర్దులోను హిందీలోను రచించిన బాబా అష్టోత్తర శతనామస్తుతి చదవెను అనంతరం బాబా "సప్త భూమికలు, సప్త అవనికలు, సప్తగ్రంథులు, సప్త ఇంద్రియద్వారాలు" అను విషయాల గురించి ఆధ్యాత్మిక ప్రవచనంచేసారు. బాబా తాము "ఆదిగానము" ఆదినృత్యము" చేసినది లగాయతు యీప్రకృతి యందు బంధింప

బడితిననియు యుగయుగాలలోను తాము తిరిగి అవతారమెత్తి ఆ బంధనముల నుండి విముక్తిపొందుటకు ప్రయత్నిస్తున్నానని చెప్పారు

బాలగోపాల భాస్కరరాజును చిత్రలేఖకుడుగాను, నటుడుగాను, కథకుడు గాను, రచయితగాను, గేయకారుడుగాను, గాయకుడుగాను బహుముఖ ప్రజ్ఞావంతుడై భగవత్ప్రేమికుడుగా కూడా ఉండినందున బాబా అభినందించారు ఇన్ని కళలలో ఆరితేరినవాడు ఆధ్యాత్మిక చింతన కూడ గలిగి బాబా ప్రేమికుడగుట సువర్ణమునకు సుగంధ మబ్బినట్లేకదా. ఇట్లు బాబా అభినందనల నందుకొనుటకు యితడు ధన్యాత్ముడు

21 వ తేదీ ఉదయం పెంటపాడులోను, పిప్పరలోను అనేక వేలమందికి బాబా దర్శన మిచ్చారు. పెంటపాడులో పాఠశాల ప్రధానోపాధ్యాయుడు గంగాధరం సన్మానపత్రం చదివాడు వామర్తి సత్యనారాయణ మూర్తి యను తెలుగు పండితుడు బాబాను తన స్వీయ కవితతో స్తుతించి కృతార్థుడయ్యెను బాబా పిప్పరలోతుమ్మలపల్లి సోదరుల గృహములకేగి వారి కుటుంబములను ఆశీర్వదించారు.

బాబా పిప్పరగ్రామమునకు వెళ్ళినపుడు ఆ గ్రామవాసులకు తమ అక్షర ఫలకం ద్వారా బాబా యీ క్రింది సందేశాన్నిచ్చారు.

"మీ అందరి మధ్యకు యీ రోజున నేను వచ్చినందుకు చాలా సంతోషిస్తున్నాను. అనాది నుంచి నా యొక్క సందేశం ప్రేమను గురించే అయి యుండెను. భగవంతుడొక్కడే నిజము. ఆయనను తెలుసుకోవడానికి మనము ఆయనను ప్రేమించాలి. మనందరిలోను భగవంతుడు సమంగా నివసిస్తున్నాడు ఆయనకు మన నిశ్శబ్దమైన ప్రేమ కావాలి. మనం మన పొరుగువానిని ప్రేమించుట వలన ఆయనను (దేవుని) మనము ప్రేమిస్తున్నాము భగవంతుని నిజాయితీతో ప్రేమిస్తే మన సందేహాలు మన చింతలు అన్నీ అదృశ్యమయిపోతాయి ప్రేమద్వారా ప్రతివారిలోను మీరు నన్ను చూడగలందులకు నా ఆశీర్వాదాల నిస్తున్నాను- ఈ నా ఆశీర్వాదమునకు మీలో ఒకడయినా యోగ్యుడయితే (అర్హత కల్గిఉంటే) నేను యిక్కడికి వచ్చిన ఫలితం దక్కినట్లే బాబా తరువాత పెనుగొండ చేరుకున్నారు.

అక్కడ శ్రీ కన్యకాపరమేశ్వరీ ఆలయంలో 800 మంది ప్రజలకు బాబా దర్శనము నిచ్చారు వారి కాతిథ్యమిచ్చిన జవ్వాది లక్ష్మయ్యను (పంచాయతీ బోర్డు

అధ్యక్షుడు) బాబా ఆశీర్వదించారు ఇంకా కొంతమంది ప్రేమికుల గృహాలకేగి వారికి ఆశీస్సుల నిచ్చారు.

22 వ తేదీ ఉదయం బాబా నిడదవోలు వెళ్తూ దారిలో కాపవరం వద్ద కారు ఆపి సుబ్బయ్య సాధు సమర్పించిన పళ్ళు స్వీకరించారు.

నిడదవోలులో బోర్డు ఉన్నత పాఠశాలలో బాబా అనేకవేల మందికి దర్శన మిచ్చి ప్రసాదం పంచిపెట్టారు ప్రముఖ బాబా ప్రేమికులయిన (ఇవటూరి చెన్నమల్లికార్జునరావు తాడిమేటి సూర్యకుటుంబ శాస్త్రి) బాబాను వారి గృహాలకు తీసికొని వెళ్ళి వారి కుటుంబాలను దర్శనం చేయించి వారి ఆశీర్వాదాలను పొందారు. బాబా కారువెనుక డా॥ ధనపతిరావు కారులో అనుసరించుచునే యుండెను. వెనుక మండలివారు బస్సులలో వస్తూ ఉన్నారు ఇప్పుడు మండలివారంతా 75 మంది వరకూ ఉన్నారు కొవ్వూరుకు కారులో బాబాయే ముందు చేరారు వెనుక వస్తున్న మండలి బస్సు మధ్యదారిలో పెట్రోలు లేక ఆగిపోగా ఆ సమయమునకు ఎవరో ఒక కుర్రవాడు తాను ఏమీ సంబంధము లేనివాడయినా సైకిల్‌మీద పెట్రోలు తెచ్చియిచ్చి బాబా మండలివారికి అమూల్యమయిన సహాయం చేసాడు. అది బాబా లీలయని అందరూ కొనియాడారు. కొవ్వూరులో బాబా ప్రేమికుడయిన రామలింగేశ్వరరావు అను న్యాయవాది తనకుమార్తె వివాహముచేస్తున్న సమయానికి బాబా వెళ్ళి వధూవరులను ఆశీర్వదించారు సుప్రసిద్ధ బాబా భక్తుడు కోడూరు కృష్ణారావు బాబాను ప్రార్థించి తన గృహమునకు రమ్మని ఆహ్వానించగా బాబా అక్కడికి వెళ్ళి అతని ఆతిథ్యమును స్వీకరించారు.

22 వ తేదీ సాయంకాలం ఉన్నత పాఠశాలలో పంగిట్లో అనేక వేలమందికి బాబా దర్శనమిచ్చారు.

ఆ సాయంకాలమే నెట్టిమి ధర్మారావునాయుడు (ఇంజనీరు, ప్రముఖ బాబా ప్రేమికుడు) తన స్వంత కారులో బాబాను తీసుకొని బయలుదేరి ధవళేశ్వరం మీదుగా రాజమండ్రి చేరెను మండలివారు ప్రత్యేకంగా స్టీమ్‌లాంచిలో గోదావరిని దాటి రాజమండ్రి వెళ్ళారు రాజమండ్రిలో నవభారత గురుకుల్‌లో బాబా విడిది చేసారు. గురుకుల్‌వారు బాబాకు సన్మానపత్రము సమర్పించారు గురుకుల్‌లో క్రొత్తగా కార్యనిర్వాహక భవనములు కట్టబడియుండెను. ఆ రోజునే బాబాచే వాటికి

ప్రవేశ మహోత్సవం చేయించారు. మొహెర్ మహల్ అని ఆ నూతన భవనమునకు నామకరణం చేయబడింది ఆ మహల్‌లో దాదా నేలపై కూర్చుని ప్రారంభోత్సవం చేసారు.

28 వ తేదీన బాబా తమ మండలినుంచి కొందరిని, ధనపతిరావు, ధర్మారావు, కుటుంబశాస్త్రి, ఏడిద సత్తిరాజు, (కాకినాడ – ప్రముఖ బాబా ప్రేమికుడు) మల్లికార్జున రావు – వీరిని కూడా బాబా పిలిచి, మొత్తం 56 మందిని బాబా ఎన్నుకొని 56 గురు సద్గురువులకు వారిని ప్రతినిధులుగా నొనర్చి అందరికిని పాదములంటి ప్రణమిల్లారు. ఆ సమయంలో బాబా యీ విధంగా చెప్పారు —

"మనమందరము ఒకటే. మనమందరము సమానులమే. హెచ్చుతగ్గులు లేవు – అనంతమయిన ఆ ఏక పదార్థమే మన అందరిలోను ప్రతి యొక్కరిలోను అవిభాజ్యంగా ఉంది. అవికారము, అవినాశము, అనంతము, సత్యము అగు ఆ ఏక వస్తువుయొక్క ప్రతినిధులుగా నేను తలంచి మీ కందరకు సామూహికంగాను మీలో ప్రతి యొక్కరికీ విడివిడిగాను నేను ప్రణమిల్లుతున్నాను తరువాత బాబా అందరినీ ఆశీర్వదించారు. వాకేఫల్కార్ యింకా మండలివారితో కొందరు వివిధ భాషలలో పశ్చాత్తాప ప్రార్థన చేసారు.

తరువాత ముగ్గురు బాలురను (శర్మ, జగత్‌కుమార్, మురళీధరరావు)– బాబా తమ మండపముమీద కూర్చుండమని వి వి. నారాయణరావు – (డిప్యూటీ కలెక్టరు, ప్రముఖ బాబా ప్రేమికుడు) – తోట రామదాస్, హనుమంతరావు (డా॥ తోట ధనపతిరావు కుమారులు, బాబా ప్రేమికులు) ఎదురుగానుండ నియమించి ధనపతిరావును ఆ ఉదయమున జరిగిన కార్యక్రమమును వివరించమన్నారు. పశ్చాత్తాప ప్రార్థన కూడా బాబా చెప్పమన్నారు జ్ఞాపకాన్ని బట్టి ధనపతిరావు ఆ ప్రార్థన చెప్పగా బాబా సంతోషించారు. ఆ ఉదయం జరిగిన దర్శన కార్యక్రమంలో నాలుగువేల మంది వచ్చి బాబా దర్శనం చేసుకున్నారు. బాబా ఆ తరువాత రాజమండ్రిలో గౌతమీ జీవకారుణ్య సంఘానికి వెళ్ళారు. అక్కడనుంచి బాబా ధర్మారావు యింటికి యింకొక ప్రేమికుని యింటికి వెళ్ళి చూసారు. ఆ ప్రేమికుల కుటుంబాలను ఆశీర్వదించారు.

29 వ తేదీ మధ్యాహ్నం బాబా రాజమండ్రి రైలుస్టేషన్‌కి 2–30 గంటలకు వెళ్ళారు. అక్కడ ప్రజలు తండోపతండాలుగా బాబాను చూడడానికి వచ్చి వారివి

చ్చుకున్నారు. ఆ రైల్వేస్టేషన్ సిబ్బంది సౌజన్యంతో బాబాకు మండలివారికి ప్రత్యేక మయిన రైలుపెట్టెను ఏర్పాటు చేసారు. దానిని 5-30 గంటల రైలుకి తగిలించారు. అందులో బయలుదేరి బాబా ఆ సాయంకాలం 6-30 గంటలకు ఏలూరుకి చేరారు.

రాజమండ్రిలో బయలుదేరినది లగాయతు ఏలూరు వెళ్ళిన దారిలో వచ్చిన గోదావరి, కొవ్వూరు, నిడదవోలు, స్టేషన్‌లలో అనేకమంది భక్తులు వచ్చి బాబా దర్శనం చేసుకున్నారు తాడేపల్లిగూడెంలో ప్రత్యేకంగా భక్తులు బాబాకు, పుష్ప మాలలు సమర్పించారు అలాగే ఉంగుటూరు, చేబ్రోలు, కైకరం, పూళ్ళ, భీమడోలు వగైరా స్టేషనులలో అనేకులు బాబాను దర్శించారు.

ఏలూరు స్టేషన్ ప్రజా సమూహంతో ఇసుకవేస్తే రాలకుండా నిండిపో యింది. అక్కడ వై. ఎ. రంగారావు (ప్రముఖ బాబా ప్రేమికుడు, సూర్యప్రకాశ్ తండ్రి, సుప్రసిద్ధ చిత్రలేఖన కళాకారుడు) ఆర్. ఎ. రామారావు, వంగిడిగూడెం రాజా, వగైరాలు స్టేషన్‌కు వచ్చి బాబాకు స్వాగత మిచ్చారు బాబాను పూలమా లలతో అలంకరించారు. రాజా తన కారులో బాబాను కూర్చోపెట్టుకుని స్వయంగా కారును నడిపి కట్టా సుబ్బారావు తోటలో ఏర్పాటయిన విడిదికి తీసుకుని వెళ్ళి అక్కడ చేర్చాడు

కట్టా సుబ్బారావు తోటలో బహుసుందరంగా మామిడిచెట్లలో చల్లగా ఎంతో హాయిగా ఉంది బాబా బస సుబ్బారావు బాబాకు అక్కడ వారు చేరగానే ఘన మయిన స్వాగతం యిచ్చాడు. ఇంక అతను బాబాకి మండలికి యిచ్చిన ఆతిథ్యము చిరస్మరణీయముగా నుండెను అన్నీ పుష్కలముగా నొనగూర్చెను ఏలూరులో 24,25,26 తేదీలలో ప్రజాదర్శన కార్యక్రమాలు ఏర్పాటయాయి

అమరావతి, సావానేర్, నాగపూర్ నగరములలో బాబా పూజా దర్శన మిచ్చినపుడు దేశ్‌ముఖ్ కుమారుడు తీసిన సినిమా ఫిల్ములను యిక్కడ ప్రదర్శించుటకు బాబా అనుమతించారు ఆ సాయంకాలము. 26 వ తేదీ ఏలూరులో రామకోటి జరిపే స్థలమందు సా॥ 5 నుండి 8 గంటలవరకు అనేకవేల మంది ప్రజలకు బాబా దర్శన మిచ్చారు. ఈ దర్శనమువలన వచ్చిన వేలాది ప్రజలకు తమ ప్రియతముని చూడ డానికి ఎంతో ఆనందము తృప్తి కలిగింది.

బాబాయొక్క జ్యోతిర్మయ స్వేచ్ఛా జీవితమునందు బాబా యిచ్చిన అనేక సందేశాలు తెలుగున తర్జుమా చేయబడినవి ఈ అనువాదాలు ఆంధ్రదేశమంతటా పంచబడ్డాయి

27 వ తేదీ (జనవరి, 1953) మధ్యాహ్నం ఏలూరులో ఉన్న జిల్లా జడ్జి ఆహ్వానించగా బాబా వారింటికి వెళ్ళారు. అక్కడ బాబా నిజాయితీ తనం గురించి ఒక సందేశం యిచ్చారు. దాని యొక్క పాఠం యిలా ఉంది.—

"ఈ మధ్యను నిజాయితీ – తనము పై నొక్కి చెప్తున్నాను మనం భగవంతుని నిజంగా ప్రేమిస్తూంటే మనం ఆయనలో ఏకమవుతాము అక్రమము, మోసము, కపటము నేడు ప్రపంచంలో ప్రబలియున్నట్లు యిదివరకెన్నడూ వ్యాపించ లేదు మన ఆలోచనలలోను, మాటలలోను, చేతలలోను, లేశమాత్రమయినా కపటం ప్రవేశించినా యింక మనలోని పరమాత్మ దాగుకుంటాడు. ఆయన ప్రకాశించడు.

కపటము వెయ్యిపడగలు గల ఒక విషసర్పము వంటిది. ఈ రోజున సాధువులని చెప్పబడే వారనేకులున్నారు. వారు ప్రజలతో నిజాయితీగా ఉండమని చెప్తూనే వారిమట్టుకు వచ్చి మోసగాళ్ళుగా ప్రవర్తిస్తారు.

నా దివ్యాధికారంతో చెప్తున్నాను – నేను మీ అందరిలోను ఉన్నాను మీరు నిజాయితీగా భగవంతుని ప్రేమిస్తూంటే ఆయనను మీరు అన్నిచోట్లా చూడ గలరు మీరు భగవంతుని ప్రేమించలేక, సాధు జీవితం గడపలేకపోతే పోనీలెండి. మీరు అటువంటి జీవితం గడుపుతున్నట్లుగా కనిపించవద్దు అలా కనిపించాలని అనుకోవద్దు. ఎందుచేతంటే కేవలం దురాచారులయినా మిథ్యాచారుల కంటె, కపటుల కంటె నయం.

జనవరి 27 వ తేదీ రాత్రి మండలివారంతా తెల్లవార్లు మేలుకొని యుండా లని బాబా అందరిని ఆజ్ఞాపించారు. అందుకని వారు కాఫీగాని టీ గాని ఒకటి రెండు సార్లు తాగి ఒక్క కునుకు కూడా తీయకుండా మేల్కొని ఆ రాత్రి శివరాత్రి లాగ జాగరణ చేసారు ఆ రాత్రి అంతా మండలివారు ప్రార్థనో, ధ్యానమో, ఆధ్యాత్మిక విషయాల చర్చో ఏదో చేసుకుంటూ సత్కాలక్షేపం చేసారు అందరి హృదయాల లోను బాబా మెదులుతున్నారు.

మండలి అందరు తెల్లవారేసరికి కాలకృత్యాలు తీర్చుకుని స్నానాలు చేసుకొని సిద్ధం అయి బాబా సన్నిధికి చేరారు. అందరు చేరిన తరువాత హజ్రత్ బాబాజాన్, సాయిబాబా, ఉపాసనీ మహరాజ్‌ల చిత్రపటాలకు మండలివారితో కలిసి బాబా హారతి యిచ్చారు. ఈ సందర్భంలోనే బాబా "నేను యిప్పుడు ఏమయి ఉన్నానో అది సాయిబాబా చేసాడు. నేను ఎలా ఉన్నానో అది అనుభవించునట్లు బాబాజాన్ చేసింది. నేను ఏమయి ఉన్నానో తెలుసుకునేలా మహరాజ్ చేసాడు. నేను ఏదిగా ఉన్నానో అదే నేను అందుచేత ఆ ముగ్గురికి ప్రణమిల్లుదాము." అన్నారు బాబా మండలితో.

జనవరి 28 వ తేదీన ఒక మౌనస్వామి ఏలూరులో కట్టా సుబ్బారావు తోటలో బాబా దర్శనం చేసుకున్నాడు. ఆ సమయంలోనే కట్టా సుబ్బారావు తన తోటలో బాబా ఆలయం ఒకటి కట్టించడానికి బాబా అనుమతి పొంది ఒక రాతిని బాబాచేత స్పృశింపజేసి దానికి శంకుస్థాపన కూడా చేయించాడు. ఆ మందిరంలో బాబా సన్నిధానంలో పూజారిగా ఉంటానని ఒక మౌనస్వామి తనంతటతానే బాబాతో చెప్పగా బాబా అంగీకరించారు. అతనిని ఏలూరులోనే స్థిరంగా ఉండిపొమ్మని బాబా ఆజ్ఞాపించారు. కాని దానికి విరుద్ధంగా మౌనస్వామి ఏలూరు విడిచి వెళ్ళాడు.

ఆంధ్రదేశంలోని ముఖ్య కార్యకర్తలయిన కుటుంబశాస్త్రిని (కె) ధనపతి రావుని (డి) రంగారావుని (ఆర్) మల్లికార్జునరావుని (ఎమ్) నలుగురిని సామూహికంగా బాబా కె. డి ఆర్ ఎమ్. అని అప్పటినుంచి పిలుస్తూ వచ్చారు.

ఇలాగే బాబా వారి మండలిలోని వారిని, పాశ్చాత్యులను కూడా సాంకేతికమగు నామాలతో పిలుస్తారు. జనవరి 28 వ తేదీన, ఏలూరు ప్రేమికులతోను మండలి వారందరితోను బాబాను ఒక ఫొటో తీసారు. ఆ రోజున కార్యకర్తల నందరను సమావేశపరచి బాబా వారిని సామరస్యంతో పనిచేస్తూ స్నేహభావంతో ఉండాలని ఉద్బోధించారు. కార్యకర్తలు కార్యోన్ముఖులైనప్పుడు అనేక అవరోధాలు కలుగవచ్చును. వారు ఒండొరులయెడ ప్రేమగలిగి వర్తిస్తే ఎట్టి చిక్కులయినా విడిపోతాయని బాబా చెప్పారు.

బాబా ప్రేమికుడయిన ఆర్ (రంగారావు) యొక్క కుమారుడు సూర్యప్రకాశ్ గురించి బాబా ప్రత్యేకమయిన శ్రద్ధ తీసుకున్నారు. ఇతడే బాబా ఆజ్ఞాను

సారం క్రిందటి నెల ప్రారంభంలో సావాటీర్‌కి తంత్రి రంగారావుతో వెళ్ళాడు బాబా ఏలూరులో ఉన్నన్నాళ్ళు, సూర్యప్రకాశ్ మండలివారితోనే ఉన్నాడు. బాబా అతనిని మామూలు స్థితిలో ఉండేలా చేసారు. ఇదివరకు మౌనంగాను ధ్యానం చేస్తూను ఉండేవాడు 17 సంవత్సరాల వయసు వరకు పాఠశాలకు మామూలుగా వెళ్తూ ఉండాలని బాబా చెప్పారు. ఇతర విద్యార్థులతో కలిసి మెలిసి ఉండాలని యుక్తవయసప్పుడే వివాహం చేయవద్దనీ, చెప్పి బాబా అతనిని ఒక సాధుపురుషుని చేస్తానని అతని బాధ్యత తామే తీసుకుంటామని బాబా చెప్పారు అయినచేత యిక్కడ ఉన్నన్నాళ్ళు బాబా అతని విద్యాభ్యాసము, యితర విషయాల గురించి శ్రద్ధచూపారు

ఈ ఆంధ్రదేశ పర్యటనలో బాబా ప్రముఖంగా అనేక పట్టణాలు గ్రామాలు దర్శించి అక్కడక్కడ ప్రజాదర్శన కార్యక్రమాలు జరిపారు తాడేపల్లిగూడెం, పెంటపాడు, పిప్పర, పెనుగొండ, నిడదవోలు, కొవ్వూరు, రాజమండ్రి, ఏలూరు, ధర్మాజిగూడెం, గుండుగొలను, బెజవాడ మొదలగుచోట్ల దర్శనాలిచ్చారు ఆ సందర్భంలో బాబా అనేక సందేశాలిచ్చి చదివించారు

## జ్యోతిర్మయస్వేచ్ఛా జీవిత వివరణము :—

బాబా తాము తాత్కాలికంగా జరుపుతున్న జ్యోతిర్మయస్వేచ్ఛా జీవితం గురించి యిట్లు వివరించి చెప్పారు ...

"నాకు రాజకీయాలతో ఎటువంటి సంబంధమూలేదు నాకు అన్నిమతాలూ సమానములే. అన్నికులాలు అన్నివర్గాలూ నాకు ప్రియములే అనేక మంచివిషయాలను అన్వేషించుచు మతాలు రాజకీయ వర్గాలు విభాగాలు మంచివేకాని నేను వీటిలో దేనికీ చెందినవాణ్ణికాను కేవలమయిన సత్యంలో యివన్నీ చేరియున్నా అది అన్నిటిని మించి అసత్యమయిన వేర్వేరు విభాగాలకి తావులేకుండా చేస్తుంది. సర్వజీవులలోను జీవము ఐక్యంగాను సమగ్రంగాను అవిభాజ్యంగాను ఉంది ఊహించగలిగిన అభిప్రాయ భేదాలెన్ని ఉన్నా ఆ ఐక్యత అప్రతిహతంగాను అనతిక్రమంగాను ఉంది.

"భగవంతుని పిలుపు వినబడే అన్ని వివిధ మార్గాలు ద్వారాను పెద్దవారు, చిన్నవారు, పుణ్యాత్ములు, పాపాత్ములు అనే భేదాలు లేకుండా ప్రతి యొక్కరికి

అందరికీ నేను అందుబాటులో ఉన్నాను నేను పూజించే సాధువులకు నే నెవరికోసం ఉన్నానో ఆ పాపులకు నేను అందుబాటులో ఉన్నాను.

("సూఫీ మతం ద్వారాను, వేదాంతం ద్వారాను, క్రైస్తవ, బౌద్ధ, జొరాస్ట్రియను మతాల ద్వారాను యింకా ఏ విధమయిన యితర మతాల ద్వారానయినా లేక మత ప్రమేయం లేకుండా తిన్నగా నయినా నన్ను చేరవచ్చును.)

"నేను అమెరికాలో ఉన్నప్పుడు ప్రజలు ఎప్పుడు మౌన విరమణం చేస్తారని" నన్నడిగారు నేను వారిని "నా మౌనమే సంభాషించలేనిచో నాలుకతో చేసే ప్రసంగాలవల్ల ప్రయోజనం ఏమిటి" అని మరల ప్రశ్నించాను భగవంతుడు ఎప్పుడైతే నా మాట విశ్వమంతా వినబడుతుందని తలుస్తాడో అప్పుడు నా చేత ఆయన మౌనభంగం చేయించగలడు నేను మౌనంగా ఉన్నా లేకపోయినా ఎవరయితే నేను ప్రకటించే సత్యాలు గురించి గాఢముగా పర్యాలోచన చేస్తారో వారు చివరికి శాశ్వతమైన జీవితములో ప్రవేశిస్తారు.

"జ్యోతిర్మయ స్వేచ్ఛా జీవితపు కార్యకలాపాలతోబాటు అందులో నేనెక్కడికి వెళ్ళినా ఒక నిత్య కార్యక్రమం తప్పకుండా ఉంటుంది. నేను పూజించే సాధువులకు నేను ఆరాధించే మస్తులకు నేను హృదయపూర్వకంగా ఆసక్తి కలిగియున్న పేదలకు నేను ప్రణమిల్లుతాను. వారి వారి రూపాలందున్న పరమాత్మకు ప్రణతిచేసే అవకాశాల కంటె నాకేదీ ఎక్కువ సుఖాన్ని యివ్వజాలదు నా చుట్టూ పరివేష్టించి యున్న భగవంతుని ఆరాధించి సేవించడం నా హృదయానికి ఎక్కువ ప్రీతికరం.

"ఈ జ్యోతిర్మయ స్వేచ్ఛా జీవితంలో అహంకారంతో కూడియున్న జీవితపు బలహీనతలన్నీ సంపూర్ణంగా దహింపబడ్డాయి సమస్తమైన కోరికలు, వాంఛలు, మోహములు నుండీ విముక్తి కలిగింది ఈ ఉజ్వల జీవితపు ఫలితం మెహెర్‌బాబాతో (భగవంతునితో) అంతహ ఏకముని ప్రసంచము తెలుసుకునేలా చేస్తుంది.

## "అద్భుతాలు - ఆధ్యాత్మిక చికిత్స" :—

"శారీరకంగా గాని, మానసికంగా గాని వ్యక్తిగా గాని సామూహికంగా గాని ప్రజలు బాధపడుతున్నపుడు వారు ఆ బాధ వెంటనే నివారింపబడాలని కోరుతారు.

ప్రపంచమంతటా మానవుని పోరాటం, సుఖదుఃఖాల ద్వంద్వాలకి లోబడి ఉంది. దుఃఖం లేకుండా చేసుకోవడానికి అతడు శాయశక్తులా ప్రయత్నిస్తాడు అట్లే సుఖం పొందడానికీ ప్రయత్నిస్తాడు కాని ఎల్లప్పుడూ బాధను తొలగించుకోలేడు. ఎల్లప్పుడూ సుఖం అనుభవించనూ లేడు సుఖ దుఃఖాలు వివిధరకాలయిన వాంఛలకి కోరికలకి పుట్టిన విడదీయరాని కవలపిల్లలుగా ఉన్నాయి. ఎక్కడయితే ఒకటి ఉందో రెండవది కూడా నీడలాగ నిత్యసహచరుని లాగ నిత్య సన్నిహితంగా తప్పకుండా ఉంటూ ఉంది. అందుచేత మానవుడు యీ ద్వంద్వాల మధ్య చిక్కుకుని ఉన్నాడు అతడు ఆ రెండిటి యొక్క మూలకారణాలన్నీ కనుక్కొని తన అజ్ఞానం వల్ల ఉత్పన్న మయిన కోటి కోరికలను నిర్మూలిస్తేగాని అతనికి ముక్తి లభించదు

వాంఛావాయువుల చేత మనస్సు చలించబడుతున్నంత వరకు తీరని కోరికల వల్ల అయిష్టమయిన సంఘటనల వల్ల కలిగిన మచ్చల్ని తుడిచి వేయడం దుస్సాధ్యం. మామూలు ప్రాపంచిక సాధనలవల్ల బాధలు తొలగించుకొనలేనప్పుడు, అతీతమయిన సాధనలకోసం అన్వేషించడం ప్రారంభిస్తాడు ఇది అద్భుతాల రంగస్థలం

ప్రపంచంలో జరిగే ప్రతీ సంఘటన వలెనే అద్భుతాలు కూడా మాయా జనితాలే. భగవంతుడు సృజించిన ప్రకృతియనే మహామాయలో చిన్న చిన్న మాయలు అనుకరించుటలో ఏమీ పసందులేదు. మామూలుగా మానవుడు శారీరక మానసిక బాధల్ని సహజములయిన ఔషధాలచే పోగొడుతున్నట్లే అతీతమయిన అతి మానుష శక్తుల అభ్యాసం చేతకూడా బాధల్ని అంతరింపజేసుకోవచ్చు. అటువంటి చికిత్సకు ప్రత్యేకమయిన ఆధ్యాత్మిక విశిష్టత యేమీలేదు. మనస్సునుంచి సమస్త బాధలకు మూలమయిన బీజాలను తీసి పారవేయగల నిజమయిన ఆధ్యాత్మిక చికిత్సకంటె పైన చెప్పినది ప్రాధాన్యతలో చాలా తక్కువ.

మానవకోటి యొక్క అంతిమ లక్ష్యమయిన భగవత్సాక్షాత్కారానికి గొని పోవుటకై అద్భుతాలు చేస్తే అవి సమర్థనీయాలే. లేకపోతే సహజమానవ పరిణామానికి అవి అత్యంతము అంతరాయాలని చెప్పక తప్పదు. శారీరక మానసిక బాధలు భగవత్ప్రసాదాలని మానవులు భావించాలి వాటివల్ల నిత్యానిత్యవస్తు వివేచన కలుగు తుంది. శాశ్వతమయినదాని అసలు విలువ తెలుస్తుంది చక్కగా అవి అంగీకరించి

వాటి మూలకారణం అవగాహన చేసుకుంటే ఆత్మను సంస్కరించి సత్యం యొక్క శాశ్వత సుఖాన్ని పొందజేస్తుంది ”

ఈ సందర్భంలో భగవంతుని చేరడానికి వివిధములయిన మార్గాల గురించి బాబా ఏమని చెప్పారో చూద్దాము -

## చక్కని రాజ మార్గాలు :—

“ముఖ్యమైన మాట చెప్పాలంటే అన్ని వృత్తులూ అన్ని మార్గాలూ చివరికి ఒకే గమ్యానికి తీసుకువెళ్తాయి - దేవుని వద్దకు వివిధ దిక్కులనుంచి ప్రవహిస్తూ ఉన్నా, దారిలో ఎన్ని పోకడలు పోయినా (నదీనాం సాగరోగతిః) నదులన్నీ సముద్రంలోనే కలుస్తున్నాయి. అయినా గానీ యాత్రికుని తిన్నగా దివ్యసన్నిధానికి తీసుకుపోయే కొన్ని రాజమార్గాలున్నాయి అవి ముఖ్యమయినవి. ఎందుచేతంటే క్లిష్టమయిన నందుగొందుల గందరగోళంలో పడి చిక్కుపడిపోకుండా యాత్రికుని అవి తప్పించి నేరుగా, తీసుకువెళ్తాయి.

(లోకంలో నిర్మాణం గావింపబడియున్న మతాలలోని కర్మకాండలు ఆచార క్రియలు కొన్ని రాజమార్గాల వెంట బయలుదేరితే అన్వేషకులను అసలయిన అంత రంగిక ప్రయాణానికి గుమ్మం వద్దకి మాత్రం తీసికొనివచ్చి అంటే సాలోక్యంలోను, సామీప్యంలోను విడుస్తాయి ఈ మార్గాలు చాలాదూరం వరకు వేర్వేరుగానే ఉంటాయి అవి చివరికి పోయిన కొలదీ ఒకదానిలో ఒకటి కలిసిపోతాయి వ్యక్తుల యొక్క సంస్కారానిబట్టి వారి వ్యక్తిగత భావ వైఖరుల వ్యత్యాసాలను బట్టి మొదట మార్గాలు భిన్నభిన్నాలుగా ఉంటాయి అయినప్పటికీ మార్గాలు చాలా ఉన్నా లక్ష్యము మాత్రం ఎప్పటికీ ఒక్కటే. దేవునితో ఐక్యమయిపోవడం - అని మొదటినుంచీ స్పష్టం కావలసి ఉంది.)

(ఈ రాజమార్గాలలో అన్నిటికంటె శీఘ్రమయినది అవతార పురుషుని (భగవన్మానవుని) ద్వారా అయిఉంది అయన చైతన్యవంతుడై సత్యంతో ఏకత్వం అనుభవిస్తున్నాడు అవతార పురుషునిలో భగవంతుడు తన దివ్యవైభవంతో ఆయన అనంతశక్తితో, అగాధమయిన జ్ఞానంతో, అనిర్వచనీయమైన ఆనందంతో, శాశ్వత మయిన అస్తిత్వంతో ప్రకాశిస్తున్నాడు అచంచలమయిన విశ్వాసంతోను సంపూర్ణ

సమర్పణాభావంతోను ఎవరయితే అవతారపురుషుని దరికి జేరతారో ఆ అదృష్టవంతు లకు ఆయన ద్వారా మార్గము గోచరమవుతుంది అలాటి సంపూర్ణసమర్పణ మిక్కిలి అభివృద్ధిచెందిన సాధకులకు గాని యితరులకు సాధ్యపడదు. ఇది సాధ్యము కానప్పుడు యితర రాజమార్గాలు అవలంభించాలి అవి యేవి యనగా —

(1) భగవంతుని యెడల ప్రేమ - ఆయనను కనుగొనుటకు ఆయనతో ఐక్యము నందుటకు తీవ్రమైన వాంఛను కలిగిఉండుట.

(2) నిరంతరము సత్పురుషులతోను భగవత్ప్రేమికులతోను సహవాసం చేయుట, వారికి హృదయపూర్వకముగా సేవచేయుట ;

(3) కామము, ఆశ, క్రోధము, ద్వేషము, అధికారమునందూ, కీర్తి యందూ మోహము, యితరుల తప్పులు వెదకుటలో ఆసక్తి – ఇవి లేకుండా చేసు కోవడం ,

(4) అందరినీ అన్నిటినీ వదలి సంపూర్ణ బాహ్యత్యాగం చేయడం ; ఏకాంతంగా, ఉపవాసాలతో, ప్రార్థనలతో, ధ్యానముతో నుండుటయందు ఆసక్తుడై ఉండడం ;

(5) జయాపజయాలతో నిమిత్తం లేకుండా ఉదాసీనతతో ప్రపంచ వ్యవ హారాలన్నీ చేయడం, పరిశుద్ధమైన హృదయంతో నిర్మలమయిన మనసుతో ఎంత తీవ్రంగా పనులలో మునిగియున్నా విరాగియై అనాసక్తుడై ఉండడం ,

(6) ఎటువంటి ప్రతిఫలాపేక్ష లేకుండా మానవకోటికి నిస్స్వార్థసేవ చేయడం —)

ఈ సందేశాలను బాబా అచ్చొత్తించి ప్రజాదర్శన కార్యక్రమాలలో విరివిగా పంచిపెట్టించారు కార్యకర్తలందరకు వారి కర్తవ్యాలను బోధిస్తూ

(1) అందరితోను పరస్పర సహకారముండాలని,

(2) నాయకుడంటూ ఎవరినీ నియమించవలసిన అవసరం లేదని,

(3) ప్రతీ కార్యకర్తకు బాబా వద్దకు పోవుటకుగాని బాబాకు ఉత్తరము వ్రాయుటకుగాని సమానమయిన హక్కు కలదని,

(4) ఏప్రెల్ మాసాంతము వరకు బాబా ఉజ్జ్వల జీవితములో కార్య నిమగ్నులై యుంటారని, తరువాత ప్రతివారును దాదాకు గాని, ఆదీకిగాని వ్రాయ వచ్చుననీ, —

బాబా చెప్పారు తరువాత బాబా ధనపతిరావును, రంగారావును, బాపిరాజును, వెంకటేశ్వరరావును యింకా యితర ప్రేమికులను ప్రత్యేకంగా అడిగి వారికి వ్యక్తిగతంగా ఉన్న యిబ్బందులు తెలుసుకుని అందరి యందు సామరస్యము కుదురుట వలన బాబా చాలా సంతోషించారు.

బాబా ఆంధ్రదేశము నుంచి జనవరి 31 వ తేదీన తిరుగు ప్రయాణము చేస్తూ మండలితో యిట్లు ప్రసంగించారు.

"మీరు నన్నెరుగరు మీరు నన్ను చూడలేదు నేను మీకు కనిపించే యీ శరీరాన్ని కాదు. నేను మీకు వినిపించేది ఏదీకాదు భౌతిక అస్తిత్వము భగవంతుడుకాదు భగవంతుడు అన్నిటిలోను, అన్నిచోటలా, అన్నివేళలా ఉన్నాడు. నీ శరీరము నీవుకాదు ఒక కాలుగాని ఒక చెయ్యిగాని తీసివేసినా నీ అస్తిత్వానికి భంగంరాదు నీలోపల నీవు పూర్ణంగానే ఉన్నట్లు భావిస్తావు నీవు యిప్పుడున్నట్లుగానే, నీవు ముందు ఉండునట్లుగానే, నీవు మారుతున్నప్పటికి ఉండగలవు నీవు ఎక్కువగా గాని తక్కువగా గాని ఉన్నట్లు భావించక నీవు ఎప్పటివలెనే ఉన్నట్లుంటావు. నిద్రపోయినపుడల్లా నీ చైతన్యము లేకపోయినప్పటికీ నీవు నంతతము ఉన్నట్లుగా భావించుకుంటావు....

నేను భగవంతుడనై యున్నా నీవు భగవంతుడవు ఎందుకు కాకుండా ఉన్నావు ? ఎందుచేతంటే నేను భగవంతుడననే చైతన్యము కలిగి ఉన్నాను నీవు అట్లుకావు." బాబా తిరుగు ప్రయాణంలో హైదరాబాద్ వెళ్ళి అక్కడ కొద్ది రోజులుండి అహమద్‌నగర్ చేరుకున్నారు.

ఫిబ్రవరి 14 వ తేదీన అహమద్‌నగర్‌లో గుల్మాయి యింటిలో బాబా గోదావరిమాయికి దర్శన మిచ్చారు.

మెహెరాబాద్‌కు అతి సమీపగ్రామమయిన ఆరంగామ్‌లో యీ యేడాది లోనే బాబా ఒక సమావేశము జరిపినపుడు 14 సంవత్సరాల వయసు గలిగిన బాలు డొకడు పూజచేసి బాబా సన్నిధిలో భక్తి పారవశ్యమున తన అరచేతిలో కర్పూరము

వెలిగించి బాబాకు హారతి ఇచ్చాడు కర్పూరము పూర్తిగా వెలుగుతో హరించువరకు చేతిలో ఉంచుకున్నాడు. కొద్దిరోజుల తరువాత బాబా ఆ వానిని చేతిమీద కట్టును జూచి నీ చేతికేమయింది అని యడిగారు అతడు ఏమయింది చెప్పినపుడు బాబా అతనిని మందహాసముతో కౌగిలించుకుని బాబా ఆనందమును గూర్చారు.

'ఈజ్ దేర్ ఎ సాన్ ? "ఉపయిమన్నది ఉన్నదా ?'' అని ఒక పుస్తకం ప్రచురణ విషయంలో ఐరీన్‌కోనిబీర్‌ను బాబా రమ్మని పిలిస్తే ఆమె పాశ్చాత్య దేశాల నుంచి బాబా ఆజ్ఞప్రకారం మెహెరాబాద్ వచ్చింది, 1953 సం॥ ఫిబ్రవరి లో. ఆ నెలలో ఆ సంవత్సరం బాబా పుట్టినరోజు పండుగ చేసుకోవడం లేదు బాబా అప్పుడే ఒక దర్శన పర్యటన కార్యక్రమం ముగించుకునివచ్చి విశ్రాంతి తీసుకుంటున్నారు. అయినప్పటికి స్త్రీ మండలి తొందరగా లేచారు. బాబా పుట్టినరోజునాడు – (అది పార్సీ పంచాంగం ప్రకారం ఫిబ్రవరి 25 కి వాగా సుందే వచ్చింది.) మామూలుగా పాశ్చాత్య దుస్తులతో మస్తాబయే స్త్రీలు కూడా భారతీయులవలె రంగు రంగుల మంచి చీరలు సింగారించుకున్నారు. స్త్రీలు అంతా వచ్చి బాబాను పుష్పమాలలతో అలంకరించారు. సరిగ్గా అయిదు గంటలకు పురుషమండలి కూడా వచ్చి దూరం నుంచి గోడ అవతలనుంచి – ఏడు వివిధ భాషలలో భగవంతుని నామం ఉచ్ఛైస్స్వరంతో ఉచ్చరించారు

తరువాత బాబా ఐరీన్‌కోనిబీర్‌తో బయలుదేరి పురుషమండలి బసల వద్దకు వెళ్ళారు. చుట్టుప్రక్కల గ్రామాలనుంచి కొంతమంది నహార్లు (అంటరాని వారు) వచ్చారు. వీరు చాలా బీదవారు – వీరికి రెండుపూటలా కడుపునిండా తిండి లేదు. దుఃఖాక్రాంతులయిన యిటువంటి పేదవారిని ఉద్ధరించడం బాబా ఉద్దేశ్యం అటువంటి అస్పృశ్యులు భారతదేశంలో అయిదుకోట్లమంది ఉన్నారు ప్రభుత్వం చట్టం ద్వారా అస్పృశ్యతా నివారణ గావించుట కష్టము, ప్రజల భావాలలో మార్పు రావాలిగాని

బాబా ఒక చెట్టుక్రింద కూర్చున్నారు. మొదట బాబా వద్దకు వచ్చినవాడు ఒక ముసలివాడు. ఎన్నో మాసికలు వేసి ఉన్న చొక్కా తొడుగుకున్నాడు. అటువంటి బీదవారికే కదా భగవంతుడు ఎక్కువగా ప్రేమించేది ఒక్కొక్కరే బాబా ముందుకు వచ్చి నిలబడగా బాబా వారి పాదాలకు ప్రణమిల్లి వారికి దక్షిణ నిచ్చి పంపారు

సింపలగాన్‌లో ఒకనాడు బాబా ఓరుబటిగా కూర్చున్నపుడు కోసేబీర్ వారిని అడిగింది — 'బాబా! ఫ్లైయింగ్ సాసర్లు ఎక్కడనుంచి వస్తున్నాయి?' యిలా అడుగగా బాబా నవ్వి — "ఈ ప్రశ్న యింకొకరు వేసిఉంటే సమాధానం చెప్పకపోదును. నీవు గనుక చెప్తున్నాను. అవి యింకో గ్రహంనుంచి మాత్రం రావడంలేదు —" బాబా తరువాత ఏమి చెప్పారో తెలియదు.

తరువాత "బాబా! ఆదమ్ అనేవానికి వయసు ఎంత ఉంటుంది! (ఎంత కాలం క్రిందట ఆదమ్ పుట్టాడు?) బాబా చిరునవ్వుతో "నేను మొట్టమొదట మనిషి భూమిమీద 8 కోట్ల 40 లక్షల సంవత్సరాలు క్రితం పుట్టాడని చెబుతాననుకో. నీకేమి అర్థమయినట్లు? మొదట పరిణామం చెందిన మనిషి యీ భూమిమీదే కాక ఎన్నో ప్రపంచాలలో పుట్టాడంటే అది నీకు అర్థమయేలా చెప్పవలసి వస్తుంది. నా శిష్యుడు రంజూ ఒక డైరీ వ్రాసుకున్నాడు అందులో దీన్నిగురించి ఏమన్నా ఉందేమో అడుగు. నేను మౌనం ఆరంభించక ముందు స్వంతంగా నేను వ్రాసిన పుస్తకం (అది యిప్పుడు ఒక బ్యాంకులో దాచబడి ఉంది నేను చెప్పినపుడే అది తియ్యాలి) లో యీ విషయం చక్కగా విపులీకరించబడింది, యుగాల గురించి. భగవంతుని సాక్షాత్కరింప చేసుకోవడంలో యీ భూమి యొక్కపాత్ర, యీ భూలోకము యొక్క పరిణామము, దాని విలయము. అదే సమయంలో యింకొక భూలోకం ప్రభవించడము - (అంతే యింకొక గ్రహంకాదు) .... అందులో వ్రాయబడి ఉన్నాయి."

"మొదటి మానవుడు పరిణామం చెందడం, మొదట భగవత్సాక్షాత్కారం పొందిన మానవుడు . . గుడ్డు ముందా కోడి ముందా (చెట్టుముందా విత్తుముందా) అనే సమస్యలు – ఇవన్నీ వివరంగా ఆ పుస్తకంలో తెలుపబడ్డాయి . . –" ఆధ్యాత్మిక, పారలౌకిక, విషయాలు ఎన్నో బాబా యింకా అందులో రచించారు అందరిలో తాను ఉండి తనలో అందరూ ఉన్నట్లు అనుభవించే మహామహుడు సర్వజ్ఞుడు, జ్ఞానసంపూర్ణుడు అయిన బాబా రచించాడు గనుక ప్రపంచంలోకెల్లా యీ యుగమునందు అదొక అపూర్వము, మహత్తరము అయిన ఘనమయిన ఉద్గ్రంథం అవుతుంది అని వేరే చెప్పనక్కరలేదు.

బాబా ఒకమారు చెప్పారు – ఒక దర్శన కార్యక్రమంలో

"జీవం అంతా (ఏరూపంలో ఉన్నా) ఒకటే భగవంతుడొక్కడే సత్య మయినవాడని, ఆయనయే అసలు పట్టించుకోదానికి తగినవాడని, మానవుడు అసలు నిజాన్ని తెలుసుకునేలా అతనికి ఒక దర్శనం కలగడానికి సమయ మాసన్నమయింది భగవంతుని కొరకే జీవించాలి. భగవంతుని కొరకే మరణించడానికి కూడా తగును. మిగిలినదంతా వట్టిమాయ.

"భగవంతుని మన నిత్య జీవితంలో మౌనంగా నిజాయితీతో ప్రేమించాలి. భుజించేటప్పుడు, త్రాగేటప్పుడు, మాట్లాడేటప్పుడు, మనం మన అన్నిపనులు చేసుకునేటప్పుడు కూడా భగవంతుని ప్రేమించగలం నిరంతరమూ ఎవరికీ తెలియకుండా దేవుణ్ణి ప్రేమించగలం భగవంతుని కనుగొన్నప్పుడు మనకి ఎంత అనంత మయిన ఆనందం కలుగుతుందో ఎంత శాంతి కలుగుతుందో మీకు తెలియదు"

ఒకమారు మండలితో బాబా అన్నారు – "నాతో ఉన్న మీరు ఎప్పుడయినా మనస్సు ప్రాపంచిక మాయమీద పోతూంటే మీరు ఆజ్ఞాభంగం పొందకండి ."

తరువాత బాబా భక్తునికి గురువుకి ఉన్న సత్సంబంధం గురించి చెప్తూ – ఎల్లప్పుడు నీపేరు ఉచ్చరిస్తూ నేను నీతో ఒకటయిపోయాను నా అన్నదేదీ మిగల లేదు. ఓ నా గురూ ! నిన్ను ఎట్లు పొగడగలను ? ఎక్కడ జూసినా, నీవే నాకు కనిపిస్తున్నావు. ఇంకేదీ నేను చూడటంలేదు అన్నాడు ఒక భక్తుడు"

ఫిబ్రవరి 16 వ తేదీకి బాబా డేరాడూన్ వెళ్ళారు ఇంక ప్రజా దర్శనా లుండవు. బాబా మస్తులను సాధువులను దర్శిస్తూ దరిద్రనారాయణ సేవలో పాల్గొంటూ ఉన్నారు డేరాడూన్‌లో బాబా రాజపూర్ రోడ్డులో ఒక బంగళాలో బస చేసారు బాబా డేరాడూన్‌లో ఉండగా కొందరు ఆయన గురించి మండలి గురించి అసత్య ప్రచారం చేసారు ఆ సంగతి బాబాకి మండలి విన్నవించారు అప్పుడు బాబా వారి భక్తులకిలా చెప్పారు – ఆరోజు 1953, ఫిబ్రవరి 22 వ తేదీ.

"నన్ను గురించి నా శిష్యుల గురించి కొన్ని వదంతులు నా చెవులకు సోకినవి. 1942 వ సంవత్సరములో నేను రిషీకేశ్‌లో నా శిష్యులతో ఉన్నపుడు ఏవో కొన్ని పార్సిళ్ళు రైలుద్వారా నా పేర వచ్చాయనీ ఆ పెట్టెలు రైలులో రవాణాలో

పెద్ద తొట్టెయిమనలని లోపల ఉన్న సరుకులో మత్తు కలిగించే సారాయముతో ప్రసాదం కోసం కొన్ని సీసాలున్నాయని తెలిసిందని యీ సంగతి పైకి తెలిసి పోతుందని నేనూ నా శిష్యులూ వెంటనే మకాం ఎత్తేసి పరారీ అయామని వదంతుల లోని ఉదంతము.

ఇలాంటి వదంతులు నన్ను గురించి వ్యాపింపజేయడానికి చర్యలు తీసుకున్నవారిని నేను మెచ్చుకుంటున్నాను ఎందువల్లంటే యిలాంటి వ్యతిరేకమయిన పనులు నాకు చాలా సహాయకారిగా ఉంటాయి ఆధ్యాత్మికమయిన పనిలో వ్యతిరేకత, నింద, దూషణ, కింవదంతి, విమర్శ మొదలయినవన్నీ యితరములయిన వాటికంటె ఎక్కువ సహాయపడగలవు ఆధ్యాత్మికంగా పరిపక్వత, పొందిన సంపూర్ణమానవులు సత్యముతో ఐక్యతనంది యుండడం వల్ల వారికి అన్నీ తెలుసును గనుక సత్యమును మరుగు పరచి దానిని మరొక విధంగా మార్పిడి చేసేవారిని ఆశీర్వదిస్తారు.

ఇన్ని సంవత్సరాలుగా సత్పురుషులకు సాధువులకు పాపులనబడేవారికి పేదవారికి కూడా ప్రణమిల్లుచుండుట నా పనిలో ప్రధాన భాగముగా ఉంటోంది ఇప్పుడు నేను రిషీకేశ్‌కు హరిద్వార్‌కు పోయినపుడు నన్నుగురించి అపనిందలు వదంతులద్వారా వ్యాపింపజేసిన వారికి అవి నమ్మినవారికీ కూడా నేను ప్రణామం చేస్తాను ఇలా ప్రణమిల్లుట వారియందు నాకు కలిగిన అహంకారము అసంతృప్తివల్ల కాదనీ, ఘనమైన నా ఆధ్యాత్మిక కార్యమునందు వారు గావించిన గొప్ప సహాయమునకు నా హృదయంనుండి బయల్వెడలిన అవ్యాజప్రేమవల్లనే నేనట్లు చేస్తున్నానని వారు తెలుసుకొందురు గాక

అనాది నుండి యీనాటివరకు నిందాస్తుతులకు చలించక నేను నేనుగానే ఉన్నాను అనంతముగా నేను అట్లే ఉంటాను" తరువాత బాబా దేరాడూన్ నుంచి వెళ్ళి రిషీకేశ్‌లో మకాము పెట్టారు.

రిషీకేశ్‌లో ఒక ప్రేమిక సమావేశములో బాబా 1953 మార్చి 1 వ తేదీన యిలా ప్రసంగం చేసారు –

"నీవు స్వంతముగా అపరోక్షముగా గాని పరోక్షముగా గాని అసత్య ప్రచారము చేసినా, నీ పేరుతో యితరులు చేసినా, నా యొక్క ఆధ్యాత్మిక విశ్వ-

కార్యకలాపము నందు నీవు పాల్గొని సహాయపడినందులకు నీకు నేను ప్రేమ పూర్వకంగా ప్రణమిల్లుతున్నాను."

బాబా ప్రణమిల్లి యీ క్రింది సందేశమును వచ్చినవారందరికి చదివించి చెప్పారు –

"సంపూర్ణత అంటే మాయా ధర్మము నుండి తప్పించుకొనుట కాదు. మానవుడు దేవుడగుటయే సంపూర్ణత కాని మనిషి తెలిసియే భగవంతుడయిన పిదప మానవస్థాల చైతన్యమునకు తిరిగి వచ్చినచో అతడు పరమ సంపూర్ణమగు స్థితిని పొందినట్లే అతడు భగవంతుడుగానే గాక, భగవన్మానవుడుగా కూడా జీవిస్తాడు అతడు మాయిలో జీవించుచున్నా దానికి అతీతుడుగా కూడా ఉన్నాడు కర్మధర్మము నందున్నను దానిచేత బంధితుడు గాకుండా ఉన్నాడు అతడు ఏ కర్మలు చేసినా అవి 'అకర్మలు'గానే ఉంటాయి. (అంటే అవి అతనిని బంధించవు). సాధారణ మానవులు ఆచరించే కర్మలు వారిని బంధిస్తాయి ఆ కర్మలే అతడాచరించినట్లయితే అవి అతనిని బంధించవు సరికదా మానవకోటిని మాయా విమోచనము పొందించుటకు అతడొనర్చు బృహత్కార్యము నందు సహాయ భూతములుగా ఉంటాయి పరిపూర్ణ మానవులు స్వేచ్ఛనుండి కూడా స్వతంత్రులై యున్నారు అందువల్ల వారొనర్చే విశ్వకార్యమునందు వారుచేసే 'అకర్మల' నుండి కూడా స్వేచ్ఛ పొందియున్నారు.

నన్ను ప్రేమిస్తూ నా పనులు తెలుసుకోగోరు వారికి నేను చెప్పేదేమంటే– నా అంతరంగజీవితం, అంతరిక కార్యాలు, భగవంతుడికీ, భగవంతునితో ఐక్యము పొందినవారికీ మాత్రం అవగాహన అవుతాయి నేను మస్తులను, సాధువులను పేదలను, సాంగత్యం చేసి వారికి ప్రణమిల్లుట సేవజేయుట మొదలయిన బాహ్యచర్యలు హృదయపూర్వకమైన ఆసక్తితో చేస్తూ ఉండడం నా శిష్యుడొకడు (విలియం డాంకిన్) బాటసారులు (వేఫేరర్స్) అనే గ్రంధములో రచించాడు.

నాకు ఆటలంటే ప్రీతి. ముఖ్యంగా క్రికెట్, గోళీలాట గాలిపటాలెగురవేయుట – నాకు సంగీతమంటే చాలా యిష్టం కొన్ని అపూర్వమయిన అవకాశాలు జారవిడువను. అనాదినుండీ నేటివరకు యీ మాయా జగత్తుతో నేను ఆడుతున్నాను. ఈ ఆటలయందు ఆసక్తి నాకు యింకా ఉంటోంది

స్వర్గాశ్రమంలో నేనూ నా శిష్యులూ మదిరాపానం చేసామన్న వదంతి కేవలం అసత్యం- అయినా ఒకానొక మహదవకాశము నందు నా ప్రేమికులకు

ప్రదర్శనము యిస్తాను - కానీ అది యిచ్చినందున వారు యీ ప్రదర్శనము కేవలము ప్రేమను ఉత్పన్నం చేసెదైవోన్మత్తత కలిగించు మధువు అనీ అది భగవంతునిలో ఐక్యం కలుగజేయుననీ తెలుసుకుంటారు-

శాఖాహారులను వారి ఆహారమే తీసుకొమ్మని అంటాను. మాంసాహారులను నేను మత్స్యమాంసాదులను భుజింపనిస్తాను. నేను ఏ యొక్క మతావలంబన యందునూ కలుగచేసుకోను ఎవరి మతాలను వారు చక్కగా ఎలాంటి అభ్యంతరమూ లేక అనువర్తింపవచ్చును. భగవంతుని యెడల ప్రేమ వ్యాపారంలో బాహ్య కర్మలకు విలువలేదు (భోజ్యము మొదలయినవి) భగవత్ప్రేమ ఉంటే తమకు కోరికలు లేకుండుట, మనోనిగ్రహం, అహంకార నాశ్యం-ఇవన్నీ కలుగుతాయి.

నేను కొన్ని సమయాలలో ఎక్కువగా హాస్యరసప్రధానమయిన సినిమాలు చూస్తూ యీ జగత్తు అనే ఎడతెగని, నిత్యము మారిపోవునట్టి బ్రహ్మాండమయిన సినిమాకు నేను శాశ్వత నిర్మాతనై యున్న నా నిజస్థితిని తలచుకుంటూ ఆనందిస్తూ ఉంటాను. వినోదపూరితాలయిన కథలను వింటూ, అనంతశక్తి వైభవ కారణమగు ఆత్మ అజ్ఞాన బంధనములో తగుల్కొని శక్తిలేనివానిగా ద్వంద్వరూపములలో బడి అలమటించు వినోదమును తలపుకొని ఆనందిస్తూ ఉంటాను.

ఒక్కొక్కప్పుడు ప్రజలకు దర్శనము నిచ్చి ప్రేమ ప్రసాదమును పంచి పెడతాను. ఎవరికి ఎంత అర్హత ఉందో వారు అంత లాభమును పొందుతారు. సద్గురువులకు సమర్పణ అయినవారికి కొన్ని ఉపదేశాలనిస్తాను సత్యాన్వేషకులకు కొంత సలహాయిచ్చి సహాయం చేస్తూంటాను ఇదంతా వారి వారి యోగ్యతలనుబట్టి పనిచేస్తుంది

పరిపక్వత చెందినవారు దివ్యజ్ఞానము నీయగలరు. దివ్యప్రేమను పొందజేయగలరు కటాక్షవీక్షణమాత్రమున స్పర్శమాత్రమున, ఒక్కదివ్యభావన చేతనే, భగవంతునితో తాదాత్మ్యం కలుగజేయగలరు

నేను చాలా సంతోషిస్తున్నాను అందరకు నాప్రేమ, ఆశీర్వాదములు యిస్తున్నాను. ఈనాప్రేమపూరితమగుచర్య ఒక్కరయినా అర్థంచేసుకోగలిగితే నను యీ వేళ యిక్కడికి రావడం సఫలత చెందినట్లే అవుతుంది "

1953 మార్చి 1వ తేదీన రిషీకేశ్‌లో బాబా పేరాకపోం యింకొక ప్రసంగం చేసారు అందులో వారిట్లు చెప్పారు "ఎంత నేర్చినా, ఎంత చదివినా, ఎంత బోధించినా, ఎంత తర్కించినా, ఎంత జ్ఞానము వ్యాప్తిచేసినా మనకు ముక్తి లభింపజాలదు వేదాంతోపన్యాసాలు, సూక్తిసూక్తులు, ధర్మపన్నాలు, యోగసూత్రాలు, ఆధ్యాత్మిక ప్రవచనాలు మనలను ఆధ్యాత్మికంగా ఒక్క అడుగయినా ముందుకు గొనిపోజాలవు మతసంబంధమయిన మహాసభలు. ఆధ్యాత్మిక సమాజాలు, విశ్వమానవ సౌభ్రాతృత్వ సిద్ధాంతము యిత్యాదులు ఆత్మను బంధించునేగాని, స్వేచ్ఛను యివ్వజాలవు

బుద్ధికి అతీతమయిన ప్రేమసామ్రాజ్యమునందు ప్రవేశించిననేగాని ముక్తి కొరకు ప్రయత్నించుటకు కూడా మనకు అర్హత కలుగదు భగవంతునియెడల ప్రేమ పరాకాష్ఠనందినపుడు మనము భగవంతునిలో మనలను పోగొట్టుకున్నపుడు శాశ్వత విమోచనము పొందుతాము విముక్తులయినవారు మాయాబంధనములనుండి ఎల్లప్పుడు విడివడి యుంటారు మంచిచెడ్డలు ధర్మాధర్మములు దివ్యసత్యమనెడి మహాసముద్రమును అపవిత్రమొనర్చజాలవు"

తరువాత మార్చి 21వ తేదీన బాబా, తమవద్ద మండలి అంతయూ ఉండగా ఒక ప్రకటన చేసారు అందులో చాలా కాలంనుంచి ఎంతో ఆదుర్దాతో ఎదురు చూస్తున్న సంసారబంధన విముక్తి. ఆధ్యాత్మిక స్వేచ్ఛ ఏప్రెల్ నెలాఖరున కాకపోతే భవిష్యత్తులో ఎప్పుడో ఒకప్పుడు జరుగక మానదు బాబా తమ భౌతిక శరీరమును త్యజించేముందు నాలుగు సంఘటనలు జరుగవలసి యున్నవని భగవన్నిర్ణయము యిదివరకే అయిందని చెప్పారు ఆ విషయాలు ఆయన యింకా యిలా వివరించారు

"నా శరీరమును వదిలేముందు నేను విశ్వవ్యాప్తంగా అవమానమును ఎదుర్కొనవలసియుంటుం ననునది నిశ్చయము. దానితోపాటు పైకి మాత్రము జగత్తునందు పరాజయమును నేను పొందినట్లు కనిపిస్తుంది. తరువాత నాకు దౌర్జన్యసహిత మగు మరణం సంభవిస్తుంది దీని ఫలితంగా విశ్వవిశాలంగా దివ్యవైభవం నన్ను వరిస్తుంది నాపై దౌర్జన్యము జరుగుటచేతనే నా మరణం సంభవించగలదు నా యొక్క మౌన విరమణం సత్యప్రకటనం ఏకకాలమందే జరుగుతాయి.

ఈ రోజున నా సమక్షమందున్నవారూ యీ క్షణమునందు యిక్కడ లేకుండా ఉన్నవారూ గమనించి సిద్ధపడుదురు గాక సమయం ఆసన్నమవుతోంది.

మీ యొక్క నిజాయితీతనం, మీ గురువునకు మీ యొక్క సంపూర్ణసమర్పణ, యిప్పుడు కఠినముగా పరీక్షింపు సమయం దగ్గరలోనే ఉంది ఆ పరీక్షచేసేది స్వంతంగా నేను కాను. మీరు ఎంతవరకు మీ గురువుకు స్వయంగా అంకితమయారో పరిస్థితులే మిమ్మల్ని పరీక్ష చేస్తాయి

నన్ను అంటిపెట్టుకుని ఉన్నవారికి నాతో కూడా ఉన్నవారికి నేను చెప్పేదేమంటే వారంతా రాబోవు అవమానానికి పైకి కనబడే సంపూర్ణపరాజయానికి శారీరక దౌర్జన్యానికి ప్రాణాలు తెగించయినా సర్వసంసిద్ధులగుదురు గాక అయినా, యీ అవమాన పరాజయ దౌర్జన్యాలు నాతో సంబంధమున్న వారంతా ఎదుర్కోవలసిన అవసరం ఉండదు ఎవరయితే సంకోచం లేకుండానూ, ధైర్యంగానూ యీ దెబ్బలకు తట్టుకొని అచంచలంగా యీ పరీక్షలకు నిలబడగలరో వారు దివ్య వైభవానికి వారసులుగానూ భాగస్వాములుగానూ ఉండగలరు. మరి ఎవరయితే బయటకు కనబడే విధికృతమయినటువంటి యీ క్లేశాలనుండి తప్పించుకుని పారిపోతారో వారు వారి కృత్యముల వలన వారి యొక్క సమర్పణ నిజాయితీగాను హృదయపూర్వకం గాను ఉందో లేక స్వార్థపు చింతలతో కూడియున్నదో వెల్లడి అవుతుంది ''

తను, మన ధనాలతో సద్గురువునకు సంపూర్ణ సమర్పణ అవడం అంటే ఏమిటో ప్రజలకు బాగా లోతుగా అవగాహన కాలేదని బాబా అన్నారు ఒక శిష్యుడు తన గురువుకు సంపూర్ణ సమర్పణ అయిపోయానని అనుకోవడం కేవలం అజ్ఞానం వల్లనే జరుగుతుంది ఆ మాటల యొక్క విశిష్టమయిన అర్థము తూచి తెలుసుకుని దానిని గురించి ఆలోచిస్తే తనయొక్క ఆస్తి, శరీరము, మనసు — తన మనుగడకు ఆధారభూతమయిన వన్నీ తన గురువుకు సమస్తమూ అర్పించేస్తే, తన స్వార్థం గురించి ఆలోచించడానికే అవకాశం ఉండదు. మనస్సు కూడా తనదికాదు గనుక, తన శరీరమే ఆయనకు స్వాధీనము చేసిన తరువాత, గురువుకోసం గాకుండా కదిలినా కూడా ఆఖరికి గాలిపీల్చినా కూడా అది కపటమే అవుతుంది కాని యిటువంటి దుస్సాధ్యమయిన సమర్పణ శిష్యుల వద్దనుంచి ఏ గురువూ కోరడు గురువు కోరే దేమిటంటే తన యిచ్ఛకు అది ఎంత అయిష్టముగాను తన స్వంత భావాలకి విరుద్ధము గాను ఉన్నా-శిష్యుడు సంపూర్ణంగా లోబడి ఉండాలని కోరుతాడని బాబా వివరించారు

దీనికి ఒక ఉదాహరణచెప్తూ ఒకరివైపుచూపుతూ బాబా యిలాఅన్నారు—

"రేపు నిన్నొక వస్త్రివర్తినిచేసి మళ్ళీ మరునాడే నిన్నుచిప్రాసికా కిందికి దింపాననుకో. నీకు కలిగిన యీ హెచ్చుతగ్గులు నాయొక్క నిర్ణయంలో చెదరిపోవటం వంటి నమ్మకం ఉంచి నీవు అంగీకరించాలి నీవు గురువుయొక్క ఇచ్ఛప్రకారం చేయడానికి, ఎసమయమందైనా సీపాత్రను నిర్వహించడానికి స్థిరమైన చిత్తముతో ప్రయత్నించాలి"

ఇతరులవైపుకి తిరిగి బాబా యిలాచెప్పారు—

"శిష్యుడైనవాడు విధేయుడుగాఉంటే చాలును. నీగురువుకు నీవు పూర్ణముగా అంకితమై యుండుటచేత నీమీదనీకు స్వేచ్ఛాధికారాలు లేవుగనుక నీవు గురువుచెప్పినట్లు చేయడమే నీవిధి నీగురుని ఇచ్ఛకు వ్యతిరేకంగా నీపరిమిత జ్ఞానముతో ఎన్నడూ తర్కించవకు గురువు ఏదిచేసినా ఏమిచెప్పినా నీఅంతట నీవు అంగీకరించడంవలన, ప్రశ్నించకుండా అతనికి విధేయుడవగుటవలన నీకెట్టికష్టము లేమరైనా అన్నీ సురక్షితంగా దాటగలుగుతావు

కావున ధైర్యంతో ఉండండి మీయెడల మీరు నిజాయితీ కలిగి ఉండండి గురువు ఏదిఅడిగినా సంతోషంతోయిచ్చి విధేయులై ఉండండి ఈనాటకంలో మీపాత్రలను మీరుచక్కగా పోషించండి భగవంతునిచే నిర్దేశింపబడినట్లు నాపాత్రను నేనుకూడా నిర్వహిస్తాను నేనువచ్చినపనిని వచ్చే ఏప్రెల్ ఆఖరికి పూర్తిచేస్తాను లేకపోతే ఏ సంవత్సరం ఆఖరుకయినా పూర్తి చేస్తాను ఎలాజరిగినా అది భగవంతుని మీద ఆధారపడి ఉంది. రానున్నదానితో సంబంధం పెట్టుకోవడం మీకు అవసరం లేకపోయినా, యిది మాత్రం మీకు చెప్తాను — ఈ ఏప్రెల్ ఆఖరికి కాకపోతే జూలై 11 వ తేదీ–అక్టోబరు 10 వ తేదీ మధ్యలో వచ్చే ఏ సంవత్సరంలో నయినా జరుగుతుంది.

నా జ్యోతిర్మయ స్వేచ్ఛా జీవితం ప్రారంభించినప్పుడు 1953, ఏప్రెల్ మాసాంతానికి నా పనికి ఉత్కర్ష కలిగిస్తానని చె ఉన్నాను కాని మీతో నిజం చెప్పాలంటే నేను యిదివరకే నిర్ణయించుకున్న పని ముందుకు సాగక నూటికి యాభై వంతులు వెనుకపడింది. ఈ మిగిలిన యాభై వంతులతో రేపు మార్చి 24 వ తేదీ నుండి తీవ్రంగా యిరవైయొక్క దినములు పనిచేసి బృహత్తరమయిన ఆ మహాత్మ్యముయొక్క ఆగమనాన్ని త్వరితం చేస్తాను. భగవంతుడు అనుకూలిస్తే నాయొక్క

పని నాకు సంపూర్ణ సంతృప్తిగా నిర్వర్తింపబడితే యీ ఏప్రెల్ నెలాఖరుకి యీ సంకటస్థితికి అంతమయినా కలుగుతుంది లేదా పరిస్థితులు మెరుగై అందరికి మంచి కాలం ప్రారంభమయినా అవుతుంది.

ఒకవేళ అనుకున్నట్లుగా యీ ఏప్రెల్ నెలాఖరికి వాంఛించిన ఫలితాలు కలుగక పోయినట్లయితే తగిన అవసరం యింకా రాలేదని మీరు భావించవచ్చును. మీరూ మానవలోకమంతానూ యింకా కొంతకాలం మీశక్తి యున్నంత వరకు భరించి నిర్దేశించిన ఆ ఘడియకోసం సహనంతో వేచి ఉండవలసివస్తుంది. అది అకస్మాత్ గానూ అనుకొనని సమయమందునా రావచ్చును

అందువలన తరుచుగా నామౌన విరమణ వాయిదావేస్తున్నానని మీరు అధైర్యపడవద్దు. నిరాశచెందవద్దు మీరు అవమానాలను కష్టాలను ఎదుర్కోడానికి అప్రమత్తతతో జాగరూకులై దివ్యసత్యము శాశ్వత జయము పొందుతుందని విశ్వాసము, నమ్మకము కలిగియుండమని మిమ్మల్ని హెచ్చరిస్తున్నాను.—" అని బాబా చెప్పారు.

## డేరాడూన్‌లో దర్శన్ కార్యక్రమం :—

1953వ సంవత్సరం మార్చి 23వ తేదీనాడు బాబా డేరాడూన్‌లో బాబా భక్తుడయిన కిషన్‌సింగ్ యింటివద్ద అనేకమంది ప్రజలకు దర్శనం యిచ్చారు. ఆసందర్భంలో బాబా కొన్నిప్రవచనాలు చేసారు మానవకోటికి ఆధ్యాత్మికమయిన స్వేచ్ఛ, స్వేచ్ఛలోని తరహాలు, సౌఖ్యానికి మార్గం, సత్యంవైపు ప్రయాణం— వీటిని గురించి బాబా ప్రసంగం చేసారు

ఆరోజున అనేకమంది సిక్కులు బాబా దర్శనార్థం వచ్చారు. బాబా సన్నిధానంలో వారందరు ప్రేమలో ఓలలాడారు బాబా అందులో ఒకరివైపుకి తిరిగి సిక్కుల గురువయిన నానక్ చెప్పిన గీతము ఆయన కిష్టమయిన దొకటి పాడమన్నారు. అతడు పాడగా బాబా అందులోని ఆధ్యాత్మిక విశిష్టతను అర్థం చేసుకుని ప్రేమతో అనుసరించమన్నారు అప్పుడు బాబా యింకా యిలా చెప్పారు—

"మనం పెరిగి పెద్దవారయినప్పుడు పిల్లలవలె సాగలిగితే, అప్పుడు భగవంతుని ప్రేమించగలుగుతాము ఎందుచేతంటే భగవంతుని ప్రేమించుటకు మనము కోరికలు లేకుండా ఉండాలి భగవంతునితో ఏకమయిపోవాలన్న కోరికతప్ప యింకేకోరికా ఉండరాదు అందుచేత చిన్నపిల్లలవలె మనం సాగలిగితే అప్పుడు నిజాయితీతో దేవుని ప్రేమించగలుగుతాము. భగవంతుని అన్నిచోట్లా గాంచ గలుగుతాము ప్రథమంగా మనం నిజాయితీతో సత్యాన్వేషణ చేస్తూంటే మనకు కలిగే శాశ్వతానందాన్ని ఎవరూ ఆపలేరు, ఎవరూ మార్చలేరు, ఎవరూ దానిని చలింప జేయలేరు.

గొప్ప గొప్ప గురువులు నమ్రతతో ఆలోచించాలనీ వినయముతో పనులు చేయాలనీ మనకు నేర్పారు. భగవంతుని అవతారమయిన వానక్ నానక్‌దాసువలె ప్రవర్తించాము.

తరువాత ఒక ప్రేమికుడు "జీవితం అంటే ఏమిటి బాబా?" అని అడుగగా బాబా చిరునవ్వుతో యిలా సమాధానం చెప్పారు —

"జీవితం ఒక పెద్ద తమాషా, యిది ఎవడు తెలుసుకుంటాడో వానిని ప్రజలు అర్థం చేసుకోలేరు. ఇది ఎవడు తెలుసుకోలేడో వాడు భ్రాంతిలో పడిపోతాడు ఈ సమస్యగురించి రాత్రింబగళ్ళు ఆలోచించినా దాని పరిష్కారం ఆవగింజంతయినా చేసుకోలేడు ఎందుచేత? ప్రజలు జీవితాన్ని గంభీరంగా తీసుకుంటారు. దేవుని తేలికగా తీసుకుంటారు కానీ మనం దేవుని గంభీరంగాను, జీవితాన్నే తేలికగాను తీసుకోవాలి అప్పుడు మనం ఎల్లప్పుడూ ఒక్కలాగే ఉంటిమనీ అలా ఒక్కలాగే ఉండిపోతామనీ తెలుసుకుంటాము దేవుడు అసలు యీ తమాషా సృష్టించినది వాడేగా. ఈ జ్ఞానము హేతువాదం చేసినందువల్ల వచ్చిందికాదు ఇది అనుభవం మీద వచ్చిన జ్ఞానము"

ఒక మిలిటరీ కాడెట్, చిన్నవాడు, భక్తితో అడిగాడు బాబాను — "బాబా! మీరు ఎప్పుడు మౌన విరమణచేస్తారు?" వెంటనే బాబా అక్షరఫలకం మీద యిలా జవాబిచ్చేరు —

"ఒక్కటి మాత్రం నిశ్చయం. నేను నాశరీరాన్ని విడిచేయడానికి చాలా ముందే మాట్లాడతాను. నేను మౌన విరమణచేయడం చాలాకాలంగా ఎదురు

చూస్తున్న భగవంతుని మౌనవిరమణ రెండూ ఒక్కమాటే జరిగిపోతాయి భగవంతుడే సర్వస్వము అని తోపింపజేసి అందరి హృదయాలు కదలింపజేసే మాటయే అనంత శక్తితో కూడినటువంటి మాట అందుచే త్వరలోనే భగవంతుడు ఆమాటను నాచేత పలికింపజేస్తాడని ఆశిద్దాము. నేను యిప్పుడు మాట్లాడినట్లయితే ప్రజలను నాదగ్గరకు వచ్చి నాచుట్టూ చేరేలా చేయగలను కాని అది దేవుని ప్రయోజనమును సాధింపజాలదు దేవుని ఇచ్ఛప్రకారం జరుగుతుంది నేను త్వరలోనే మాట్లాడి ప్రపంచం ఆ మాట తెలుసుకునేలా చేస్తాను ”

బాబా తరువాత డిఫెన్సు ఎక్కౌంట్స్ శాఖ వారితో యిలా అన్నారు...—

“మన ఆలోచనలలోను. మన చేతలలోను నిజాయితీగా ఉండాలి. భగవంతుడు మనలను సంపూర్ణంగా నీతిగా జీవించమన్నాడు భగవంతుని ప్రేమిస్తున్నట్లు నటించేకంటె భగవంతునిలో నమ్మకం లేకపోవడమే మంచిది. మనం నీతిగా ఉన్నప్పుడే దైనందిన చర్యలలో కూడా మనం భగవంతుని కనుగొనగలము ఎందుచేతనంటే అప్పుడు మనం అనాసక్తంగా ఉంటాము కావున మీరు నీతిగా ఉండగలందులకు మీకు నా ప్రేమాశీస్సులను యిస్తున్నాను ”

హరిద్వార్ నుంచి ఆయుర్వేద కళాశాల నుంచి వచ్చిన విద్యార్థులలో ఒకడు భగవంతుని చూడాలని ఉంది అని అంటే బాబా ఒక పద్యం చెప్పారు-—

“ధనము కోసం దేవులాడతారు కొందరు
పేరు కోసం పాకులాడతారు కొందరు
అధికారం కోసం ఆరాటపడతారు కొందరు
కీర్తి కాంక్ష మరికొందరికి
అక్కర్లేదు ఎవరికీ దేవుడు
జీవితము ఒక తమాషా
అంతా ఒక నాటకం —”

అన్వేషణ అనే పదాన్ని విపులీకరిస్తూ బాబా చెప్పారు — “సంపూర్ణ హృదయంతో ఎవరు ఏది కోరి వెదకినా

అది వానికి లభిస్తుంది నీవు 'వెదికాను గాని కనపడలేదు' అంటే నీవు ఎలా వెదకాలో అలా వెదకలేదన్న మాట. నిజాయితీతో వెదకితే భగవంతుడే కనిపించి నప్పుడు, యింక అల్పమైన వస్తువులు, ప్రాపంచిక సంబంధమయిన వస్తువులు కోరితే ఎందుకురావు, అవి హృదయపూర్వకంగా కోరినప్పుడు ?

నీ జీవితాన్ని అరచేతుల్లో పెట్టుకుంటే నీవు దివ్యప్రేమ మార్గంలో ప్రవేశిస్తావు అని చెప్పబడింది భగవంతుని చూడాలి అంటే భగవంతునిగా అయిపోవాలి అని అర్థం అంటే ఒక చెమ "నేను ఏనుగను అవాలి' అన్నట్లుంది ఆ మాట "

అనేక మతాలవారు బాబా దర్శనానికి వచ్చారు అక్కడికి వచ్చినవారిలో ఒకడు బాబాను యిలా అడిగాడు భగవంతుడు యీ విశ్వాన్ని ఎందుకు సృష్టించాడు? అని అందుకు బాబా యిలా సమాధానం చెప్పారు

"భగవంతుడు యీ ప్రపంచాన్ని సృష్టించాడని ఎవరన్నారు ? మన ఊహతో అది మనం సృష్టించుకున్నదే భగవంతుడు సర్వోత్కృష్టుడు. సర్వస్వతంత్రుడు ఈ మాయా జగత్తు ఆయన సృజించాడంటే ఆయన అనంతస్థితినుంచి క్రిందికి లాగినవారమవుతాము దీనికంతకీ అతీతుడు అయన మన దినచర్యలో దైనందిన జీవితంలో కూడా మనలో ఆయనను కనుగొనినపుడే మన సందేహాలన్నీ మాయమవుతాయి అప్పుడు మనం దేవుని తెలుసుకుంటాము. ఇంక ఆయనను గురించి మనం ఆలోచించనక్కరలేదు. నీవు ఎప్పుడయినా నీవు స్త్రీవో పురుషుడవో ఆలోచించ వలసి ఉంటుందా ? నీ వెవరవో నీకు తెలుసు కనుక ఆలోచించవలసిన అవసరం లేదు అలాగే మనం భగవంతుడు అయినప్పుడు ఈ పరమ జ్ఞానాన్ని పొంది అనుభవించే వరకు యిదంతా వట్టిమాటలు, హేతువాదము, తర్కము, ఊహ అన్నమాట నీకు నాప్రేమను యిస్తున్నాను " అని చెప్పారు బాబా.

ఒకడు కొంచెం ఆతురతతో "భగవంతుని ఏవిధంగా ప్రేమించాలి ?" అని అడిగితే బాబా___

"దేవుని ఎలా ప్రేమించాలి ? అసలు దేనినయినా ఎలాగ ప్రేమించడం ? అందమయిన ఆడపిల్లతో ఒకడు ప్రేమలో పడితే అప్పుడు ఏం జరుగుతుంది? వాడికి పద్ధతులు, నియమాలు, నిబంధనలు ఏమీ ఉండవు అవమానం కలుగుతుం

దేమో అని ఆలోచింపడు ప్రజలు వానిని పిచ్చివాడన్నా వాడేమీ ఖాతరు చేయడు. ప్రియతముని ఎలాగయినా ఏ ఉపాయం చేతయినా పొందాలనే అభిప్రాయంలో మునిగిపోవాలి. నీ ప్రాణానికయినా తెగించి దేవునితో ఐక్యం సాధించి తీరాలని నీ హృదయంలో నిశ్చయించుకుంటే, ప్రపంచం అంతా ఎగతాళి చేసినాసరే అని సిద్ధపడితే, అప్పుడు నీవు బహుశా దివ్యప్రేమ మార్గంలో ప్రవేశించావని అనుకో వచ్చునేమో ''

దేవుని ప్రేమించవలసిన రీతిగా ఎలా ప్రేమించాలో ఒక ప్రేమిక బృందానికి బాబా వివరించి చెప్పారు

''మొదట్లోనే అసలు పదార్థానికి ఊహ ఒక తిరుగుడు యిచ్చింది. ఆ విధంగా ఛాయకి ప్రాధాన్యత యిచ్చింది మాయలో పడిపోయి మన ఆత్మను - నిత్యము స్వేచ్ఛగా ఉన్నదానిని – బందింపజేసుకుంటున్నాము అనంతానందము పొందినా, మనము అన్నీ - దుఃఖము, ఆందోళన, సందేహము, విఫలత, నిస్సహాయత– అనుభవించాలి.

ఒక్క మెరుపులో అసలయిన జ్ఞానం కలిగినపుడు మనం కనిపిస్తున్నది కామని మనం నిజంగా అనంతుడయిన దేవుడే అని తెలిసినపుడు, ఆ విచారాలన్నీ పోతాయి ఎందుచేతంటే వాస్తవంలో సుఖమూలేదు, దుఃఖమూలేదు ఈ అజ్ఞానాన్ని పోగొట్టుకొని, అసలు పదార్థం – సత్యము యొక్క విలువ తెలుసుకోవాలంటే, భగవంతుని అనుభూతి కలగాలి ఆ భగవంతుడే మన జీవితాలకి శ్వాస, ప్రాణము, అయినా ఆ భగవంతుని నిజాయితీగల ప్రేమద్వారానే అనుభవించగలము.

ఆయనను మనము మౌనముగాను నిజాయితీతోను మన ప్రతిదిన కార్య ములలో కూడా ప్రేమించాలి. భుజించేటప్పుడు, త్రాగేటప్పుడు, మాటలాడేటప్పుడు మన పనులన్నీ చేసేటప్పుడు ఎవరికీ తెలియకుండానే నిరంతరము దేవుని ప్రేమించ గలము భగవంతుని దర్శించినపుడు ఏ అనంతానందము శాంతి మనకు లభించునో మీకు తెలియదు అనుభవం లేమి గనుక ఎప్పుడో మీరు భగవంతుని ప్రేమించవలసిన రీతిగా ప్రేమించుటకు మీ అందరకు నా ప్రేమ నిచ్చుచున్నాను.''

భగవంతునిలో ప్రేమ నిమగ్నమయి యున్నవారి మనస్థితి ఎట్లుండునో బాబా చెప్పారు —

“భగవత్ప్రేమికులను మర్ద్ - ఎ - ఖుదా అని అంటారు భగవంతుని ప్రేమించిన వానికి ఉండే ఏకైక వాంఛ భగవంతునితో ఐక్యము పొందుటయే ‘నేను నిన్ను దర్శించాలి ప్రియతమా!’ అనేది అతని నిరంతర ఆక్రోశము. పరిస్థితులు యితనినేమీ చేయజాలవు ప్రజలు అతనిని పిచ్చివాడని అనవచ్చును, చెప్పలేనటువంటి కష్టాలు పడేలా అతన్ని చేయవచ్చును. కాని అతని జీవితధ్యేయము భగవంతుని చూడాలనేదే ”

వారిపని వారు చేసుకుంటూ ప్రతినిత్యమూ ఎవరయితే భగవంతుని ప్రేమలో నిమగ్నులై అహోరాత్రులు అలమటిస్తూ ఉంటారో వారిప్రేమ, మర్ద్-ఎ-ఖుదా అని పిలువబడే వారియొక్క ప్రేమ అంత గొప్పది అని బాబా చెప్పారు వారిని ఏదీ బంధించజాలదు వారు అన్ని పనులూ చేస్తున్నా ఏమనీ చేయనట్లే. (కర్మణ్యకర్మయః పశ్యేత్ అని గీతాచార్యుడు చెప్పినవాడు యిటువంటివాడే)

మనోవేదన అనుభవిస్తూ అతని నిరాడంబరత్వానికి ప్రజలు చేసే అవహేళనలను సహిస్తూ ఉండే ఒకనితో బాబా ఏమన్నారో చూడండి —

“నీకు దేవుడు, ఆయన మార్గము తెలియవు ప్రజలు నిజాయితీ లేకుండా ప్రవర్తిస్తే, మనకు ప్రజలు కష్టాలు తెచ్చిపెడితే, వారు మనలను మోసంచేస్తే. యిన్ని చేసినా మనము నీతి విడిచిపెట్టకుండా ఉండగలిగితే మనం చాలా అదృష్టవంతులం అన్నమాట. ఎందుచేతనంటే యీ మోసకారులు, మనకు శత్రువులులా కనబడేవారు నిజంగా మన స్నేహితులే వారు మన పాపాలను మన బలహీనతలను కడిగివేస్తారు భగవంతుని చేరేందుకు మన మార్గం సుగమం చేస్తారు వారు మనలను మోసగించరు వారు మనకు సహాయమే చేసినవారవుతారు వారు వారినే మోసగించుకుంటారు ” అని బాబా చెప్పారు

మార్చి 23 వ తేదీన బాబా ప్రజలకు యిచ్చిన దర్శనం సాధువులకు భక్తులకు ఒక గొప్ప ఆధ్యాత్మికమయిన విందుగా భావించబడింది. మార్చి నెలాఖరున బాబా మండలితో బయలుదేరి కాశ్మీరుకి హిమాలయ ప్రాంతాలకి వెళ్ళారు.

ఏప్రెల్ (1953) లో బాబా ప్రేమికుడయిన వి వి నారాయణరావుకి ఎరచ్‌చేత బాబా ఒక ఉత్తరం వ్రాయించారు. అందులో నారాయణరావు కుమారుడయిన జగత్‌కుమారుని బాబా చెప్పిన ప్రకారం చేయమని బాబా జ్ఞాపకం చేసారు.

అప్పుడు నారాయణరావు తూర్పుగోదావరి జిల్లాలో అమలాపురంలో డిప్యూటీ కలెక్టరుగా ఉండేవాడు. ఆ సమయంలోనే అతనికి బాబా మరియొక ఉత్తరం వ్రాయిస్తూ ఆ జిల్లాలో ఉన్న బాలయోగుల గురించిన వివరాలన్నీ సేకరించి వ్రాయమని పురమాయించారు. ఈ విధంగా నారాయణరావుచేత బాలయోగుల భోగట్టా అంతా తెప్పించుకున్నారు బాబా.

దిహైయెస్ట్ ఆఫ్ ది హై (సర్వోన్నతుడు) అని బాబా యిచ్చిన సందేశానికి తెలుగు తర్జుమా అచ్చొత్తించి అది విరివిగా పంచిపెట్టించాలని బాబా కుటుంబశాస్త్రికి వ్రాయించారు (అక్టోబరు, 1953 లో).

బాబా 1953 వ సం॥ ఏప్రెల్ 5 వ తేదీన ఒక సర్క్యులర్ లేఖను (10 వ నెంబరు) డేరాడూన్ నుంచి వారి ప్రేమికులందరికీ పంపించారు. దీనిని పురస్కరించుకొని బాబా తరువాత జూలై 10 వ తేదీ మౌనవార్షికోత్సవం నాటికోసం ఒక సందేశం యిచ్చారు.

## బాబా సందేశము :—

"ఏప్రెల్ 5 వ తేదీనాటి సర్క్యులర్ ఎవరికయితే వచ్చిందో లేక అందు లోని సమాచారం ఎవరు తెప్పించుకున్నారో వారంతా వారి హృదయపు లోతులనుండి జూలై 10 (1953) వ తేదీనాడు తెల్లవారుజామున 4 గంటల నుండి 5 గంటల వరకు ఒక గంటసేపు భగవంతుని నామము పైకి వినిపించేలా సంపూర్ణ హృదయంతో ఉచ్చరించాలి. హిందువులు "పరబ్రహ్మ పరమాత్మ" అని, మహమ్మదీయులు "అల్లా – హు - అక్బర్" అని, పార్సీలు "అహూర్ మజ్దా" అని, ఇరానీలు "యెజ్దాన్" అని, క్రైస్తవులు, "గాడ్ ఆల్‌మైటీ" అని చెప్పాలి.

## బాబాదాస్ :—

ఈ శిష్యుని నడతగురించి బాబా అనేకమారులు అతనిని మందలించారు మితిమీరి అతడు అవిధేయుడుగా నుండుటచే బాబా అతనితో సంబంధము తెగతెంపులు చేసుకున్నానని ఏప్రెల్ నెల 10 వ తేదీన ప్రకటించారు. అనేకమారులు అతని యొక్క తప్పులను బాబా మన్నించారు. ఇప్పుడు కూడా అందరివలెనే అతనిని కూడా బాబా ప్రేమిస్తున్నారు. అందుచేత అతడు చేసిన అన్ని తప్పులూ బాబా క్షమించారు

బాబా ఆజ్ఞ లేకుండా అతడు బాబా పేరుతో బాబా కార్యములకై అప్పుచేసాడు అయినా అపార కరుణామూర్తి అయిన బాబా ఆ అప్పులు తీర్చే బాధ్యత వహించారు. ఇటీవల మరి ఒక్కమనిషి తాను బాధ్యతారహితంగా ప్రవర్తింపబట్టి బాబా తమ ప్రేమికులందరకు హెచ్చరిస్తూ అతనితో సంబంధము పూర్తిగా వదులుకున్నానని ప్రకటించారు. ఇకమీదట అతనితో వ్యవహారము కలిగించుకుంటే అది అలా కలిగించుకున్నవారి బాధ్యతమీదనే అని అందరూ తెలుసుకోవాలని బాబా కోరుతున్నారు.

1953, మే మాసం మొదటివారం బాబా యిలా చెప్పారు—

"అనంత పరమాత్మునిగా దేవుని మనం ప్రేమించినపుడు మనలో మాత్రంగాక అందరిలోను ఉన్న ఆత్మగా ఆయనను మనం ప్రేమించినది మనలనే గాని దేవుని కాదని మనం తెలుసుకుంటాము"

మే 15 వ తేదీనుండి సెప్టెంబరు (1953) నెలాఖరువరకు బాబా ఎవరినీ ఏకారణం చేత కూడా ఆయనకి ఉత్తరాలు వ్రాయవద్దని ప్రకటించారు.

మే నెలారంభంలో బాబా మసూరీలో ఉంటూ నాగపూర్‌నుంచి చక్రధర్ దేశ్‌ముఖ్‌ను వచ్చి తమ వద్ద రెండు దినాలుండమని పిలిచారు తరువాత మరల దేరాడూన్ వెళ్ళి రాజపూర్ రోడ్డులోనే బసచేసారు మేనెల 3 వ తేదీన బాబా చాలా మంది బీదవారికి విడివిడిగా నమస్కరించి వారిని సత్కరించారు కొందరు స్త్రీలకు జీవనస్మృత్తి కల్పించడానికి బాబా ఉషా కుట్టుయంత్రాలను బహూకరించారు. ఆరోజున మొత్తం ఆరువేల రూపాయిలు ఖర్చుపెట్టారు ఈ డబ్బు బొంబాయినుంచి బాబాకు కొందరు ప్రేమికులు పంపిన దానిలోది. ఇంకా మిగిలితే అది బాబా మస్తుల అన్వేషణ కోసం జూన్ 6 వ తేదీన బయలుదేరి చేసిన పర్యటనలో ఖర్చుపెట్టారు. ఈ పర్యటనలో బాబా తమ మండలిలో ఏడుగురిని తమతో తీసుకువెళ్ళారు. ఆ యేడుగురు ఎవరెవరంటే—ఎరచ్, జగన్నాథ్, దేశ్‌ముఖ్, కుమార్, హెలెన్, అలోబా, బైదుల్ అనేవారు వీరంతా కలిసి రెండు మోటారుకార్లలో బయలుదేరి వెళ్ళారు. బాబా రిషికేశ్ వెళ్ళి అక్కడ భజనాశ్రమంలో నీలకంఠ్‌వాలా మస్తును సాంగత్యం చేసారు తరువాత బాబా టర్కీ అనే స్థలంలో కవీర్‌వాలెసేవిర్ అను సాధువు యొక్క దర్గాను చూసారు

మే నెల 6 వ తేదీనే రిషీకేష్ నుంచి బాబా బిజ్‌నోర్‌కి కారులో బయలు దేరి ప్రయాణం చేస్తున్నారు. అది ఎడారి ప్రదేశం ఉష్ణోగ్రత ఎక్కువగా ఉంది. 115 డిగ్రీల వరకూ వేడి ఉంది మంచినీళ్ళు కూడా దొరకవు. ఇసుకదారిమీద కర్ర పలకలు పరిచి రోడ్డుగా తయారుచేసారు. బాబా కారు వడిగా వెళ్తూంటే కారు కర్ర పలకల మీదనుంచి చక్రాలు జారి యిసుకలో కూరుకుపోయాయి. అది మిట్టమధ్యాహ్న సమయం. రెండుగంటలు కష్టపడ్డారు గాని మండలి కారుని మరల కర్రపలకల మీదకి ఎక్కించలేకపోయారు మండలికి దాహం వేస్తోంది ఒక్క చుక్క మంచి నీళ్ళయినాలేవు వారు త్రాగడానికి క్రింద ఇసుక వేడికి కాళ్ళు కాలిపోతున్నాయి. ఎటువెళ్ళినా కొన్నిమైళ్ళు నిర్జనమైన ఎడారిప్రదేశం దేరాడూన్ అయితే చల్లని ప్రదేశం ఇప్పుడు అగ్నిగుండంలో ఉన్నట్లుంది.

ఇలా రెండు గంటలు వృధాశ్రమ అయిన తరువాత ఎవరో బాటసారులు ఆదారిన వెళ్తున్నారు. వారి సహాయంతో కారు రోడ్డుపైకి ఎక్కించారు ఎలాగయితేనేం ఎట్టకేలకు గంగానది ఒడ్డుకు చేరుకున్నారు ఆ నది చూడగానే వాళ్ళకి పోయిన ప్రాణాలు తిరిగి వచ్చాయి. కారుతో నది దాటడానికి అక్కడ ఉన్న పడవలవారితో మాట్లాడారు. వాళ్ళు అందుకు ఒప్పుకున్నారు కానీ బాబా బిజనోర్ యింక వెళ్ళనని చెప్పి ముజఫర్‌నగర్‌కి ప్రయాణమయారు అక్కడికి చేరి కొంతసేపు విశ్రమించారు తరువాత మస్తు అన్వేషణకై రెండు కారులమీద బయలుదేరారు. ముజఫర్‌నగర్ సమీపంలో ఘర్‌త్వాల్ అనే గ్రామానికి బాబా బయలుదేరి వెళ్తున్నారు కొంతసేపయే సరికి వారు తప్పుదారిన వెళ్తున్నట్లు గ్రహించారు అది రోడ్డు కానేకాదు. ఎద్దుబళ్ళు కూడా వెళ్ళడానికి వీలులేదు ఆదారివెంట. ఎలాగయితేనేం కొంతసేపు కష్టంతో ప్రయాణంచేసి ఘర్‌త్వాల్ చేరుకున్నారు. ఆ ఊళ్ళో ఒక సాధు సత్పురుషుని బాబా దర్శించి అతనికి నమస్కరించారు వచ్చిన దారికాక మంచిరోడ్డుని ముజఫర్‌నగర్ వస్తూ దారిలో ఒక మహమ్మదీయ అల్లియా స్త్రీని బాబా కలుసుకొని ఆమెకు నమస్కరించారు. రాత్రికి ముజఫర్‌నగర్ తిరిగి చేరారు ముజఫర్‌నగర్‌కి వెళ్తూ బాబా రోడ్డులో ఒక చెట్టుక్రింద ఒక దిగంబరుడైన మస్తుని కలుసుకొని వందనం చేసారు.

జూన్ 7 వ తేదీ ఉదయం షహారన్‌పూర్‌లో కాలుమియాఁ అనే అతనిని కలిసారు. ఇతనికి ఖురాను చదవడం మిక్కిలి ప్రీతి. తరువాత కురుక్షేత్రం వెళ్ళి

అక్కడ కరాదాదాసు సాంగత్యం చేసారు మరునాడు 8 వ తేదీ ఉదయం ఖానాలోని సోమేశ్వరానంద్ అనే ఒక జైనసాధువును కలుసుకున్నారు. ఈ సాధువు పసుపు పచ్చని వస్త్రాలు ధరిస్తాడు ఎప్పుడూ ఆనంద నిమగ్నుడై ఉంటాడు. తరువాత ఒంటి బాబా అనే అతనిని సాంగత్యం చేసారు అతడు బాబాను సందర్శించగానే సాఫీ అని గట్టిగా అరిచాడు సాఫీ అంటే ప్రేమామృతం చిలికేవాడని అర్థము. బాబా అతనికి నమస్కారం చేసిన వెంటనే అక్కడనుంచి బయలుదేరి వెళ్ళిపోయాడు. అక్కడి నుంచి బాబా నుప్ అనే ఊరికి పోయి అక్కడ తోతాపురి అనే వృద్ధుని సాంగత్యం చేసారు. తోతాపురి నూరేళ్ళు నిండిన దిగంబరుడయిన మస్తు అతడు బాబాను చూడగానే నాదేవుడు వచ్చాడని కేకవేసాడు బాబా అతనితో ఆనందంగా ఒక అరగంట గడిపారు. అక్కడనుంచి బాబా లూధియానాకి వెళ్ళారు అక్కడ దండిస్వామి అనునొక సాధువును దర్శించారు అతడు ఎవరినీ తన పాదాలను అంటనీయడు. దరికి రానీయడు అందుచేత బాబా దూరముగా నుండి అతనికి ప్రణామం చేసారు.

9 వ తేదీన ఉదయాన్నే బయలుదేరి బాబా పర్యటన కొనసాగిస్తూ ఒక చోట దిగంబరిగా దుమ్ములో పొర్లాడే ఒక మహమ్మదీయ మస్తును సాంగత్యం చేసారు. అక్కడనుండి ఫిల్లోరు అనే గ్రామంలో మస్తానీమాయి అనే స్త్రీని చూసి షిక్ఖాటా అనే యింకో ఊరు చేరారు అక్కడ మున్నీలాల్ అనునొకనితో పరిచయం చేసుకున్నారు అతడొక మేడలోనుండి క్రిందికివచ్చి నీడలో కూర్చుండెను. బాబా మున్నీలాల్‌కు నమస్కరించగా అతడు “నాకాళ్ళు తెగ్గొట్టుకోవాలా ?” అని అడిగాడు. ఆ సాయంకాలము చింతాభగత్ అనే మస్తుతో చాలాసేపు గడిపారు. అతడొక గదిలో దిగంబరిగా పరుండియుండెను ఆమస్తు యిష్టులు అతనికి ఒక బాలునివలె సంరక్షణ చేస్తున్నారు అతనికి ఆహారపదార్థాలు తెచ్చిపెడుతూ అతనివద్ద కూర్చుని పాటలుపాడుతూ ఉండేవారు. అతడు ప్రశాంతముగా భగవత్ప్రేమలో మత్తిల్లినట్లు కనిపించే నేత్రయుగ్మముతో నుండెను

తరువాత బాబా మండలితో సంగత్‌పురం వెళ్ళి అక్కడ మస్తు నూరియా బాబాను చూసారు బాబా వెళ్ళేసరికి అతడు విశ్రాంతి తీసుకుంటున్నాడు బాబా అతని విశ్రాంతికి భంగం చేసే ఉద్దేశం లేక బయటకు వెళ్ళి ఒక చెట్టుక్రింద కూర్చుని వేచి యున్నారు. నూరియా బాబా ఒక చిన్నగదిలో నిద్రపోతున్నాడు కొంతసేపటికి లేచి

బయటకు తొంగి చూసాడు అప్పుడు బాబా వెళ్ళి అతనిని కలుసుకున్నారు మౌనంతో బాబా అతనికేమి చెప్పారో మూకిదూ బాబా గ్రహించాడు అప్పుడు వారిరువురు మౌనంగా మాట్లాడుకొనిన ప్రకారం బాబా ఏడు మలుపులు కలిగిన ఒక చిక్కు మార్గం నుంచి బయటకు వచ్చారు.

ఆ సాయంకాలానికి బాబా కపూర్‌తలా చేరారు అక్కడ బఖియాజెట్టి బుధియారాణి అనే యిద్దరు మస్తానీలను బాబా కలుసుకున్నారు తరువాత రమేషా హసు, కాశీరామ్ బావాను బాబా సాంగత్యం చేసారు రాత్రికి తిరిగి బాబా ఫిల్లౌరు చేరుకున్నారు అక్కడ ఎక్కువశక్తి కలిగిన ఒక మస్తానీ మాయిని కలుసుకున్నారు. ఆమె బాబా మండలి వారందరికి తలొక సిగరెట్టు యిచ్చింది. ఎవరయినా మస్తులు యిచ్చే ఏ పదార్థమునయినా వద్దనకుండా స్వీకరించాలి ఈ మస్తానీ మంచి రాజఠీవితోను గంభీరమయిన వదనముతోను ఉంటుంది ఎవరయినా ఆమె చెప్పే మాటలు శాసనంలా పాటిస్తారు ఆమె సాధారణంగా రోడ్డుప్రక్కన ఒక మంచము పై కూర్చుని ఉంటుంది ఆమె మీద బట్టలున్నదీ లేనిదీ కూడా ఆమె కక్కరలేదు ఆమె ఒక కఫ్నీ తొడుగుకొని ఉంటుంది బాబా ఆమె కఫ్నీ చివర ఒక చిన్నముడి వేసారు. ఆమె బాబాను చల్లని మంచినీళ్ళు యిమ్మని కోరింది. బాబా ఆమెకు మంచినీళ్ళు తెచ్చి యిచ్చారు అక్కడి ప్రజలందరకు ఆమె యెడల మిక్కిలి గౌరవం ఉంది. ఆమెకు యిష్టంలేనిపని ఎవరూ చేయరు ఎందుకు అని ప్రశ్నించకుండా ఆమె చెప్పినట్లు సాధారణంగా అందరూ చేస్తారు

అక్కడినుంచి బాబా మండలితో హరిద్వార్‌కి ప్రయాణం చేసారు ఆరాత్రి శిష్యులందరినీ మెలకువగా ఉండాలని నిద్రపోరాదని బాబా ఆదేశించారు ఈ తిరుగుప్రయాణంలో కారుటైరు ఒకదానికి చిల్లుపడినందున ప్రయాణం ఆలస్యమయింది అరోజు జూన్ 10 వ తేదీ. ఆ తెల్లవారుజామున హరిద్వార్ వెళ్ళేదారిలో ఒక తోటలో బాబా 'కంకాళమస్తు'ను చూద్దామని వెళ్ళగా వారిని చూడగానే ఆమస్తు ఎదురువచ్చి స్వాగతం చెప్పి తీసుకువెళ్ళాడు కంకాళమస్తు శరీరం ఎప్పుడూ ఎండలో ఎండుతున్నందువల్ల రాగిలాగ ఎఱ్ఱగా మెరుస్తోంది తరువాత యీ మస్తుతో బాబా ఏకాంతంగా కూర్చుని ఆధ్యాత్మిక సాంగత్యం చేసారు అతడు కట్టించుకున్న పళ్ళు ఉపయోగిస్తున్నప్పటి నుంచి అతనికి ఆకలి ఎక్కువయిందని బాబాకు చెప్పాడు. ఆ సమయంలో దేశ్‌ముఖ్ యీ దృశ్యాన్ని సినీకెమేరాతో ఫిలిం తీసాడు ఆమస్తు

హిందీలో మాట్లాడుతూ దధీచి చరిత్రము, వృత్రాసురవధ వృత్తాంతము బాబాకు చెప్పాడు. హరిద్వార్‌లో ఏకంబల్‌వాలా మస్తును బాబా అతనికిచ్చిన మాట ప్రకారం దర్శనం చేసారు.

6 వ తేదీన బయలుదేరి ప్రయాణాలుచేసి చేసి తమ మండలితో జూన్ 10 వ తేదీ సాయంకాలం 4 గంటలకి బాబా తిరిగి దేరాడూన్ చేరారు.

జూలై (1953) మాసంలో బాబా దేరాడూన్‌లోనే ఉన్నారు అప్పుడు నిడదవోలునుంచి కుటుంబశాస్త్రి అనే ప్రేమికుడు బాబాను చూడడానికి దేరాడూన్ వెళ్ళాడు. అప్పుడు బాబా కుటుంబశాస్త్రి దివ్యజ్ఞాన సమాజానికి చేసిన సేవ గురించి చెప్తూ "ఇన్ని యేళ్ళుగా నాసమాజానికే యితడు పనిచేస్తూ వచ్చాడు ఇప్పుడు నన్ను కనుగొన్నాడు. గనుక నాకు అంటిపెట్టుకుని ఉన్నాడు" అన్నారు

## హెచ్. పి. బి :—

నా సమాజానికి అన్నమాటలోని అంతరార్థము గురించి ఆలోచిస్తే బాబా దివ్యజ్ఞాన సమాజస్థాపకులలో ఒకరగు మాడమ్ హెలెనా పెట్రోవ్నా బ్లావట్స్కీగా యింతకుముందు జన్మించి యున్నారని యీ క్రింది వివరాల వల్ల తెలుస్తోంది ఈమె ఒక రష్యన్ వనిత 1831 వ సంవత్సరములో ఆగష్టు 11 వ తేదీన రష్యాలోపుట్టి అమెరికాలో కర్నల్ ఆల్కాట్ అనే మహనీయునితో కలిసి 1875 వ సంవత్సరంలో నవంబరు 17 వ తేదీన దివ్యజ్ఞాన సమాజాన్ని స్థాపించింది. ఈమె అఖండమయిన దివ్యజ్ఞాన సంపన్నురాలు అనేకమయిన అద్భుతశక్తులు కలిగియుండెను. ఆమె 1879 లో ది థియాసఫిస్టు (దివ్యజ్ఞాని) అను మాసపత్రికను ప్రారంభించెను. ఈమె పేరును సంక్షిప్త పరచి హెచ్ పి. బి. అని సాంకేతికంగా ఆమెను పిలిచేవారు. హె పి. బి అణిమాది అష్టసిద్ధులు కలిగిన మహనీయురాలు చూపు మాత్రం చేత ఆమె ఎవరినయినా వశపరచుకొను శక్తి భయంకరమగు ఆమె కళ్ళలో నుండెను.

ప్రపంచానికి ఆధ్యాత్మిక కేంద్రం భారతావని యని ఆమె గ్రహించి దివ్యజ్ఞాన సమాజానికి ముఖ్యస్థానమును దక్షిణ భారతంలో చెన్నపురి సమీపాన అడయారు నదీతీరాన 1882 వ సంవత్సరంలో విశాలమయిన స్థలమును కొని అక్కడ కార్యస్థానములు నెలకొల్పెను ఈమె ప్రపంచమంతయు పర్యటించెను.

శ్వేత సోదర బృందమను సరళ సంఘమునందు మహాత్ములలో మాస్టర్ మోర్య యీమెకు గురువు.

ఆ మహాత్ముడు హిమాలయములలో ఉనికి ఏర్పాటు చేసుకొనినందున 1882 సెప్టెంబరులో ఆమెకు శరీర రుగ్మత కలిగినందున ఆమెను సిక్కిం రమ్మని అక్కడ విశ్రాంతి తీసుకొనమనెను 1885 సం॥లో ఆమెకు జబ్బు తీవ్రమయి నందున అడయారులో మాస్టర్ (సద్గురు) మోర్యా ఆమెకు దర్శన మిచ్చి ఆమెకు శరీరారోగ్యము కలుగజేసి ఆమె యింకను జీవించాలని కోరుటచే ఆమె జీవితకాల మును మరికొంత పొడిగించి ఆమె పనిని పూర్తిచేయమని ఆశీర్వదించి తిరోహితు డయ్యెను. అటువంటి సంపూర్ణ సద్గురువు తలుచుకుంటే చేయలేని దేమున్నది? ఆ సంవత్సరంలోనే ఆమె "ది సీక్రెట్ డాక్ట్రిన్" (గుహ్యసిద్ధాంతము) అనే అపూర్వగ్రంథము రచించి రెండు సంపుటములలో ప్రచురించెను తన జీవిత కాలంలో ఆమె యింకను "కీ టు థియాసఫీ" (దివ్యజ్ఞానానికి తాళం చెవి) 'వాయిస్ ఆఫ్ సైలెన్స్' (మౌనవాణి) 'ఐసిస్ అన్ వీల్డ్' (బహిర్గత మొనర్చిన రహస్య జ్ఞానము) అను గ్రంథములు ఆమె రచించిన వాటిలో ముఖ్యమయినవి. తాను వచ్చిన పని పూర్తియగుటచే దివ్యజ్ఞాన సమాజాన్ని ఆల్కాట్, డా॥ అనీబిసెంటు చేతులలో పెట్టి 1891 సం॥ మేనెల 8 వ తేదీన నిర్యాణము చెందెను తరువాతనే 1894 ఫిబ్రవరి 25వ తేదీన మెహెర్ బాబా జననం పొందారు

హెచ్. పి. బి. తాను క్రితం జన్మలో ఛత్రపతి శివాజీ మహారాజ్‌గా జన్మించియుంటినని చెప్పెనని ది థియాసఫిస్ట్ అనే పత్రికలో ప్రచురితమయ్యెను.

మెహర్‌బాబా అనేకమారులు పూర్వజన్మలో తాము శివాజీనని తమ శిష్యులతో చెప్పియున్నారు 1952 సం॥లో తా॥ సూ॥ కుటుంబశాస్త్రి బాబా సతారా మకాంలో ఉండగా అక్కడికి వారి దర్శనార్థమేగినపుడు అనేకమంది శిష్యులు చూస్తూండగా వారున్న బంగళావైపుకి తీసికొనివెళ్ళి అక్కడ కనిపిస్తున్న కొండలు చూపెంచి "ఇవన్నీ నేను యిదివరలో తిరిగి చూసాను, నా పూర్వజన్మలో" అని సైగలతో చెప్పారు అబ్దుల్‌గనీ మున్సిఫ్ అను శిష్యునితో యింతకన్నా స్పష్టంగా బాబా "నేను పూర్వం ఒక జన్మలో శివాజీ మహరాజ్‌ను" అని చెప్పిన సంగతి అతడు తాను బాబాను గురించి రచించిన గ్రంథములో పేర్కొనెను. బాబా ప్రేమి

కులకు యిది సువిదితము పైన దివ్యజ్ఞాన సమాజము గురించి "నా సమాజము" అని బాబా అన్నమాటకు యిప్పుడు అర్థము మనకు సుబోధకము అవుతోంది బాబా వారి (మెర్వాన్) క్రితం జన్మలో హెచ్. పి. బి గా జన్మించారని తెల్లమవుతోంది

వారి పూర్వజన్మ వృత్తాంతము గనుక, పైన వ్రాసిన జీవితాంశములు గాక హెచ్. పి. బి. తన జీవితములో చేసిన అద్భుతకార్యములు గురించి ప్రస్తావించుట సమంజసమనిపిస్తోంది ఆమె చేసిన పనులు అనేక రకాలు వాటిని యిట్లు విభజింప వచ్చును

(1) తలుచుకున్న ప్రశ్నలకు సరియయిన జవాబులిచ్చుట.

(2) రోగములు కుదుర్చుట.

(3) పృచ్ఛకులకు, సంశయగ్రస్తులకు, జీవితంలోని రహస్యములను తెలియ జేయుట.

(4) వస్తువుల యొక్కయు, మనుష్యుల యొక్కయు బరువును, హెచ్చించుట, తగ్గించుట

(5) ఎన్నడూ ఎరుగనివారి వద్దనుండి జాబులు రప్పించుట

(6) ప్రశ్నలు వేస్తే వాటి సమాధానాలు ఎక్కడో మారుమూల ఉన్న కాగితాలలో వ్రాయబడి యుండుట.

(7) ఎవరికీ చెందని క్రొత్త వస్తువులు ప్రత్యక్షమగుట.

(8) తలచినపుడు గాలిలో సంగీతపు స్వరాలు వినిపింపజేయుట.

(9) కాలంకాని కాలంలో కావాలంటే అపురూపమైన పళ్ళు పువ్వులు తెప్పించుట

(10) మనసులోని ఆలోచనలు చెప్పుట

(11) పరవశీకరణ శక్తిని జూపుట.

(12) త్రికాల వేదిత్వము - జరిగినదానిని, జరుగుచున్నదానిని, జరుగబోవు దానిని చెప్పుట.

(13) సమానులతోగాని అధికులతోగాని మానసిక మౌన సంభాషణ.

(14) అంతర్వాణితో దైవప్రకృతిలోని జ్ఞానరాశిలోనుండి ఆత్మద్వారా తెలిసి కొనిన సంగతులు ఉపయోగించి పనులు చేయుట.

ఆమెను ఆమె గురువులు (మహాత్ములు) కంటికి రెప్పవలె కాపాడుతూ ఆమె జీవితమందలి అనేక ప్రాణాపాయ స్థితులనుండి కాపాడారు ఆమెను గురించి ఆమె గురువు (మాస్టర్ మోర్య) వ్రాసిన ఉత్తరంలో యీ విధంగా వ్రాసారు —

"మనుష్యుడు — మా యుద్యమమును సేవించుటకు జీవితము ధారపోసిన వ్యక్తికి మేము చేయగల కనీసపు ప్రత్యుపకారము అవసరమైనపుడు ఆమె ఆరోగ్యమును కాపాడుటయే— హెచ్.పి.బి యెడల (మేము) కృతఘ్నులమై యుండుట కంటె దివ్యజ్ఞాన సమాజము నశించిన మేలు — M"

తన గురుదేవుడు తనకు ఒక్కరోజు దర్శనము యివ్వకున్నను ఆమె హృదయము తల్లడిల్లిపోయేది. ఆమె అటువంటి గురుసేవా పరాయణురాలు. బాబా యొక్క యీ అవతారమున సేవాతత్పరత (**Mastery in servitude**) పరాకాష్ఠ నొంది పరిపూర్ణత్వము చెందింది

1953 జూలై 10 వ తేదీనాటికి బాబా మౌనము ప్రారంభించి 28 సంవత్సరాలు నిండాయి తెల్లవారితే 10 వ తేదీ ఆ తెల్లవారుజామున 4 గంటలు మొదలు 5 గంటలు వరకు ఒక గంటసేపు హృదయపూర్వకంగా బాబా ప్రేమికులయిన ప్రతివారూ తమ హృదయపులోతులనుండి పైకి వినబడునట్లు ఏమతానికి చెందిన వారు ఆ మతానికి సంబంధించిన భగవన్నామం ఉచ్చరించాలన్నారు బాబా. హిందువులు "పరబ్రహ్మ పరమాత్మ" అనీ, ముస్లిములు "అల్లా-హూ-అక్బర్" అని, పార్సీలు "అహురామజ్దా" అనీ, ఇరానీలు "యజ్దాన్" అనీ, క్రైస్తవులు "గాడ్ ఆల్ మైటీ" అని బాబా కోరిన ప్రకారం ఉచ్చరించారు ఇంతేగాక జూలై 10వ తేదీన ఉదయం 7 గంటలు మొదలు సాయంత్రం 7 గంటలవరకు బాబా ప్రేమికులెల్లరు మంచినీరు మాత్రం కావలసినంత తీసుకుంటూ 12 గంటలకాలం ఉపవాసం చేసారు. ఆరోజున

ఉదయం 5 గంటలనుండి 7 గంటలవరకు మధ్యకాలంలో ఏదైనా ఘనపదార్థంగాని ద్రవపదార్థంగాని తీసికొనవచ్చునని బాబా అనుమతించినందున ప్రేమికులు అట్లు చేసారు.

డేరాడూన్‌లో 101, రాజపూర్ రోడ్ గృహంలో బాబా మకాం చేస్తూ 25 మంది శిష్యులను భక్తులను తమతో 3 రోజులు (15, 16, 17 తేదీలు, జూలై 1953) ఉండటానికి ఆహ్వానించారు. బాబా ఆహ్వానం ప్రకారం కాశ్మీరు, ఢిల్లీ, హమీర్‌పూర్, బొంబాయి, పూనా, అహమద్‌నగర్ నుంచి ఆహ్వానితులు వచ్చారు. ఆమూడు రోజులు జరిపిన చర్చలలోను అనేక విషయాలు బాబా వచ్చినవారికి వివరించారు. ఆ మూడురోజుల చర్చలు జరిగాక తత్ఫలితంగా బాబా యీ క్రింది నిర్ణయాలు తీసుకున్నారు—

ఆగస్టు (1953) ఆరంభమునుంచి నవంబరు (1953) ఆఖరు వరకు తమతో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపరాదని బాబా నిషేధించారు. ఈ నాలుగు నెలలలోను బాబా ఎవరికీ దర్శన మీయనని చెప్పారు బాబా ఏకాంతమునకు ఎటువంటి భంగమూ వాటిల్లకూడదని అన్నారు ఏదయినా అత్యవసర విషయమయితే ఆదీ (సీ) టెలిగ్రాం ద్వారా బాబాకు తెలియజేయవచ్చునని అనుమతి యిచ్చారు-

పైన చెప్పిన సమావేశాలు అయిన తరువాత జూలై (1953) 26 వ తేదీన, బాబా వారి మండలికి "బాబా కార్యకర్తలు ఎలా ఉండాలి" అనే విషయం మీద ఒక ప్రవచనం యీ విధంగా చేసారు –

"భగవంతుని తెలుసుకోవడమంటే భగవంతుడవడమే. అలాగే నీవు ఒక సద్గురువు అయితేగాని సద్గురువుని ఎలా తెలుసుకోగలవు నన్ను అవతారుడన్నా సద్గురువన్నా లేక నేను మామూలు మనిషినైనా – మీరు నన్ను ఎవరినిగా భావిస్తే నేను అదే అవుతున్నాను

"అది అంత ప్రధానమయినది కాదు నేను బాబాను అయితే నా కోసం పనిచేయడానికి నా కెవరూ అవసరం లేదు అయినా నేను అందరినీ నాతో ఉండ మంటాను. నా జీవితం మీరు పరిశీలించి చూస్తే నే నెప్పుడూ ఏదీ శాశ్వతంగా ఉంచనని తెలుస్తుంది. ఆస్పత్రులు, ఆశ్రమాలు, పాఠశాలలు వగైరా అవన్నీ తాత్కాలికంగానే నడిపాను. ఎందుచేతనంటే ఏ సంస్థలు శాశ్వతంగా స్థాపించడం

నా కర్తవ్యంలేమి అయితే నాకు కార్యకర్తలు కావాలి ఎందుచేతంటే భగవంతుడు నన్ను ఏమి యివ్వమన్నట్లు చేయునో అది స్వీకరించడానికి ప్రజలను సంసిద్ధపరచాలి బాలభానుని కిరణాలు ప్రతిచోటా ప్రసరిస్తాయి. మధ్యాహ్న సమయంలో సూర్యకిరణాలు మరింత తీక్షణంగా ప్రకాశిస్తాయి అన్నిచోట్లా సూర్యుడు తన కిరణాలు ప్రసారం చేస్తాడు నాలుగు పందల మొదలు ఏడువందల సంవత్సరాలు తరువాత ప్రపంచమంతటా ప్రజలు నివసించే గృహాలుజొచ్చి సూర్యకిరణాలు వారిని చేరడానికి సూర్యుడే వారిచేత గృహాల కప్పులను పడగొట్టించి అందరి మీద సూర్యరశ్మి పడేలా చేస్తాడు.

"ప్రేమ సందేశ వ్యాప్తిచేత ప్రజలు తమ నీచమయిన కోరికలయొక్క కప్పులు పడగొట్టి అందువల్ల సమయం ఆసన్నమయినప్పుడు వారు వెలుగును పొందగలరని నేను కోరుతున్నాను మీరు మాత్రం తర్కవాదాలలోను సమాజాల రాజకీయాలలోను కుట్రలలోను చిక్కుకోకండి.

"మిమ్మల్నందరిని హృదయపూర్వకంగాను ఐక్యంగాను ఒక కేంద్రం నాకు కలిసి పనిచేయాలని నేను కోరుతున్నాను

"నిజాయితీ తనం, ప్రేమ, భగవంతునికోసం కాంక్ష, కలిగియుండునట్లు మీరు ప్రజలకి తెలియజెప్పండి. వారిని ఉత్సాహవంతుల్నిగా చేయండి అందువల్ల భగవంతుడు నాచేత యిప్పించినప్పుడు నేను యిచ్చేది వారు గ్రహించడానికి సమర్థులవుతారు

"మామూలుగా నదులు సముద్రంలోకి ప్రవహిస్తాయి కాని నదులు యిప్పుడు ఎండిపోతున్నాయి ఇప్పుడు సముద్రమే నదులలోకి ప్రవహించే సమయం వస్తోంది.

"నేను ఎవరయినా కాపచ్చు మీరు హృదయపూర్వకంగా పనిచేస్తే మీరు అడుగకుండానే సర్వజ్ఞుడు సర్వవ్యాపి అయిన దేవుడు ఆయనకు తోచిన పారితోషికం మీకు యిస్తాడు. నేను దెయ్యాన్నయినాసరే దేవుడు మీపనికి తగిన బహుమానం యిస్తాడు. తప్పదు.

"భగవంతుడు స్వేచ్ఛ, స్వతంత్రం కలవాడు ఆయన్ని తెలుసుకోడానికి మనం బంధనంతో గాక స్వేచ్ఛగానే పనిచేయాలి. మీరు నిజాయితీతో పనిచేస్తే భగవంతుడు సహాయం చేస్తాడు.

"ఒకరి దయకోసం నీవు నీచంగా ప్రవర్తించకు ఎప్పుడూ నీ యెడలగాని యితరుల యెడలగాని మోసంగా పనిచేయకు

"ఎవరయితే హృదయపూర్వకంగా నా పనిచేస్తారో వారే నాకు నిజమయిన 'కేంద్రం.'

"భగవంతుడు నన్ను శాశ్వతంగా ఉండేది యిచ్చేలాగ చేయవచ్చును.

భగవంతుడు మాత్రమే సత్యము.

భగవంతుడు ప్రేమమయుడు.

భగవంతుడు జ్ఞాన స్వరూపుడు.

భగవంతుడు సర్వశక్తివంతుడు.

భగవంతుడు సౌందర్యమూర్తి.

భగవంతుడే సర్వమూను.

అంతా భగవంతుడే.

భగవంతుని నుంచి దూరం చేసేది ఒక కామం (కోరిక) మాత్రమే. అందులో అహంకారం కూడా కొంచెం ఉంది అందుచేత మీరు పరిశుద్ధమయిన జీవితాన్ని గడపండి-" (అంటే స్వార్థరహితము నిష్కామము అయిన జీవితమే పరిశుద్ధంగా ఉంటుంది) అని ప్రవచనం ముగించారు.

ఆగస్టు 13 వ తేదీనుండి సెప్టెంబరు 2 వ తేదీవరకు బాబా ఒక ప్రత్యేకమయిన పనిలో నిమగ్నమై యున్నారు.

## పర్వర్దిగార్ ప్రార్థన :— (ఆగస్టు 1953)

ఆగస్టు 13 నుంచి సెప్టెంబరు 2 వ తేదీ వరకు యీ 21 రోజుల ప్రత్యేకమయిన పనిలో డేరాడూన్‌లో బాబా వారి మండలిచేత తాము చెప్పి ఆంగ్లమున

వ్రాయించిన ఒక ప్రార్థన తమ సమక్షంలో ప్రతిరోజూ చదివించుకునేవారు. దానికి గుజరాతీ అనువాదం కూడా దాని తరువాత చదివించుకునేవారు. ఇది నిర్గుణపరమయిన సర్వమత ప్రార్థన. దీని తెలుగుపాఠం ఈ క్రింద ఈయబడుతోంది —

ఓ పర్వర్దిగార్! సర్వపోషకా! సర్వరక్షకా!

నీవు ఆదియును అంతమును లేనివాడవు;

అద్వయుడవు, నిరుపమానుడవు,

నీ ప్రమాణ మెవ్వరును ఎరుంగ నేరరు ;

నీవు వర్ణము, నామము, రూపము, గుణములు లేనివాడవు,

నీవు అపరిమితుడవు; గంభీరుడవు; ఊహాతీతుడవు

భవనాతీతుడవు; శాశ్వతుడవు; నాశము లేనివాడవు;

నీవు అవిభాజ్యుడవు; దివ్య చక్షువులతోగాని నిన్నెవరునూ చూడజాలరు

నీవు ఎల్లప్పుడు ఉంటివి; నీవు ఎల్లప్పుడు ఉన్నావు; నీవు ఎల్లప్పుడు ఉందువు;

నీవు అంతటను గలవు, నీవు అన్నింట నున్నావు ;

మరి నీవు అంతటికి అన్నింటికి ఆవలనున్నావు;

నీవు ఆకాశమున గలవు; పాతాళమున గలవు,

నీవు వ్యక్తుడవు; అవ్యక్తుడవు;

అన్ని భూమికలందు ఉన్నావు; అన్ని భూమికలకు అతీతుడవు;

నీవు మూడు లోకాలలో నున్నావు; ముల్లోకాల కావల కూడా నున్నావు;

నీవు అగోచరుడవు, స్వతంత్రుడవు;

నీవు సృష్టికర్తవు, ప్రభులకు ప్రభుడవు;

అందరి మనస్సులను హృదయములను ఎరిగినవాడవు,

నీవు సర్వశక్తిమంతుడవు, సర్వ వ్యాపివి;

నీవే అనంత శక్తియు, అనంత ఆనందమును,

నీవు జ్ఞాన సాగరుడవు, సర్వజ్ఞుడవు, అనంత జ్ఞానివి;

నీవు భూత భవిష్యద్వర్తమానముల నెరిగిన వాడవు, జ్ఞానమే నీవు.
నీవు సర్వదయామయుడవు, నిత్య శుభంకరుడవు;
నీవు ఆత్మలకెల్ల నాత్మవు, అనంతగుణ విశిష్టుడవు;
నీవు సత్య జ్ఞానానందముల త్రిమూర్తివి;
నీవే సత్యమునకు మూలము. ప్రేమ మహాసాగరుడవు;
నీవు పురాణ పురుషుడవు, సర్వోత్తముడవు.
నీవు ప్రభుడవు, పరమేశ్వరుడవు;
నీవు పరుడవు, పరాత్పరుడవు;
నీవు పరబ్రహ్మవు అల్లాహ్, ఇలాహీ,
యజ్దాన్, అహూరామజ్దా;
ప్రియతముడైన భగవంతుడవు;
నీవు 'ఈజద్' అనబడు ఏకైక పూజ్యుడవు.

సద్గురు సాయిబాబా మెర్వాన్‌ను (మెహర్‌బాబాను) జూచుట తోడనే 'ఓపర్వర్దిగార్' అని సంబోధించెను. ఆ పవిత్ర సంబోధనా పదముతోనే బాబా యీ సర్వమత ప్రార్థన ప్రారంభించారు ఈ ప్రార్థనయందు నిర్గుణ పరబ్రహ్మ తత్త్వము లన్నీ చేర్చి సర్వమతములకు చెందిన సాధకులకు అనువర్తనీయముగా బాబా దీనిని సర్వజనోపయుక్తముగా రచించారు. పర్వర్దిగార్ ప్రార్థన (ప్రభుస్తుతి) అని ప్రసిద్ధి గాంచిన యీ స్తోత్రము ప్రపంచమునందు అన్నిదేశములందు అన్ని భాషలలోకి అనువదింపబడి సమస్తమయిన బాబా కార్యక్రమములందు సత్సంగ సభలయందు ఆరంభమున పఠింపబడుతోంది బాబా ప్రేమికులెల్లరు నిత్యము దీనిని ఒక్కమారయినా చదువుతారు. ప్రప్రథమముగా యీ ప్రార్థనను ప్రియతమ బాబా జూలై 1953 లో డేరాడూన్‌లో చెప్పి వ్రాయించి చదివించారు.

## బాబా సర్వోత్తముడు :— (ఉన్నతోన్నతుడు)

బాబా డేరాడూన్‌లో ఉండగా 1953, సెప్టెంబరు 7 వ తేదీన అవతార పురుషుడగు జోరోష్టరు యొక్క జన్మదినము వచ్చినది ఆనాడు ప్రపంచమునకు ఒక

అమూల్యమయిన సందేశము నిచ్చి జగత్తునందు తాను ఉన్నతోన్నతుడనని (ఉత్తమోత్తముడనని) బాబా చాటిచెప్పారు. "ది హైయెస్ట్ ఆఫ్ ది హై" అని యీ సందేశము ప్రసిద్ధికెక్కినది. ఈ సందేశముద్వారా బాబా సాక్షాత్తు దేవుడనేనేనని ప్రపంచములో ఉన్నతమయిన వారిలోకెల్ల ఉన్నతుడనని (అవతారుడను) ప్రకటించారు. ఈ సందేశము యొక్క పూర్తిపాఠమును యిందు పొందుపరుస్తున్నాను.—

"తెలిసి అయినను తెలియక అయినను అపరోక్షముగానయినను పరోక్షముగా నయినను, ప్రతియొక్క జీవజంతువు, ప్రతియొక్క మానవుడు—ఏదో ఒక రూపములో—తనవ్యక్తిత్వమును, స్థిరీకరింప జూస్తాడు. తుదకు మానవుడు తాను అనంతుడని, శాశ్వతుడని, అవిభాజ్యుడని తెలిసి అనుభవం పొందినపుడు, అతడు పూర్ణచైతన్యముతో తన వ్యక్తిత్వముతో తాను భగవంతుడనని తెలిసికొని, అనంత జ్ఞానశక్తి ఆనందములను అనుభవిస్తాడు కావున మానవుడు భగవంతుడవుతున్నాడు; పూర్ణ మానవుడని సద్గురువు అని కుతుబ్ అని గుర్తింపబడుతున్నాడు. ఇట్టి మానవుని ఆరాధించుట భగవదారాధనయే అవుతోంది

భగవంతుడు మానవరూపముతో యీ భూమిమీద ప్రభవించి ఆయన దివ్యత్వము మానవకోటికి ప్రకటించినపుడు, ఆయన అవతారపురుషుడుగా – మెస్సయ్యగా, ప్రవక్తగా – గుర్తింపబడతాడు. ఆ విధంగా భగవంతుడు మానవుడవుతున్నాడు

యుగయుగాలలోను అనంత పరమాత్మ తన అపార కరుణతో మానవకోటి మధ్యకు మానవుల స్థాయికి దిగి మానవరూపములో అవరోహణ చేయుటకు ఇచ్ఛయించును కానీ మానవులలో ఒకడుగా మానవశరీరముతో వచ్చి యుండినందున సాధారణ ప్రపంచ మానవుడే అని అనుకుని మానవులు అతనిని గుర్తించలేరు కాని ఆ యుగావతారుడుగా తన దివ్యత్వమును ప్రకటించినపుడు కొంతమంది ఆయనను భగవంతుడుగా అంగీకరించి పూజిస్తారు. భూమి మీద అవతరించిన దేవుడని తెలిసికొనిన కొద్దిమంది ఆయన మహిమను కొనియాడతారు కాని సర్వసాధారణముగా మిగిలిన మానవులందరూ అతడు యింకా శరీరధారియై యుండగానే అతనిని దుయ్యబట్టి దూషించి నిందించి తిరస్కరిస్తారు.

కావున మానవుడుగా నున్న భగవంతుడు తాను అవతారుడనని ప్రకటించుకొని తాను ఎవరికొరకు అత్యంతప్రేమతో తన మహోన్నత స్థానమునుండి క్రిందికి

దిగి వచ్చెనో ఆ మానవుల చేతులలోనే బాధలు పడుటకు, హింసింపబడుటకు, వారిచే అవమానింపబడుటకు, నిందింప బడుటకు, స్వచ్ఛందముగా ఉద్యుక్తుడవుతున్నాడు. మానవులు అవతారపురుషుని నిందించినను అనంత శాశ్వత స్థితిలోనున్న భగవంతుని యొక్క అస్తిత్వమును పరోక్షముగా నయినను స్థిరీకరించిన వారవుతున్నారు.

అనంతుడు, శాశ్వతుడు, అవిభాజ్యుడు అయిన భగవంతుడు ఒక్కడే గావున మానవరూపములో అవతారుడుగా, మెస్సయ్యగా, ప్రవక్తగా, సనాతన పురుషుడుగా. ఉత్తమోత్తముడుగా ఉన్నప్పుడు కూడ ఒక్కడే, నిత్యుడగు అవతారుడే యుగయుగములందు వేరు వేరు మానవ రూపములతో, వివిధ నామములతో, పృథక్ప్రదేశముల యందు ప్రభవించి సత్యమును విభిన్న భాషలలోనూ స్వరూపములలోనూ ప్రకటించి మానవుల అజ్ఞానకూపము నుండి ఉద్ధరించి వారిని మాయాబంధ విముక్తుల గావించును

ప్రపంచమునందు అసలయినవారి సంఖ్య చాలా చాలా తక్కువగా ఉన్నను, సాధువులు, సన్యాసులు, మహాత్ములు, మహాపురుషులు, యోగులు, వలీలు అసంఖ్యాకంగా ఉన్నారు. నిజాయితీగల కొద్దిమంది వారి ఆధ్యాత్మిక స్థితినిబట్టి ఒక ప్రత్యేకస్థాయిలో ఉంటారు వారు మామూలు మానవుల స్థితిలోనూ ఉండరు.

నేను మహాత్ముడనూ కాను, మహాపురుషుడనూ కాను సాధువునూ కాను, సన్యాసినీ కాను, యోగినీ కాను, వలీని కాను- ఐశ్వర్యము కావలెననీ, ఆస్తులను నిలబెట్టుకోవాలనీ నా దగ్గరకు వచ్చేవారు, ప్రాపంచికపు కోరికలు తీర్చుకోవాలని నా సహాయమును అర్థించేవారు – వారికి నేను సాధువును, మహాత్ముని, మహాపురుషుని, సిద్ధుని, యోగిని కానని యింకొక మారు చెప్పదలచినాను ఎందుచేతంటే యీ కోరికలతో నా వద్దకు వస్తే వారికి ఆశాభంగము అవక తప్పదు అయినప్పటికీ యీ ఆశాభంగము సర్వసాధారణంగా ఐహికపు కోరికలను వాంఛలను పూర్తిగా మార్చివేయగలదు.

మార్గమధ్యము నందున్న సాధువులు, సిద్ధులు, యోగులు యితరులు అద్భుతముల నొనర్చి అనేకులను ఆకర్షించి వారిని ఆశ్రయించిన వ్యక్తులయొక్క ఐహికావసరాలను తీర్చగలరు.

అయితే, నేను సాధువునీ కాక, సిద్ధుడనూ కాక, మహాత్ముడనూ గాక, యోగినీ కాక, మహాపురుషుడనూ కాక, వలీనీ కాకపోతే, యింక నేనెవరిని ?—

అనే ప్రశ్న ఉదయిస్తుంది. నేను మామూలు మనిషినేనా అయి ఉండాలి లేకపోతే సర్వోత్తమ పురుషుడనయినా అయి ఉండాలి అని సహజంగా ఊహించుకోవచ్చును. ఒక్కటి మాత్రం నేను స్పష్టంగా చెబుతున్నాను—అదేమిటంటే నేను మధ్య స్థాయిలలో నున్న నిజమయిన సాధువులు, సిద్ధులు, యోగులు యింకా అలాటి యితరులలో మాత్రం నేను ఎప్పటికీ చేర్చబడలేను

ఇప్పుడు నేను వట్టి మామూలు మనిషినే అయితే నా సమర్ధతలు, శక్తులు పరిమితంగానే ఉంటాయి. నేను మామూలు మనిషికి భిన్నమూ కాదు అంతకంటె ఎక్కువా కాదు ప్రజలు నన్ను అలాగే తీసుకుంటే నావలన అద్భుతాల ద్వారాను ఆధ్యాత్మిక సహాయరూపంలోను ప్రకృతికతీతమయిన అసామాన్యమయిన ఉపకారం పొందుటకు ఆశించరాదు. వారి కోరికలను తీర్చమని నావద్దకు రావడంకూడా నిష్ప్రయోజనం అవుతుంది.

మరి నేను మామూలు మనిషి స్థాయికంటె సాధువులు సిద్ధులు యోగుల స్థాయికంటె యింకా ఎంతో పైన ఉంటే నేను ఉత్తమోత్తముడనగు సర్వేశ్వరుడనే కావాలి. అలాటప్పుడు మీ సాధారణ మానవ బుద్ధితో నన్ను తెలుసుకుందామంటే మీ పరిమిత మనస్సుతో అర్థం చేసుకుందామంటే అంతకంటె అవివేకం ఉండబోదు. అంతకంటె అజ్ఞానం ఉండబోదు ఎందుచేతంటే మానవ మేధస్సు ఎన్నివిధాలుగా పల్టీలు కొట్టినా ఎంత గింజుకున్నప్పటికీ నా రీతులు అవగాహన కాబడవు, నా అనంత స్థితి నిర్ణయించబడ శక్యముగాదు

నేను సర్వోత్తముడనే అయితే నా ఇచ్ఛయే శాసనం అవుతుంది, నా కోరిక ప్రకారం శాసనం చేయబడుతుంది నా ప్రేమచేతనే యీ విశ్వం నిలుస్తుంది బాహ్యంగా మీకు కలిగే క్లేశాలు, క్షణ భంగురాలగు మీ బాధలు - అవన్నీ మీ యొక్క అంతిమశ్రేయస్సు కొరకు నా ప్రేమ వల్లనే కలుగుతున్నాయి కావున మీ చిక్కులు విడదీయుటకు నా దగ్గరకు రావడం మీ ప్రాపంచిక కోరికలను తీర్చమని నన్ను కోరడం, నన్ను అసాధ్యమాయిన పనిని చేయమనడం అవుతుంది, నేనిదివరకు నిర్ణయించిన దానికి విరుద్ధంగా చేయమనడం అవుతుంది మీ బాబాను నిజంగా పూర్ణమయిన విశ్వాసంతో ఉత్తమోత్తముడుగా మీరు అంగీకరించినట్లయితే, క్షుద్రమయిన మీ కోరికలను తీర్చమనడం కంటె, బాబా పాదముల చెంత మీ ప్రాణాలర్పించడం

మీకు తగినపని అవుతుంది బాబా యొక్క అపరిమితమయిన ప్రేమయే మిమ్ములను తప్పకుండా మీ నశ్వరజీవితపు అంధకారయుతమయిన సందుగొందులనుండి సురక్షితముగా గమ్యస్థానమును చేర్చగలదు అందువలన బాబా వంటి సర్వోత్తముని పాద పద్మములకడ ధారపోయుటకు మీయొక్క ఒక్క జీవితమేకాదు, మీ జీవిత సహస్ర పరంపర త్యాగము చేసినా అదికూడా అల్పమయిన త్యాగమే కాగలదు

ఎప్పుడో ఒకప్పుడు వీడిపోవలసిన శరీరము, మనస్సు, ఆస్తులు— అన్నీ నాకు ఎవరయినా సమర్పణ చేసినప్పటికీ, ఒక ప్రయోజనము కొరకు వాటిని సమర్పించినచో— శాశ్వతమయిన ఆనంద ధనమును సంపాదించుటకై అశాశ్వతమయిన ప్రాపంచికపు ఆస్తులను వదలివేయ వలయునని తెలుసుకొని వాటిని సమర్పిస్తున్నారు కాబట్టి దానితో నన్నువారు ఋణపడి ఉండేలా చేయలేరు. ఈ సమర్పణ వెనుక యింతకంటె ఎక్కువయిన (ఆధ్యాత్మిక) లాభమును పొందవచ్చుననే కోరిక ఉన్నది కాబట్టి యీ సమర్పణ సంపూర్ణము కాజాలదు

నేను సర్వోత్తముడ నయినచో, నాపాత్ర, మీ అందరియొక్క ఆస్తులను కోరికలను లేకుండా చేసి, మీ వాంఛలను నిర్మూలింపజేసి, మీ కోరికలను తీర్చడము కంటె మిమ్ములను వాంఛారహితులనుగా చేయవలెనని ఉద్దేశింపబడినదని మీరు అందరూ తెలుసుకోవాలి సాధువులు, సిద్ధులు, యోగులు, వలీలు, మీరు కోరుకున్నని యివ్వగలరు కానీ నేను మీకోరికలను తీసివేసి మిమ్ములను యీ మమకారములనుండి, యీ అజ్ఞాన బంధనములనుండి విముక్తుల గావిస్తాను నేను మీరుకోరినప్పుడెల్లా మీరు కోరినవన్నియు మీకు యిచ్చేవాడను కాను నేను తీసుకొనే వాడినే కేవల బుద్ధిమంతులు వారి బుద్ధిద్వారా ఎప్పటికి నన్ను అర్థంచేసుకోలేరు నేను ఉత్తమోత్తముడ నయితే బుద్ధికి నన్ను తెలుసుకొనుట దుస్సాధ్యము. పరిమితమయిన మానవుని మనస్సుచేత నా అగాధమయిన విధానాలను అవగాహన చేసుకోవడం సాధ్యంకాదు.

నన్ను ప్రేమిస్తూ, అత్యంత ఆశ్చర్యంతో ప్రక్కను నిలబడియున్న వారిచేత నేను తెలియబడను నన్ను అపహాస్యముచేస్తూ నన్ను నిందించేవారి కొరకు నేను రాలేదు. కోట్లకొలది మానవులు నా చుట్టూను మూగుట కొరకు నేను రాలేదు. జన సమూహాలలో అక్కడక్కడ ఉండి మౌనముగా నిరాడంబరముగా వారియొక్క తను మన ధనాలను సమస్తమును నాకు అర్పణ జేసియున్న ఎన్నిక అయిన కొద్ది

మంది కొరకు నేను ఉన్నాను నాకు సర్వమును సమర్పణజేసి అట్టి సమర్పణ గురించి ఏ మాత్రమూ ఎప్పుడూ ఆలోచించకుండా ఉన్నవారి కొరకు – నేనింకా యెక్కువగా అటువంటి వారికొరకే ఉన్నాను. నా నుండి ఒక సైగరాగానే, నేను ఒక్క చూపుతో చూడగానే సత్యము కొరకు వారి ప్రాణాలర్పించుటకు వారివంతు కొరకు వేచియుండి వెయ్యి పనులమధ్య నున్నను అప్రమత్తులై యుండి నా కొరకు సమస్తము త్యాగము గావించామన్న భావం కూడా వదిలివెయ్యడానికి ఎవరయితే సిద్ధంగా ఉన్నారో వారందరూ నావారు ఎవరు అజేయమయిన తమ ధైర్యముతో ఎటువంటి విపత్తుల నైనా సంతోషముతోనూ యిష్టముతోనూ ఎదుర్కొంటారో, ఎవరు నాయందు అచంచల మయిన విశ్వాసమును కలిగియున్నారో, వారికి కష్టము కలిగినా, వారి సుఖమును పోగొట్టుకుని నా యభీష్టలేశమును నెరవేర్చుటకు ఆతురపడుతున్నారో. వారే నిజముగా నన్ను ప్రేమించేవారు భగవంతునిలో నమ్మకము గాఢముగా నున్నదనుకొంటూ దైవనిర్ణయం ప్రకారం, అతనికి విధింపబడిన బాధ్యతలను నిర్వహింపక సాధువులు, సిద్ధులు, యోగుల వెనుక పరుగెత్తి చివరకు తనకు శాశ్వత విముక్తిని కలిగింప జేయుటకే తనకు కలిగిన బాధలను నివారణచేయమని కోరేవానికంటే, ప్రాపంచిక బాధ్యతలను, తనకు విధించిన గౌరవ విధులను ధైర్యముగను చక్కగను నిర్వహించు నట్టి నాస్తికుడు యింకా ధన్యత గాంచినవాడని నేను చెప్పగలను

ఒక కంటితో శారీరకమగు మోహముల కొరకు చూస్తూ, యింకొక కంటితో శాశ్వతానంద కిరణ ప్రసారము కొరకు ఆశించుట దుస్సాధ్యమేగాక అది అత్యంత కపటవర్తన మవుతుంది కూడ.

మీరు తెలుసుకొనవలెనని నేను కోరునది అంతా ఒక్కమాటుగా మీకు అర్థమవుతుందని నేను అనుకోలేను. యుగయుగాలనుండి పరిమితాలయిన మీ మనో క్షేత్రాలయందు బీజాలనునాటి అవి మీ కృషివలన మీ జాగ్రత్త వలన మొలకలెత్తి పెరిగి పండ్లు కాచే జ్ఞానవృక్షాలగునట్లు, వాని ఫలితం మీరు పొందగలిగేలా మిమ్ము లను మేల్కొలుపునట్లు చేయుట నాపనియై యున్నది

అలా కాకుండా, అజ్ఞానముచేత, మీ మార్గముననే పోవుటకు పట్టుపట్టినచో, మీరు ఎన్నుకున్న అభివృద్ధి మార్గమును ఎవరూ నిరోధింపజాలరు బాధాయుతము, ఆలస్యము అయినా అది కూడా అభివృద్ధియే అవుతుంది నేను మిమ్ము యిప్పుడే

తెలిసికొనగోరునది మీకు అసంఖ్యాకములయిన జన్మలయిన తరువాత తెలియగలదు. నిజమయిన లక్ష్యము తెలియక మీ అజ్ఞానము కొలది ఆత్మకృతమయిన బాధలనుండి రక్షించు కొనుటకు, యింకను భ్రాంతి సంజనితమయిన అయోమయ స్థితిలో చిక్కు కొనకుండా రక్షించుకొనుటకు యిప్పుడే మేలుకొనండి అజ్ఞానమును (తత్కారణముగా వచ్చిన బాధలను) దాని నిజమయిన దృక్పథములో అనుభవించుటచేత స్వేచ్ఛ కొరకు ప్రయత్నించండి.

భగవంతుని యెడల, మీ యెడల నిజాయితీతో ప్రవర్తించండి. ఎవరయినా ప్రపంచమునూ యిరుగు పొరుగు వారినీ మోసగించవచ్చును కాని సర్వజ్ఞుడయిన పరమేశ్వరుని ఎరుక నుండి తప్పించుకోలేరు. అది దైవనిర్ణయం.

నా వద్దకువచ్చే మీ కందరికీ, నన్ను ఉత్తమోత్తముడనని నమ్మి నా చెంతకు వచ్చేది మీకు నేను స్పష్టముగా చెబుతున్నాను – మీ హృదయంలో ఐశ్వర్యం కోసం, ప్రాపంచిక లాభాలకోసం, కోరికలను పెట్టుకుని ఎప్పుడూ నా వద్దకు రావద్దు. మీ తను మన ధనాలను మీ సమస్తమును వాటిమీద ఉన్న మమకారములతో యిచ్చివేయాలనెడి తీవ్రమయిన వాంఛతో మాత్రమురండి. మీ చిక్కుల నుండి విడదీయమని నన్ను వెదకుతూ రావద్దు. నా ఇచ్ఛకు హృదయపూర్వకముగా సమర్పణమగుటకు నన్ను కనుగొనండి ఐహిక సుఖము కొరకు క్షణభంగురమగు సదుపాయముల కొరకు నన్ను అంటిపెట్టుకుని ఉండవద్దు. కష్టమయినా సుఖమయినా మీ సంతోషమును మీ సుఖమును నా పాదముల కడ త్యాగముచేసి నన్ను చేరి యుండండి నా సుఖమే మీ సంతోషమగుగాక నా సమపాయమే మీకు విశ్రాంతి యగుగాక మంచి ఉద్యోగము లభించునట్లు ఆశీర్వదించమని నన్ను అడగకండి. కాని యింకా ఎక్కువ శ్రద్ధతోను, నిజాయితీతోను, ఫలాపేక్ష లేకుండా నన్ను సేవించుటకు కోరుకోండి. మీ ప్రాణములు కాని మీకు ప్రియమైనవారి ప్రాణములు గాని రక్షించమని నన్ను వేడుకొనవద్దు. మిమ్ము అంగీకరించి నా కొరకు మీ ప్రాణముల నర్పించుటకు అనుమతించమని నన్ను యాచించండి. మీ శారీరక రోగములను కుదర్చమని నన్ను అడుగవద్దు కాని మీ అజ్ఞానము పోగొట్టమని నన్ను ప్రార్థించండి ఏదయినా నా వద్దనుంచి తీసుకొనుటకు చేయి చాచవద్దు కాని ఉత్తమోత్తముడనగు నన్ను చేరితిమని మీ చేతులెత్తి నన్ను స్తోత్రం చేయండి

నేను సర్వోత్తముడ నయితే నాకు అసాధ్యమైనదేదీ లేదు వ్యక్తుల అవసరాలను తృప్తిపరచుటకు నేను అద్భుతములను చేయనప్పటికిని, అవి చేయుట వలన అశాశ్వతమయిన యీ జీవితమనే వలలో యింకా ఎక్కువగా ఆ వ్యక్తులు చిక్కుకొనువట్లు చేయుట యగును కొన్ని కొన్ని సమయములయందు అద్భుతముల ద్వారా, సర్వజీవరాసుల యొక్కయు మానవకోటి యొక్కయు ఆధ్యాత్మికాభ్యు దయము కొరకు మాత్రమే నా అనంతమయిన శక్తిని ప్రదర్శిస్తూ ఉంటాను.

అయినప్పటికీ, నాయందు అచంచల విశ్వాసము కలిగి నన్ను ప్రేమించు వ్యక్తులచేత అద్భుతములగు అనుభూతులు అనుభవించబడుతూనే ఉన్నాయి. నాయొక్క కృపా విశేషమే, నా అనుగ్రహమే, నాయొక్క కటాక్ష వీక్షణమే వీటికి కారణం అని చెప్పబడుతోంది కాని అటువంటి అద్భుతానుభవాలు నా ఉన్నతోన్నత స్థితికి సంబంధింప జేయుట నాప్రేమికులకు తగదని మిమ్ముల నందరను తెలుసు కోమని కోరుతున్నాను. నేను సర్వోత్తముడనైతే దైవ నిర్ణయంలో యీ మాయా విలాసాలకి అతీతుడనై ఉన్నాను కావున నన్ను ఆవిధంగా గుర్తించిన నాప్రేమికు లకు, లేక నన్ను తెలుసుకొనకుండా యితర మార్గాలద్వారా నన్ను ప్రేమించేవారికి ఏవయినా అద్భుతానుభవాలు కలిగియుంటే నాలో వారికున్న దృఢమయిన నమ్మకం వల్లనే అవి కలుగుతున్నాయి వారి అచంచల విశ్వాసము తరచుగా మాయను అధిగమించి వారికి అద్భుతాలని చెప్పబడే అనుభవాలు కలుగజేస్తూ ఉంటుంది

వారి దృఢవిశ్వాసం ద్వారా ఏర్పడిన అద్భుతానుభవాలు అనుభవించే వారిని యింకా ఎక్కువ మాయాబంధంలో చిక్కుకోకుండా చేసి తుదకు వారికి మంచినే కలిగిస్తాయి.

(నేను ఉత్తమోత్తముడనైతే ఒక్క క్షణంలో అందరికి భగవత్సాక్షాత్కారం కలిగించి సృష్టియందలి ప్రతీ జీవిని అజ్ఞాన శృంఖలాలనుండి విమోచనం కలిగించ దానికి విశ్వనాథుడనయిన నా ఇచ్ఛచాలును కాని దైవనిర్ణయం ప్రకారం అజ్ఞానపు అనుభవాల ద్వారా సంపాదించిన జ్ఞానం ధన్యమైనది అజ్ఞానం మధ్యలోనే యీ జ్ఞానం పొందడానికి సద్గురువు యొక్క సహాయము చేతను సర్వోత్తమునికి చేసే సమర్పణ ద్వారాను సాధ్యమవుతోంది ')

— ఈ విధంగా పరాత్పర పరబ్రహ్మమును నేనే, సర్వోత్కృష్టుడయిన ఆ సర్వేశ్వరుడను నేనే. అని సమగ్రమయిన సుస్పష్టమయిన ప్రకటన ప్రప్రథమంగా

బాబా 1953 సెప్టెంబరు 7 వ తేదీన దేరాడూన్‌లో బాహటంగా చేసారు. బాబా యొక్క ఆధ్యాత్మికస్థాయి ఎట్టిది అని విచారించే తార్కికులు, పండిత ప్రకాండులు, వేదాంతులు, విమర్శకులు దీనినిబట్టి వారికి సందేహ నివృత్తికాగలదు. బాబా యొక్క నిజమయిన స్థాయి ఋషులకు, సిద్ధులకు, మహాత్ములకు, మహాయోగులకు కూడా అందరానిదై అతీతమైనదై దురవగాహమైనదై ఉంది అని దీనిని బట్టి అందరికి విశదమౌతోంది.

1953 అక్టోబరు 28 వ తేదీ అర్ధరాత్రి 12 గంటలనుండి ఒక గంటసేపు మెలకువతో నుండి యిదివరలో మౌన వార్షికోత్సవం నాడు జరిపినట్లు భగవంతుని నామం – ఏ మతానికి చెందినవారు ఆ దైవనామం – పైకి వినిపించేలాగ ఉచ్చరించవలసిందని ఆ రాత్రి మెలకువగా ఉండమని బాబా తమ ప్రేమికుల నందరిని కోరారు అప్పుడప్పుడు బాబా యీ విధంగా తమ ప్రేమికులకు తమ ఆధ్యాత్మిక మహా కార్యమునందు పాల్గొనే అవకాశం కల్పించి తమకు సహకరింపజేయుట బాబా యొక్క అనంతము అవ్యాజము అయిన అనురాగమే గాక ప్రేమికుల మహాభాగ్యము అపూర్వమయిన వారి అదృష్టము అని చెప్పాలి

1953 నవంబరు 1 వ తేదీన దేరాడూన్‌లో బాబా "నిజమైన దర్శనం" అంటే ఏమిటో యిలా వివరించి చెప్పారు –

"మీ మధ్యలో ఉన్నందుకు నేను చాలా సంతోషిస్తున్నాను. దేరాడూన్‌లోని కొందరి ప్రేమికుల గాఢమైన ప్రేమయే మీరందరినీ యీ రోజున నా దర్శనం కోసం యిక్కడ సమావేశపరచింది.

"కాని నా నిజమైన దర్శనం పొందడం సులభంకాదు. "దగ్గర నుంచి నన్ను చూడడం, నాకు నమస్కారం చేయడం, నాకు పువ్వులు పళ్ళు సమర్పించడం, నాకు పంగి ప్రణామం చేయడం, తరువాత మీ యిళ్ళకు తిరిగి వెళ్ళడం – ఇలా చేస్తే నా దర్శనం చేసుకున్నట్లు ఎప్పటికీ అవదు.

"మీ కళ్ళతో నన్ను మీరు చూసినా నేనున్న వాడనున్నట్లుగా మీరు నన్ను చూడలేదు నా రూపాన్ని మీరు లేశమాత్రమయినా, నన్ను మీరు లాంఛన ప్రాయంగా దర్శనం చేసుకున్నా, మీరు నన్ను చూడలేదన్నమాటే

"నా అసలు దర్శనం పొందడం అంటే నన్ను కనుగొనడమే. 'నన్ను కనుగొనే మార్గం నాలో మీ నివాసాన్ని కనుగొనడం. "నాలో మీ నివాసాన్ని కనుగొనే విధానం నిశ్చయంగా నన్ను మీరు ప్రేమించడం.

"నేను మిమ్ము ప్రేమిస్తున్నట్లు నన్ను మీరు ప్రేమించడానికి మీరు నా అనుగ్రహాన్ని పొందాలి నా అనుగ్రహమే మీకు దివ్యప్రేమను కలుగజేస్తుంది.

"నా అనుగ్రహం మీకు రావాలంటే, నాలోని అచంచల విశ్వాసం అనే దృఢమయిన పునాదితో నాకు మీరు హృదయపూర్వకంగా విధేయులుగా ఉండాలి.

"మీ అంతట మీరు నేనుకోరినట్లు నాకు పూర్తిసమర్పణ అయితే నాకు మీరు విధేయులు కాగలరు. అందువలన నాకోరికే మీ ధర్మం అవుతుంది, నాప్రేమయే మిమ్ములను నిలబెడుతుంది.

"యుగయుగాలుగా చాలామంది అటువంటి సమర్పణ కోసం ఆశిస్తారు, కాని చాలా కొద్దిమంది మాత్రమే నేను కావాలన్నట్లు నాకు సంపూర్ణ సమర్పణ అవడానికి నిజంగా ప్రయత్నిస్తారు

"ఎవడయితే జయం పొందుతాడో అతడు చివరికి నన్ను కనుగొనడమే గాక తన జీవిత గమ్యాన్ని కూడా పొందుతాడు, తాను నేనే అయిపోతాడు.

ఈరోజున మీలో యింతమందిలో ఒక్కడేనా నేను మీరు తెలుసు కోవాలని కోరేది అర్థం చేసుకుంటే నేను మీ మధ్యకువచ్చి ఉండడం సార్థకం అవుతుంది

"నేను మీకు అందరకు నా ఆశీస్సుల నిస్తున్నాను"

ఆసందర్భంలోనే బాబా యింకొక సందేశం యిచ్చారు.

## మాయతో ఆడడం :—

మిమ్ములను యిక్కడ సమావేశపరచిన మీ విశ్వాసాన్ని మెచ్చుకుంటు న్నాను. మీప్రేమను భక్తిని కూడా మెచ్చుకుంటున్నాను అది నన్ను చాలా ఆనంద పరచింది. మీసమస్యలను, బాధలను, మీ ఆశలను నేను తెలుసుకొని అర్థంచేసు

కుంటున్నాను. వ్యక్తులేగాకుండా ప్రపంచం అంతా కూడా బాధలతో సతమతమవు తూంది. బాధ వచ్చినపుడు దైవ నిర్మితమయిన కర్మధర్మము ననుసరించి వస్తుంది. అందుచేత అది ధైర్యముతోను, సరసంగాను అంగీకరించాలి. కాని మీ చేతలే మీ బాధలకి కారణాలని మీరు జ్ఞాపకం ఉంచుకోవాలి. తెలివైన ఆచరణ ద్వారా అవి తగ్గించుకోవచ్చును. మానవులకు కావలసినది ఆధ్యాత్మిక జ్ఞానము అందుకొరకు మానవులు సద్గురువులను అవతారపురుషులనే ఆశ్రయించాలి.

అజ్ఞానమువలన మాయామోహం వలన బాధ కలుగుతుంది. పిల్లలు బొమ్మలతో ఆడుకున్నట్లే చాలామంది మాయతో ఆడతారు అశాశ్వతమయిన యీ ప్రాపంచిక విషయాలలో మీరు చిక్కుకుంటే, మాయాన్వితమైన వాటి విలువలకి మీరు అంటిపెట్టుకుంటే బాధ తప్పదు. చిన్నపిల్లలు వారి ఆటవస్తువులను విడిచి పెట్టెయ్యడం సులభంకాదు, ఎందుచేతంటే వారు మానలేని అలవాటుకు లోనయి నారు. అలాగే లక్షలాది జన్మల ద్వారా మీరు మాయలతో ఆడుకొనుట అలవాటు చేసుకున్నారు ఆ చిక్కులలోనుంచి మీరు విడిపించుకోవడం కష్టం.

యుగయుగాలుగా మానవుడు తన ఛాయను చూస్తూ రూపములతో నిండిన యీ మాయాన్విత ప్రపంచంలో మనసును లగ్నము చేసుకుంటున్నాడు. సృష్టిలో ఎన్ని యుగాలలోనయినా మానవుడు తాను సృష్టించుకొనిన దృశ్యమునే చూడటానికి కోరికను అలవాటుపడతాడు. మానవుడు ఆత్మజ్ఞానము కొరకు అంతర్వర్తియైనపుడు తన మనసును ఆధ్యాత్మికంగా తిప్పుకున్నాడన్నమాట. అక్కడయినా ఏదో ఒక దృశ్యాన్ని చూడాలనే కోరే అలవాటు ఎన్నో జన్మలలో ఉంటూనే ఉంటుంది. కొన్ని అద్భుతాలు అనుభవించాలని కోరుతాడు మానవుడు ఏదో ఆశ్చర్యము గొలిపే దృశ్యాలు చూడాలని కోరుతాడు. లేక అభివృద్ధి చెందిన స్థితిలో అతడు అద్భుతాలు చేయాలనుకుంటాడు ఆధ్యాత్మికంగా అభివృద్ధి చెందినవారు కూడా యీ మాయలతో ఆడుకొనే అలవాటును మానుకోలేరు అద్భుతాలలో ఆసక్తి కలిగి ఉంటూ ఉండడం ఆ అలవాటును పొడిగించుకోవడమే

నిజమైన స్వేచ్ఛ అద్భుతాలు కాదు తెచ్చేవి, అవగాహనయే. భగవన్మాన వుని యెడల అచంచలమైన ప్రేమ విశ్వాసాలుంటే శాశ్వత సత్యమును పొందుటకు మీకు మార్గం సుగమం అయిందన్నమాట. అప్పుడు నిరర్థకమైన వాటితో ఆటలాడుటలో

సమయము వ్యర్థము చేయుటకు నీకు వీలుండదు. మీరు ప్రేమ చేతను సత్యము చేతను నడుపబడుదురుగాక భగవంతుని దగ్గరకు చేర్చే సరళమైన మార్గము, అంతం లేకుండా మోహింపజేసే మాయలను చమత్కారంగా క్రిందుమీదులు చేయడం వల్లకాదు గాని అవికారమయిన సత్యానికి కట్టుబడి ఉండడం చేతనే మీరు శాశ్వత మయిన శాంతిని బడయగలరు.

నేను మాటలాడితే వచ్చేది అది ఒక్క దివ్యమైన శబ్దము మాత్రమే. కాని పలుకులకెల్లపలుకు, లేక సత్యముయొక్క ప్రకటీకరణ, అది అవుతుంది- ఆశబ్దము మనసుతో మాత్రమే గాక అది హృదయము చేత వినిపించుకోవాలి. అది ఏ హృదయాంతరాళం లోనికి చొచ్చుకొనిపోయి విన్ను మేల్కొలుపుతుంది

నేను మీకు ప్రేమాశీర్వాదాల నిస్తున్నాను—" నవంబరు మాసంలో బాబా దేరాడూన్ నుంచి ఢిల్లీ వెళ్ళారు

1953 సంవత్సరము నవంబరు 21 వ తేదీని బాబా ఢిల్లీలో వాసుదేవ్‌కైన్ యింట్లో ఉండగా యీ మాటలు చెప్పారు—

"రెండు రకాల అనుభవాలున్నాయి ఒకటి బాహ్యము, రెండవది అంతరము. బాహ్యానుభవము స్థూల విధానంద్వారా కలుగుతుంది. మనము స్థూల చక్షువులతో యీ స్థూల ప్రపంచాన్ని చూసింది మనకు ఒక విధమయిన విశ్వాసాన్ని కలుగజేస్తుంది ఒక్కొక్కప్పుడు యీనమ్మకం అసత్యపు విభజనం మీద ఆధారపడి ఉంటుంది ఉదాహరణకి తాటిచెట్టుక్రింద ఒకడు సీసాలో పాలుత్రాగుతూండగా చూస్తే వాడు కల్లు త్రాగుతున్నాడనే అనుకుంటాము కాని అది అసత్యము కదా అంతశ్చక్షువుతో చూసినది ఎప్పటికీ కేవలము నిజమైనదే అవుతుంది. దానికి తిరుగు ఉండదు. అది అసత్యం కానేరదు అంతర్నేత్రంతో భగవంతుని సర్వశక్తిమంతు డుగా చూస్తే ఆ చూసినవాడు ఆ అనంతమయిన అస్తిత్వము తానే అవవలసిన అవసరం కలవాడవుతున్నాడు కావలసిందేమిటంటే ఎక్కువ సిద్ధాంతీకరించడంకాదు, హేతువాదం చేయడంకాదు, శాశ్వతమయిన విశ్వాసం కలగడం అది ప్రేమద్వారానే సాధ్యం అవుతుంది

భగవంతుడు అనంతుడయినట్లుగానే ఊహకూడా అనంతమయినదే. ఆ ఊహాజనితమయిన భగవంతుని ఛాయకూడా అనంతమయినదే. అంతం లేకుండా

మనం ఊహించవచ్చును— ఏదయినాసరే— ప్రతీదీ కూడా అనంతంగా ఊహించవచ్చును

ఈరోజున అవగాహన చేసుకుంటున్నట్లు విజ్ఞానశాస్త్రము శక్తి గురించి, పదార్థం గురించి చెబుతుంది ఈ భౌతిక విజ్ఞానశాస్త్రము మానసిక పరిధిలో చేరింది. ఆధ్యాత్మిక శాస్త్రము మానసికాతీత స్థితి గురించి చెబుతుంది.

భౌతిక విజ్ఞానశాస్త్రము, ఆధ్యాత్మిక విజ్ఞానశాస్త్రము, రెండూ కూడా ఋజువులిస్తాయి భౌతిక విజ్ఞానశాస్త్రము బుద్ధిద్వారా ఫలితాలు కలుగజేస్తుంది. ఆధ్యాత్మిక విజ్ఞానశాస్త్రం ప్రేమద్వారా ఫలితాన్ని కలుగజేస్తుంది ప్రేమను పూర్తిగా అనుభవించినపుడు, అనంతుడయిన భగవంతుడు సాక్షాత్కరిస్తాడు. ఇతరమయినదిఅంతా మొదట మాయాన్వితమయిన సంఘటనగా కనుగొనబడుతుంది

ఆధ్యాత్మిక విజ్ఞానశాస్త్రం ప్రేమ మీద మాత్రమే ఆధారపడి, పద్ధతి ప్రకారమయిన మానసిక అవగాహన నిమ్నోన్నతాలతో కూడుకొని, విరుద్ధములను, విచిత్రములను ప్రేమ మాత్రమే ఎదుర్కొని జయించగలదు. ఎందుచేతననగా భౌతిక విజ్ఞాన శాస్త్రం అహంకారయుత జీవితాన్ని అతిశయింప జేస్తుంది. దానిని ఆధ్యాత్మిక విజ్ఞాన శాస్త్రం రూపుమాపుతుంది

ఈనవంబరు మాసంలోనే బాబా యింకొకరోజున యీ విధంగా చెప్పారు— "నావద్దకు వద్దామనుకున్న వారందరికీ నేను ఉత్తమోత్తముడనని, సర్వోన్నతుడనని నన్ను అంగీకరించి నావద్దకు వచ్చేవారందరికి— నేను ముఖ్యంగా ఒకటి చెప్ప దలచుకున్నాను మీ హృదయంలో ఐశ్వర్యం కావాలని, ప్రాపంచిక లాభాలు కావాలని, కోరికలు పెట్టుకుని నావద్దకు ఎప్పుడూ రావద్దు మీకున్నదంతా— మీ తను మన ధనాలు— నాకు యివ్వాలనే గాఢమైన వాంఛతోనే నావద్దకురండి. మీకు ఏర్పడిన చిక్కులనుంచి విడిపించుకుందామని నావద్దకు రావద్దు కాని నా ఇచ్ఛకు మీరు హృదయపూర్వకంగా సమర్పణ అవాలని నన్ను చేరండి ప్రాపంచిక సుఖాలు, సదుపాయాలు కావాలని నన్ను మీరు అంటి పెట్టుకొని ఉండవద్దు, కాని కష్టం లోను సుఖం లోను మీ సుఖాన్ని సదుపాయాలను నాపాదాలవద్ద త్యాగం చేసి నన్ను వదలకుండా ఉండండి. నా సుఖమే నా సంతోషమే మీకు హాయిని కలుగజేయాలి

ప్రాపంచిక జయాలు పొందాలని నన్ను ఆశీర్వదించమని మీరు నన్ను కోరకండి. ఫలాపేక్ష లేకుండా నన్ను నిజాయితీతో సేవించాలని కోరుకోండి మీప్రియులయొక్క గాని మీయొక్కగాని ప్రాణాలు రక్షించమని నన్ను అడుగకండి కాని నిమ్మల్ని అంగీకరించి మీప్రాణాలు నాకోసం త్యజించడానికి అనుమతి కోసం నన్ను ప్రార్థించండి మీకు సంక్రమించిన శారీరక రోగాలు కుదర్చమని నానుండి ఆశించకండి. కాని మీ అజ్ఞానాన్ని పోగొట్టమని నన్ను బ్రతిమాలండి. నావద్దనుంచి ఏదయినా పొందుదామని మీచేతులు చాచకండి కాని ఉన్నతోన్నతుడనయిన నన్ను స్తుతి చేయడానికి మీచేతులు యెత్తండి "—

డిశెంబరు మాసం వచ్చిన తరువాత బాబా తమ మకామును మహాబలేశ్వర్‌కి మార్చి అక్కడ మండలితో ఉండడం ప్రారంభించారు

హమీర్‌పూర్ ప్రేమికుల కోరికపైన బాబా ఆ జిల్లాలో పర్యటించి ప్రజలకు దర్శనమివ్వడానికి ఫెబ్రవరి 1 (1954) న మండలితో మహాబలేశ్వర్ నుంచి బయలుదేరారు బాబాతో కూడా తొమ్మండుగురు శిష్యులు బయలుదేరారు— ఎరచ్, పెండు, శత్రుఘ్నకుమార్, గుస్తాద్‌జీ, అలోబా, కిషన్‌సింగ్, జాల్‌భాయి, రంజూ, భావూ అనే వారితో బాబా ప్రయాణమయారు మెహెర్‌జీ బొంబాయినుంచీ, పటేల్ పూనాలోను యీ బృందంతో కలిసారు అహమద్‌నగర్ నుంచి ఢాకేఫల్కర్, ఛగన్ మాస్టర్, సిద్ధుజీ, సావక్‌కొత్వాల్, జస్వంతరావు, కృష్ణాజీ — వీరంతా బాబా మండలితో చేరారు ఇటార్సీస్టేషన్‌లో మరి యిద్దరు - నానా, పంఛ్‌రాజ్ మండలితో కలిసారు వీరు కాకుండా దేరాడూన్ నుంచి హెలెన్, హరిచంద్ మరియొకడు కూడా వచ్చి చేరారు వీళ్ళు ముగ్గురు ఓరాయ్ స్టేషన్‌వద్ద మండలితో చేరుకున్నారు

ఈ పర్యటన సాఫీగా జరిగిపోయేటందుకు మండలివారికి కొందరికి వారు చేయవలసిన పనులు బాబా పురమాయించి చెప్పారు. ఎరచ్, మెహెర్‌జీ ఎప్పుడూ బాబాతో ఉండాలి. —ఛగన్‌మాస్టర్, సిద్ధుజీ— వీరిద్దరు బాబాకి కావలసిన సదుపాయాలు చూస్తూ ఉండాలి. ఢాకే, కుమార్ లు దర్శనకార్యక్రమాలకి వెళ్ళేటప్పుడు బాబాతో ఉండాలి. ఒక ఊరినుంచి యింకొక ఊరికి ప్రయాణం చేసేందుకు ఏర్పాటు

లన్నీ పెండూ చెయ్యాలి బాబా చెప్పిన సందేశాలు వ్రాతలో పెడుతూ రంజూ సాహిత్యసేవ చెయ్యాలి.

అందరూ ఓరాయి నుంచి హమీర్‌పూరు వారు ఏర్పాటు చేసిన కారులోనూ, బస్సులోనూ బయలుదేరి ఇచ్చౌరాకి వెళ్ళవలసి ఉంది. బస్సు బాగా వెళ్ళడానికి రోడ్డుమీద ఉన్నగోతులు పూడ్చి బాగుచేసారు ఈవిధంగా కొన్ని మైళ్ళు ప్రయాణం చేసారు. బాబా బస్సులోనే మండలితో కూర్చున్నారు బస్సు మామూలు రోడ్డు నుంచి కాలువగట్టుమీద ఉన్న మట్టిరోడ్డుకి తిరిగింది తరువాత కొద్దిసేపట్లోనే బస్సు ఆగిపోయింది ఎడమవైపు ముందుచక్రానికి ఒక మట్టిదిబ్బ అడ్డం వచ్చింది. ఇంతలోనే ఎవరో కుడివైపుకి చూసారు. కుడివైపు ముందు చక్రానికి 6 అంగుళాల దూరంలోనే ఒక లోతయిన గొయ్యి ఉంది బస్సు అక్కడ ఆగకపోయినట్లయితే ఆగోతులోపడి కుడివైపున ఉన్న కాలువలోకి పడిపోయేదే బాబా అదిచూసి ఎరునవ్వు నవ్వారు. ఎలాగో తప్పించుకొని బస్సును ముందుకు తీసుకువెళ్ళారు కానీ అది మట్టిరోడ్డు, బస్సులు నడిచే రోడ్డుకాదు. కొంచెం దూరం వెళ్ళాక బస్సు ఆగింది. అందరూ బస్సులోంచి దిగి ఎద్దుబళ్ళు కట్టించుకున్నారు ఎద్దుబళ్ళలో అందరూ సర్దుకుని వెళ్తూంటే పెద్దపెళ్ళివారి బృందంలా వారికెంతో సరదాగా ఉంది. బాబా మండలితో ఇచ్చౌరా చేరేసరికి 8 వ తేదీన ఉదయం 10 గంటలయింది. గతరాత్రి పెద్ద వర్షం పడినందున రోడ్డుపాడయి బస్సు, కారు అవూరు రాలేదు. అందుచేత మరునాడు నౌరంగా వెళ్ళడానికి మరల ఎద్దుబళ్ళే కట్టించుకున్నారు ప్రయాణం చాలా శ్రమతో కూడి ఉంది. నిగమ్‌ని పిలిచి బాబా "బస్సూ, కారూ వస్తాయా, రావా ?" అని అడిగారు. బస్సుకి ఏదారినయినా వెళ్ళడానికి అనుమతి ఉందని అందుచేత ఏఇబ్బందులున్నయినా అవి రావచ్చునని చెప్పాడు అయిదు నిమిషాల్లోనే ఆ రెండుబళ్ళూ వచ్చి చేరాయి అయినా రోడ్డు బాగాలేనందున బస్సు వెళ్ళడము చాలా ఆలస్యమూ కష్టమూ అయింది హమీర్‌పూర్ జిల్లా పర్యటన అంతా అలాగే జరిగింది.

బాబా యొక్క పవిత్రనామం హమీర్‌పూర్ జిల్లా ప్రజల హృదయాలలో బాగా నాటుకుపోయింది మొదటి మాటుగా 1948 వ సంవత్సరంలో బాబా నామవ్యాప్తి ఆ జిల్లాలో బాగా జరిగింది. ఆ కారణంగా అలంపురాలోను ఇచ్చౌరాలోను, నౌరంగాలోను మహోవా - మెహెరా స్థానాలోను యింకా యితర స్థలాల్లోనూ బాబా తీర్థాలు ఏటేటా జరుగుతున్నాయి బాబా గౌరవార్థం ఆయా గ్రామాలలో ప్రదర్శనలు

పండుగలు ఉత్సవాలు చేసుకుంటున్నారు ఆ గ్రామీణుల అమాయక హృదయాలచే ఆకర్షింపబడి 1954 ఫిబ్రవరిలో బాబా హమీర్‌పూర్ వెళ్ళారు బాబా వారి రాకతో పావనమొనర్చిన స్థలము ఇచ్చోరా 3 వ తేదీకి అక్కడ బాబా యీ సందేశం యిచ్చారు.

"నన్ను హృదయపూర్వకంగా ప్రేమించండి నేను మీ అందరిలోను నిరంతరమూ జీవిస్తున్నాను. అందువలన ఎల్లప్పుడు నన్ను మీలో ఒకనిగా భావించి ప్రేమించడానికి ప్రయత్నించండి ఈ ప్రయత్నం నిజాయితీతో చేయండి దేవుడు ఎప్పుడూ నిజాయితీ తనం మెచ్చుకుంటాడు నన్నుమీరు ప్రేమిస్తే మీ గృహాలలోను మీ హృదయాలలోనూ నన్ను మీరు చూస్తారు – అని చెప్పారు

అది అలహాబాదు కుంభమేళా మహోత్సవంలోని పూర్ణ కుంభదినము. త్రివేణీ సంగమంలో ఆరోజున లక్షలాదిప్రజలు తమ తమ తనువులను పవిత్ర మొనర్చుటకు స్నానమాడారు ఇక్కడ పవిత్రగంగ ఏ మహనీయుని పాదపద్మముల నుండి జనించి సంతత ప్రవాహములుగా జగత్తును పావన మొనర్చుచున్నదో సాక్షాత్ ఆ శ్రీ మహావిష్ణువు యొక్క అవతారమూర్తి యగు మెహెర్ ప్రభువును దర్శించి తమ జన్మలను తరింపజేసుకొను చున్నారు ఆ రోజున యిచ్చట బెత్వానదీ తోయములలో నడిచివచ్చారు బాబా ఆ జలములనే తెప్పించుకొని స్నానం చేసారు. అందుచేతనే బాబా ప్రేమ యిక్కడ ప్రజలలో వాహినియై ఇచ్చోరాలో ప్రవహించింది. బాబా రెండవమారు 1954 ఫిబ్రవరిలో యిక్కడికి వచ్చినపుడు అనేకవేలమంది వచ్చి వారి దర్శనం చేసుకున్నారు తరువాత బాబా సౌరంగా వెళ్ళినపుడు యీ క్రింది సందేశమిచ్చారు. ఆనాడు ఫిబ్రవరి 5 వ తేదీ

"మౌనంగా నున్నట్లు కనిపిస్తున్నా మీ అందరి ద్వారాను నేను నిరంతరము మాట్లాడుతూనే ఉన్నాను. ఈ కనిపించే మౌనం నేను విరమించే సమయం సమీపించింది. అప్పుడు నన్ను ప్రేమించేవారు నా యొక్క నిజమైన ఆత్మను సందర్శిస్తారు నాప్రేమ ప్రసారాన్ని ప్రేమతో స్వీకరించండి

అప్పుడు మీ హృదయాలలో ప్రేమ బీజం నాటబడుతుంది మరల బాబా ప్రేమికులయిన పుకార్ పగ్గైరాలు ప్రకాశిక తయారు చేసారు తరువాత బాబా సౌరంగా నుంచి ధాధ్‌కి వెళ్ళారు. అప్పుడు ఢిల్లీనుంచి వచ్చిన హరజీవన్‌లాల్ అను

బాబా శిష్యుడు మండలితో చేరాడు ఆరోజున, ఫిబ్రవరి 6 వ తేదీన, రాత్రి లో ప్రేమికుల సభలో బాబా యిలా చెప్పారు—

"నేను నా ఉన్నతోన్నత స్థాయినుంచి క్రిందికి మీ స్థాయికి దిగి వచ్చాను. నన్ను మీవాణ్ణిగా చేసుకోండి సహజంగా అప్పుడు మీరు నావాళ్ళయిపోతారు. మీరు బీదవారయితే నన్ను కూడా బీదవానిగానే భావించండి మీరు భాగ్యవంతులయితే నన్ను కూడా మీరు అలాగే అనుకోండి. మీరు నన్ను ఎలా భావిస్తే అలా అవుతాను. మీరు విద్యలేనివారయితే నన్ను కూడా నిరక్షరకుక్షిగా తీసుకోండి మీ స్థాయికి నేను దిగివచ్చాను నన్ను మీరు నిజంగా ప్రేమిస్తే, హృదయపూర్వకంగా ప్రేమిస్తే, నా అసలు స్థాయికి నా ఉత్తమోత్తమ స్థాయికి మీరు రాగలుగుతారు ఎందుచేతంటే మీ అందరిలోనూ నేనున్నాను గనుక")

అక్కడనుంచి ఫిబ్రవరి 7 న బాబా ధనోరీ వెళ్ళారు అక్కడ ప్రేమిక సమావేశంలో బాబా—

"మీరు ఎలాంటి పరిస్థితిలో ఉన్నారో నేను కూడా ఆ స్థాయిలోనే ఉన్నానని తెలుసుకోండి మీరు ఎలా ఉన్నా నన్ను ప్రేమించారంటే నా నిజస్థితిని తెలుసుకో గలుగుతారు నన్ను ప్రేమించుటకు ప్రయత్నించి నన్ను మీ వాడిని చేసుకోండి" అన్నారు

ధనోరీ నుంచి ఆరోజునే బాబా ఛసి అనే గ్రామం వెళ్ళారు అక్కడ సమావేశమయిన ప్రేమికులకు బాబా— "స్థావరమయిన రాయివలె భగవంతునియందు స్థిరమైన విశ్వాసమూ, జ్వలిస్తూ ఉన్న ప్రేమ ఉన్నదంటే యీ ప్రపంచంలో ఏదీ మిమ్ములను ఏమీ చేయలేదు నిందాస్తుతులు మీకు అంటవు సుఖాలు మిమ్ములను పరవశం చేయలేవు దుఃఖాలు మిమ్ము లొంగదీయలేవు సుఖదుఃఖాలవల్ల మీరు చలించరు. ఎటువంటి క్లేశాలయినా మిమ్ము బాధించలేవు నన్ను ప్రేమించి భగవంతుడే సత్యమని గ్రహించుటకు నా ఆశీస్సును మీకు యిస్తున్నాను దానివలన ఊహా దృశ్యాలకుమీరు అతీతులై బాబాయే సత్యమని మీరు తెలుసుకుంటారు."

ఆ రాత్రికి బాబా హమీర్‌పూర్ వెళ్ళి అక్కడ మకాం చేసారు హమీర్‌పూర్‌లో ఆ మరునాడు అనగా 8-2-54 ఉదయం 9-20 గంటలకు యీ సందేశం యిచ్చారు —

"భాగ్యవంతుడు — పేదవాడు, పురుషుడు - స్త్రీ, పెద్దవాడు - చిన్నవాడు, చదువుకున్నవాడు - చదువుకానివాడు - అందరూ ఆ దేవుని తెలుసుకోవానికి సమానమయిన హక్కు ఉన్నవారే. దానికి ఒక్కటే మార్గం ఉంది. ఆ దేవునితో మనం ఏకం అని తెలుసుకొని ఆయనను ప్రేమించడమే

జిహ్వయొక్క భాషగా జపము, మంత్రము, భక్తిగీతాలు వగైరా యివేవీ- భగవంతుడు వినడు మనసు యొక్క మాటలు కూడా - ధ్యానము వగైరా, ఆయన చెవిని పెట్టడు ఆయన వినిపించుకునే దల్లా హృదయం యొక్క నివేదన - అదే ప్రేమ ఈ ప్రేమకు ఆచారాలు, వ్రతాలు, కర్మకాండలు, ఏమీ అక్కరలేదు. ప్రియతముని యెడల మౌనయుతమయిన భక్తిమాత్రం కావాలి)

భగవంతుని గుణాలలో అనంతమయిన నిజాయితీతనం ఒకటి మనలో కపటం అనేది లేశమాత్రం ఉన్నా ఆయన మనకి దూరంగా పోతాడు మీతో ఉండి మీకు ఆశీర్వాదాలు యిస్తున్నందుకు నాకు సంతోషంగా ఉంది"—

ఇలాగే బాబా ఎక్కడికి వెళ్ళే అక్కడ ప్రేమోత్సాహాలతో ఆయనకు జన సందోహాలు స్వాగతం యిచ్చారు ప్రతిగ్రామంలోను— ఇంగోటా, మహూబా, ఝుర్హార్, రుస్కారా, గోబార్, వగైరాలలో సందేశాలు యిచ్చారు.

ఓరాయిలో బాబా తమ ప్రేమికులకి యిచ్చిన సందేశంలో యిలా చెప్పారు—

"ప్రియతమ దైవము తన కొరకు హృదయం ఆలపించే ప్రేమగీతమే వింటాడు.

హృదయం ఎప్పుడయితే ప్రియతముని సమాగమం కోసం పరితపిస్తుందో ఆయనతో వియోగం సంభవిస్తే ఎప్పుడైతే మనసు విలవిలలాడిపోతుందో అప్పుడు ప్రియతముడు నిన్ను కౌగిలిలోకి తీసుకొని తనతో ఏకం చేసుకుంటాడు. అంటే భగవంతుని ప్రేమించుటకోసం ఆయనను ఎప్పుడూ దగ్గర అట్టేపెట్టుకుని ఒక్క క్షణంకూడా విడువకుండా ఉండాలి అంటే ఎన్ని పనులు చేస్తున్నా ఎన్ని ఆలోచనలు ఉన్నా, ఎన్ని మాటలు చెప్తున్నా వాటికి వెనుక, వాటితోకూడా ఆయన యొక్క

స్మృతి, ఆయనయొక్క స్మరణ ఉంచుకోవాలి మంచి అయినా చెడ్డ అయినా ప్రతీ చిన్నదానిలోనూ ఆయనను జ్ఞాపకం పెట్టుకోవాలి అప్పుడు యింక బాధ్యతంతా అయనదే అవుతుంది ''—

ఆసాయంత్రం హమీర్‌పూర్ చేరుకున్నారు సాయంత్రం 7 గంటలకు డాక్‌బంగళాలో ఉన్నపుడు బాబా మెహర్‌జీకి చెప్పి యీ క్రింది సందేశం వ్రాయించారు.

బాబా సందేశం :—

ఈస్థూల ప్రపంచంలో ప్రతి పైసా లెక్కకు వస్తుంది సూక్ష్మలోకంలో ప్రతి ఔన్సు శక్తి లెక్కకు వస్తుంది. మానసిక లోకంలో ప్రతి ఆలోచన యొక్క శక్తి పరిగణింపబడుతుంది ఈ మూడు లోకాలికి ఆవలి స్థితిలో భగవంతుడే గణనకు వచ్చేది భగన్మానవుని రాజ్యంలో సమస్తమూ శూన్యంగాను, శూన్యము సకలంగాను గణింపబడుతుంది.

భగవంతుడు తన శ్రోత్రములను హృదయం వైపుకే ఉంచుకున్నాడు గనుక హృదయపూర్వకమైన ప్రేమను సమర్పించి యీ జన్మలోనే విముక్తి పొందండి ఈ ప్రేమను అనేక విధాలుగా కనపరచవచ్చు – దైనందిన చర్యలలో, పనులు చేయడంలో, ప్రేమకలిగి మాట్లాడాలి ప్రేమతో ఆలోచించాలి మానవులందరి యెడల జాతిమత భేదాలు లేకుండా అందరిలోను భగవంతుడున్నాడని జ్ఞాపకం ఉంచుకుని ప్రేమతో మెలగాలి ''

10 వ తేదీనాటికి బాబా మహోవా వెళ్ళారు ఆ రాత్రి అక్కడ మహోవా ప్రేమికులకు బాబా యిలా చెప్పారు –

''త్వరలోనే దేవుడు నన్ను నా మౌనమును విరమించేలా చేస్తాడు. అప్పుడు దేవుడే స్వయముగా ప్రకాశింపగలడు. తరువాత కొద్దికాలములోనే నాకు అవమానము కలుగుతుంది. ఆ తరువాత నా మహిమను అందరు కొనియాడి నన్ను

స్తోత్రం చేస్తారు ఆ తరువాత నా బలిపన్మరణము కలుగుతుంది మరల నేను 700 సంవత్సరాలకి అవతరిస్తాను ''

బాబా వెళ్ళిన ప్రతిగ్రామంలోను ప్రజలకి దర్శనాలిచ్చారు ప్రజలు ఆయనకు పుష్పమాలలు సమర్పించారు ప్రేమపూర్వకంగా ఆయనకు హారతులిచ్చారు. ఇంగోటా అనే గ్రామంలో బాబా పై పుష్పవర్షం కురిపించారు. ఎక్కడకు వెళ్ళినా బాబా ప్రజల హృదయాలు హరించారు. ఎక్కడకు వెళ్ళినా బాబాను ప్రజలు ఊరేగించారు. ఆయనను కీర్తించారు. భక్తి పారవశ్యంతో నృత్యగానాలు సలిపారు. ప్రతీసభలోను సన్మానపత్రాలు, విన్నపాలు, విజ్ఞప్తులు చదివారు

బాబా ఇంగోటా వెళ్ళినపుడు అలహాబాదు నుండి హరిజార్‌సింగ్ వర్మ అను భక్తుడు వచ్చి బాబా దర్శనముచేసికొని తాను కుంభమేళా సమయంలో త్రివేణి తీర్థస్నానం కంటె బాబా పాద దర్శనం పరమ పావనమయిన మహత్తర భాగ్యమని బాబా యొక్క దర్శనమయినందున తాను పునీతుడనయితినని చెప్పెను బాబా కారు గ్రామాల మీదుగా పోయినపుడు నాదరా మొదలయిన ఊళ్ళలోని వందల కొలది స్త్రీ పురుషులు పూర్వం గోకులంలో కృష్ణుని మురళీరవళి వినగానే గోపికలు పరుగున వచ్చినట్లు బాబా దర్శనార్థము జనావళి పరుగు పరుగున రాగా బాబా కారుదిగి వారలందరి జూచి వారి యభీష్టము దీర్చేవారు.

బాబా హమీర్పూర్ వెళ్ళినపుడు యిదివరలో 1952 వ సం॥లో బాబా స్పృశించిన ఇటుకరాతిపై విద్యార్థుల వసతి భవనము ఆ విద్యార్థుల శ్రమదానం చేతనే నిర్మాణం కావింపబడుట జూచి బాబా సంతోషించి, యిప్పుడు వారు బాబాను ప్రార్థించగా దానికి బాబా ప్రారంభోత్సవం చేసారు ఆ భవనంలోపల ప్రవేశించి బాబా వారికోసం ఏర్పాటు చేసిన వేదికపై కుర్చీలో గాక వేరొకచోట కూర్చున్నారు.

మహెవా, నౌరంగా, హమీద్‌పూర్, మహోబా గ్రామాలలో కొంతమంది ప్రేమికులు వారి యిండ్లకు రమ్మని ఆహ్వానింపగా బాబా వారి గృహాలను పావనము చేసి వారి కుటుంబాలను ఆశీర్వదించారు.

వొరంగాల్లో నరసింగదాసు అనే ప్రేమికుని మాగృహంలో బాబా ప్రవేశించి అతనిని సంతోషింపజేనారు అతడు బాబా అట్లు వచ్చినప్పుడు వారికి హారతి నిచ్చి ఆనందముతో పరవశుడయాడు

డూలిపెట్ అనే భక్తుని యింటిలో బాబా అతన్ని అనుగ్రహించి ప్రత్యేకంగా అతనికి ప్రసాదం యిచ్చారు. ఇక్కడ కొందరు స్త్రీలు నీటి కడవల మీద జ్యోతులు వెలుగజేసి వాటిని తలపై ధరించి నృత్యముచేసి బాబాను ఆనంద పరిచారు హీరాలాల్ అను ప్రేమికుని యింటికి వెళ్ళినపుడు బాబా ప్రేమికులు ప్రేమాతిశయంచేత విలపించారు బదరీ ప్రసాద్ అను ప్రేమికుని గృహంలో అతని భార్యకు బాబా ఒక కొబ్బరికాయనిచ్చి దానిని పూజించుకొమ్మని చెప్పారు అతనికి జ్ఞాపకార్థము ఒక వస్త్రము స్పృశించి యిచ్చి తన ఎద్ద నుంచుకొనమని యిచ్చారు. బాబా వచ్చిన స్థలాలలో బాబా ప్రేమికులు "అయేహై ప్రభు మెహెరవతార్" అనే వినాదం మిన్నుముట్టేలా చేసేవారు.

హమీర్‌పూర్‌లో పుకార్‌కి చెందిన ఒక పిండిమరను స్పృశించి బాబా స్వయంగా అందులో గింజలుపోసి ఆడించారు. పుకార్ ఆ పిండిమరను స్థాపించి నపుడు బాబా అనుమతి పొందాడు ఇప్పుడు స్వయముగా బాబా దానిని చూసి పుకార్‌ను ఆశీర్వదించారు.

మహోబాలో సేవక్ ఖరేకి ప్రత్యేకంగా ప్రసాదం యిచ్చారు జనవరి (1953) 23 వ తేదీన ఆదర్శ్‌కి కలిగిన కుమార్తెకు మీరా అని బాబా నామకరణంచేసారు. అతని ఇల్లు పావనం చేసి బాబా వారిని ఆశీర్వదించారు

ధనోరీ అనే గ్రామంలో ఒక ఏకాంత స్థలంలో బాబా, ప్రేమికులు మండలి మొదలయిన వారితో ఒక దర్బార్ జరిపారు దానికి బాబా సేవకు అంకిత మయిన ప్రేమికులు హాజరయారు ఆ సందర్భంలో యీ సందేశం యిచ్చారు—

"బాబాకు జీవితము, ప్రాణములు అర్పించుటకు సిద్ధమగుట తమ కుటుంబములకు స్నేహితులకు సెవజేయుటకు మనదేశమునకు జాతికి అర్పించుట వంటిది కాదు—

"నేను యీ శరీరమును ధరించి అవతరించుట యీ దర్శన కార్యక్రమముల కొరకు గాదు, పూజాహారతులను స్వీకరించడానికీ కాదు అవన్నీ దేవలోకము నాకు సర్వదా అర్పిస్తూనే ఉంది. నేను ఎందుకొరకై వచ్చానో అది తెలియజేయడానికి సమయం దగ్గరికు వస్తోంది నన్ను అంటిపెట్టుకుని ఉన్నవారికి అది తెలుస్తుంది" అని బాబా చెప్పారు బాబా యింకా యిలా అన్నారు—

("నన్ను ఎక్కువగా ప్రేమించండి ఆ ప్రేమ మిమ్మల్ని పిచ్చివారిని చేయగలిగినంత తీవ్రంగా ఉండాలి. గాని అది ఆడంబరంగా ఉండకూడదు అది చేతగాకపోతే మీ ప్రపంచపు పనులు అన్నీ చేసుకుంటూనే అవన్నీ బాబాకోసం చేస్తున్నామనుకొని బాబాకు అర్పించాలి అదికూడా సాధ్యంగాకపోతే నిష్కామంగా, ప్రతిఫలాపేక్ష లేకుండా లోకసేవ చేయండి" అని బాబా చెప్పారు

"లోకసేవ అంటే నీ సుఖాన్ని పోగొట్టుకుని యితరులకు సుఖం కలిగించడం నిష్కామమైన సేవ యితరులద్వారా నన్ను ప్రేమించునట్లు చేయును నన్ను ప్రేమించుట వలననే శాశ్వతమయిన స్వేచ్ఛపొందగలరు" అని బాబా వివరించారు)

హమీర్‌పూర్ జిల్లా పర్యటన చేసేటప్పుడే ఒకనాడు ఎరచ్ బాబాను ఇతర మండలి సభ్యులతో ఉండగా ఇట్లడిగాడు – "బాబా ' మండలి అంటే యేమిటి ?" అని దానికి బాబా యిలా జవాబిచ్చారు –

"బాబాతో చాలాకాలం నుండి ఉంటూ బాబాకి వారి యెడలా బాబా యెడల వారికి అరమరికలు లేకుండా సన్నిహితంగా ఉంటూ వారి సర్వస్వము బాబా కొరకు త్యాగం చేయడానికి సిద్ధంగా ఉన్నవారు 'మండలి' —" అని బాబా తెలియజెప్పారు. బాబా యింకా యిలా అన్నారు —

"తన జీవితం ఎవరయితే బాబాకి అంకితం చేస్తారో, బాబా చెప్పినట్లు విని ఎవరయితే అక్షరాలా ఆచరిస్తారో, ప్రతిఫలం కోసం ఆశించకుండా ఎవరయితే బాబా చెప్పినట్లు చేస్తారో, ఆ పనిలో తాను ఏమయిపోయినా సరే అని ఎవరు భావిస్తారో, బాబా సంతోషమే తన సంతోషం అని ఎవరు తలుస్తారో — వారు 'మండలి'లో నుండుటకు అర్హులు. మండలిలోని వారి శరీరాలు బాబావి కాని వారివి

కావు " ఇంకా ఎరచ్ తన సందేహం తీర్చుకుందామని" బాబా చెప్పిన ప్రకారంగా ఎవరయితే మండలిలో ఉన్నారని బాబా అనుకుంటారో వాళ్ళు ఉన్నట్లు లేనివాళ్ళు లేనట్లూనా ? అంటే ఎవరయినా "నేను మండలిలో ఉన్నాను అని తనకు తాను గట్టిగా చెప్పుకోగలడా ?" అని ఎరచ్ అడిగాడు. బాబా "ఆ అనుకోవడం రెండు వైపులా ఉండాలి " అన్నారు. అప్పుడు బాబా హరిచంద్ అనే ఒక ప్రేమికుని వైపు చూసి "నీవు మండలిలో ఉన్నావా ?" అని అడిగారు బాబా యెడల అతనికి బాగా చనువు వుంది. అతడు బాబాకు చాలా సన్నిహితుడే. కాని యిష్టంతో బాబా కోసం సర్వస్వమూ త్యాగం చేస్తాడా, అనే ప్రశ్న వస్తుంది.

"ఎప్పుడు నేను ఏమి చెప్పినా సంకోచం లేకుండా అది చేస్తావా ? నీ కూతురు రాజ్‌ని కోసెయ్యమని నేను చెప్తే ఆపని చేస్తావా ?" అని బాబా హరిచంద్‌ని పరీక్షగా అడగ్గా "తప్పకుండాచేస్తాను బాబా" అన్నాడు. "అయితే నీవు మండలిలో ఉన్నావన్నమాటే" అన్నారు బాబా. "మండలిలో ఉండడానికి నా అంగీకారమే గాక మండలియొక్క నిజాయితీతనంకూడా ఉండాలి" అని బాబా అన్నారు

ఇచ్ఛోరా వెళ్ళినపుడు వారు బసచేసినచోట మండలిలో ఒకడు యజమానిని అడుగకుండా రేగుపండ్లు కోశాడని బాబా అతనిని తీవ్రంగా మందలించారు బాబా ఆ చెట్టు స్వంతదారుకి క్షమాపణ చెప్పారు.

మహేవాలో 9 వ తేదీన (ఫిబ్రవరి, 1954) రాత్రి మండలి వారిని మెలకువగా ఉండమని ఆజ్ఞాపించారు. ఇలా జాగరణ చేయడానికి ఆ రాత్రి అజీజ్' అమర్‌దాన్, వామన్ అనే ముగ్గురిని పాటపాడి కాలక్షేపం చేయమని బాబా నియమించారు రాత్రి 9 గంటలకు పాటకచేరీ ప్రారంభం అయింది ఆ ముగ్గురు రాత్రి 11-40 వరకు అద్భుతంగా గానం చేసారు. అప్పుడు బాబా అందరినీ ముఖం, కాలుసేతులు శుభ్రంగా కడుగుకొమ్మని చెప్పారు. బాబా కూడా చేతులు కడుగుకున్నారు.

9 వ తేదీ రాత్రి 12 గంటలకు (తెల్లవారితే 10 వ తేదీ) ఎరచ్ ఆంగ్లము నందు, రంజూ ఉర్దూలోను, ఢాకే మరాటీ లోను బాబా యొక్క పశ్చాత్తాప ప్రార్థన చదివారు. తరువాత పాటకచేరి మరల ప్రారంభం అయింది. వామన్ తన శ్రావ్యమైన గాత్రంతోను, అజీజ్ తన అద్భుతమయిన గజల్ గానంతోను, అమర్ దాన్ తన హాస్యరసయుక్తమయిన కథాకథనంతోను ఆ రాత్రంతా ఎవరికీ కునుకు

వట్టుకుంటూ చేసారు బాబా తెల్లవారుజామున కేశవ్‌ని పిలిచి పంచాంగం ప్రకారం 10 వ తేదీన తమ 60 వ జన్మదినమని చెప్పారు అందరి ఆనందము అవధులు దాటింది కేశవ్ హిందీలో ప్రార్థనచేసాడు విష్ణు మొదలయినవారు కలిసి "ఆయేహై మెహెరవతార్!" అని పాడారు సరిగ్గా 5 గంటలకు కార్యక్రమం ముగించి బాబాకు హారతి యిచ్చారు. మండలి అందరినీ బాబా కౌగిలించుకున్నారు

మహేవాలో కార్యకర్తలలో అభిప్రాయభేదాలున్నాయని వారి మధ్య సామరస్యం కలుగజేసారు బాబా.

అప్పుడే తాను అవతారుడనని బాబా ఒక చరిత్రాత్మకమయిన ప్రకటన చేసారు. అనేకవేల మంది ఉన్న ఆ ప్రేమికుల మహాసభలో సనాతన పురుషుడైన బాబా మొదటిమాటుగా తాను దేవుని అవతారమని చాటి చెప్పారు. బాబా యొక్క ప్రకటన ఆ అశేష ప్రజానీకానికి హృదయాలలో చెరగని ముద్రవేసింది. మొదటి మాటు 1952 సం॥ంబరులో వారి హృదయాలలో రగిలించిన ప్రేమాగ్ని, 1954 సం॥ ఫిబ్రవరి మాసంలో యిప్పుడు రెండవమారు దానిని బాగా జ్వలింపజేసారు బాబా. అనేక క్రొత్తప్రేమికుల హృదయాలలో ప్రేమజ్యోతి వెలిగింది. ఈ ఉత్సవంలో బాబా దేవుని యొక్క గుణగణాలను రోజంతా స్తోత్రం చేస్తూనే ఉన్నారు. ఆనాటి వారి హృదయానందం వర్ణనాతీతం.

మెహెరాస్థానాలో బాబా చిత్రం నెలకొల్పినచోట అనేక పుష్పహారాల తోను, తోరణాలతోను చక్కగా అలంకరించారు ప్రక్కనే మిఠాయి దుకాణాలు పూల అంగళ్ళు వెలిసాయి.

ఈ ఉత్సవంలో కుస్తీపోటీలకు ఒక సమయం కేటాయించబడింది. గ్రామస్తులందరు కుస్తీపోటీలు చూసి చాలా ఆనందించారు.

అలంపురాలో పల్లెటూరిస్త్రీలు దివారీ అనే బృందనాట్యం చేసారు. 21 మంది జట్టుగా రంగురంగుల బట్టలు ధరించి గజ్జెలు కట్టుకుని చిన్న కర్రలు చేతబట్టుకొని కోలాట మాడారు. కాళ్ళకి గజ్జెలే కాకుండా చిరుగంటలతో దట్టీలు మొలలకు బిగించుకొని ఎగిరెగిరి గిరగిర తిరుగుతూ అడుగులు వేస్తూంటే ఆ వింత ధ్వనులు శ్రవణానందంగాను తిలకించుటకు కన్నుల పండువుగాను ఉన్నది. వివిధ స్థలాలలో బాబా జన్మదినోత్సవాలు జరిగాయి. కొన్ని ఊళ్ళలో యీ పండుగ మూడు రోజులు జరుపుకున్నారు. తెల్లవారుజామున నగర సంకీర్తనలు కూడా జరిపారు.

ఇంకా పక్కలమీద ఎద్దకంతో దొర్లుతున్నవారికి యీ పాటలు వినగానే అవి మేలు కొలుపుల్లా పనిచేసాయి ఆఖరిరోజున బాబా చిత్రాన్ని ఉన్నతంగా శిరమున ధరించి నగర సంకీర్తనలు, ఊరేగింపులు చేసుకున్నారు బాబా సప్తవర్ణపతాకం ఎగురవేసారు మేళతాళాలతో ఊరేగింపుసాగి చివరకు ఒక మైదానస్థలంలో ఆగి అక్కడ వేసిన పందిట్లో బ్రహ్మాండమయిన సమావేశం చేసుకున్నారు అక్కడ బాబా సత్యప్రేమ సందేశాల గురించి ప్రముఖులయిన బాబా ప్రేమికులు ఉపన్యాసాలిచ్చారు చివరకు జయఘోషలతో సభ ముగిసింది

ఆఖరున "ప్రపంచంలో ధర్మము వర్ధిల్లుగాక
ప్రేమరాజ్యం స్థాపింపబడుగాక
దివ్య జీవనము మేలుకొల్పబడుగాక
సర్వశక్తివంతమయిన మెహెర్‌నామము
వైభవోపేతముగా వెలంగు గాక"

అని శుభాశయములు ఉచ్చైస్వనమున ధ్వనించాయి చిట్టచివరకు బాబా కార్యకర్తలు ఆంతరంగిక సమావేశమొనర్చి ప్రియతమ బాబా గురించి స్వకీయానుభవాలను చెప్పు కున్నారు బాబా దివ్యకార్యముగురించి చర్చసాగింది బాబా ప్రేమలో బాబా కొంగును విడనాడకుండా జీవితము గడపవలెనని నిశ్చయములతో బాబాకు ముఖ్యకార్యకర్తలందు కొందరు పునరంకితం గావించుకున్నారు

తిరుగుప్రయాణంలో బొంబాయి వచ్చి అక్కడినుంచి మహాబలేశ్వర్ బస్సులో 12 వ తేదీనాటికి చేరవలసి ఉంది ఆరోజున పూనా చేరుకున్న తరువాత కనుక్కోగా బస్సుకి టిక్కట్లన్నీ అయిపోయాయని ఒక్కడికీ చోటులేదని చెప్పారు మండలి వారికి ఆశాభంగం అయింది కాని బస్సు బయలుదేరే సమయానికి ఒక బృందం వారి ప్రయాణం అనుకోకుండా వాయిదా పడిందని టిక్కట్లసొమ్ము వాపసు తీసుకున్నారు ఆటిక్కట్లన్నీ మండలికి బాబా కి సరిగా సరిపోయాయి వాళ్ళు టిక్కెట్లు కొనేసి బస్సు ఎక్కారు ఈ విధంగా బాబా వారి మండలి ఇబ్బంది లేకుండా మహబలేశ్వర్ చేరుకున్నారు

(ఆరవ భాగము సమాప్తం)

తరువాయి 7 వ భాగములో